# వ్యాసతోరణము

## (ప్రాసంగిక వ్యాససంకలనము)

సంపాదకులు

శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము : హైదరాబాదు - 4

# పీఠిక

పంథొమ్మిదవ శతాబ్ది చివరి భాగం తెలుగులో ఎన్నో నూతన సాహిత్య ప్రక్రియలు ఆవిర్భవించడానికి దోహదంచేసింది. అందుకు కారణాలు అనేకం. అంతకు పూర్వం ఆంధ్ర సాహితీ ప్రపంచంలో సర్వత్రా వ్యాపించియున్న స్తబ్దత; దేశంలో అప్పుడే వస్తూన్న సాంఘిక, రాజకీయ, సాహిత్య చైతన్యం; సంస్కరణాభిలాషులైన సాహితీ వేత్తల ప్రయత్న సాఫల్యం; నూత్న మార్గాల్ని ఆదరించి గౌరవించాలనే ఆంధ్ర మహాజనత ఆకాంక్ష; చదువరుల హృదయాలపై ఒక స్థాయికి చేరుకుంటూన్న పాశ్చాత్య సాహిత్య ప్రభావం – అట్టి కారణాలలో కొన్ని.

తత్ఫలితంగా నవల, కథ, నాటిక, జీవిత చరిత్ర, ఆత్మకథ, గల్పిక, ఖండకావ్యం, వ్యాసంవంటి ఎన్నో క్రొత్త వాఙ్మయ రూపాలు తెలుగులో వెలసి క్రమంగా పాదుకొని కాలక్రమేణ విస్తారంగా విస్తరిల్లాయి.

వీనిలో వ్యాసం అనేది ఒక విలక్షణమైన ప్రక్రియ. ప్రయోగ ప్రయోజనాలనుబట్టి వ్యాసాన్ని ఎందరో విమర్శకులు ఎన్నో రకాలుగా నిర్వచించారు. "రచయిత తనకుగల విజ్ఞానాన్ని పరిమితమైన పరిధిలో, భావ విస్తృతి నొక తార్కికమైన మార్గంలో పొందుపరుస్తూ, చేసే వచో విన్యాసమే వ్యాసమ''ని ఒకరంటే, ''ఏదైనా ఒక విషయము గురించి సాగిన ఆలోచనలను క్రమబద్ధంచేసి, తన భావవాహినిని సాహిత్య స్థాయికిపెంచి చదువరులకు అందించే రచయిత ప్రయత్నమే వ్యాసం" అని మరియొకరన్నారు. "వ్యాసానికి వస్తువుగా దేనిని స్వీకరించినా, దానిని పారముట్ట చూడడం వ్యాసకర్తపని కాదనియు, దాని స్వరూపాన్ని ఒక కోణంనుంచి మాత్రమే చూసి రసజ్ఞులకి అందించి ఆపైన వారు దాన్ని గురించి ఆలోచించునట్లు చేయుట అతని ధ్యేయము కావలయుననియు" ఒకరనగా, ''ప్రతిభావంతుడైన రచయిత తన లోకజ్ఞత పాండితీ ప్రాభవం అనే దోసిలితో రస జగత్తుకి విందుచేసే ఆలోచనామృతమే వ్యాసం" అని ఇంకొకరన్నారు.

ఇలా వ్యాసాన్ని ఎవరు ఎలా నిర్వచించినా ఈ ప్రక్రియ ఎంతో క్లిష్టమైనదీ, ఆసక్తిదాయకమైనదీ అని మాత్రం అంతా అంగీకరించారు. వ్యాసకర్తకి ఎన్నో

సంగతుల్ని జాగ్రత్తగా కుదించి తక్కువ మాటలలో చెప్పగల నేర్పు ఉండాలి. సమగ్రమైన భావాన్ని పరిమితమైన పరిధిలో అందించాలంటే, చెప్పదలచుకొన్న విషయంపై వ్యాసకర్తకి ఎంతో అధికారం అవసరము. దానికి సంబంధించి పరిపూర్ణమైన పరిజ్ఞానం, అందలి వివిధమైన భాగాలను విజ్ఞతతో వింగడించుకొను నేర్పు, అతనికి ఉండాలి. అప్పుడే ఏయే భాగాలు కుదించాలో, ఎక్కడెక్కడ విస్తృత పరచాలో, ఎలా ప్రారంభించాలో, ఎలా ముగించాలో, ఆద్యంతము ఎలా సాగించాలో అతనికి తెలుస్తుంది.

వ్యాసమునకు స్వీకరించిన వస్తువు, దానిని చర్చించిన విధానము, పరిమితమైన పరిధిలో పరిపూర్ణతను సాధించిన నేర్పు, పాఠకునిలో రేకెత్తించిన ఆసక్తి - వీటిపై ఆ వ్యాసముయొక్క విజయము ఆధారపడి ఉంటుంది. వస్తు స్వీకరణ, ప్రారంభ ఉపసంహారములు, రచనా నైపుణ్యము, విన్యాస విన్నాణము, శిల్ప చాతుర్యములనుబట్టి ఒక వ్యాసముయొక్క స్థాయినికూడ, అంటే అది ఉత్తమమైనదో తద్భిన్నమైనదో, నిర్ణయించవచ్చును.

నిర్మాణ క్లిష్టమైన ఈ వ్యాసమును వస్తుపరముగా పరిశీలించినచో స్థూలముగ రెండు విభాగములుగ కన్పించును. అందొకటి సాహిత్య వ్యాసము, మరియొకటి సాహిత్యేతర లేదా ప్రాసంగిక వ్యాసము. మొదటిదానికి సాహిత్యము, దాని లక్షణములు, తత్సంబంధమైన పరిజ్ఞానము, ఆలంబనమైనచో, ప్రాసంగిక వ్యాసమునకు సాహిత్యముతోబాటు సర్వ జీవిత వ్యాపార వ్యవహారమును ఆధారమగును. ఒక రకముగ చూచినచో ప్రాసంగిక వ్యాసమునకు గల ఆలంబనము ఎంత విస్తృతమైనదో అంత సూక్ష్మమైనది. ఒక్కొక్కప్పుడు ఆ వ్యాసకర్త ఏ ఆధారము లేకుండగనే, కేవలము తనకుగల లోకజ్ఞత, సూక్ష్మగ్రహణ పారీణత, నిశిత పరిశీలనా వ్యగ్రత, భావనా శబలత, సాహితీ సంస్కార కుశలత, వీని సాహాయ్యముతోనే తన ఆలోచనా జలనిధిని తరచి అమృత రచనా భాండము నందీయవలసియుండును.

సాహిత్య వ్యాస రచయితయొక్క పరిస్థితి అదికాదు. చర్చించవలసిన విషయము స్పష్టముగ, నిర్దిష్టముగ నతని యెదుట నుండును. నా వ్యాస రచనోద్దేశము ఇది అని నిర్ణయించుకొనువరకే అతనికి శ్రమ. ఆ తర్వాత ఆ దృష్టితో తన యెదుటగల కావ్యమును పరిశీలించుకొనుచు బోయిన చాలును. అతని మార్గమంతకంతకు సుకరమై పోవును.

భారతములో స్త్రీ పాత్రలు, శ్రీనాథుని సీసములు, పెద్దనగారి పెద్దఱికము, ఆముక్తమాల్యదలో ప్రకృతి వర్ణన, శుచిముఖి వచోవైయాత్యము, చేమకూరిలోని శబ్ద మాధుర్యము - ఈ రకమైన సాహిత్య వ్యాసములను, విషయ పరిజ్ఞానము విమర్శనా శీలమైన నిశిత పరిశీలనా పాటవము, ఉన్నచో చాలును, చక్కగా రచించవచ్చును.

కాని ప్రాసంగిక వ్యాసకర్తకు ఈ శక్తులుమాత్ర మున్నచో సరిపోదు. వీనికి తోడు లోకముతో గాఢమైన పరిచయము, సాహిత్యముతోబాటు ఎన్నో ఇతర విజ్ఞాన శాఖల అధ్యయనము, తాను తీసికొనిన వస్తువునకు సంబంధించిన రకరకము లైన భావములను ఏర్చి కూర్చుకొను నేర్పు, విస్తరణలేని విశ్లేషణా నైపుణ్యము, ఉక్తి చమత్కృతి, సహృదయ హృదయాహ్లాదకరమగు రచనా విన్నాణము, జల కణమును స్వీకరించి దాని సాహాయ్యమున జలనిధిని చూపించగల సామర్థ్యము, ఇలా ఇతరేతరమైన వివిధశక్తు లెన్నో రచయితలో అద్భుతముగ సమ్మేళనము నొందవలెను.

అందుకే నాటకమువలె ప్రాసంగిక వ్యాసముకూడ సాహిత్యమునకు పరా కాష్ఠయనియు, రచనా పాటవమునకు గీటురాయి అనియు ప్రాచ్య పాశ్చాత్య విమర్శకు లెందరో దాని ప్రాశస్త్యము నుగ్గడించారు. సాహితీ కల్పతరువున పూసిన పుష్పములు కథ, కావ్యము, నవల మొదలగు ప్రక్రియలైనచో, ఆ కల్పవృక్షమున పండిన రసవత్ఫలము ప్రాసంగిక వ్యాసము.

దీనిని సమర్థముగ నిర్వహించవలెనన్నచో వ్యాసకర్తకు పరిశీలనా శక్తి ఎంత అవసరమో భావనా నైశిత్యముకూడ నంతే అవసరము. ఏదో ఒక సామాన్య విషయమును తీసికొని దానిపై తన భావలహరిని పోనిచ్చి సాహిత్య స్థాయికిచేర్చి చక్కని రసఖండము నందించుట అనునది ఎంతో నేర్పరితనముతో చేయవలసిన సాహిత్య వ్యవసాయము. నిత్య జీవితమున అప్రధానముగ కనిపించు వస్తువును తీసికొని, ఆసక్తిదాయకమైన విధానములో, ఆ వస్తువునకు సంబంధించిన మనోహర భావముల నెన్నిటినో, పుష్పలావిక పూలమాలను రచించునట్లు చిత్రవిచిత్రముగ నల్లుచు, ఔచితీ సురభిళమును వెదజల్లవలెనన్నచో, ఆ వ్యాసకర్తకు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము అపారముగ నుండవలెను. అతని ప్రయత్నమునకు ధ్వని వ్యంగ్యాదులు దోహదమొనర్చి రచనకు ఒక ఉత్తమ స్థాయిని రసవత్ స్వరూప మును సమకూర్చును.

తక్కిన ఇతర సాహిత్య ప్రక్రియలకంటె ఈ ప్రాసంగిక వ్యాసమున సమకాలీన సమాజము, కాంతిమయమైన దర్పణములోవలె స్ఫుటముగ ప్రతిఫలించును. చుట్టునుగల మనుష్యుల మనస్తత్వము, వారి అలవాట్లు, వారిలో వారికి గల వైవిధ్యము, ఆలోచనా ధోరణులు, ఆర్థిక సమస్యలు, మారుతున్న విలువలకు అప్పటివరకు రాజ్యముచేసిన సంప్రదాయములకు మధ్య చెలరేగు సంఘర్షణ, వైయక్తికమైన బలహీనతలు, నుడులు నానుడులు, ఆశలు నిరాశలు – వేయేల సమస్త మానవ వ్యాపారములు, భౌతిక మానసిక స్థితులు, అన్నియు నీ ప్రక్రియలో కావ్యత్వమును సంతరించుకొనగలవు.

వివిధ మనస్తత్వములుగల వ్యక్తుల మధ్యనున్న అభిప్రాయ భేదములను తొలగించుటకు, ఆరోగ్యకరమైన సమాజమును రూపొందించుటకు, ఈ ప్రక్రియను, పాశ్చాత్య దేశములలో ఎడిసన్, స్టీల్, శామ్యూల్ జాన్సన్‌వంటి సాహితీవేత్తలెందరో బలమైన ఆయుధముగ నుపయోగించి విజయమును సాధించిరి. ప్రతి సమస్యకు సామాన్యముగనుండు బొమ్మ బొరుసులను రెండింటిని ప్రస్తావించి, సామాజికులలోని బలహీనతలను సున్నితముగ అవహేళనమొనర్చి, ప్రతి వ్యక్తియు తనలోని లోపములను వెడనవ్వుతోను, పరుల లోపములను చిరునవ్వుతోను సంస్కరించి సరసమైన నడవడిని సహజీవన సౌమనస్యమును అలవరచుకొనుటకు ఈ ప్రక్రియ ప్రాశ్చాత్య దేశమున గత శతాబ్దులలో ఎంతో ఉపకరించినది. ఈ శతాబ్దిలోకూడ ఎ. జి. గార్డినర్, ఇ. వి. లూకాస్, స్టీఫెన్‌లీకాక్, ఛెస్టర్‌టన్, రాబర్ట్‌లిండ్‌వంటి సమర్థ సాహితీవేత్తల చేతులలో ఈ ప్రాసంగిక వ్యాసము వేయి విధముల విస్తరిల్లి వ్యక్తుల మానసిక భారములను తొలగించి, సామాజికుల మధ్యనున్న పొరపొచ్చములను తగ్గించి పరస్పర అవగాహనను పెంపొందించి, ఉత్సాహము ఉల్లాసము వారిలో కలిగించి వారిని రసార్ద్ర చిత్తులను చేయుచున్నది.

తెలుగులో ప్రాసంగిక వ్యాసముల సంఖ్య పరిమితము. దాదాపు రెండువేల వరకు కన్పించుచున్నవి. అయినను ఈ పరిమిత సంఖ్యలోనే ఈ ప్రక్రియ ఎన్నో రూపురేఖలను దిద్దుకొన్నది. గంగానిర్ఝరివలె ఉపన్యాస ధోరణిని సాగినవి కొన్ని; కథా కథన రీతిలో కొన్ని కొన్ని సంఘటనలను కూర్చుకొనుచు నడిచినవి మరి కొన్ని; వర్ణనాత్మకముగ విహరించినవికొన్ని; పాఠకునిలో ఒక అనుభవమునుకాని ఆవేశమునుకాని ప్రజ్వలింపజేయునవి కొన్ని; ఆలోచనోన్ముఖు నొనర్చునవి మరి కొన్ని; నూత్న కవాటములను తెరచునవి కొన్ని, ఉన్న లోకమునే ఉద్దీపన

మొనర్చునవి కొన్ని; చతుర హాస్యభాషణముల నడిచినవి కొన్ని; గంభీర గమనమును ఎన్నుకొన్నవి మరికొన్ని; కొన్నిటి భాష మృదులము, సరళము; కొన్నిటిది గంభీరము, దురవగాహము; కొన్ని వాక్చిత్రములు; కొన్ని భావ ప్రభంజనములు; కొన్ని నాతి దీర్ఘములు కొన్ని అతిదీర్ఘములు; కొన్ని తాత్కాలిక ప్రయోజన ప్రేరితములు, కొన్ని సార్వకాలీనములు.

ఇలా వేయి రేకులుగా విస్తరిల్లిన ప్రాసంగిక వ్యాసము, చాలవరకు శక్తిని పుంజుకొన్నది పలు పత్రికలలోని ప్రత్యేక శీర్షికలందు (features). దీని విస్తృతికి తోడ్పడిన శీర్షికలలో (features) వారం వారం, పాన్‌సుపారీ, ఖాతాఖానీ, పనిలేని మంగలి, వినాయకుడి వీణ, కుర్చీలో కూనిరాగాలు, మ్యూజింగ్స్, కాలక్షేపం, మాటా మంతీ, ఊహాగానం, పిచ్చాపాటీ, నుడి నానుడి, కిటికీలో సూర్యుడు, ఆషామాషీ, ఇల్లాలి ముచ్చట్లు, యమునాతీరే, యథాలాపం, మాటకచ్చేరి, వెలుగు నీడలు - కొన్ని.

ఈ సంకలనాన్ని తయారుచేసే ప్రయత్నంలో, వేటపాలెం సారస్వత నికేతనం, రాజమండ్రి గౌతమీ లైబ్రరీవంటి ప్రసిద్ధ గ్రంథాలయాలకి వెళ్ళి అక్కడ గత అరవై డెబ్బైయేళ్ళనుంచి తెలుగులో వచ్చిన పత్రికలను, అందు పై శీర్షికా విభాగంలోను, ఇతరత్రా వచ్చిన దాదాపు రెండువేల వ్యాసములను పరిశీలించుట జరిగినది.

అన్ని వ్యాసములు పైన ఉదహరించిన శీర్షికలనుండి (features) ఎన్నుకొనుటకు వలను పడలేదు. కొన్ని అమూల్యమైన వానిగా కన్పించినను వానిని స్వీకరించుటకు వీలులేకపోయినది. ఏమన, కొన్ని తత్కాల ప్రయోజనము దృష్ట్యా ఆ వారము లేదా ఆ నెలలో జరిగిన ఒక ప్రముఖ రాజకీయ లేక సాంఘిక సంఘటన గురించి వ్రాసినవి. అవి ఆ సమయమునకు విలువైనవే - కాని గ్రంథస్థముచేసి ముందుతరాలవారికి అందించవలసినంత సార్వకాలీనత వానిలో లేదు. కొన్నిటిలో సార్వకాలీనత ఉన్నది. కాని అవి ఆద్యంతము ఒక కథానికవలె లేదా రెండు మూడు సంఘటనల సమాహారమువలె నున్నవి. ప్రసంగ వశమున వ్యాసములో ఒక సంఘటన వర్ణించుట వేరు, వ్యాసమంతయు దానితోనే నింపుట వేరు. అట్టి సందర్భములో అది కథ అగునుకాని వ్యాస మెట్లగును? ఒక కథ తర్వాత ఒక ఉపసంహార వాక్యమును చేర్చినంతలో అది వ్యాసము కాజాలదు. ఇక కొన్నింటిలో ఒక వర్గమును లేదా ఒక వాదమును తూర్పారబట్టుచు విమర్శ సాగినది. ఒక

ప్రత్యేక ఆలోచనా విధానముకల వ్యక్తుల మనస్సులను నొప్పించు వ్యాసములను, తక్కిన ఎన్ని ఉత్తమమైన విలువలు వానికి ఉన్నను, ఇటువంటి గ్రంథమున చేర్చుట సమంజసముకాదు.

ఈ రకమైన కారణములు కారణముగా పైన పేర్కొన్న శీర్షికలనుండి పది పదిహేను వ్యాసములకంటె ఎక్కువ తీసికొనుటకు వీలులేకపోయినది. అయితే అటువంటి ఎన్నికలో మాత్రము, ఆయా శీర్షికా రచయితల రచనా విధానమునకు, భావ సరళికి, ప్రతీకగా నిలబడునా నిలబడదా ఈ వ్యాసము, అని జాగ్రత్త తీసి కొనుట జరిగినది.

ఇలా ఎన్నుకొనిన వ్యాసములతోపాటు, వివిధ పత్రికలలో అప్పుడప్పుడు ఇతరత్రా వచ్చినవి, కొన్ని గ్రంథములలో ప్రసంగ వశాత్తు వ్యాస విధానమున నడచిన కొన్ని భాగములు, ఒకే రచయిత అనురూపమైన భావసరళిలో రెండు మూడుచోట్ల ఖండ ఖండములుగ వ్రాసిన వ్యాస విభాగముల సమాహారములు, కొన్నిటిని సర్ది, కొన్నిటిని ఒకటి రెండు వాక్యముల చేరికతో కలిపి, కొంచెము కొంచెము కొన్నిటిని సంస్కరించగా వచ్చిన రూపములు, వీని సాహాయ్యమున రూపుదాల్చిన మరికొన్ని వ్యాసములు, ఈ గ్రంథమున చేర్చుట జరిగినది. ఇట్లు చేర్చుటలో వ్యాసమునకు వ్యాసమునకు మధ్య వైవిధ్య ముండునట్లు శ్రద్ధ తీసికొన బడినది.

ఈ వ్యాసతోరణ రచనకు ఎన్నుకొనిన వ్యాసములలో కొన్ని కవితా ధోర ణిలో సాగినవి; మరికొన్ని చమత్కార మార్గము ననుసరించినవి; కొన్ని విజ్ఞాన కోశములు; కొన్ని హాస్య వ్యంగ్య భాషణములు; ఒకటి రెండు విపులార్థ ప్రవచన ములు; మరి రెండు ఔపదేశికములు; కొన్ని నిగూఢార్థ నిధులు; కొన్ని నిత్యజీవిత పరిశీలనా నైశిత్యములు; కొన్ని హృదయమునకు చక్కిలిగింత పెట్టునవి; కొన్ని హృదయముయొక్క లోతులను ముట్టునవి; కొన్ని ప్రసిద్ధ రచయితలు రచించినవి; మరికొన్ని సామాన్య రచయితల కలమునుండి అసామాన్య మార్గమున సాగినవి.

ఉత్తమ రచనా విధానము, ఉదాత్త భావ సౌరభము ఈ రెండే ఈ వ్యాసము లన్నింటియందు కన్పించు సామాన్య లక్షణము. తక్కిన లక్షణములలో వేటికవే. వీని నన్నిటిని ఒక మూసలోపోసి సమీక్షించుటకు వీలుపడదు. దేనికదే ఒక రసగుళిక.

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు వ్రాసిన 'సాక్షి' వ్యాస పరంపరనుండి ప్రకృతమునకు తీసికొనిన వ్యాసము 'స్వదేశీ పరిశ్రమలు'. తీసికొనిన విషయమా, నాడు యావద్భారతమును ఉర్రూత లూగించిన విదేశీ వస్తు బహిష్కారము. ఉపయోగించిన భాషా, పాఠకుని ఊపిరి సలుపుకొననీయకుండ ఒకదానివెనుక మరియొకటిగా తరుముకొనివచ్చి మీదపడు పద తరంగోల్లాసినియగు గంగా నిర్ఝరిణి. ఇక చెప్పవలసినది ఏమున్నది ? తన వాదమును బలము చేసికొనుటకు, పాఠకునిలో ఆవేశము రేకెత్తించుటకు, శ్రీ పానుగంటి వరుస వరుసను అనేకమైన ఉదాహరణలు, ఉపమానములు, అలంకారములు, అనుప్రాసలు, మాటల ఈటెలు, మర్మభేద మొనర్చు ఎకసక్కెములు ఉపయోగించి, ఒక మహా దండయాత్రవలె తన వ్యాసమును నడిపించును.

ఉదాహరణకు ఇప్పటి చేవ్రాతలను ఈసడించుకొను సందర్భమున ఆయన ఒకటిరెండు మాటలని ఊరుకొనలేదు. ఎన్ని రకములుగ అనవచ్చునో ఎంతవరకు అనవచ్చునో అంతవరకు అన్నాడు. "ఇప్పటి వ్రాతలా ? తల వెండ్రుకల చిక్కులు - గొగ్గిపండ్లు - గ్రుడ్డి గచ్చకాయలు - సిరాలో మునిగిన సాలె పురుగు ప్రాకుటలు - కోడి కొక్కరింపులు - కొకిబికలు - లుకలుకలు - తికమకలు -" ఇంత అనినగాని ఆయనకు సంతృప్తి ఉండదు. ఇట్లే, ఎప్పుడో ఏదో వచ్చును అని ఎదురుచూచువారిని దుయ్యబట్టుచు "ఏమి వచ్చును ? వచ్చునది నెత్తికి చేతులు, కంటికి నీరు, నోటికి తాళము, చేతికి లంకె, గుండెకు దడ" అనుచు ఒక్క గుక్కలో పది చదివి, ఎదుటివారి నోటికి తాళము వేయగల సత్తా ఆయనది. భాష, భావము ఒకదాని నొకటి ఒరసికొనుచు అనంత వేగముతో సాగిపోవు మహా ప్రవాహము ఆయన వ్యాసరచనా విధానము.

శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి రచనా మార్గ మిందులకు భిన్నము. అది మంచి గంధమువలె, మలయమారుతము రీతి, పచ్చ కప్పురము భాతి, పచ్చల పల్లకివోలె, పాఠకుని అల్లనల్లన తాకి ఒయ్యారముగా సోకి, గాలి ఉయ్యాల లూపి, ఏవో తెలిమేఘ శకలములపై, రసమయ లోకములవైపు, తీసికొనిపోవు, మాట తేటుల పూలబాట.

తియ్యగా గుండె నిండుగా పలకరిస్తూ కాలవపక్కనుంచి, పంట చేలల్లోంచి, తోట వెనుకగా, కొండ ప్రక్కగా, చల్లగా తెలుగు పల్లెవైపు తీసికొనిపోయి, మొన్న మొన్నటివరకూ తెలుగువారి వెలుగు జీవితానికి మణిమయ వేదికగా నిలచిన వీధి

అరుగును చూపి, దానిపై గత శతాబ్ది రంగవల్లులను హారంగుగా చూపించే నేర్పు కృష్ణశాస్త్రిది. 'వీధి అరుగు స్వాగత వచనం వంటిది', 'అది గ్రామంలో గొప్ప సంస్థ' అని చెప్పడంద్వారా పాఠకుల మనః కేదారాలలో జ్ఞాపకాల పంటల్ని పండించడం రచయిత గడుసుదనం. తీసికొన్నది వాళ్ళ ఊరేఅయినా అది ప్రతి తెలుగు పల్లెటూరికీ ప్రతినిధి. అక్కడి పెద్ద లోగిళ్ళవారి నాలుగు అరుగులూ, తెలుగువాడి నలుముఖాల జీవితానికీ నాలుగు దర్పణాలు.

రాయణింగారి వీధి అరుగు ప్రాభవానికీ, కరణంగారిది కచేరీ పనులకీ, మునసబుగారి వీధి అరుగు చర్చలకూ, శాస్త్రిగారిదేమో పురాణ పఠనానికీ ఉపయుక్తం అవుతూ, పట్టెనామాలవారినీ, ముతక ధోవతులవారినీ, జుట్టుముళ్ళవారినీ, జునపాలవారినీ అందంగా ప్రదర్శించేవిట. అటువంటివి ఇప్పుడు పేకాటలకీ, కుట్టు మిషనులకీ, ఎన్నికల తగాదాలకీ ఆలయాలయ్యాయని నిట్టూర్చడంద్వారా, మారుతూన్న ప్రపంచాన్నీ, తరాల అంతరాన్నీ రచయిత ఒక్కమాటలో చిత్రించారు.

'చలి' అందరి ఎముకల్నీ కొరుక్కుని తినేదే – కాని శ్రీ రావూరి వెంకట సత్యనారాయణగారి 'చలి' మాత్రం పాఠకునికి చక్కిలిగింతలుపెట్టి తనలోని అందాల్ని అందరికీ అందిస్తుంది. నిజమే! 'చలిలో మాట సరిగా వెలువడదు. ఏదో పాత ట్రెపుమిషను టకటక లాడుతున్నట్లు పై పళ్ళు కిందవాటితో ఏక కొట్టుకోవడమేకాని శబ్దం కంఠందాటి బయటకురాదు'. 'చలికాలంలోనైనా భార్య భర్తకి ఒణికిపోతూ తలుపు తీస్తుంది. ఆమె భర్తకి ఒణికిందా చలికి ఒణికిందా అన్నది వేరేమాట... ఒణికిందాలేదా... అయినా ఎన్నింటికి ఒణకటంలేదు? ఈ చలికి కూడా రెండు నెలలపాటు ఒణుకుదాం – ఇలా సాగే శ్రీ రావూరి వ్యాసంలో సున్నితమైన హాస్యం చురుక్కుమనిపించే వ్యంగ్యంతో కలసి, అందంగా పఠితల గుండెలచుట్టూ అల్లిబిల్లిగా అల్లుకుపోయి హాయి అనిపిస్తుంది. తెలుగు పలుకుబడి, జాతీయం శ్రీ రావూరి సొత్తు. అక్కడక్కడ సంభాషణని జోడించి వ్యాసాన్ని నడపడం శ్రీ రావూరి మార్గం.

ఒక రకంగా ఉపన్యాసాల యుగంగా మారిన ఈ రోజుల్లో, పాత విద్యార్థి సంఘ కార్యదర్శి దగ్గర్నుంచి, పకోడీలు అమ్మేవానిదాకా, అందరూ ఇచ్చే ఉపన్యాసాలూ, సందర్భశుద్ధి లేనివాళ్ళ అవ్యక్త ప్రవచనాలూ వినివిని అలిసిపోయిన శ్రోతల పాలిటి అమృతవర్షిణిలా శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు ఒక చక్కని 'ఉపన్యాసం' అనే వ్యాసాన్ని అందించారు. అయితే ఆయన 'ఉపన్యాసం',

పై తరగతి ఉపన్యాసాలకు సర్వ విధాలా భిన్నమైనది. విన్న ప్రతి వ్యక్తి పెదిమల మీదా మృదుల దరహాసాన్ని సృష్టించి హృదయాన్ని రస ప్లావితం చేస్తుంది. శ్రీ మొక్కపాటివారి వచన రచన నిస్తులమైంది. అతి సహజంగా నిరాడంబరంగా సాగే వారి రచనలో ఉండుండి ఒక సన్నని హాసరేఖ తొంగిచూస్తుంది. ఎవరినీ నొప్పించని హాస్యం తామరకొలనుమీంచి వచ్చే మలయమారుతంలా రకరకాల సంఘటన సౌరభాలతో కలసివచ్చి పాఠకుని మదికి చల్లగా తగులుతుంది.

తెనుగు కవిత్వంలో, ఆదికవి నన్నయ దగ్గర్నుంచి నిన్నటి కవివరకూ ఎవరెవ రేయే ఫ్యాషన్లను తీసికొనివచ్చి ప్రవేశపెట్టారో సాధికారికంగా చెబుతూ మధ్యమధ్య వ్యంగ్యాన్ని అందిస్తూ చెణుకులు విసురుతూ ఎక్కువ పరిశోధనా మార్గంలోనూ విమర్శనా ధోరణిలోనూ నడచిన వ్యాసం శ్రీ నోరి నరసింహశాస్త్రి గారిది. మూల రచనలనుండి ఎన్నో ఉదాహరణలిస్తూ తన వాదాన్ని బలం చేసుకుంటారు శ్రీ శాస్త్రి. ఆంధ్ర సాహిత్యంలో మైలురాళ్ళుగా నిలిచిన ఎన్నో గ్రంథాల నుంచి ఉదాహరణ లిచ్చారు శ్రీ నోరివారు. సాహిత్యేతర వ్యాస సంకలనంలో శ్రీ నోరివారి 'తెలుగు కవిత్వంలో ఫ్యాషన్లు' అనే వ్యాసాన్ని చేర్చుట ఎట్లు పొసగింది అని ప్రశ్నించే వారికి నా సమాధానం "ఇది కవిత్వములోని ఫేషన్లగురించి కాని కవిత్వము గురించి వ్రాసిన వ్యాసముకాదు" – అని.

తన ఊహాగానంతో తెలుగు వారిని కొన్ని సంవత్సరములపాటు తలయూచునట్లు మంత్రముగ్ధుల నొనర్చిన శ్రీమతి తెన్నేటి హేమలత (లత) కలములో వాడి, రచనలో తేటదనము అపారముగా ఉన్నాయి. వచనమును చక్కగా పచనముచేసి, నిరాడంబరమైన శైలిలో, నిశితముగా అందించు నైపుణ్యము ఆమెకు ఉన్నది. అందుకే ఆమె చేసిన ఏ రచనైనా పాఠకుని హృదయంలోకి తిన్నగా చొచ్చుకుపోతుంది. స్త్రీ పురుషుల పరస్పర ఆకర్షణ, సార్వకాలీనమైన మనోహర బంధము గురించి వ్రాసిన వ్యాసము చిన్నదే అయినా, ఆ విషయమును చర్చించిన తీరు మాత్రము ప్రత్యేకమైంది.

మతిమరపుగురించి ఆంగ్లములో వ్యాసములు లేకపోలేదు. అయితే వానిలో మతిమరపు వాని బాహ్య లక్షణములగురించి ఎవరూ పట్టించుకోలేదు. అట్లే ఆ వ్యాసములలో మతిమరపువలని లాభములగురించికూడ చర్చించలేదు. ఈ రెండు విషయములను శ్రీ అప్పజోడు వెంకట సుబ్బయ్యగారి కన్ను పసిగట్టి మరి మరపు రానట్లు పాఠకుని హృదయముపై గాఢమైన ముద్రను వేయగలిగిన వ్యాసమును అందించినది.

శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి దృష్టి చాలా నిశితమైంది. ఆయన కలము అంతకంటె పదునైనది. సమకాలీన సమాజము ఆయన రచనలలో రూపు కట్టినంత ప్రస్ఫుటముగ మరి యే కొద్దిమంది రచనలలోనోకాని రూపుకట్టదు. ప్రతి విషయమును స్పందించే హృదయముతో చూసి చదువరిలో ప్రతి స్పందనము కలిగించడంలో ఆయన దిట్ట. 'కిళ్ళీకొట్టు' ఆయన ప్రత్యేకముగ ఒక వ్యాస రూపమున వ్రాసిన రచనకాదు. 'రాజు - మహిషి' అనే నవలలో ప్రసంగ వశమున వర్ణించినది.

నానాటికీ దిగజారుచున్న సమాజ పరిస్థితులను చెళ్ళుమనేలా కొట్టిన కొరడా దెబ్బ కిళ్ళీకొట్టు. ఈ రచనలో శ్రీ రాచకొండ ఉపయోగించిన గ్రాంధికభాష, ఆయన చేతిలో అలంకారముకాదు, అవహేళనకు ఉపయోగించిన బలమైన ఆయుధము. రచనలో ఎక్కడైనా ఏదైనా సంగతిని వర్ణించవలసి వచ్చినచోట ఆయన తీసుకువచ్చే క్రొత్త క్రొత్త ఉపమానాలూ, ఉపయోగించే పద చిత్రాలూ అపురూపమైనవీ అనన్య సామాన్యమైనవీను. నిద్రగన్నేరుచెట్టు నీడలో ఉండే కిళ్ళీకొట్టులో తరుచు కూర్చుండే వయస్సు ముదిరిన ఆడదాన్ని, బలసిన చిలుకతో, గుళ్ళో విగ్రహంతో, చలికాలంలో ఉపయోగించే రగ్గుతో పోల్చడంవల్ల, ఘనీభవించి పోయిన పాతకాలపు ఆర్థిక వ్యవస్థమీదా, రంగుల ప్రపంచంమీదా, అంధ విశ్వాసాల జీర్ణ సౌధంమీదా ఆయనకుగల తీవ్ర వ్యతిరేక భావం ఎట్టిదో అవగతం అవుతుంది. కాలక్షేపానికీ, రకరకాల అవసరాలకీ, ఆస్తికమ్మన్యులకీ, అల్లరిమూకలకీ, భక్తులకీ, భావుకులకీ, రోగులకీ, భోగులకీ, అందరికీ అన్నిరకాలుగా పనికివస్తూ అందుబాటులోఉండే సెక్యులర్ సౌభాగ్యం కిళ్ళీకొట్టు అనుటలో రచయిత నిజమును ఎంత తీవ్రతరంగా చెప్పగలడో అర్థమౌతుంది.

తీవ్రమైన విషయాన్నికూడా తియ్యగా మార్దవంగా చెప్పగల నేర్పరి శ్రీ మునిమాణిక్యం నరసింహారావు. చుట్ట పుట్టుకగురించి చర్చించి, చుట్టలోని ఘాటు, కమ్మదనము, మాధుర్యము వర్ణించి, నెమ్మది నెమ్మదిగా లోకములోని సర్వ విషయములను చుట్టలో చుట్టబెట్టి తుదకు పాండవులచేతకూడా చుట్ట ముట్టించిన దిట్ట శ్రీ మునిమాణిక్యం. ఆదిశేషువుకూడా చుట్ట చుట్టుకొనికాని పడుకోడు, అతనికీ చుట్టకీఉన్న చుట్టరికం అంతటిది అని ఆయన బల్లగుద్ది చెబుతూంటే ఎంతటి తర్క వ్యాకరణ పండితునికైనా 'చుట్టరికం' చుట్ట శబ్దభవమేమో అని అనుమానం రాకమానదు. ఆయన చేతిలో బీడీ సిగరెట్లతోకలిసి చుట్ట, త్రిమూర్త్యా

త్మకత సాధించింది. సమసమాజాన్ని సాధించడంలో చుట్టను మించిన దిట్ట మరి లేదు అని శ్రీ మునిమాణిక్యం తన వ్యాసానికి ఒక ఘాటునీ మాధుర్యాన్నీ అందించారు.

వావిలాలవారి 'నిద్ర', భమిడిపాటివారి 'నవ్వు' తక్కిన అన్ని వ్యాసముల కంటె భిన్నమైనవి. అవి ఆ యా విషయములపై విజ్ఞాన సర్వస్వములు. నిద్రకు సంబంధించిన ఎన్నో ఆసక్తి కరమైన విషయములు, శాస్త్రమునకు సంబంధించిన సంగతులు రకరకములైన ఉదాహరణలతో కలిపి శ్రీ వావిలాల సాగించిన రసవ ద్రచన 'నిద్ర', దేశ విదేశాలలో ప్రాచీన అర్వాచీన సమీచీన ప్రజలకు గల నిద్రానుభవము, నిద్రకు సంబంధించిన ఎన్నో అపూర్వమైన సంగతులు, శ్రీ వావి లాల సోమయాజులుగారి చేతిలో కావ్యత్వమును సంపాదించుకొన్నాయి. శ్రుతి స్మృతి పురాణములనుండీ, అనేకమైన పాశ్చాత్య గ్రంథములనుండీ నిద్రతో ముడి వడిన ముఖ్య విషయముల నెన్నిటినో ఏర్చికూర్చిన మణిహారము వావిలాలవారి వ్యాసము. నిద్రపై ఆయన వేసిన ముద్ర ఎన్నటికీ మాసిపోనిది.

ఇట్టే రచయితయొక్క పాండిత్యానికీ ప్రతిభావ్యుత్పత్తులకీ అద్దముపట్టిన మరియొక రసవద్రచన పలుకే బంగారమా అనిపించేటటువంటి శ్రీ అడపా రామ కృష్ణారావుగారి మౌనం. పర్షియాలోని 'మిత్ర'దేవత ఉపాసకులూ, ఏసుక్రీస్తు ఉపదేశ వాక్యములూ, కాళిదాసు నిగూఢవచనాలూ, పైథాగరస్ సలహాలూ, గెథే సూక్తులూ, వీరి వ్యాసానికి తరగని సొమ్ములు, వ్యాసాన్ని ఆరంభించి చర్చించి చివరకి ఉపసంహార వాక్యాన్ని పలుకుటలో శ్రీ అడపావారు ఎడనెడ చూపించే ప్రజ్ఞాపాటవములు ప్రత్యేకములు.

కాలక్షేపం శీర్షికద్వారా తెలుగు పాఠకులకు పరిచితులైనవారు శ్రీ దాసు వామనరావుగారు. వారి 'అన్నదానం' వ్యాసం ప్రాచీనకాలంలో భారతీయ జీవి తాన్నీ, అన్నదానానికి సనాతనులిచ్చిన ప్రాముఖ్యాన్నీ విశదీకరిస్తుంది.

'మన మనస్సులోని భావాల్ని పసిగట్టి ఈయన ఎలారాశారు చెప్మా' అని పించేటంతటి నిసర్గ రమణీయమైనది శ్రీ నండూరి రామమోహనరావుగారి 'ఆశ-నిరాశ' వ్యాసం. నిజానికి మనం అంతా ఆశావాదులమా నిరాశావాదులమా అని గుండెలమీద చెయ్యివేసుకొని ప్రశ్నించుకుంటే ''అవునుసుమా ! ఆయన చెప్పినట్లు లోపల్లోపల అంతా ఆశావాదులమే. కాని పైకిమాత్రం పెదవివిరుస్తూ నిరాశనటిస్తాం.

ఎంత చోద్యం'' అంటూ విస్తుపోయి దవడలు నొక్కుకుంటాం. మసిబూసిన మారేడుకాయలా తయారైన మానవ జీవితాన్ని ఈ వ్యాసం ఎక్స్‌రే తీసి పడేస్తుంది.

చెవులు అందరికీ ఉన్నవే-కాని అవి ఎంతమందికి ఉపయోగపడుతున్నాయి? ఆ ఉపయోగంలో దుర్వినియోగమెంత సద్వినియోగమెంత ? సవాలక్ష సందర్భాల్లో ఇబ్బందుల్ని కలిగిస్తూ కారం తిన్నపుడల్లా గూబగుయ్‌మనిపిస్తూ, ఆ చెవిగాడ్పు ఈ చెవికి అందిస్తూ గోడలకికూడా మొలవడం మొదలెట్టిన ఈ చెవులు, లేకపోతే ఏం అంటూ చెవుల్ని పట్టుకుని ఆడించిన వ్యాసం ఒకటి అయితే, మరయితే 'తాంబూలమ్' మాటేమిటి ? అదిమాత్రం ఎన్ని తమాషాలు చేయడంలేదు ? మనుచరిత్ర కథకి అదే కదామూలం ? ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీ గంధస్థగితేతర పరిమళంతోకూడిన మారుతం వీచింది కనుకకాని లేకపోతే ప్రవరాఖ్యుడు వరూధిని దగ్గరకు వెళ్ళేవాడా ? అయినా ఈ తాంబూలంతో ఎన్ని తంటాలని ? అందరికీ ఈనెలుతీసిన ఆకుల్ని వేసుకోవాలనే తహతహ, సమస్యలు తీరిన జీవితాన్ని తనివితీరా అనుభవించాలన్నట్లు. కాని ఈనెలన్నీ తీయబోతే చివరకి చేతిలో ఆకే మిగలదే అని, తాంబూలపు వాసనలు గుప్పుమనేటట్లు నిట్టూర్చారు శ్రీ కామేశమ్.

ఒక మహోద్యమంలాగ, ఒక పెనుతుఫానులాగ, ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన శ్రీ గుడిపాటి వెంకటచలం రమణమహర్షి ఆశ్రమం చేరుకోవడమేమిటి ఈయన్ని ఎలాగ అర్థంచేసుకోవడం అని వితర్కించుకొంటూన్న ఆంధ్రులకు తన మ్యూజింగ్స్‌లో ''వెఱ్ఱివాళ్ళల్లారా ! మీకు అర్థంకావడం అలాఉంచండి. నాకునేను ఎంతవరకు అర్థంఅయాను ? అసలు నేను ఎవరు ? ఎప్పటినేను ? చిన్నప్పటినేనా, ఎదిగిన నేనా, నేటినేనా ? నాకు మోక్షంఅంటే ఏ నేనుకి ? ఆ నేనుకీ ఇప్పటి నేనుకీ సంబంధం ఏమిటి ! మోక్షం అంటే ఏమిటి ? విడదీయడానికి వీలులేకుండా కలిసిపోవడమే కదా ? కలిసిపోయిన తర్వాత, ఇంక 'నాకు మోక్షంవచ్చింది అనడమేమిటి అర్థంలేనిమాట - ఇంకా నే నెక్కడ మిగిలింది ? అంటూ శుద్ధతర్కంతో జిజ్ఞాసతో రీజన్ ఎంతవరకూ తీసికొనివెళితే అంతవరకూ వెళ్ళి 'నేను' యొక్క స్వరూపాన్ని గాఢమైన వేదనతో, బలమైన భావావేశంతో, సజీవమైన భాషలో రకరకాలుగా తర్కించి అందిస్తారు శ్రీ చలం 'నేను'లో. ఈ గ్రంథంలో పొందుపరచిన 'నేను', ఆయన తన మ్యూజింగ్స్‌లో ఒకటిరెండుచోట్ల విడివిడిగా ప్రస్తా

వించిన విడిభాగాల సమాహారం. శ్రీ చలం భావాలకీ భాషకీ తపనకీ తర్కానికీ నికషోపలంగా నిలిచే ఈ వ్యాసం, పాఠకునిలో ఆలోచనల్ని రేకెత్తించి 'నేను' తెలితేనేకాని మేనువాల్చకుండా తొందరచేసే 'బహుపరాక్'.

అనతి కాలంలో అశేష ఆంధ్ర పాఠకుల అభిమానాన్నీ చూరగొనిన శ్రీమతి పురాణం సీత, వారం వారం వ్రాసే ఇల్లాలి ముచ్చట్లు ఎంత ముచ్చటైనవో అంత గంభీరమైనవీను. మధ్యతరగతి స్త్రీకి వచ్చే ఇబ్బందుల్నీ, నిత్యమూ ఎదురయ్యే పందలాది సమస్యల్నీ అన్నింటికీ మూలమైన ఆర్థిక సమస్యనీ హార్దికంగా ఒక చిన్న సన్నివేశం ఆధారంగా అందించిన చిత్రమైన వ్యాసం 'మనీసెన్స్'. స్వరూపంలో ఇది సంఘటన ఏమో అనిపించినా, మౌలికంగా ఇది ఎంతో బరువైన వ్యాసం. ఈ రచనని చదివిన ప్రతి పాఠకుని హృదయం ఆర్ద్రం అవుతుంది. అందుకు కారణం దానిలోని అపూర్వ శిల్ప నైపుణ్యమూ, దాని వెనుక దాగిఉన్న నిజాయితీను (Sincerity).

మూసీ కినారే, మాట కచ్చేరీవంటి ప్రత్యేక శీర్షికలద్వారా ఆంధ్ర పాఠకులలో ఉత్సుకతను రేకెత్తించిన 'ప్రవీణ్' యొక్క అసలుపేరు శ్రీ తురగా కృష్ణమోహన్. ఈయన తన వ్యాసం 'ప్రయాణాల్లో బరువు సామాన్లు'కి వస్తువుగా తీసికొన్నది ఒక సామాన్య విషయం. కాని అది ఆయన చేతిలో అసామాన్యమైన రూపాన్ని సంపాదించుకొంది. ప్రయాణాలూ బరువు సామానులూ అంటూ మొదలుపెట్టి పాఠకులను సన్నసన్నగా నవ్విస్తూ, మనిషి బతుకుని ప్రయాణంతోనూ, అతని బాధ్యతల్ని బరువు సామానులతోనూ పోల్చి వ్యాసానికొక తాత్త్వికవిలువని తీసుకువచ్చారు. సన్నివేశ గతమైన హాస్యం శ్రీ కృష్ణమోహన్ చేతిలో పరాకాష్ఠ నందుకొంది. 'టిక్కెట్టు తప్ప తక్కిన సామాను అంతా కూలివాడి నెత్తిన పెడతాం', 'గేటుదగ్గరఉండే టికెట్ కలెక్టర్‌చేతిలో పర్సుఉంచి టిక్కెట్టు జేబులో పెట్టుకుంటూ బయటికి నడుస్తాం' - వగైరా సంగతుల్ని వర్ణిస్తూంటే ఆ సన్నివేశం మన కళ్ళముందు మెదిలి పెదిమలపై సన్నని నవ్వు తళుక్కుమంటుంది.

ఫేన్‌ల దగ్గర్నుంచి వేన్‌లవరకూ అన్నీ వాయిదాల పద్ధతిమీద కొనుక్కుంటూన్న నేటి ప్రజల స్థితిని చూసి జాలిపడి వ్రాసిన వాయిదాల వ్యాసం శ్రీ రావూరి చేతిలో కరుణహాస్యాలలోదోగి, వాయిదాల లోకంలో లభించే చమత్కారాన్నంతనీ అసలీ ఫాయిదాలతో సహా చదువరికి ముట్టచెబుతుంది.

ఆవకాయ, గోంగూర ఆంధ్రత్వానికి పర్యాయ పదాలుగా ఏనాడో స్థిరపడి పోయాయి. తెలుగువాడి తెగింపు, చొరవ, చేవ, ప్రజ్ఞ, ప్రాభవం, ఘనత, ప్రత్యే కత, వీటి అన్నింటికీ మూలకారణం అతను ఎంతో ఆప్యాయంగా ఆరగించే ఆవకాయే అని జాడీ బద్దలుకొట్టి చెప్పిన 'ఆవకాయ' వ్యాసంలో శ్రీ పుచ్చా పూర్ణానందంగారి కలం నల్లేరుమీద బండిలా సాగిపోయింది. సరదాగా తమషా కోసం రాసినా మధ్యమధ్య ఏం గాంభీర్యం! ఎంతటి పాండితీ వైభవం! గంగా ప్రవాహంలాగానే భాషకీ, ఉవ్వెత్తుగా ఉరికిపడే ఆలోచనల జలపాతానికీ, చక్కగా వియ్యం కుదిరిన వ్యాసం ఇది. పిండీ మధురం, ముక్కా మధురం, ఊటా మధురం, టెంకా మధురం అన్నట్లు పేజీమధురం, పేరామధురం, పంక్తిమధురం, పదమూ మధురం–ఆవకాయ జాడీలాంటి ఈ వ్యాసం అంతా మధురమే–

హితశ్రీ అనే కలంపేరుగల శ్రీ ఎమ్. వి. ఎన్. ప్రసాదరావుగారు వ్రాసిన 'గొప్పవాడి పక్కవాడు' వ్యంగ్యాన్ని అందంగా దట్టించిన ఒక చిన్న రసఖండం. నాయకులతోను వినాయకులతోనూ విసిగిపోతున్న ప్రజల కిది అమితానక్తి దాయకమైన వ్యాసం. గొప్పవాడి గొప్పతనం పక్కవాడి పక్కతనంమీదే ఆధారపడి ఉంటుందనే సత్యాన్ని చెబుతూ శ్రీ హితశ్రీ ప్రస్తావించిన సంగతులూ, సూచించిన సంఘటనలూ ఆయన నిశిత పరిశీలనా శక్తికీ ప్రాపంచికానుభవానికీ, రచనా వైచిత్రికీ తార్కాణాలు.

శ్రీ అప్పజోడువారి 'కన్ను', శ్రీ వావిలాలవారి 'నిద్ర', శ్రీ భమిడిపాటి వారి 'నవ్వు', ఈ మూడు వ్యాసాలూ ఒక కోవకి చెందినవి. ఇవి ఆ యా విష యాలకి సంబంధించిన సమస్తమైన సంగతుల్నీ ఆసక్తి దాయకమైన విధానంలో పాఠకున కందించి, అతని విజ్ఞాన పరిధిని వేయింతలుగ పెంచే విజ్ఞాన కోశములు.

సమకాలీన ఆంధ్ర సాహితీ ప్రపంచంలో చతురహాస్య రచనా ధురీణుడుగా పేరుగాంచిన శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ వ్యాసం 'పగటి కలలు' నిరాశాదురాశ లతో క్రుంగిపోయే మానసిక వ్యాధులకి దివ్యౌషధం. "పగటి కలల్ని మితంగా సేవిస్తే కండకూ గుండెకూ పుష్టి లభిస్తుంది. పగటి కలల ముడిసరుకు కోరిక తీరిక "అంటూ తన భావాన్ని చెప్పేతీరులో, ఉపయోగించే భాషలో నిత్యమూ నవ్య మార్గాన్ని ప్రవేశపెట్టే రచయిత శ్రీ ముళ్ళపూడి. ఆయన వ్యాసం 'పగటి కలలు', ఈ మణి తోరణంలో, రంగురంగుల కాంతుల్ని విరజిమ్మే ఒక అమూల్యమైన మణిరాజము.

'తాంబూలం' గురించి సాగిన ఆలోచనలు సాత్త్వికశృంగారంనుంచి ఆధ్యాత్మిక ప్రవచనందాకా గల ఎన్నో చిత్రవిచిత్రమైన జీవిత సంఘటనల్ని వెలిగించగా, అడపావారి వ్యాసం మౌనాన్ని ప్రశంసించగా మానవునికిగల ప్రత్యేక మైన శక్తులలో ముఖ్యమైనది అయిన సంభాషణనిగురించి రకరకములైన అభి ప్రాయములను, ప్రాచీన ప్రబంధాలలో మాటకి ఇచ్చిన ప్రాముఖ్యమును, ప్రాశ్చాత్య సాహితీవేత్తల అపూర్వమైన ఆలోచనలను 'మాట్లాడం' అనే వ్యాసము సమీక్షిస్తూ, ఎన్నో విశిష్టమైన భావాల కాంతుల్ని పాఠకుల మనో వీధులలో తళుక్కుమనిపించి, మాటయొక్క మహిమాన్విత శక్తి ఇంతటిదా అని నివ్వెర పడునట్లు చేస్తుంది.

దొంగనోట్లు ముద్రించేవాళ్ళూ, నకిలీ సరుకులు అమ్మేవాళ్ళూ, కల్తీ వ్యాపారం చేసేవాళ్ళూ కాశ్మీర్‌నుండి కన్యాకుమారిదాకా బ్రహ్మ చెముడు డొంకల్లా విస్తరించిపోగా, వారి వ్యాపార వ్యవహారాల్ని ప్రస్తావిస్తూ, 'పాపం స్వయం పోష కులు' అంటూ శ్రీ వాకాటి పాండురంగారావు, వారిని సమర్థిస్తున్నట్లు రచన సాగించారు. కాని నిజానికి ఆయన వ్యాసం వారిమీద ఎత్తిన ధ్వజం. సమాజానికి శ్రీ వాకాటి పలికిన హెచ్చరిక, ఈ వ్యాసాన్ని వ్యంగ్య శ్రేణికి చేర్చింది.

'నవ్వు', శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు తెలుగువారి హృదయంలో పండించిన నవ్వుల పంటకు సంబంధించిన శాస్త్ర విషయముకాగా, 'దేవుని దస్తూరీ', ఈ లోకంలో కనిపించే ప్రతి సౌందర్య మయమైన వస్తువు రచయితలో కలిగించే పులకింతగా, ఒక మధురమైన వచన కావ్యంగా, రూపొందింది. శృంగారమునకు సంబంధించిన అభిప్రాయములు పోనుపోను ఏ స్థితికి దిగజారుచున్నదీ, దానివలన రానున్న ప్రమాదముల స్వరూప మెట్టిదీ, అనే సంగతుల్ని ముందు చూపుతో ఒక మహా ప్రవక్తవలె సమాజానికి తెలియపర్చారు శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు. 'శృంగారము' లోని భాష తేటయైనదికాగా, శ్రీ యస్వీ జోగారావుగారి తొలి పలుకుల పాలవెల్లి, సాహిత్యోద్యానంలో భాషాయోష విలాసంగా ఊరేగే పూల రథం.

అనితర సాధ్యం శ్రీశ్రీ మార్గం అనేది అక్షరాలా నిజం. ఆయన చూపు ఎప్పుడూ ఉన్నతంగా ఊర్ధ్వానికీ, నడకఏమో ఎన్నటికీ ప్రగతి పథంలో మున్ముందుకీను. అందుకే ఆయన వ్యక్తిత్వాన్ని నమ్మకాల్ని ముమ్మూర్తులా ప్రతిబింబించే చెట్టూ సెలయేరూ ఆయనకి వస్తువులయాయి; ప్రయాణం ప్రవాహం

అని రెండు శీర్షికలనుండి తీసికొన్న ఒక్క వ్యాసంలో. శ్రీరంగం శ్రీనివాసరావుకి శషభిషలు పనికిరావు. చెప్పదలుచుకున్నది ఏదో ముక్కుమీద గ్రుద్ది చెప్పడం, ఆ చెప్పింది ఎంత అందంగా, ఎంత బలంగా, ఎంత కొత్తగా చెప్పారు అని ప్రతి పక్షులచేతకూడా అనిపించుకోవడం. భావాల్ని నేరుగా గుండెల్లోంచి తీస్తారుకనకే ఆయన రచనలలో అంతవాడీ, వేడీను.

శిష్ట వ్యావహారికంలో ముఖ్యంగా పత్రికల భాషలో తనదైన ఒక మార్గాన్ని వేసి, అది పదిమందికీ ఒరవడిగా చేయగలిగిన సామర్థ్యం శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారిది. తన అసంఖ్యాకమైన రచనలద్వారానూ, అసామాన్యమైన సంపాద కీయముల ద్వారానూ, అననుకరణీయమైన పిచ్చా - పాటీ, మాటా - మంతీ ద్వారానూ ఆంధ్ర ప్రజాసాగరంలో ఆలోచనా తరంగాల్ని రేపిన సాహితీ ప్రభంజను డాయన. శ్రీ నార్ల ప్రయోగించిన 'కవుల ఢంకా' కవుల శక్తినీ, యుక్తినీ, కుయుక్తినీకూడా తేటతెల్లంచేసే విశిష్ట రచన. వ్యాసంలో ఆయన ఇచ్చిన ఉదాహరణలు ఆయనకు సాహిత్యంతో ఉన్న గాఢమైన పరిచయానికి తార్కాణాలు.

ప్రసిద్ధ విమర్శకుడు, ఉత్తమ భాషా పరిశోధకుడు అయిన శ్రీ తిరుమల రామచంద్ర నుడి - నానుడి నుండి ఎన్నుకొన్నది 'కోటలో పాగా'. ఈ సంక లనములోని వ్యాసము లన్నిటి మార్గము ఒకటి, దీని మార్గము మరియొకటి. ఇందు ముఖ్యముగా ఆ శబ్దముయొక్క ఉత్పత్తి, విపరిణామము, వాని వలన మనము తెలిసికొనవలసిన నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు చర్చించుట జరిగింది.

శ్రీ కొఙ్గపాటి గంగాధరరావుగారు తమ 'రిహార్సల్స్' అనే వ్యాసములో మానవ జీవితాన్నే ఒక నాటకంగా, అందులో మనిషిచేసే పొరబాట్లనీ అవక తవకల్నీ రిహార్సల్స్‌గా, ఊహించి, తమ పాతిక ముప్ఫైయేళ్ళ రంగస్థల జీవితం లోని వివిధమైన విచిత్రానుభవాల్నీ ఉదాహరణలుగా చేర్చి ఏర్చి కూర్చారు. ఇది ఒక రసవత్తరమైన ఖండిక.

ఈ సంకలనములో ఈ యీ వ్యాసములను కూర్చుటకు ముందు, 'అసలు వ్యాసముల నెన్నుకొనుటలో ఏ విధానము ననుసరించవలెను' అను ప్రశ్న ఉద యించింది. ఒక పరిమితమైన కాలమును తీసికొని, ఆ కాలములో రచింపబడిన ఉత్తమ ప్రాసంగిక వ్యాసములను ఎన్నుకొనుట ఒకటి - అలా కాకుండా ఒక

విధానమునకు కట్టుబడి ఆ విధానమున నడచిన వ్యాసములను స్వీకరించుట మరి యొకటి. లేక ఒక ధోరణిలో నడచిన వ్యాసములను కూర్చుట ఇంకొకటి. అట్లు కాదని ప్రాసంగిక వ్యాసమునకు ఒక నిర్వచనమును సిద్ధపరుచుకొని ఆ నిర్వచన మునకు నిలిచే వ్యాసములను ఏరుకొనుట వేరొకటి.

ఇలా ఏ ఒక్క మార్గమును అనుసరించినా సాధ్యమైనన్ని మంచి వ్యాస ములు లభించుట దుర్ఘటమై ఉండేది. ప్రచురణార్హము కానివానినికూడ కొన్నిటిని స్వీకరించవలసి వచ్చేది. అందువలన, గిరిగీసి కూర్చొనకుండ రసజ్ఞ మనోజ్ఞముగ సాగిన అన్ని రకముల మంచి వ్యాసములను, రచనలోని విశిష్టత ఒక్కటియే కొలమానముగ తీసికొని, ఎన్నుకొనుట జరిగింది. అయితే ఎక్కువ బరువుగ, గంభీరముగ సాగిన వ్యాసములకంటె, ఒకింత సరళముగ, కొంచెము చతురముగ, విజ్ఞాన వినోదదాయకముగ, మధుర మంజులముగ నడచిన వ్యాసములకే ప్రాధా న్యము నిచ్చుటకు ప్రయత్నించాను.

తెలుగు పత్రికలలో అప్పుడప్పుడు, కొందరి రచనలలో ఎప్పుడో ఒకప్పుడు మెరిసిన విద్యుల్లతికలను కొన్నిటినైనను చేర్చి స్థిర సౌదామినిగాకూర్చి ఆంధ్ర సాహితీ ప్రాంగణమున 'వ్యాసతోరణము'గ వెలార్చవలెనను సంకల్పము ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి కలుగుటయు, ఆ కృషికి నన్ను నియో గించుటయు, ఇట్టి ప్రయత్నము తెలుగులో మొదటిది అగుటయు, చిత్రమైన సంఘటనలు.

ఏడెనిమిది శతాబ్దులనుండి నేటివరకును విస్తరిల్లిన ఆంధ్ర వ్యాస తరు శాఖలను, తెనుగున వెలసిన ప్రసిద్ధ పత్రికా సముచ్చయమును, అధ్యయన మార్గ ములో పరిశీలించుట ఒక అపూర్వమైన అనుభవము. నవ్యాంధ్ర సారస్వత సింధు వున మునిగి ఈ మణులను వెలికితీయు ప్రయత్నములో, కొన్ని అనర్ఘ రత్నములు నాకు దొరికియుండక పోవచ్చును. దొరికిన ఈ కొద్ది మణులలోకూడ నన్నియు సమానమైన కాంతులను ప్రసరింపక పోవచ్చును. ఇట్టి ప్రతి ప్రయత్నమునకును సాధారణముగ ఎల్లప్పుడు కొన్ని పరిమితులు, ఇబ్బందులు ఉండుట సహజము. అవి కారణముగ రసజ్ఞుల అమోదమును పూర్తిగా పొందలేని ఒకటి రెండు వ్యాసము లిందు చోటుచేసికొని యుండవచ్చును. రస ఖండములవంటి మరెన్నో వ్యాసము లిందు కన్పింపక పోవచ్చును.

అయినా తెనుగున, వివిధ రచయితల ప్రాసంగిక వ్యాసములను సంకలన రూపమున, తీసికొని వచ్చుట కిది తొలి ప్రయత్నమే కనుక మలి ప్రయత్నములు మరెన్నిటిలోనో ఈ లోటుపాట్లను సర్దుబాట్లు చేసికొనవచ్చును. ఆంధ్రభాషా యోష గృహప్రాంగణమున మరెన్నియో వ్యాసతోరణములను కైసేయవలసి యున్నది గాన, వానిని మరింత యుజ్జ్వల కాంతులతో ప్రకాశింపజేయనగును.

ప్రస్తుతమున కీ యత్నమును ప్రారంభించిన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారిని అభినందించుచు, నా కీ అవకాశమును కల్పించిన గౌ॥ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి (అధ్యక్షులు) శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి (కార్యదర్శి) కృతజ్ఞత నర్పించుచు, తమ రచనల నిందు చేర్చి ప్రచురించుటకు అనుమతించిన రచయిత లందరకు కృతజ్ఞత లందించుచు, ఆంధ్ర రస జగత్తు ఈ గ్రంథమును సమాదరించగలదని ఆశించుచు, దీనిని సహృదయ కరకమలముల కందించు చున్నాను.

6, మ్యునిసిపల్ వీధి
బాపట్ల,
15-12-1973

*పోలాప్రగడ సత్యానారాయణమూర్తి*
సంపాదకుడు

# విషయ సూచిక

# వ్యా స తో ర ణ ము

## (ప్రాసంగిక వ్యాససంకలనము)

# స్వదేశ పరిశ్రమలు

—శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

మాటులో గూర్చుండి - నిర్భయముగా నిరుపద్రవముగా గూరుచుండి - యాయన శలాకలుగల గవాక్షమునుండి, తుపాకిని బేల్చి పెద్దపులిని జంపుట శౌర్య లక్షణమా ? శౌర్యమున్నవానికి జాఁప జాతిబండలతో గట్టిన మాటెందులకు ? దొంగ దొంగ చూపుల నక్కినక్కి జాలకఱ్ఱల నడుమనుండి నిక్కినిక్కి యెదుట నున్న నీటిగుంట వైపునకుఁ బ్రాణము లరచేతఁ బెట్టుకొని చూచుట యెందులకు ? శౌర్యమున్నయెడలఁ బెద్దపులి కెదురుగాఁ బోరాదా ? ఎడమచేతికి గుడ్డ గట్టిగాఁ జుట్టఁబెట్టి, చిట్టచివర చాకును ధరించి యా చేతిని శార్దూల వదన గహ్వరమున కందిచ్చి, కుడిచేతనున్న కైజారుతోఁ గణతపైఁ బొడిచి దానినిఁ జంపరాదా ? బహిరంగ కదన రంగమున భయరహితుడై నిలువఁబడి భల్ల ప్రఘాతమున దాని ప్రాణము లపహరింపరాదా ! 'మా దొరగారు పరవకుఁబోయి పెద్దపులిని జంపినా' రని యాతని భటులు ప్రభు శౌర్యలక్షణస్తుతు లొనర్తురు. ఆ స్తుతి వాక్యములకేమైన నర్థమైనదా ? ఆ స్తుతులవలన ప్రభువునకు గౌరవ మేమైన నున్నదా ? పోనిండు గౌరవము లేనందులకుఁ జింతలేదు - అది ప్రభువునకు మఱింత యప్రతిష్ఠా కరముగ నుండునట్లు కనఁబడుటలేదా ? ఇంటిలోఁ బెసరట్లఁ దినుచుఁ గూరుచుండు టచేఁ బెద్దమనుష్యుఁ డనిపించుకొనిన దొర, పెద్దపులి వేటకుఁబోయి యీ నగు బాటుకూడ నందు టెందులకు ? కట్టుదిట్టముగాఁ జెట్టుమాటులోనుండి తుపాకిని గాల్చు నప్పుడు ప్రభుఁడే యా మహాకార్య మొనర్పవలయునన్న మాటయేమి ? అతని బానిస యామాత్రపుఁ బనిని జేయలేఁడా ? ఇఁకఁ బ్రభుని శౌర్య మెక్కడిది ? మాటులో మాటుగ నొక్కొక్కప్పుడు బానిసయే తుపాకిని బేల్చి పెద్దపులిని జంపి ప్రభున కప్రతిష్ఠనుమించిన ప్రతిష్ఠ నంటగట్టుటలేదా ? శౌర్య ప్రకటనమున కిచ్చటఁ గనిన యవకాశ మేమున్నది ? నోరు తెఱచుకొని నోటిలోఁ బడినదెల్ల గుటుక్కున మ్రింగు నజగర మేమంత శౌర్యముకలది ? శార్దూలాఖేటములో నున్నది శౌర్యము కాదు. మోసము. ప్రచ్ఛన్న సంకేత స్థలాంత రాసీనుఁడై వ్యాఘ్ర రాజమారణ మొనర్పగల ప్రభుడు, పారిపోవుట కవకాశములేని గదిలోఁ దిరుగఁబడిన పిల్లిని

వధింపగలుగు నెడల, శిరఃకంపన మొనర్పవలసినదేకాదా! పిల్లి వేటలోనున్న పౌరుషము పెద్దపులి వేటలో నేది?

సైకిలు నెక్కి గంటకుఁ బదారుమైళ్ళు పోవువాఁడు శీఘ్రగామికాఁడు. కాలి కొలఁది, గంట కాఱుమైళ్ళు పరుగెత్త గలవాఁడే జంఘాలుఁడు - బేగిరావు - రికాబుల నుపయోగపఱచి జాఱకుండ ముందు వెనుకల నెత్తుగల జీనుపై భద్రముగ నధివసించి, కంఖాణము నిష్టానుసారముగఁ గనుతెప్ప ప్రేటుతో నాఁపఁగల కళ్ళెమును జేత ధరించి గుఱ్ఱపుస్వారి చేయు నాతఁడు రౌతుకాఁడు. మెడపైనున్న జూలును జేత దబాయించి డబ్బాటున మీఁదికి దుమికి తొడలతోఁ బిక్కలతో గుఱ్ఱమును బెసఁగ నీకుండ నదిమిపట్టి స్వారిచేయువాఁడే రౌతు. కౌపీనమును ధరించి యేటికో నదికో సముద్ర శాఖకో యడ్డుపడినవాఁ డీతగాఁడుగాని, పైకిఁ దేల్పఁగల బెండు పటకాలను - దెప్పల గుంభములను - గాలిదిండ్ల నుపయోగించి యీఁదువాఁడీతగాఁ డనవచ్చునా?

> కత్తివిడని వాని ఘనుఁడందు రదికాదు
> కత్తి విడుచువాఁడె ఘనుఁడు సుమ్ము
> కత్తి యోధవరుని ఖ్యాతిని హరియించుఁ
> గలియఁబడుటలోనె కడిమి కలదు.

సాధన సామగ్రులు, యంత్రములు, వచ్చిన తరువాతనే దేహశక్తు లడుగంటినవి. చేతిపనులు చచ్చినవి. పరిశ్రమ చాకచక్యములు భగ్నములైనవి. మొగము మెఱుఁగులువచ్చిన తరువాతనే మగువల మొగములు గఱుసెక్కినవి — కేశ సంవర్ధనీ తైలములు వచ్చిన తరువాతనే యున్నవికూడ రాలిపోవుచున్నవి - సహజ సౌందర్య వృద్ధికి - సహజ ప్రతిభావృద్ధికి - సాధనములు తఱుచుగా బాధకములుగాని సాధకములు కావు. పడుచుదనమున సేవించిన వసంత కుసుమాకర మకరధ్వజాది తేజఃపుష్టి హేతుకములగు నౌషధములు వీర్యవినాశములుకాని పోషకములు కావు. యౌవనవతి మెడలో ధరించు పట్టెడు ముత్యాలపేరైన మిసమిసలగు యౌవనాంకముల నడఁచిపెట్టునుగాని యుబుకఁజేయఁ జాలదు. మన పరిశ్రమము లన్నియు విదేశీయ యంత్రజాల నిర్మిత వస్తు పరికరములవలన భగ్నములై పోయినవి.

"ఢక్కాలో నేఁతగాండ్రు స్వహస్తములతో నేసిన సెల్లాల (Muslins) వంటి పరమలలిత మృదుల సుకుమార వస్త్రము లెచ్చటనైన గలవా? ఎన్ని దేశ

ములు ఈ నడుమ సంపద్వంతములైనవి ? ఎన్ని జాతులు నాగరకతా సమృద్ధము లైనవి ! ఎన్నికోటుల పరిశ్రమ శాలలు ప్రపంచమున నుద్భవించి యభివృద్ధినొందు చుండుటలేదు. ఆవిరిచే, నూనెచే, విద్యుచ్ఛక్తిచే నడపఁబడు నెన్ని యంత్రములు ప్రపంచమునం దలసూపి పనిచేయుచుండుటలేదు ! ఏది ! ఒక్క దేశమున - నొక్క జాతిలోనైన - ఢక్కా సెల్లాలవంటివి బయలు దేఱినవా ? మహా మహా నిశితములై - మహా సూక్ష్మములైన - యనేక సహస్రాశ్వ ధాటిగల యంత్రములైనఁ దీయఁజాలని - మిగుల సన్ననైన దారములను మన నేఁతగాండ్రు (ఢక్కాలోనివారు) వట్టి చేతులతోఁ దీయఁగలుగుట యత్యంత పరిశ్రమోన్నతశక్తి కధికతమావధికాదా ? ఆహా ! వారి వ్రేలికొన లెంత మృదులములో - యెంత సూక్ష్మములో - యెంత స్పర్శేంద్రియ మహాశక్తి మహనీయములో - యెట్టి సంపూర్ణ చాకచక్య పరిపక్వతాదశ నొందియున్నవో - ఆలోచించు కొనుటకైన మనకు భావనాశక్తి కలదా ? ఎంత చిరకాలాభ్యాసమున నెంత యక్షీణ దీక్షాదక్షతచే వారికి మహామంత్రములకైనను లొంగని మహిమ ప్రాప్తించెనో యెవ్వరు చెప్పగలరు ?

మూఁడు నాల్గువందల సంవత్సరముల క్రిందటివఱకి పరిశ్రమ నైపుణ్యము బాగుగా నున్నదికాదా ? జహంగీరు కాలమందుఁ బదునైదడుగుల పొడవును మూఁడడుగుల వెడల్పునుగల యొక్క సెల్లాను ఢక్కా నేఁతగాండ్రు పాదుషాగారి సెలవుపైన నేసిరట ! అది తొమ్మిదివందల యవగింజ లెత్తుండెనఁట. దాని కాఱు వందల రూప్యములు ఖరీదట ! అంత పొడవు వెడల్పుగల సెల్లానే 1840 వ సంవత్సరమునం దచ్చటనే నేసిరి. కాని యది పదునాఱువందల యవగింజ లెత్తుండెనట. దాని విలువ నూటయేబది రూపాయలు మాత్రమే. అప్పటికే యా విద్య యంతమొందుచున్నట్లు స్పష్టపడుటలేదా ? ఇట్టి విద్యను మన దేశీయులు బుద్ధిపూర్వకముగాఁ బోగొట్టుకొనిరి. ఇందుల కేమి కారణము ? ఏ కారణములు చెప్పిన నిప్పుడేమి వినియోగము - మన ప్రారబ్ధమే ప్రధాన కారణము. సంపత్తు నశించినది. స్వాతంత్ర్యము మాయమైనది. స్వీయ పరిపాలనములో మొండెచేయి పుట్టినది. తూర్పు గాలిచేఁ బడమటి దేశములకు, మన పాటవము ప్రతిభ, స్వాతంత్ర్యము, బంగారము, వైభవము నెగిరిపోయినవి. బానిసలమై పనసకాయఁ గొట్టుకొనుటకైన కత్తిలేక, యేడు కత్తుల సైనుగుడ్డలే మహా భాగ్యములని యేడువవలసి వచ్చినది.

నాయనలారా ! ఇంత చెడియున్నను - నిట్టి మహా దుర్దశలోనైనను - మన

మంత వ్యర్థులమై యుండలేదు. ఇప్పటికైనఁ దూర్పున 'పొందూరు' మొదలగు గ్రామములలోఁ బశ్చిమమున మఱికొన్ని స్థలములలో 'దేస్‌వాలా' నూలు నొడుకు వార లనేకులున్నారు. దానినే మాలనూలనికూడ నందురు. ఆ నూలు నొడుకు వారిలో మాలవాండ్రు విశేషముగా నున్నారు కాబోలు! మన యీ విద్యను గాపాడి మన దేశ ప్రతిష్ఠను నిలిపి, మన కమూల్య వస్త్ర సాధనములను గల్పించి, యనేక విధముల మనకు దోడుపడుచున్నవా రెవ్వరు? పశువులకంటె నెవ్వరిని మనము హీనముగాఁ జూచుచుంటిమో - యెవ్వరిని సమీపించి మనము మృత్తికా స్నానము లాచరింతుమో - యెవ్వని పే రుచ్చరించినయెడల మనకు రౌరవాది నరకములు ప్రాప్తించు ననుకొనుచున్నామో - యట్టి మన సోదరులగు పంచములే! ఉన్నత జాత్యుద్భవులారా! ఇప్పుడైనఁ దలవంచుకొందురా? ఇప్పుడైనఁ సిగ్గుపడుదురా? ఇప్పుడైనఁ బశ్చాత్తాపమునొంది బాష్పములు విడువరా? పాదముల క్రింది మట్టి పురుగు మొదలు పరమేశ్వరునివఱకు కొక్కటే తత్త్వమని కోటి జిహ్వలతో - గోళాంతరములలోనికిఁ గూడ వినఁబడునట్లు దివ్య మహాగాన మొనర్చుచున్న వేద ములుపుట్టిన మన దేశముననేకదా యీ విపరీత చర్య! ఈ నీవు నేను భేదము! ఈ యధిక న్యూన తారతమ్యము! ఈ చూడరాని యంటరాని చెప్పరాని శబ్దసృష్టి! ఛీ! తుట్టతుద కట్టివారే మన కర్మవిద్యలను గాపాడి, మన పరువు లిప్పటికైన, నింతవఱకైన, నిలువఁబెట్టుచున్నారు. ఆ మాల నూలుతో నొడికిన బట్ట 120 నంబరు గల సీమనూలు బట్టకంటె సన్నముగా నుండదు. కాని జిగిలో - బింకములో సాగు దులోఁ - గఱకులో - గడుసుఁదనములో - మాంచెస్టర్ సైనులు గ్లాస్గో మల్లులు వాని కాలిక్రింద దిగదుడుపు. మాల నూలుబట్ట లరుగవలసినవేకాని వాడుకవలనఁ జినుగునవి మాత్రము కావు. మాంఛెస్టరు మల్లు పంచెలజత యొక్క సంవత్సరము కంటె నెక్కువ నిలువయుండదు. మాలనూలు పంచెలతజ యాఱు సంవత్సరము లుండును. అప్పటికైనఁ గ్రొత్తదివలెనే యుండును. నిగనిగ, కఱకు, పెళపెళ, దానిని గాల్చిన యెడలఁ బోవలయునుగాని యంతకుముందు మాత్రము పోదు.

వర్తకులారా! పరిశ్రమాభిమానులారా! ధనాధికులారా! ప్రభువులారా! దేశాభిమానులారా! ఇప్పుడైనఁ గన్నులు తెఱవరా? స్వదేశ పరిశ్రమ విద్యా పండి తులకుఁ జేయూతనీయరా? మీ ధనము మీలో నుండునట్లు చేసికొనరా? విదేశీయపుఁ బై మెఱుగులను ద్రోసివేయరా? స్వదేశీయపు సారమును గ్రహింపరా? ఏమంత మహోపకార మొనర్పవలయును? మీ యూరకే ధనరాసులను వెదజల్ల నక్కఱలేదు. రక్తమును ధారపోయనక్కఱలేదు. మాల నూలుబట్టలేకాని కట్టుకొనమని ప్రతిజ్ఞ

చేసినఁ జాలును. అదియైన మీరు చేయఁజాలనప్పుడు – వెనుకఁజేసి తప్పిపోయి నప్పుడు – మీకి నిస్సత్త్వము నిర్భాగ్యము నిరాధారస్థితి యాశ్చర్యముకాదు. ముమ్మాటికిఁగాదు. ఎప్పుడో – యేదో – వచ్చుననియు నప్పు డన్నియుఁగూడఁ జక్కఁబడుననియు వెఱ్ఱియాస పెట్టుకొని చుక్కలవంకఁ జూచుచున్నారు కాఁబోలు !

వచ్చునది నెత్తికిఁ జేతులు
కంటికి నీరు
నోటికిఁ దాళము
చేతికి లంకె
గుండెకు దడ

మీరు మీకు సాహాయ్యము చేసికొన్నప్పుడు కదా పైవారి సాహాయ్యము, పరమేశ్వరుని సాహాయ్యము ! యజ్ఞోపవీతములు శిధిలమైనప్పుడు, కాణి తీసికొని సుబ్బిసెట్టియొద్ద సీమనూలు జందెములకై పోవుదువుకాని పావులా డబ్బులిచ్చి స్వదేశీయపు బ్రత్తితో – కృతయుగమునుండి వచ్చుచున్న స్వదేశీయపుఁ గదురుతో – బ్రహ్మముఖోత్థిత వేదమంత్రోచ్చారణముతో – నొడికిన, పవిత్ర స్వదేశీయ యజ్ఞోప వీతము కొనఁజాలవే ! ఆహా ! ఇంతకంటె విరుద్ధత గలదా ! నీ పైసలీయూరనున్న శివయ్య శాస్త్రులను జేరుట మంచిదా, పై ఖండమునందలి సింప్సన్ కంపెనీని చేరుట మంచిదా ? నీ పైన స్వదేశములో నుండుట మంచిదా ? జర్మనీకి బోవుట మంచిదా ? ఈ మాత్రమైన నాలోచించుకొనలేదా ? మఱియు యజ్ఞోపవీత నిర్మాణమున నాఱి తేఱిన మహా విద్వాంసులున్నారు. మహామహోపాధ్యాయులున్నారు. వది జందెము లొడికి సెనగకాయలో నిముడ్చఁజాలినవా రనేకు లున్నారు. విలాసార్థముగానైనఁ – బరీక్షార్థముగానైన – వారి విద్యను జూడవలదా ? చూచి యానందింపవలదా ? ఊపిరి ముక్కునుండి గట్టిగా వచ్చిన యెడల నొడుకుచున్న నన్నదార మెక్కడ దెగిపోవునోయని ముక్కునకుఁ జిన్న గుడ్డను బిగించుకొని గాలి యేమాత్రమైనను దగులని చీఁకటి కొట్టులోఁ గూరుచుండి చిన్న దీపపు వెలుతురు సాహాయ్యమున యజ్ఞోపవీతముల నొడుకు మహా నిపుణుల కష్టములైనఁజూచి బళీయనదగదా ? వారిని బహుమానింప దగదా ?

ఇట్టి మిక్కిలి సున్నితములగు చేతిపనులెన్నో యంత్రాది సాధన నిర్మాణ మున నశించినవి. కుట్టు యంత్రములు వచ్చిన తరువాతఁ జిత్ర విచిత్రాది విచి

త్రములగు చేతి కుట్టుపను లెన్నివేలు నశించినవి? ఆహా! ఆలోచించుకొనుటకు హృదయ ముండవలయునుగాని యీ దుర్దశా ఫలమైన హృదయభేదనమున కంత ముండునా? పాళీలువచ్చిన తరువాతనేకదా వ్రాఁత సొగసులన్నియు గోతఁబడినవి. నూరు సంవత్సరముల క్రిందటివారి వ్రాఁత తాటాకుమీఁదిదికాని, యేబది సంవత్స రముల క్రిందటివారి వ్రాఁతకాగితముల మీఁదిదిగాని, చూచిన యెడల, నప్పుడు వ్రాసినట్లు, జీవకళ లుట్టిపడునట్లు, పత్రముమీఁదినుండి పై కుబికినట్లు - చల్లగ - నిశ్శబ్దముగాఁ బ్రవహించినట్లు - ముత్యాల కోవలవలె, తొండపు తొలుసుల యల్లికల వలె, స్పష్టముగా, బిగిబిగిగా, నేత్రపర్వముగాఁ గనఁబడునే - ఆ గంటములేవీ? ఆ బాతు టీకలేవీ? ఆ నెమలి కలములేవీ? ఏమియులేవు. పాళీలు సర్వత్రా ముఖ ముగా వ్యాపించినవి. వ్రాత సొగసులు సంపూర్ణముగాఁ బరమపదించినవి. గుండ్రడ కత్తున కొక్కుటే పాళి. కోలకత్తున కొక్కుటేపాళి. కుడివ్రాలున కొక్కుటే పాళి. ఎడమ వ్రాలున కొక్కుటే పాళి. తలకట్టున కొక్కుటే పాళి. Down stroke న కొక్కుటే పాళి. తెనుఁగున కొక్కుటే - ఇంగ్లీషున కొక్కుటే - ప్రపంచభాష లన్నిటికిఁగూడఁ బాళి యొక్కుటే! పేనాకము లెప్పుడు పేరు మోసినవో Penknives అప్పుడే యంతరించినవి. ఇంక నిప్పటి వ్రాఁతలు - తలవెంట్రుకల చిక్కులు - గొగ్గిపండ్లు - గ్రుడ్డి గచ్చకాయలు - సిరాలో మునిఁగిన సాలెపురుగు ప్రాకుటలు - కోడి కొక్కురింపులు - కొకిబికలు - లుకలుకలు - తికమకలు. ఈ దురవస్థకే యేడ్చుచుండగా దేశీయుల మహాపుణ్యమున టైప్‌రైటర్ దాపురించినది. ఇఁక సంతకములుగూడ జేయఁజాలని దురవస్థాగ్రగణ్యము సిద్ధముగానున్నది. అక్షరాభ్యాసమైనది మొదలు హరియని యంతమొందువఱకు - నిరంతరాభ్యాస మున్న యీ చేతిపనికి జీవ ప్రాయశ్చిత్త మిట్లొనర్చితిమిగదా! దీని బ్రతుకే యిట్లు తెల్లవాఱి పోవగ నితరములగు చేతిపనుల బ్రదుకు లడుగవలయునా?

కాశ్మీరపు శాలువుల మాటయేమి? ప్రభువుల ప్రక్కలపై - పండితుల తలలపైఁ - గవుల భుజములపై - ధనికుల మెడలపైఁ - బెండ్లి బహుమతుల దొంత రులపై - బంగారు సింహాసనములపై - నంగీల రూపముగా మహమ్మదీయుల గాత్రములపై మహమ్మదీయ కాంతల నీలాల ముంగురులపై - వర్తకుల దండెము లపై - నన్ని యాభరణములపై - నన్ని సొగసులపై - పైనాడి పైనాడి ప్రకాశించి నవేకదా కాశ్మీర రాంకవములు! వాని వ్యాప్తి మనయొక్క దేశమందేనా? కాదు. చీనాలో, జపానులో పారసీక దేశములోఁ, దురుష్క స్థానములో - ఇంతేనా?

కాదు - కాదు. రెండువందల వత్సరముల క్రిందట ఫ్రాన్సులో, ఇంగ్లండు, జర్మనీ, రష్యాలలో చక్రవర్తిని మొదలు దానివఱకుఁ గాశ్మీరపు సేలువును ధరింపని కాంత లెవ్వరైన నుండిరా ? ఆ కాలమందలి - యంతకుఁ బూర్వ మందలి - కాంతలకుఁ దలలపై శిరోజము లెట్టి యలంకారమో, కాశ్మీరపు సాలువట్టిది. ఆ కాల మందలి పురుషులలో నది చలికొఱకుఁ గప్పుకొనిన వారెవరు ? శీత నివారణమునకై - చిత్రా లంకార సౌభాగ్యమునకై - దానిని మెడకుఁ జుట్టుకొననివా రెవ్వరు ? ఒక్క మన ప్రపంచార్థమునందే నా వానివ్యాప్తి ? కాదు. కాదు. అమెరికావారి కవి యనఁగ నందఱకంటె వెఱ్ఱి. ప్రపంచమునంత నొక్క యూపుతో నొక్క ధాటితో నాకర్షించినది కాశ్మీరపు శాలువేకదా ? హిందూస్థాన పటముఖమున రావిరేకవలె నుండు రవంత కాశ్మీరదేశమే యగస్త్యుఁడు సముద్రమునువలె నా పోశనము పట్టి నదే ? ఇప్పు డట్టి వేమయ్యెను ?

ఏమయ్యెనా ?
కళవయ్యెను.
కలయయ్యెను.
మన్నయ్యెను.
మాయమయ్యెను.

స్వదేశ సౌభాగ్యమంతయుఁ జచ్చిన తరువాత జర్మనీ ధావళీలను గప్పుకొని స్వదేశాభిమానులమని మహా నాగరకులమని యనిపించుకొనుచున్నాము. పోనిండు. జర్మనీ గంతలేల ? బళ్ళారి కంబళ్ళను గప్పుకొనగూడదా ? అవిమాత్ర మేమి సామాన్యములా ? అవి యెట్టి మహోన్నత దశా పరిపాకము ననుభవించినవి ? వానిలోనైన వేలకొలది రూప్యముల విలువఁగలిగినవి యున్నవే ! ఇంగ్లీషు ట్వీడ్డుల వలె ఫ్రెంచి ఫ్లానల్సువలె నవి యెంత ప్రశస్తముగా నుండెడివికావు ! వానిని గత్తి రించి కోట్లుగా నెందఱు ధనికు లుపయోగించి యుండలేదు ! నిజమే ! అవి యట్టివే ! కాని యవిమాత్ర మిప్పుడు పూర్వోన్నత స్థితిలో నుండెనా ? వానిలోఁ గూడ క్షీణత్వ మారంభించి యెంతకాలమైనది ? దేశాదృష్టము చెడినప్పుడా చే టొక్కదానిలో మాత్రమే కనబడి యూరకుండునా ? చెట్టు మొదలు చెడినప్పు డుత్తరపు గొమ్మ నశించి, దక్షిణపు గొమ్మ నశింపకుండునా ? ఇనుపచుట్టు (Spring) వదలిపోయిన గడియారమునకొక్క ముల్లాఁగి వేఱొక్క ముల్లు తిరుగునా ? జీర్ణకోశము చెడి యగ్నిమాంద్యము సిద్ధించునప్పుడు దుర్బలత యన్ని

యవయవములకుఁగూడ సమానముగనే సిద్ధింపదా ? బళ్ళారి కంబళ్ళ బ్రదు కట్టు లైనప్పు డేలూరు రత్న కంబళ్ళ బ్రదు కింతకంటె భిన్నముగా నేడ్చునా ? ఏలూరు తివాసులు ప్రపంచమునందలి యన్ని ముఖ్యపట్టణములలోఁగూడ నున్నవికావా ? వానిమీఁది లత లావరింపని సీనులున్నవా ? వానిమీఁది పుష్పములు పరిమళింపని దేశము లున్నవా ? అవి యిప్పు డెక్కడనైనఁ గనబడుచున్నవా ? అక్కడక్కడఁ గనబడినను, వానిని గొనినవారి నెవ్వరినైనఁ జూచితిరా ? మన తండ్రుల కాలములోఁ గొన్న వేమైన నిలువ యుండవలయునుగాని మన కాలములో సంపాదించినవి మాత్రము లేవనుట సత్యమునకు దూరము కాదు.

నాయనలారా ! కుంభకోణపుఁ జెంబులో, వారణాసీ వసనములో, విశాఖ పట్టణపు దంతపు బనులో, మధుర రంగులో, బ్రహ్మపురపు బీతాంబరములో, సేలము పంచెలో, ఉప్పాడ బట్టలో ఇటు లెన్నిచెప్పవచ్చును ? ఎవరితోఁ జెప్ప వచ్చు ? ఎవరితోఁ జెప్పిన నేమి వినియోగము ? అరణ్య రోదనముకంటె భిన్నమా ? వట్టి కంఠశోషము తక్క ఫలమేమున్నది ? మనకుఁ బూర్వమునఁ బరిశ్రమలు లేవనియు, నిప్పు డవి నాట్య మాడుచున్న జాతీయతకు వెనుక పాడుచున్న వనియుఁ, గ్రిందటిసారి యుపన్యాసకర్త చెప్పుటచేత వీనినిగూర్చి యింతవఱకైనఁ జెప్పవలసి వచ్చినది. అవి వెనుక పాట పాడుచుండుటలేదు. వెనుకటి యున్నత స్థితికై యేడ్చుచున్నవి. ప్రస్తుతాధమస్థితికై యేడ్చుచున్నవి. భావిదశ యింత కంటె నధమముగా నుండునేమోయని మఱింత యేడ్చుచున్నవి. వాని రోదనము గానమువలె నా మహానుభావునకు వినఁబడినది. ఆతని దెంత దివ్యమైన చెవియో !

ఈ యంశము లన్నియు మీరు పూర్ణముగా నెఱుగుదురు. మీ కొక్కటియైనఁ జెప్పవలసిన యావశ్యకములేదు. కాని యొకందులకు మాత్రము చెప్పవలసివచ్చెను. మీరు దేశాభిమానులనుకొనుచున్నారు. స్వార్థపరిత్యాగులనుకొనుచున్నారు. దేశ భక్తులనుకొను చున్నారు. విద్యావంతులనుకొనుచున్నారు. స్వదేశీయ పరిశ్రమాది విద్యాప్రోత్సాహకులనుకొనుచున్నారు. మహా నాగరకులనుకొనుచున్నారు. మీకు సోదరులు - మీకుఁ బ్రియసోదరులు - నగు పరిశ్రమ విద్యా పండితులు - మగ్గ ములు వదలి, జోలెలు ధరించి, మాధుకర మెత్తుకొనుచుండఁ, గొలిమి తిత్తులను బట్టుటమాని, కలిగిన వారి కాళ్ళు పట్టుకొని పొట్టపోసికొనుచుండఁ, గర్మశాలలలోని కళ్ళు సామానులు గాడి ప్రొయ్యిలలోఁబడి యార్యావర్త దేశమందలి కర్మదేవత కగ్ని సంస్కార విధులకు దోడ్పడుచుండ, మీ సోదర భావమెంతో - దేశభక్తి యెట్టిదో -

పరిశ్రమ విద్యాప్రోత్సాహ మేమాత్రమో - నాగరకతా మాహాత్మ్య ముపన్యాసకర్త చెప్పినట్లు ఏ గ్రేడ్ లోనిదో మీరే యోజించుకొనవలయునని యీ మాటలు మీతోఁ జెప్పవలసివచ్చెను. అదిగాక మీరు సంపాదించిన విద్యలవలన దేశమున కేమియు లాభములేదు. మీరు B. A, B. L, M. A, M. L. మొదలగు మహా పరీక్షలలో నుత్తీర్ణులైనవారే కావచ్చును; మీ రాంగ్లేయ భాషలో "నయాగరా" జల ప్రపాతము వలెఁ జెవులు చిల్లులు పడున ట్లుపన్యాసముల ననర్గళ ధోరణితో నాకాశ మెగురు నట్లీయఁగలవారే కావచ్చును. మీ Resjudicata మీ Easements దేశమున కిప్పు డక్కఱలేదు. మీ Sulphuretted Hydrogen తోను, Refraction of Light తోను దేశమునకుఁ బనిలేదు. మీ జమాబంది లెక్కలు - మ్యునిసిపాలు డొక్కలు - తేయాకు ప్రొయ్యిలలోకేకాని, దేశ దీప్తికిఁ బనికిరావు. లెండు లెండు. నెత్తిపై నున్న జీలుగుబెండు బుట్టలను వంట ప్రొయ్యిలలోఁ బాఱవేయుడు. ఒడలిఁమీది గౌనులు తీసివైచి చిలుక కొయ్యలఁ దగుల్చుఁడు. ప్రత్తి బుట్టలను ముందు బెట్టు కొని మీరుకూడ మా వితంతువులతోఁగలిసి కూరుచుండి దారమును బేనుఁడు. కొలిమి గోతులను మీ పూర్వోపన్యాస పత్రములతో నంటింపుడు. గొఱ్ఱుబొచ్చును గత్తిరింపుడు. తోళ్ళను బాగుచేయుడు. కదుళ్ళు సుత్తెలు బాడిదలు అంపములు మొదలగునవి చేతఁబట్టుడు. "జయా భారతమాతకు జయా!" అని సుత్తెతో దాఁగటిపై గట్టిగాఁ గొట్టుడు. నాల్గు దిక్కులనుగూడఁ గొట్టుఁడు. అదియే మీ విజయభేరి!

Fine arts గురించి ముం దెప్పుడైనను జెప్పెదనని జంఘాలశాస్త్రి తన యుపన్యాసమును ముగించెను.

(24-11-1920 - ఆంధ్ర పత్రిక)

# వీథి అరుగు

—శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

పట్టణంలో ఉన్నప్పుడు పల్లెటూరికి పోయి ఉండాలనిపిస్తుంది. తీరా, పల్లెటూళ్ళో పట్టుమని పది రోజులైనా ఉండలేను.

చాలా వింతగా తయారయ్యాను నేను. ఆలోచనలకీ, కోరికలకీ, బుద్ధికీ, నడవడికీ, దేనికీ, ఒకదానికొకటి సంబంధంలేదు; పొత్తులేదు.

స్ఫుటమైన మూర్తిఒకటి నాకింకా ఏర్పడినట్లులేదు.

ఈ రోజుల్లో అందరూ నాలాగే ఉన్నారనిపిస్తుంది ఒకప్పుడు-ఎటూ తేల్చుకోలేక, ఎక్కడికీ పోలేక.

అసలు పల్లెటూరికే మతిపోయినట్లుంది ఇప్పుడు. ఇదివరకు ఎలాగుండేది, పాపం, నిశ్చలంగా నిశ్చింతగా :

"కాలవ ఒడ్డున ఒరిగి నీడచూసుకొనేదో
చేలనడుమ పడుచులాగ చే యెత్తీ పిలిచేదో
తోటవెనుక కాస్త కాస్త తొంగి తొంగి చూసేదో
కొండ పక్క నిలిచేదో'',

ఎంత తీయగా, చల్లగా ఉండేది తెలుగుపల్లె!

ఇప్పుడు పల్లెకూడా మతిచెడగొట్టుకుంది-అనవసరంగా పట్టణంలాగ ఉండబోయి, అది చాతకాక.

నేనూ పల్లే ఒకలాగే ఉన్నాం.

కాఫీ హొటళ్ళూ, వాటినుంచి గ్రామఫోను రికార్డుల అరుపులూ, కిళ్ళీ సోడా కొట్టులూ, బస్సుల సందడీ, సినీమాలూ, వాటితాలూకు ప్రకటనలూ-వీటి అన్నిటితో గ్రామం వేడుకకోసం నగరంవైపు మొగం త్రిప్పుకొని చూస్తున్నట్టుంది. నగరం వీటి అన్నిటిమధ్యా ఊపిరాడక నలుగుతూ, అన్నంకోసం పల్లెవైపు చేతులు జాపుతున్నట్టుంటుంది.

పల్లి తల్లివంటిది. పట్టణం ప్రియురాలి వంటిది.

అన్నం పెట్టడం, చల్లని అంకంమీద పవళింపజేసుకోవడం - గారాబంగా పెంచుతుంది పల్లె.

ఆకర్షించడం, ఎప్పటికప్పుడు ఆవేశాలతో కదిలించి వేయడం - గాఢంగా ఊపేస్తుంది పట్టణం, "నీకేంగావాలి?" అంటుంది పల్లె, "నాకేమిస్తావు?" అంటుంది పట్టణం. అంతేగాదు. పల్లెకుటుంబంలాగ, సంసారంలాగ ఉంటుంది. పట్టణం సంతలాగ, విపణిలాగ ఉంటుంది.

గ్రామంలో కాలాలు తెలిసిపోతాయి - ఎండా, వానా, వెన్నెలా, వీటితో స్పష్టంగా. పట్టణానికి ఋతువులులేవు; అందువల్ల పట్టణంలో ఉన్న చెట్లూ, చేమలూ, లతలూ, పువ్వులూ, పక్షులూ, బిక్కచచ్చి ఉంటాయి; దిగులుగా ప్రవాసంలో ఉన్నట్టు.

పట్టణంలో పదిమందిలో ఒంటరిగా ఉంటాం. పల్లెలో మనిషీ, చెట్టూ, చేమా, పిట్టా, జంతువూ కలసి ఒకేఒక కుటుంబం.

ఈ సందర్భంలో నాకొకటి వింతగా కనబడుతుంది. ఇళ్ళల్లోనూ, ఇళ్ళు కట్టడంలోనూ.

పట్టణాల్లో కొత్త రకపు ఇళ్లు లేస్తున్నాయి. ఇవి దాదాపు ఒకే రకంగా ఉంటాయి.

కొన్నింటికి చుట్టూ గోడలు ఉంటాయి, లోపలికి రావడానికి వీలులేదన్నట్టు. ఎన్నిటికో గోడలు లేకపోయినా వీధి అరుగు లుండవు.

ఇలాంటి ఇళ్ళు గ్రామాల్లోకీ చొరబడుతున్నాయిప్పుడు. ఈ ఇళ్ళు ధుమధుమ లాడుతూ, మొహం చిట్లించుకొని, వీథివైపు వీపు త్రిప్పినట్లుంటాయి.

గ్రామాల్లో ఇళ్ళకు వీధి అరుగులుండేవి. పెద్దవాళ్ళ ఇంటికి మరీపెద్ద అరుగు లుండేవి.

వీథి అరుగు ఆహ్వానం వంటిది. మొదటి ఆతిథ్యం వీథి అరుగే ఇస్తుంది. అతిధులో, అభ్యాగతులో, బాటసారులో, అందరినీ "ఇలా దయచేయండి" అంటుంది వీథి అరుగు.

వీథి అరుగు స్వాగత వచనం వంటిది.

గ్రామంలో వీథి అరుగు గొప్ప సంస్థ.

ఇంటికి తగిన అరుగు ఉండేది మునుపు. ఇప్పుడు అరుగు హరించుకుపోతూ ఉంది క్రమంగా.

మా ఊళ్ళో చెప్పుకోదగ్గ నాలుగు అరుగులు ఉండేవి. కరణం జగ్గరాజు మామయ్యగారిదీ, మునసబు శేషాద్రిగారిదీ, దివాణందీ అంటే వెలమ దొరగారు వెంకట్రాయణింగారిదీ, మరి మాదీ అంటే పెద్దశాస్త్రుల్లు గారిదీను.

ఇవే, సమయాన్నిబట్టీ, చేరిన జనాన్నిబట్టీ, కచేరీలయ్యేవి; క్లబ్బులయ్యేవి; సభా స్థలాలయ్యేవి.

కరణంగారి వీథి అరుగూ, రాయణింగారి వీథి అరుగూ, గచ్చువీ, పెద్దవీ.

రాయణింగారి అరుగు గచ్చునిగనిగమంటూ నున్నగా మెరుస్తూ ఉండేది. అరుగంటే నిజానికి రెండు అరుగులు – వీథి గుమ్మానికి ఇటూ అటూ, దివాణపు టరుగులమీద తివాసీలు పరచిఉండేవి. కాని, చల్లటి గచ్చుమీదే కూర్చోవాలని ఉండేది మాకు. ఈ అరుగులమీద ఇటూ అటూ జేరగిలబడ్డానికి, గచ్చు బాలీసు లుండేవి. అరుగులమీద ఒకవైపు రెండు సవారీలుండేవి-చక్కగా చెక్కిన అద్దలూ, సోగదండెలూ, దంతపుకోళ్ళూ, రాయంచ రెక్కలతో పరుపుబాలీసులూ," వింతపని చక్కిల్ పెంజరీ పింజరీల్". మొదలైన వాటితోనూ.

పెద్దలు మాట్లాడు కుంటూంటే పిల్లలం ఆ సవారీలో సరదాగా కూర్చునే వాళ్ళం.

ఆ అరుగులమీద ఉన్న కిటికీలలో నుంచి దివాణం లోపలిభాగం కనబడేది.

నగిషీ పనుల మించు నిగనిగ జిగిగుల్కు
　　కంబముల్ దూలముల్ గలిగి, వింత
సంతనదగు చాక చక్యంబు పల్కుల
　　జిగి సరంబీ క్రింద జిల్గు మేల్ క
లంకారి చాందినీ, లాంతరుల్ వెలుగ, ము
　　క్తా చూర్ణ పరిలిప్త ధాగధగ్య
భిత్తి భాగాది శోభిత గోప గోపికా
　　బహుళ కేళీ చిత్రపటము లమర
తళుకు లిల జిల్కు నిల్వుటద్దములగములు
మరి, హ మీరు వనందైన ఫరుమ గల్గి"–

అద్భుతంగా మరో లోకపు ప్రాసాదాన్ని తలపించేది.

రాయణింగారి లోగిటి వీథి అరుగు మా ఊళ్ళో క్లబ్బువంటిది. దీనికి కూడా రాయణింగారికి లాగే ప్రాభవమూ బడాయీ ఎక్కువ. ఇక్కడ అందరూ అన్ని పనులమీదా, చేరగూడదు, వీల్లేదు. పెద్ద చందాలిచ్చే సభ్యత్వం లేకపోయినా ఊళ్ళో కొందరు పెద్దలే ఇక్కడ చేరేవారు. ఆ చేరడమున్నూ సాయంకాలాలే.

ఇక్కడ కాస్త కరణం మునసబుల వీధి అరుగులను గూర్చి నాలుగు మాటలు చెపుతా.

అవి కచేరీలు.

కరణంగారి వీథి అరుగుమీద పాత తివాసీ ఉండేది - కొంత నలిగి, ఎంతో రంగు పోగొట్టుకొన్నది.

ఒక పక్కన గోడ నానుకుని ఆయన కూర్చుంటే ముందుగా చిన్న డెస్కు బల్ల ఉండేది.

కరణం జగ్గరాజు మామయ్యగారి కచేరీవేషం మహా బడాయిగా ఉండేది. "తెలి తలపాగ, చొక్కా, మొలతిత్తి, బుజంబున చల్వపచ్చడంబు, అల చిటిబ్రేల ముద్రిక, ఒయారముమీర పొగాకుచుట్ట, సొంపలరెడు కావిధోవతి, పదాబ్జ యుగంబున ముచ్చెలున్నూ" ఇవిగాక కళ్ళజోడు ఉండేది. అది ఒకప్పుడు నుదుటిపై కెక్కేది, ఆయన తీవిగా పరిశీంచేటప్పుడు. అది మరొకప్పుడు ముక్కు కొనకు జారేది, ఆయన సూటిగా పరీక్షించేటప్పుడు.

మునసబు శేషాద్రిగారి వీథి అరుగు గచ్చుకన్నా కూడా నిగనిగలాడుతూ గట్టిగా నున్నగా ఉండేది-మట్టితో అలికినదైనా! ఈ అరుగు మొగానజేవురు మట్టి చారలుండేవి. దీనిమీద పెద్ద పెద్ద తుంగచాపలు. ఆ చాపల కొకమూల తుంగలు తుంచి ఉండేవి. వచ్చిన వాళ్ళు తోచక పెరకడంవల్లో, పళ్ళకుట్టుకుందుకో, నమలడానికో, పీడకంవల్లో!

మనసబు అరుగుమీద కూడా ఒక సవారి ఉండేది.

పెద్ద పట్టె నామాలూ, ఎర్రచారల నిడుపాటి కళ్ళూ, కోటేసిన గరుడ ముక్కూ, ముందు ముళ్ళుగట్టుకునే అంగరఖా, తలవెనుకపై భాగానికి లాగి గోపురం లాగా కట్టిన జుట్టుముడీ, వెండిపొన్ను పెద్ద కర్రా-వీటితో మా మునసబు అంత తీవ్రైన విగ్రహాన్ని నేను దరిమిలాని, చూడలేదు.

కరణంగారి వీథి అరుగూ, మునసబు వీథి అరుగూ కచేరీలు అన్నానుగదూ!

అవి సాయంకాలందాకా సందడిగా ఉండేవి. ముఖ్యంగా కరణంగారి వీథి అరుగు. కిస్తీలూ, జప్తులూ, మందడిగోడల ఫిర్యాదులూ, బండెల దొడ్లూ, చేలగట్ల వివాదాలూ, సర్వేరాళ్ళూ, రెవిన్యూ ఇనస్పెక్టర్ల దురంతాలూ, తాసిల్దారు గారికి సప్లయిలూ, బోర్డు ఎన్నికలూ, రౌడీసుబ్బన్న పోకిరీ చేష్టలూ, అన్నదమ్ముల ఆస్తి పంపకాల తాలూకు వివాదాలూ, అచ్చెమ్మ విడాకులూ, పట్టణంలో కోర్టు సాక్ష్యాలకు తయారీలూ-ఇలాటి వాటిమీద కరణం మునసబుల మంత్రాంగాలూ, చర్చలూ, నిర్ణయాలూ తీర్పులూ, ఈ అరుగులమీద జరిగేవి.

ఇక్కడికి అన్ని తరగతులవారూ వచ్చేవారు. వచ్చితాహతునుబట్టి కొందరు పైన అక్కడా అక్కడా కూర్చునేవారు. పాగాలవారూ, జుట్టుముళ్ళ వారూ, జునపాల వారూ, బొత్తాలులేని చొక్కాల వారూ, దినమొండెముల వారూ, పెద్దలూ, పిన్నలూ, రకరకాలు!

కొందరు అరుగుమీద కూర్చుందుకు తాహతులేనివారు, కింద నిలబడి తమ గోడుచెప్పకొనే వారు.

మరికొందరు, అరుగుమీద వేంచేయడానికి తమకే అవసరమూ లేదన్నట్లు నిర్లక్ష్యంగా క్రింద నిలబడి, ఒక చంకకింద పొన్నుగర్ర నిలబెట్టి, రవంత ఆపక్కకు ఒరిగి, లంకాకు చుట్ట కాలుస్తూ ఉండడంవల్ల నడుమ నడుమ తుపుక్కున ఉమ్మేస్తూ, అరుగువైపు చూడకుండానే అక్కడ జరిగే వ్యవహారాలలో కలుగజేసు కొంటూ ఉండేవారు.

కొందరు స్త్రీలు తమ గొడవ చెప్పకోవలసివచ్చి, అరుగుపక్క చాటుగా, ఒదిగి నిలబడి ఉండేవారు.

దూరాన అరుగుమీద ఓ మూల ఒక పరదేశి మూటతో కూర్చుని ఉంటాడు.

ఈ వ్యవహారాల తీర్పులో నడుమ నడుమ ఎవరో ఒకరు ఛలోక్తులు విసరుతారు.

ఒక డనవసరంగా కలుగజేసుకొని చివాట్లు తింటాడు.

పనిలేకుండా వచ్చినవాళ్ళు అక్కడక్కడ కూర్చుని ఇద్దరు ముగ్గురు తమ తమ తీర్పులు కూడా ఇస్తుంటారు.

సాయంకాలం మూడు గంటలనుండి దివాణపు వీధి అరుగు. ఇక్కడికి కరణం మునసబులు వస్తారు; కలకాపులు వస్తారు; మేష్టారువస్తారు; సిద్ధాంతీ షావుకారూ కూడా వస్తారు; శాస్త్రుల్లుగారు వస్తారు. రాయణింగారు సరేసరి.

వీరందరు అరుగు మీద సభ తీర్చినప్పుడు ఆ వీధివెంట నిరాఘాటంగా అందరూ వెళ్ళడానికి జంకేవారు-మా ఊరిలో ఉన్న పెద్ద ఆ బోతుతప్ప!

దాని దర్జాయే వేరు. పెద్దమూపురం అదీ, వెండికొండలా కదలివస్తూ, ముందు పెద్దరంకెవేసి, దివాణపు టరుగును రాసుకుంటూ వచ్చి, మధ్య మెట్లమీద మునికాళ్ళుపెట్టి నిలబడేది. తక్షణం దొరగారు నౌకరువైపు చూసేవారు. వాడు పోయి చాటెడు బియ్యంపోసి తెచ్చి దానికి పెట్టేవాడు.

ఇంతలో ఆ వీధినే తుర్రుమని ఒకపంది అటు పరుగెత్తేది; చెంగున ఇటు ఒక లేగదూడ బంతిలా ఎగిరి వెళ్ళిపోయేది.

ఊరి బావి నుండి నీళ్ళు తెస్తున్న అమ్మలక్కలు, అంతవరకూ కిలకిల మాట్లాడేవాళ్ళు, ఒక్కసారి ఆగిపోయి, నిశ్శబ్దంగా, తలలు రెండోవైపు తిప్పుకొని, నడిచిపోయేవారు. వాళ్ళ అందెల రవళిలో రవ్వంత వడిదుడుకూ, వాళ్ళ కడవల నీళ్ళలో రవ్వంత తొట్రుపాటూ, వాళ్ళ మనస్సులు దివాణపు టరుగుమీదనే ఉన్నాయని తెలియ పరుస్తున్నప్పటికీ.

ఇంతలో సీమదేశాల్లో యుద్ధాన్ని గురించో చంద్రలోక యాత్రను గురించో, కబుర్లు వస్తాయి. ఎవరికి తోచినట్లు వారు మాట్లాడుతారు. వెటకారంగా చిరునవ్వుతో కరణంగారు ఆఖరిమాట చెప్పడానికి చూస్తూ ఉంటారు. తమ పూర్వులైన వీరుల్లో ఒక్కరుంటే చాలు, ఈ యుద్ధాలు చిటికెలో తేలిపోయేవని దొరగారుచెప్తారు. కాలికి పసరు పూసుకొని హిమాలయానికిన్నీ, ఇట్టే చేతులు జాపి కాళ్ళెత్తి చంద్రగోళానికిన్నీ, మన పూర్వులు చటుక్కున వెళ్ళి, మళ్ళీ సాయంకాలానికి ఎలా తిరిగి వచ్చేసేవారో సిద్ధాంతిగారు విశదంగా తెలియబరుస్తారు.

రెండో అరుగుమీద పేకాట జరుగుతూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు వీధి అరుగులముందు, తూర్పునుంచి రాజుగారు పంపిన పుంజుకీ, రాయణింగారి పుంజుకీ పోట్లాట జరుగుతుంటే, అందరూ చూస్తారు. కౌజుపిట్టలది కూడా. దొరగారు కౌజుల్నీ, పుంజుల్నీ నాణెం గట్టడంలో గొప్పవారు. వీటి పోట్లాటల సమయంలో మాత్రం గ్రామంలో చాలా మంది వీధిలో మూగుతారు. కొందరు పిల్లలు చొరవచేసి దివాణపుమెట్లు ఎక్కి, అరుగులమీదకి రాబోతుంటే, పెద్దలు వాళ్ళను తరిమేస్తారు.

రాత్రి శాస్త్రిగారి వీధి అరుగు. దాని ముందు ఖాళీస్థలంలో పురాణ పఠనం.

ఇలాగ కరణం మునసబుల వీధి అరుగులు గ్రామస్థుల నిత్యలౌకిక జీవితానికీ, దివాణం వీధి అరుగు వేడుకలకీ కాలక్షేపానికీ, శాస్త్రిగారి వీధి అరుగు ధర్మచింతనకీ ఆ ముష్మిక గోష్ఠికీ కేంద్రాలై ఉండేవి.

కాక కుట్టుపని దానయ్య అరుగుండేది. దానిమీద మిషన్ టకటక లాడిస్తూ ఉండేవాడు.

సిద్ధాంతిగారి చిన్న అరుగుండేది. ఇక్కడ ఆయనచేత చెవిటి సుబ్బయ్య-వినిపించకపోయినా—న్యూస్ పేపర్ చదివించుకొనేవాడు.

ఇలాగే ప్రసిద్ధమైన అరుగులు కొన్ని ఉండేవి.

అయితే ఈ మధ్య వీధుల్ని వెడల్పు చెయ్యడంలో అరుగులు కొన్ని కుదించుకుపోయాయి.

కొన్ని అరుగులు గదులైపోయాయి. సిద్ధాంతిగారి వీధి అరుగు అటువంటిది. దానిలోకి వచ్చింది దానయ్య కుట్టుమిషన్.

కాని కాలంవచ్చి రాయణింగారు చితికిపోవడంవల్ల వారు దూరాలకు వలస పోవడమున్నూ, తరువాత కుమారుని ఉద్యోగానికై పట్టణవాస మేర్పరచుకోవడమున్నూ, దివాణపు లోగిలి, లోపల కూలి దిగబడిపోయి అరుగుల మీద అందంగా చెక్కిన స్తంభాలు మాత్రం మిగిలిపోయాయి. ఇప్పుడు ఆ దారిన ఆ బోతేకాక అందరూ ధాటీగా మాట్లాడుకుంటూ పోతున్నారు.

కరణంగారు వృద్ధులవడంవల్ల ఇతర కారణాలవల్ల, కుంగిపోయిన గుడారంలాగ అయిపోయి అరుగుమీద చదికిలబడి కూర్చుంటారు. ఇప్పుడు దానిమీద అట్టే కచేరీలు జరగడంలేదు.

శాస్త్రిగారు పరమపదించడంవల్ల, వారి కుమారుడు ఇంగ్లీషు చదువుకొని, ఎక్కడికో ఉద్యోగానికి వెళ్ళిపోతే ఆ ఇల్లు బోర్డువారు 'ఎక్వైరు' చేసి అరుగుల మీద క్లాసులకోసం గదులు కట్టారు.

మునసబుగారి వీధి అరుగు ఇఃకా సుందడిగానే ఉంది. అయితే, అక్కడ ఇప్పుడు ఎన్నికల గోలా, పార్టీల కోలాహలమున్నూ.

(విశోదయ-పుష్పలావికలు)

# చలి

—శ్రీ రావూరి వెంకట సత్యనారాయణ

స్వెట్టరు, మఫ్లర్, రగ్గూ అన్నీ ఇచ్చినా ఇంకా గజగజలాడుతూ "చలి! చలి!" అని గోలచేసే ఒక కుమారుణ్ణిచూసి తండ్రి అన్నాట్ట "చలి అని మళ్ళీ అన్నావంటే ఆ స్వెట్టర్, మఫ్లర్, రగ్గూ లాక్కుని రాత్రి బస్సులో హైదరాబాదు పంపిస్తా నిన్ను. ఎక్కిమోలకు వేసినన్ని దుస్తులువేస్తే ఇంకా చలిట!... ఇది బెజవాడ అనుకున్నావా! డార్జిలింగ్ అనుకున్నావా!" అని.

నిజాని కీసంవత్సరం విజయవాడలోకూడా చలిదేవత ఒళ్ళు విరుచుకుని స్వైర విహారం ప్రారంభించింది. ఎండలకే ప్రసిద్ధిచెందిన ఈ పట్టణం చలిలో కూడా అగ్ర తాంబూలం అందుకోవాలని ప్రయత్నిస్తున్నదేమో ననిపిస్తోంది.

వెనకటికి ఎవరో ఒక పెద్దమనిషి హిమాలయ పర్వతాలను గురించి ప్రసంగిస్తూ - "హిమాలయాలు గొప్పవి కావచ్చు. మనం చూశామా? ఏమన్నానా? వ్యాసాల్లో చదివితే వాటి సంగతి ఏమి తెలుస్తుంది? అందుకని మా ఊళ్ళో కొండల్నే మేం హిమాలయాలను కొంటాం. తప్పేంవుంది?" అని.

ఆయన అనడం మాట అలావుంచి ఈ కొండలుకూడా ఎందుకనో శీతాకాలంలో ఇదివరకటికంటే ఎక్కువగా చల్లబడుతున్నాయి. ప్రజల్ని ఒణికిస్తున్నాయి. ఈ ఆధునిక యుగములో మన సంస్కృతీ సభ్యతలు మారినట్లే కొండల స్వభావాలుకూడా మారిపోతున్నా యనిపిస్తుంది. మంచిదే!

పోనీ ఉత్తరాది సోదరులతోపాటు మనంకూడా రెండు నెలలు చలికి ఒణుకుదాం! ఎన్నింటికి వణకడంలేదు? ప్రకృతికి ఒణికితే వచ్చే ప్రమాదం ఏమిటి?

ఆంధ్ర ప్రాంతంలోకూడా చలి కొంచెం అధికమైందని అనుకొంటున్నా - హైదరాబాద్ చలికి దూరంగా వున్నందుకు కొంచెం సంతోషిస్తున్నారు. అక్కడ ఇటీవల ఎనిమిది డిగ్రీలవరకూ పడిపోయిందట ధర్మామీటర్.

వెనుక ఒకసారి ఏడు డిగ్రీలవరకూ పడిపోయినప్పుడు నేను అక్కడ ఉన్నాను. రగ్గులు కప్పితే చలి ఆగుతుందని భ్రమపడతాం. అసలా రగ్గుల్లో వున్నంత చలి బయట ఉండదు. రగ్గుల్లో వాళ్ళు రగ్గుల్లో మాట్లాడలేక పడిపోవడం కూడా కద్దు.

ఉదయం పదిగంటలదాకా ఈ చలి అలాగే ఉంటుంది. ఈ లోపల ఎవరి నన్నా పలకరిద్దామన్నా మాటరాదు. ఒకవేళ కర్మంచాలక పలకరిస్తే అవతల వాళ్ళు జవాబు చెప్పలేరు. పళ్ళు మాత్రం టకటక కొట్టుకోవడం వినిపిస్తుంది. ఇంటిల్లిపాదీ అలా పళ్ళు కొట్టుకుంటూ కూర్చుంటే ఏం తోస్తుంది?

ఒక గృహస్థు భార్యను కాఫీ కాచావా? అని ప్రశ్నించాడు సంజ్ఞలతో. ఆమె ప్రతిసంజ్ఞ చేయడం బాగుండదని ఏదో చెప్పబోయింది. పాత ట్రైపుమిషను చప్పుడు మాత్రం వస్తోంది. భర్త ఆ మోత భరించలేక గడ్డం క్రింద అరిచేత్తో నొక్కుకో... మాట్లాడకపోతే మా నెయ్యి అని ఆవిణ్ణి దబాయించాడు.

చలికి ఒణుకుతూ ఒక ఇల్లాలు, తల, ఒక దిండుమీద వంకరగా పెట్టుకొని నిద్రపోయింది. తెల్లవారి లేచిచూస్తే ఆ తల ఆవైపే బిగుసుకు పోయింది. ఎంత ప్రయత్నించినా రాలేదు. మీరు హైదరాబాదు విడిచి వెళ్ళడం మంచిదని అక్కడి వాళ్ళు సలహా చెప్పారు.

మర్నాడు బస్సులో ఆవిడ బయలుదేరిందా వంకర మెడతోనే. సూర్యా పేట వచ్చేసరికి కొంచెం సరిగా వచ్చిందట. అమ్మయ్య అనుకొందిట పాప మావిడ. జగ్గయ్యపేటలో చూసుకుంటే మెడ సరిగ్గానే ఉందిట. అది హైదరాబాద్ చలి మహాత్మ్యమని ఆవిడ ఇప్పటికీ చెపుతూ ఉంటుంది.

ఎప్పుడన్నా ఆ ఊరు వెళ్ళవలసివచ్చినా, "మార్చి దాటేదాకా ఆ మాట ఎత్తకండి బాబూ! ఫిబ్రవరిలో నా మెడకా ఇబ్బంది వచ్చింది" అని అంటూ ఉంటుంది.

ఇటీవల ఒకాయన పాలమనిషితో అన్నాడట "చలితో బిగుసుకు చచ్చి పోతున్నాం. పాలు కొంచెం పెందరాళే తీసుకువస్తే ఇన్ని వెచ్చటి కాఫీనీళ్ళన్నా గొంతుకలో పోసుకుంటాం. కాస్త అయిదూ అయిదున్నరకల్లా వస్తూఉండు నీకు పుణ్యం ఉంటుంది" అని.

దాని కతడు వెంటనే ఇలా జవాబు చెప్పాడట. "ఇళ్ళల్లో దుప్పట్లు కప్పుకుని కిటికీలు మూసుకొని పడుకునే మనుష్యులే బిగుసుకు పోతూంటే-పాకల్లో

పడిఉండే బర్రెలు బిగుసుకుపోవూ! చలిలో ఎంత బాదినా అవి లేవడంలేదు... లేచినా ఫెళ్ళున తంతున్నాయి...సూర్యుణ్ణి చూడందే చుక్కపాలు ఇవ్వడం లేదు."

అవునుమరి చలి అనేది అన్ని జీవులకూ ఒకటేగా! మానవుడు తన బాధ తను చెప్పుకుంటాడుగాని, ఇతరుల బాధ తలచుకోడు. సౌకర్యాలున్నకొద్దీ సణుగుతూనే ఉంటాడు.

చలికాలానికి సంబంధించిన సరసాలూ, తమాషాలూ కొన్ని ఉంటాయి. మొన్న ఒక గృహస్థు అంటున్నాడు, "ఎంత చలివేసినా రాత్రిపూట కొంచెం షికారు వెళ్ళిరావాలనిపిస్తుందండీ" అని. "రాత్రిపూట షికారేమిటండీ, పులిలాగ చలి మీదపడి కొరుకుతూంటే" అంటే.

"కొరికేమాట నిజమేననుకోండి. ఒక మంచికోసం బాధపడటం అవసరం అవుతూ ఉంటుంది" అన్నారాయన.

"అయితే మంచేవిటి చెప్పండి. చెపితే నేను కూడా కొంచెంసేపు తిరిగి వస్తాను" అన్నాను.

"చెప్పమంటారా! కొంచెంసేపు తిరిగి ఇంటికి వెడతామనుకోండి. ఆడ వాళ్ళు కొంచెం నిద్రపోతూ వుంటారు. మనం వెళ్ళి తలుపు కొట్టగానే గజగజ లాడుతూ తలుపుతీస్తారు. అది చాలదుటండీ?" అని ఆయన ముసిముసి నవ్వులు నవ్వారు.

"వణికేది చలికిగాని మీకు కాదుగా?" అంటే,

"అలా వివరించి చెప్పకండి భర్త తలుపుకొట్టడం భార్య గజగజలాడుతూ తలుపు తియ్యడం అంటూ జరుగుతుందా లేదా? మనమీ రోజుల్లో చూసేది 'ఫేస్ వాల్యూ'; 'మైండ్ వాల్యూ' కాదు. యూ అండర్ స్టాండ్" అని ఆయన ఇంగ్లీషులో ఉద్ఘాటించారు.

చలిలో సరసంతో పాటు కొంత వైరాగ్యం కూడా ఉంది. దుప్పటిలోనో రగ్గులోనో తనకు తానే మూటగట్టుకొని పడుకొన్న వ్యక్తి ఒక్కసారి తల బైట పెట్టడానిక్కూడా ఇష్టపడడు. అందులో తలదాచుకొని పరుండగా ఎంత వేదాంతం వస్తుందో చెప్పలేం. ఆత్మకీ అతనికీ ఎంతో సంవాదం జరుగుతుంది.

ఆత్మ: ఎక్కడో చప్పుడవుతోంది. దొంగలేమో ఒక్కసారి లేచిచూడు.

తను : చూచిమాత్ర మేంలాభం? మనమేమన్నా వాళ్ళను కొట్టగలమా?
ఏమన్నా నా? ఎలా వ్రాసిఉంటే అలా జరుగుతుంది. పడుకోవడమే మంచిది.

ఆత్మ : తీరా నష్టపడేది నువ్వేగా!

తను : నష్టమైతే అయింది గానీ కష్టపడలేను. ఈ దుప్పటీ తీసి ఈ సుఖం పోగొట్టుకోలేను.

తెల్లవారిన తర్వాత లేవనివారికీ ఆత్మకూ సంవాదం ఇలా ఉంటుంది—

ఆత్మ : ఏమిటా బద్ధకం?...లే...ఎంత ప్రొద్దెక్కిందో చూడు.

తను : నే చూడలేను. నన్ను వేధించకు.

ఆత్మ : ఆఫీసుకు వెళ్ళక్కర్లా...ఒళ్ళు అమ్ముకొన్నానని జ్ఞాపకం ఉందా ?

తను : అమ్మకం మాటేమో ఈ రగ్గుకు తాకట్టుపెట్టేశా. ఇది వదిలించుకోలేకుండా ఉన్నా.

ఆత్మ : జాగ్రత్తగా ఆలోచించుకో ... జీవితమంటే ఆషామాషీ కాదు. అనేక బాధ్యతలున్నాయి. నిద్రలేచిన తర్వాత నిజరూపం బయటపడుతుంది.

తను : పడితే పడిందిలే నన్ను పలకరించకు. నా బాధ్యత నువ్వేమీ పైనవేసుకోనక్కర్లే.

ఆత్మ : నే చెప్పేది నగ్న సత్యం.

తను : సత్యాలు నాకక్కర్లా ... స్వప్నాలే కావాలి. వాటిలో సుఖమే కావాలి. కాసేపు పలకరించకు.

ఇలాంటి కొత్తరకం వేదాంతం చాలా బయలుదేరుతుంది చలినుంచి.

ఈ వేదాంతాలలో వ్యక్తికి ప్రాధాన్యం ఎక్కువ లభిస్తుంది.

మరి వ్యక్తిత్వాలను నిలబెట్టడం కోసమే కాబోలు దేశంలో లేనిచోట్ల కూడా చలిగాలులు ఎక్కువ కావడం.

(ఆషామాషీ - ఆంధ్రప్రభ)

# ఉపన్యాసాలు

—శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి

అసలు ఉపన్యాసాలు వినడమే అపరాధం. అందులో జిడ్డు, గ్రీజు, జనపనార పచ్చడి, గానుగకర్ర మార్కు ఉపన్యాసాలు వినడం మరీ అపరాధం. వినే వాళ్ళకి నీరసంవచ్చి కళ్ళు తిరిగినా, ఓపికా ఓర్పూ నశించినా, ఆఖరికి ప్రాణాలు పోయినా, పైరకం ఉపన్యాసాలు ఆగవు. వినేవాళ్ళ ఆయుర్దాయం ఉన్నంతవరకూ అవి సాగుతూనే ఉంటాయి.

అయితే జీవితంలో అన్ని ఢక్కామొక్కీల్నీ ఎదుర్కొని ధైర్యంగా నిలబడా లంటే, ఎన్ని కష్టాలొచ్చినా బెదిరిపోకుండా ఆత్మస్థైర్యాన్ని పొందాలంటే, అప్పు డప్పుడు అలాంటి ఉపన్యాసాలు వింటూ ఉండాలని, బ్రహ్మాండమైన ఉపన్యాసాలు విని విని ఓర్పు పందేలలో విజేతలైన సభ్య శిఖామణులు సెలవిస్తూ ఉంటారు. ధైర్యం, ఆత్మస్థైర్యం మాట ఎలాఉన్నా, జన్మలో తాను ఉపన్యాసం ఇవ్వకూడదనే గట్టి నిర్ణయానికి మాత్రం అలాంటివారు తప్పక వస్తారు. వచ్చి, ప్రజల్ని అధమం తమ గ్రీజు ఉపన్యాసముల నుండి అయినా తప్పించిన వాళ్ళు అవుతారు.

అవును ఒక్కళ్ళు తగ్గినా తగ్గడమే. అయినా సవాకోటి జంగాలలో ఒక జంగం గంట వాయించక పోతేనేం, మరో జంగం శంఖం ఊదకపోతేనేం? ఈ రోజుల్లో అన్ని విషయాలగురించీ ఉపన్యాసాలు ఇచ్చేవారు కొన్ని లక్షల మంది ఉన్నారు. ఇంత మందికీ ఇన్ని విషయాలూ తెలుసునా అని అడగనక్కరలేదు. ఏం? తెలియక పోతేనేం? ఊకదంపు ఒక్కటి చేతనైతే చాలు. అది అదృష్ట వంతులకు జన్మతః వస్తుంది.

ఒక ఆసామీ, అవిరళోపన్యాసకు డొక్కణ్ణి పట్టుకుని "అయ్యా! గంటలాది తమరు అలా మాట్లాడతారు. నేను బాగా తెలిసిన విషయాన్ని గురించి ఒక్క పావుగంటైనా మాట్లాడలేను. ఎందుచేత నంటారు?'' అంటూ ప్రశ్నించాడు. వెంటనే ఆ మహానుభావుడు "ఓయి వెర్రివాడా!" అన్నట్టు ఒకచూపు పారేసి,

"అలవాటు కొంత ఉండాలనుకోండి. అంతకంటే ఏమిటంటే, మీరు పొరపాటు పడుతుంటారు. మీరుచెప్పేది బాగుందో, లేదో సభలో అంతా తెలిసినవాళ్ళుంటారు. వాళ్ళేమన్నా అనుకుంటారేమో అని మీరు ఎప్పటికప్పుడు సందేహిస్తూ ఉంటారు. అందుకని మీకు ఉపన్యాసం నడవదు. మీరేమీ అనుకోకుండా ఉంటే ఒక్క సంగతి మనవిచేస్తాను. వినండి. మన సంగతి తెలిసినవాడు మన్ని ఉపన్యాసాలు ఇవ్వమనడు. అలాగే మన సత్తా తెలిసినవాళ్ళూ, మనకంటే విద్వత్తుఉన్న వాళ్ళూ సభకురారు. కాబట్టి సభలో ఉండేవాళ్ళు విద్వత్తు విషయములో మనకంటే తక్కువని తేలిందా ? అందుచేత మనం ధైర్యంగా మన ఇష్టంవచ్చినట్లు మాట్లాడ వచ్చును. అథవా, పెద్దవాళ్ళెవళ్ళైనా ఒకరిద్దరున్నా, మరేం ప్రమాదంలేదు. ఎందు కొచ్చామురా భగవంతుడా అని వారే లేచిపోతారు. లేదా చివరివరకూ కూర్చొని బాధపడతారు. మన్నేమీ అనరు. ఇదీ మేష్టారూ ఇందులోని రహస్యం'' అన్నాడు, చాలా నమ్రతతో,

ఆలోచిస్తే ఇది అంతా నిజమే అని తెలుస్తుంది. అన్నిటి మాటా ఎలాఉన్నా ఇదిమట్టుకు ఆయిన తెలిసే చెప్పాడనినిస్తుంది. ఆలోచించినకొద్దీ యాథార్థ్యం తెలిసి వస్తుంది. అవును నిజమే. దేనికైనా కొంత అహంకారం ఉంటేనే కాని వీలుపడదు.

పూర్వం ఉపదేశాలే కాని ఉపన్యాసాలుండేవి కావు. ఆ ఉపదేశాలు ఏ పాట రూపంలోనో, పద్యరూపంలోనో చేసేవారు. లేదా పురాణాలూ హరికథలూ చెప్పి ప్రబోధం చేసేవారు. అవి కేవలం ఉపన్యాసాలు అనిపించకుండా కొంత నృత్యం, సంగీతం కూడా ఉండడముచేతనూ, విసుగుదల లేకుండా ఉత్సాహ జనకంగా ఉండేవి.

ఆంగ్లేయుల హయాంవచ్చిన తర్వాతనే ఈ ఉపన్యాస ధోరణి ఏర్పడింది. మతప్రబోధకులు ప్రతి ఊళ్ళోనూ ఉపన్యాసాలు దంచుతుండేవారు. దేశీయ క్రైస్తవుల్లో ఆ రోజుల్లో చదువుకున్నవాళ్ళు తక్కువగా ఉండేవారు. వీరిలో కొందరిని ఏరి, హిందువులనూ, వాళ్ళమతాన్నీ ఎలా విమర్శించాలో వాళ్ళకు రాసి ఇచ్చి కంఠతా పట్టించి గ్రామాలమీదకి వొదిలేవారు మిషనరీ దొరలు. వీరు ఆ నాలుగు తిట్లూ ఒప్పచెప్పి, అక్కడక్కడ మరి నాలుగు వడ్డీతోసహా తిని చక్కా వచ్చేవాళ్ళు. దొరల ఉపన్యాసాలు హాస్యాస్పదంగా ఉండేవి.

మా స్కూలుకి ఒక మిషనరీ తరుచువచ్చి మాకు ఉపన్యాసాలిచ్చి ఏడిపించే వాడు. ఆయన ఎన్నిసార్లు చెప్పినా Purity and temperance మీదనే.

మమ్మల్ని టెంపరెన్సు సంఘాలు ఏర్పాటు చెయ్యమనేవారు. ఆ రోజుల్లో మరీ తక్కువ వర్ణాలలో ఏ కొద్దిమందికో తప్ప, ఈ రోజుల్లోకి మల్లె అందరికీ తాగుడు అలవాటుండేది కాదు. ఇప్పుడు తాగనివాళ్ళు అల్పసంఖ్యాకులు. అప్పుడు తాగే వాళ్ళు అత్యల్ప సంఖ్యాకులు. అంతే తేడా. అందుకని 'మితిమీరి త్రాగము' అని మమ్మల్ని ప్రమాణం చెయ్యమంటే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో ఆలోచించండి. ఓ సభలో నేనీమాటే దొరగార్ని అడిగాను. మా హెడ్మాష్టరుగారు నన్ను రెక్క పట్టుకొని అవతలకి లాక్కెళ్ళి ఈ దవడా, ఆ దవడా వాయించి 'వెధవా, దొరగారు మాట్లాడుతుంటే, వేలెడున్నావో లేవో, ఎదురు సమాధానం చెబుతావా? సీమాత్రం తెలివితేటలు మాకు లేకనే నోరు మూసుకు్కూచున్నామా' అన్నారు.

ఆ రోజుల్లోనే మన ప్రాంతంలోకి బ్రహ్మసమాజం దిగింది. ఎక్కడ ఎవరి బుర్రలో ఏంపుట్టినా, అదిముందు మనమీద వాలవలసిందే కదూ! ఈ సామాజికు లకు కూడా ఉపన్యాసాలివ్వడం సరదా ఎక్కువగా ఉండేది. వారి ఉపన్యాసాలు వినడానికి బాధగా ఉండేది. ఏమంటే, వారు చెప్పేది పూర్తిగా వారికే అవగాహన కాకపోవడమూ, ఎదుటివాళ్ళ సత్తా తెలుసుకోలేక పోవడమూ, వాస్తవిక దృష్టీ, సమయస్ఫూర్తీ లేకపోవడముచేత చెవిలో బర్మా తిప్పినట్టు ఉండేది. ఈ బాధంతా విద్యార్థులకే. ఎవడొచ్చినా మామీదే (అనగా విద్యార్థులమీదే) విరుచుకు పడడము జరుగుతుండేది.

ఓ మాటు ఒక తమాషా జరిగింది. నా చదువు పూర్తిఅయి ఇంగ్లాండునుంచి దిగిన క్రొత్తరోజులవి. ఎవరో ఒకాయన ఉపన్యాసమిస్తారని, నన్ను తప్పకుండా రావలసినదని మా పూర్వపు హెడ్మాష్టరుగారు తాఖీదు పంపారు. సరేనని వెళ్ళాను, ఉపన్యాసకుడొక బ్రహ్మసమాజ మతస్థుడు. పాపం ఏమీ చదువుకున్నవాడుకాడు. పొట్టకూటికని చేరాడు. ఈయనకు పదిహేనో ఇరవయ్యో ఇచ్చి ప్రచారకుడుగా చేర్చారు. రెండు ఉపన్యాసాలెవరో రాసిఇచ్చి గ్రామాలు తిరుగుతూ కాలక్షేపం చెయ్యమన్నారు. అవి ముఖ్యంగా మద్యపాన నిషేధ ప్రబోధమునకు ఏర్పడ్డవి. హరిజన వాడల్లోనూ అక్కడా చెప్తే ఎవ్వడూ వినేవాడు కాదు. అందుచేత స్కూళ్ళలో మీటింగులు ఏర్పాటుచేస్తే బావుంటుందనుకున్నారు. పాపం. మాఊరూ, మా స్కూలూ లోకువగా కనపడ్డాయి ఆయనకి. సరే, విద్యార్థులు, మేష్టర్లు, నాబోటి పెద్దలు కొందరు, అంతా చేరారు.

గంటసేపు ఉపన్యాసకుడు ఆయన చిత్తం వచ్చినట్లు తాడూ, బొంగరము లేకుండా, వీర విహారము చేశాడు. ఉపన్యాసం ముగించే ధోరణి కనపడలేదు.

అందరూ బాధపడుతున్నారు. హెడ్మాష్టారు పులిలా అగ్రాసనాధిపతిగా ఉన్నారు. ఏమన్నా అంటే వారేమంటారో అని ఊపిరి బిగపట్టుకొని కూర్చున్నారుసభ్యులు. ఇది బాగుంది కాదని నేను లేచి 'అయ్యా! ఉపన్యాసం ఇంకా ఏమాత్రం ఉంటుంది? చాలా ఉంటే నాటకాలలోలాగ ఒక పావుగంట విశ్రాంతి ఇస్తే, కొంచెము తొందర పనుండి; అది ముగించుకొని మళ్ళీవస్తాను' అన్నాను. అందరూ సైరన్ కూతలాంటి నిట్టూర్పు విడిచారు. హెడ్మాష్టారు నాకేసి తీవ్రంగా చూచినా మందహాసం మట్టుకు చేశారు.

ఉపన్యాసకుడు ఉక్కిరి బిక్కిరిఅయి, 'అబ్బెబ్బే అయిపోయిందం'దని రెండు నిముషాల్లో ముగించాడు. ఆ ముగించడంలో ఒక తెలివితక్కువపని చేశాడు. మద్యపానాన్నిగురించి మాట్లాడాడన్నానుకదూ! ఎదుటివా ళ్ళెవరో మరచి పోయి, ఇది స్కూలన్న సంగతి విస్మరించి, ఏ పాకలముందో గుడిశలముందో మాట్లాడుతున్నాం అనుకొని, "ఓ మద్యపాన దురాచార పిశాచ గ్రస్తులారా! ఈ దుర్వ్యసనాన్ని మానండి. ఓ మద్యపాన దురాచార పిశాచ గ్రస్తులారా! అమాయకు లైన మీ భార్యా బిడ్డలను మరువకండి. ఓ మద్యపాన దురాచార పిశాచగ్రస్తులారా! మీ భవిష్యత్తూ దేశ భవిష్యత్తూ ఆలోచించండి. భగవంతు డిది సహించడు సుమండీ!" అంటూ మూడు ముక్తాయింపులూ ఇచ్చి కూర్చున్నాడు.

నవ్వాలో ఏడవాలో తెలియక సభ్యులు చప్పట్లు కొట్టడముకూడా మరిచి పోయారు. అగ్రాసనాధిపతిగారు ఉపన్యాసకులకు కృతజ్ఞత ఎలా తెలపాలో తెలి యక బాధపడుతున్నారు. ఆ మూర్ఛలోనుంచి ముందుగా నేను లేచి" సోదరు లారా! పెద్దమనిషి ఆయన చెప్పేడు, బాగుండదు. వెంటనే తాగుడు మానెయ్యండి. ఆ జీతపు రాళ్ళేవో ఈ నెలాఖరుకేనా తిన్నగా ఇంటికి తీసికెళ్ళి కుర్రాళ్ళకు బట్టలే కావాలో, ఇల్లాలు కేం కావాలో కనుక్కొని కొనుక్కొని హాయిగా బ్రతకండి. ఊ... ఇంక లేవండి'' అన్నాను. ఒక్కసారి అందరూ ఇంజను ఆవిరి విడిచినట్లు గొల్లుమని లేచారు. అగ్రాసనాధిపతిగారు వందన సమర్పణకూడా మరచిపోయి, తిన్నగా నా దగ్గరకొచ్చి 'అసాధ్యుడవోయి' అని నవ్వుతూ నా వీపు తట్టారు. మేమంతా బయటకు వెడుతుంటే, పాపము, ఉపన్యాసకు డొక్కడూ కుర్చీలో కూర్చుండి పోయాడు.

ఇంకోమాటు ఇంకో చిత్రం జరిగింది. ప్రతి స్కూల్లోనూ పాత విద్యార్థి సంఘాలు వాటి వార్షికోత్సవాలు జరపడం కొన్నాళ్ళు ఫేషన్గా ఉండేది. మా

స్కూల్లోనూ జరిగే సంవత్సరీకానికి నేనూ వెళ్ళాను. మా పాఠశాల పాత విద్యార్థులలో ఒక మహమ్మదీయుడుకూడా ఉండేవాడు. ఆయన చాలా తెలివైనవాడు. బాగా చదువుకున్నవాడు. మంచి వక్త. ఎటొచ్చీ చాలాసేపు మాట్లాడడము ఆయనకు అలవాటు. రానురాను ఆయనకు ముస్లింలీగుమీద అభిమానం ఎక్కువై ప్రతిసభలోనూ మనవాళ్ళను దూషించడము ఎక్కువైంది. ఆ రోజు ఆయన ఉపన్యాసము గంటపైగా సాగించాడు. ఏదేదో చెప్పాడు. పార్సీ భాషలోనూ అరబ్బీ భాషలోనూ హిందువు అంటే దొంగ అని అర్థం కనుక, హిందువులంతా దొంగలనే ధోరణిలో ఉపన్యాసం సాగించి ఆఖరుకు ఎలాగైతేనేమి ముగించాడు. నాకు - నాకేమిటి - అందరికీ ఒళ్ళు మండుకొచ్చింది. తరువాత వక్త ఒక డాక్టరు; మాట్లాడడానికి వేదిక మీదకు వెళ్ళాడు.

నేను లేచి, సభాపతి నుద్దేశించి ''అయ్యా! నా దొక మనవి. ఇది వార్షికోత్సవం! పాత విద్యార్థులు కలుసుకోవడం, లాంఛన ప్రాయంగా సభ జరపడం బాగుంటుంది కానీ, దీర్ఘోపన్యాసాలు భరించడం కష్టం. ఇప్పుడు మాట్లాడినవారు చాలా విద్వాంసులు. తమకు తెలిసిందంతా ఇతరులకు చెప్పవలెననే కుతూహలం కలవారు. కనుక ఇంతసేపు మాట్లాడారు. ఈ డాక్టరుగారూ తెలివైనవారేను. సమయం దొరికిందికదా అని ఈయన ఏ పేథాలజీ గురించో, పేషెంట్లను గురించో, ఉపన్యాసం దంచుతే బొత్తిగా భరించలేం. కాబట్టి సభాపతిగారు ఇక వక్తలకు అయిదు నిముషాలకంటే వ్యవధి ఇవ్వడము ధర్మం గా'దన్నాను. సభలో గొల్లుమన్నారు. ఆయనకు కోపంవచ్చి వెళ్ళిపోయారు.

ఉపన్యాసా లనేటప్పటికి ఇలాటివేవో గమ్మత్తులు జరుగుతుంటాయి. గాంధీగారి ఉద్యమం వచ్చిన తరువాత నిజంగా దేశంలో ఉపన్యాసకులు చాలామంది బయలుదేరారు. ఎటొచ్చీ మొదటి రోజుల్లో ఎవ డెంతసేపు మాట్లాడగలడని పందెము వేసుకొని మాట్లాడినట్లు మాట్లాడేవారు. ఒకసారి ఒక ఉపన్యాసకుడు సుమారు రెండు గంటలుపైగా మాట్లాడాడు. అప్పటికి సగమైనాకాలేదు. ఏ దేశంలోనో స్వాతంత్ర్య సమరం వర్ణిస్తున్నాడు. శత్రువులు రాజ ప్రాసాదం దగ్గర కొచ్చారట! ఆ ప్రాసాదానికి చాలా మెట్లున్నాయట! ప్రతి మెట్టుదగ్గర ఘోరమైన పోరాటం, కొందరు అక్కడ చనిపోవటము: ఇలా ఒక్కొక్క మెట్టుదగ్గర వర్ణించడము. అక్కడ చచ్చినవాళ్ళకోసం నిముషం విచారిస్తూ నిలబడడం - ఇలా ముప్పై నలభై మెట్లయ్యాయి. ఒక కుర్రాడు భరించలేక ఇంకా ఎన్నిమెట్లున్నా

యండి అన్నాడు అమాయకంగా. ఉపన్యాసకుడు వొళ్ళుమండి జన సమూహాన్ని నాలుగు తిట్టి చక్కా పోయాడు.

మన రాజకీయ వేత్తలకూ మంత్రులకూ పెద్ద చదువులు కావాలనే పట్టింపులు లేవు. పెద్ద చదువు అక్కరలేదనే అభిప్రాయమేమోకూడా అని నా అనుమానం. ఒక రాజకీయవేత్త, ఎలాగో ఒక ఛోటా నాయకుడుగా తయారయ్యాడు. జిల్లా బోర్డు ఎన్నికలు వచ్చాయి. తను అధ్యక్షపీఠం అలంకరించాలని, తరువాత మంత్రి పీఠానికి మంగళసూత్రం కట్టాలనే మహాదాశయంతో కృషిచేస్తున్నాడు. ఆ జిల్లాలోనే ఒక గ్రామంలో చాలా సేవచేసిన పెద్దమనిషి చిత్రపటాన్ని ఆ ఊరు పంచాయితీ బోర్డు ఆఫీసులో ఆవిష్కరణ చెయ్యమని వారు కోరగా, అందు కంగీకరించి, చాలా సేపు జాతీయ అంతర్జాతీయ రాజకీయాలను గురించి విద్యా విధానాన్ని గురించి, గాంధీ మహాత్ముని గురించి, దేశాభిమానాన్ని గురించి, ఖద్దరును గురించి, జిల్లా బోర్డులను గురించి, వోటర్ల కర్తవ్యాన్ని గురించి సుదీర్ఘోపన్యాసంచేసి అసలు విషయం మరచి కూర్చున్నారు. పక్కనున్నవారు పరాకు తెల్పగా, మళ్ళీ లేచి, "మహా జనులారా! అందుకని నేను ఈ చిత్ర పటాన్ని బహిష్కరిస్తున్నాను" అని సెలవిచ్చి కూర్చున్నారు. కరతాళ ధ్వనులతో సభ ముగిసింది.

ఇలాంటి తమాషాలు చాలా జరుగుతుంటాయి. వక్తృత్వంకూడా గొప్ప విద్య. దానికితోడు తగ్గ పాండిత్యముకూడా ఉంటే రాణిస్తుంది. ఏ ఒక్కటున్నా చాలదు. కీర్తిశేషులైన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఏలాటి హేమాహేమీలున్న సభలోనైనా అనర్గళంగా కొన్ని గంటలు మాట్లాడేవారు. చివరకు ఏమిటి విషయ మంచే ఇదమిత్థమని తెలియకపోయినా గంట ఒక్క క్షణంగా గడిచిపోయేది. ఒక్క నిముషముకూడా వినకుండా వెళ్ళబుద్ధి అయేదికాదు. అది ఉపన్యాస మనిపించేది కాదు. అదొక entertainment గా ఉండేది. అలాగే పానుగంటి లక్ష్మి నరసింహా రావుగారూనూ. వారి ఉపన్యాసాలవల్ల కొందరికి దెబ్బలూ, గాయాలూ తగిలినా విన్నంతసేపూ చాలా బాగుండేది.

ఇప్పు డింట్లో మూలనున్న ముసలమ్మ దగ్గరనుంచీ, రైలులో మందులమ్మే వాడిదాకా అందరికీ ఈ ఉపన్యాస ధోరణి బాగా పట్టుపడింది. అందరికీ ఒకటే ఉద్దేశం. శ్రోతలు ఉత్త దద్దమ్మలని. రైలులో మందులమ్మేవాణ్ణి చూడండి. లోపలకువచ్చి, నాలుగువైపులాచూచి, ఒక్క నిముషం మన సంభాషణలు కట్టిపెట్టి దానికి సావకాశం ఇచ్చినట్టు ఊరుకొని 'ఆఁ చూడండి' అని ఆరంభిస్తాడు. అంటే

ఏమిటి – మీ చచ్చు బాతాఖానీ ఎప్పుడూ ఉండేదే, ఒక్క క్షణమైనా అది కట్టిపెట్టి నేను చెప్పబోయే విషయం వింటే బాగుపడతారని. ఆ 'ఆఁ చూడండి' లో అంత భావ ముందన్నమాట.

కొందరు కేవలం అర్థంలేని శబ్దాడంబరంకోసం మాట్లాడతారు, మన కెలాగూ తెలియదని – 'అధ్యక్ష హార్యక్షుల సమక్షమందు నిరక్షర కుక్షినైన నేను, నా కుక్షింభరత్వము కొరకు ప్రత్యక్ష సాక్షీభూతముగా...' ఇదీ ధోరణి.

ఉన్న కర్మ చాలక ఉపాకర్మ అన్నట్లు, ఈ రాజకీయ వేత్తలూ, ప్రచార కులూ చాలనట్లు, ఈ మధ్య మరీ ఎక్కువగా ఏడెనిమిది సంవత్సరాలనుంచీ సాంస్కృతికోత్సవాలనే తిరునాళ్ళు ప్రారంభమయ్యాయి. నవంబరు ఆఖరు వారం నుంచీ జనవరి ఆఖరు వరకూ ఈ తిరునాళ్ళు జరుగుతుంటాయి. ఎక్కడెక్కడున్న కవులూ కథకులూ ఈనాడు బయటపడి వక్తలుగా తయారవుతారు. ఈ రెండు నెలలూ ఏ రైలులో చూచినా తిరునాళ్ళకు వెళ్ళేవారో, వచ్చేవారో, రచయితలు – బాధ్యత ఎరిగినవారూ, ఎరుగనివారూ తగులుతుంటారు. పాపం విద్యార్థులు వీళ్ళని పిలవవచ్చు, వీళ్ళను పిలవకూడదనే పక్షపాతబుద్ధి ఉండదు. రమణారెడ్డి మొదలు రాళ్ళపల్లివరకూ, రేలంగి మొదలు రేడియో ఇంజనీరువరకూ సమస్త ప్రజ్ఞా పారంగతుల్నీ పిలుస్తారు. అందరూ వెడతారు. సంస్కృతంలాంటి తెలుగు తోటి ఇంగ్లీషులాంటి తెలుగుతోటి, తెలుగులాంటి ఇంగ్లీషుతోటి, అనేక రకాలుగా విజ్ఞానం వెదజల్లుతూ ఉంటారు, ఈ కవి ప్రకాండులు. వీటి బాగోగులన్నారా – ఓ పూటకూటి అమ్మని 'ఏమండీ ఇక్కడ భోజనం బాగుంటుందా' అంటే 'తినే వాళ్ళ దంతసిరినిబట్టి బాగోగులు లుంటాయి నాయనా!' అందిట-అలాగే ఉపన్యా సాల బాగోగులు శ్రోతల చెవులు చేసుకున్న పాపపుణ్యాల్నిబట్టి ఉంటాయి.

కనక నాయనలారా – నేను ఇచ్చిన ఈ ఉపన్యాసం అంతా విన్నాక మీ చెవులు ఇవాళ మహా పాపం చేసుకున్నాయి అని అనరుకదా! ఎందుకంటారులెండి, అలా అంటే తిరిగి మీకే తగుల్తుంది అనే భయమో, ఈ పెద్దమనిషి ఏమను కుంటాడో అనే మొహమాటమో మీకు ఉండక పోతుందా? తప్పకుండా ఉంటుంది.

అంటూ బారిష్టరు పార్వతీశంగారు తమ సుదీర్ఘోపన్యాసపూర్వక బాతా ఖానీని ముగించారు.

(బారిష్టరుగారి బాతాఖానీ)

# తెలుగు కవిత్వంలో ఫాషన్లు

—శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఫాషను అనేది కవిత్వములో కూడా ఉన్నదా? అని కొందరు సందేహ పడవచ్చు. మానవుడికి సంబంధించిన ప్రతి దానిలోనూ ఫాషను ఉన్నది.

పూర్వాంధ్ర కవులలో "ఫాషను" అన్నప్పుడు ఏ శ్రీనాథునితోనో, "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలకల్గెనీ యతులిత మాధురీ మహిమ?" అని మహాసభలో కూడా ప్రస్తావన వచ్చేటంత ప్రసిద్ధముగా విలాసపురుషుడైన ధూర్జటితోనో, అనేక కథలు చెప్పుకొనే పినవీరభద్రునితోనో ప్రారంభిస్తానని మీరు ఊహించవచ్చు. వాళ్ళుకూడా ఫాషనులు కనపరచినవారే! కాని తెలుగు కవులలో కల్లా మొదటి ఫాషను తెచ్చిన నవనాగరికుడు నన్నయభట్టు.

ఏమిటి! "అవిరళ జపహోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు, నానాపురాణ విజ్ఞాన నిరతుడు" అయిన ఈ నన్నయభట్టు శుద్ధ ఛాందసుడు కాడా? బ్రాహ్మణాతిశయము సంగతీ, వర్ణాశ్రమ ధర్మరక్షణము సంగతీ అనుమానమేమీ లేకుండా సర్వసామాన్య విషయంగా ఎక్కడపడితే అక్కడ వర్ణిస్తూవచ్చినాడు. రాజరాజ నరేంద్రుణ్ణి వర్ణిస్తూ ఆరో పద్యములోనే "సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ" నొప్పుచు అనీ తర్వాత పద్యములోనే "విప్రకులమునెల్ల బ్రోచుచు" అనీ "అగ్రజన్ములకు ననుగ్రహమున చారుతర మహాగ్రహారంబు లిచ్చుచు" అనీ అన్నాడు. ఆయనకు ఇష్టమైన నాలుగైదు వస్తువులలో, "భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతి" ఒకటి, అన్నాడు. భారత శ్రవణాభిరతివల్ల" అమల సువర్ణ శృంగఖురమై కపిలంబగు గోశతంబు నుత్తమ బహువేద విప్రులకు దానముచేసిన తత్ఫలంబు తథ్యమ సమకూరు" అన్నాడు. ఊరికే సభాపర్వంలో పుటలుతెరవగానే ఈ వాక్యము కనబడ్డది. "దిగ్విజయోపార్జితంబులయిన ధనంబుల బ్రాహ్మణ సంతర్పణంబును, ధర్మ మార్గంబులం జాతుర్వర్ణ్య రక్షణంబునుంజేసి సామ్రాజ్యంబునం బ్రకాశింపుము" అని ధర్మరాజుతో నారదుడన్నట్లున్నది. ఇంతగా బ్రాహ్మణాతిశయము తిక్కన కూడా చెప్పలేదు. ఇక నన్నయభట్టు చెప్పినదా

పురాణము. ఇటువంటి అచ్చసనాతనుడైన నన్నయభట్టే తెలుగు కవిత్వములో మొదటి ఫాషను తెచ్చినాడా! అని సందేహము ఎవరికయినా కలగడము ఆశ్చర్యము కాదు.

అయితే ఈ నన్నయభట్టే రాజసభలోని సభ్యులను – సభికులంటే తగాదా వస్తుంది-వర్ణిస్తూ సభలో "మృదుమధుర రసభావ భాసుర నవార్థవచన రచనావిశారదులైన మహాకవులును" ఉన్నారని వర్ణించినాడు. మహాకవుల రచనలు వర్ణిస్తూ "భావ భాసురమైన"వనీ, "నవార్థ వచనము"లనీ చెప్పినాడు. ఆయన ఇప్పుడే గనక ఉంటే తప్పక 'భావకవిత్వమూ', 'నవ్యకవిత్వమూ' ఆదరించే వాడనుకోవడములో అనుమానము ఉండదు. ఒక్క సమాసములోనే రెండూ ఉదాహరించినాడు.

ఇంతకూ ఆయన భావకవిత్వమందు అభిమానము చూపినా అటువంటిది వ్రాయలేదు కాబట్టి ఆయన తెచ్చిన 'ఫాషను' ఏమిటి? ఈ ప్రశ్నకు జవాబుచెప్పే ముందు మీరు అసలు తెలుగుభాషలో భారతమువంటి గ్రంథము పనిపెట్టుకొని చెప్పడమనేదే అప్పటి పూర్వాచార పరాయణులకు ఎంత హాస్యాస్పదముగా ఉండేదో కాస్త ఊహించుకోవలె. ఇప్పటికి ఇంచుమించు వెయ్యి సంవత్సరాల బట్టీ విద్వాంసులు కవిత్వము చెప్పి పండితపామరులను మెప్పించినారుగదా! కాని ఇప్పటికీ కూడా కేవల సంస్కృత పండితులకు తెలుగు కవిత్వమంటే ఎంత నిరసనభావముంటుందో తెలుసునా! అటువంటి వారిలో తెలుగు వారితో తెలుగు కవిత్వము సంగతి ప్రస్తావిస్తే వాళ్లేమంటారో తెలుసునా? "మాకు తెలుగులో అంత ప్రవేశము లేదండీ" అంటారు. ఇంగ్లీషు చదువుకొన్న కొందరు "మేము తెలుగులో వ్రాయలే"మని అంటున్నట్లు ఆ సంస్కృత పండితుల దృష్టిలో తెనుగు, కవిత్వయోగ్యమైన భాషకాదు. చివరకు అది 'తెనుగు' కూడాకాదు. "తెలుగులు!"– నిత్యబహువచనము–మినుములు పెసలు వలెనే అదిన్నీ.

కాళిదాసాదులు కూడా ఆదరించక తప్పకపోయిన ప్రాకృతాన్నే పూర్వపండితులు 'అపభ్రంశము' అన్నారు-గ్రామ్యమన్నట్లు. ఒక ప్రాకృతాన్ని 'పైశాచి' అన్నారు. ఇక తెలుగో! ఆ అపభ్రంశానికి అపభ్రంశం కొంతా, పైశాచికి వికృతి కొంతా, సంస్కారహీనమైన-అంటే సంస్కృతము కాని-అచ్చతెలుగు కొంతా ఈ భాషలో కలిసింది. ఈ పనికిమాలిన తెలుగుభాషలో మహాభారతము వంటి ఉద్గ్రంథము రసవంతముగా వ్రాయడానికి ఉపక్రమించి నాడంటే నన్నయదెంత సాహసము! అప్పటి కాలములోని అచ్చ సనాతనులు నన్నయభట్టును భ్రష్టబ్రాహ్మ

ఋణ్ణిగానో చదువురాని నవనాగరీకపు కవిగానో భావించి ఉంటారు. ఇంతఎందుకు? ఆయన రాజాశ్రయము సంపాదించి తెలుగులో కూడా పుస్తకము వ్రాస్తున్నాడంటే, ఇప్పటికాలపు కవిత్వము చదవకుండానే, కవులు ఎవరో తెలియకుండానే, హేళన చేసే పూర్వపండితులూ పండితమ్మన్యులూ లేరూ?, అట్లాగే ఆ కాలపు పెద్దలు నన్నయభట్టును ఏమని హేళనచేశారో? వ్యాసమహర్షి చెప్పిన మహాభారతము తెలుగులో రసవంతముగా వ్రాస్తాడట ఈ బ్రాహ్మణుడు!

ఏమయితే ఏమి? ఆ బ్రాహ్మడు పురాణాలు తెలిగించే ఫాషనే నిరాఘాటంగా కొంతకాలముపాటు సాగిపోయింది. రైళ్ళూ విమానాలూ వంటి రయసాధనాలులేని ఆ పూర్వపు రోజులలో ఫాషన్లు కూడా ఇప్పటంత తొందరతొందరగా మారేవికావను కుంటాను. ఇట్లా ఉండగా శ్రీనాథుడు పురాణాలతోపాటు నైషధీయ చరితము కూడా తెలుగుచేశాడు. దానితో కవులదృష్టి సంస్కృత కావ్యాలమీదికి మళ్ళింది. అట్లాగే శిశుపాలవధ, కిరాతార్జునీయము, మేఘదూతము, కుమారసంభవము మొదలైనవన్నీ అప్పటికాలపు కవులు తర్జుమాచేసి ఉంటారు.

ఇంతలోకే ఈ తర్జుమా లెందుకు? ఇతివృత్తము కాస్త పూర్వపుది పెట్టుకొని మనమే స్వతంత్రంగా సంస్కృత కవులవలె కావ్యాలు వ్రాసేస్తామని ఎవరికో ఒకరికి బుద్ధిపుట్టింది. ఎవరికి ఆ బుద్ధి ముందు పుట్టిందో చెప్పలేము కాని తెలుగు దేశములో ఈ రకము కావ్యాలు ఫాషనుచేసినది పెద్దన్న; వీటికి ప్రబంధాలని పేరు రావడము కూడా ఒక ఫేషనే.

ఈ ప్రబంధాల్లో శ్లేషపద్యాలు చేర్చి ప్రతి పద్యాన్నీ సానలుదీరిన జాతి రత్నంగాచేస్తూ రామరాజ భూషణుడు వసుచరిత్రచెప్పి శ్లేషకవిత్వము ఫాషనులోనికి తెచ్చినాడు. అందుమీద పిల్లవసుచరిత్రలు పుట్టుకువచ్చినవి!

భట్టుమూర్తి వ్రాసిన పుస్తకాన్ని మించవలెనని పింగళి సూరన రాఘవ పాండవీయము వ్రాసి ఒక్క కావ్యములో రెండు కథలు రెండెడ్ల బండివలె నడిపించే కొత్త ఫాషను – కాదు, అది రెండు బళ్ళకు ఒంటెద్దుకట్టి నడిపించే ఫాషను – తెచ్చినాడు. అక్కడనుంచీ నలయాదవ రాఘవ పాండవీయాలు వగైరాలు ఒంటెద్దుకు నాలుగు బళ్ళూ ఐదుబళ్ళూ కట్టి తోలడము సాగించారు.

ఇది ఇట్లా ఉండగా, ఒక పనిలేని కవికి అచ్చతెలుగు కావ్యము వ్రాయవలెనని బుద్ధిపుట్టివ్రాస్తే ఇంకొకడు నిరోష్ఠ్య కావ్యము వ్రాశాడు. ఇట్లా ఎవరి ఊహ

కొద్దీ వాళ్ళు కొత్తకొత్త ఫాషన్లు తెలుగు కవిత్వములో వెదజల్ల సాగినారు. ఇదంతా 'భవి కవుల' సంగతి :

ఈ రకంగా 'భవి కవు' లంతా కవిత్వ సంసార సాగరములోపడి తన్నుకులాడుతూఉంటే ''శివ కవులు'' వారి దోవను వారు కొత్త ఫాషన్లు కవిత్వములోకి తీసుకురా మొదలు పెట్టినారు. సోమనాథుడు బసవ పురాణము ద్విపద కావ్యముగా జాను తెనుగులో వ్రాసినది మొదలుకొని శివకవులకు తెలుగులో ద్విపద, సంస్కృత పురాణాలలో అనుష్టుభుకు పర్యాయమై పోయింది. వీళ్ళు ఇంకా ఎన్నెన్ని రకాలలో పదాలు, పాటలు, ఫాషను చేసినారు. అవి చాలా భాగము కాలగర్భములో అంతరించినవి.

తిక్కన సోమయాజికి ఆయన పితృదేవతను ముందు పెట్టుకొని హరిహరనాథుడు ప్రత్యక్షమై భారతము పూర్తిచేయ మన్నాడు. భక్తాగ్రేసరుడైన పోతన్న గోదావరిలో గ్రహణ స్నానము చేసిఉంటే దివాస్వప్నములో శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షమై భాగవతము తెలుగులో వ్రాయమన్నాడు. తరువాత కొద్ది కాలానికే కళింగ యాత్రకు పోతున్న కృష్ణదేవరాయలకు శ్రీకాకుళనాథుడు స్వప్నములో సాక్షాత్కరించి శ్రీ వేంకటేశ్వరునిపేర ఆముక్తమాల్యద వ్రాయమన్నాడు. అప్పకవికి కృష్ణాష్టమినాటి రాత్రి కామేపల్లి చక్రపాణి కలలో కనబడి చెప్పి మర్నాటికి మతంగ నివాసి అయిన బ్రాహ్మణునిద్వారా అయిదువందల సంవత్సరాలనాడు పోయిన పుస్తకము పంపించినాడు : అప్పకవికి కలలో కృష్ణుడు చెప్పిన మాటలు అసందర్భంగా ఉన్నవని మన నవ్య విమర్శకులు అంటున్నారు కాని అది అప్రస్తుతము. ఇక కంకంటి పాపరాజుకు భగవంతుడు ప్రత్యక్షమై ఉత్తర రామాయణము వ్రాయమన్నాడు. "నా విష్ణుః పృథివీపతిః" అన్నట్లు "నా భక్తః కవిశేఖరాత్" అని వాడుకలోనికి వచ్చిఉంటుంది. ఇక ఆ పైని తాము వ్రాసిన కావ్యము కృతిపొందడానికి సిద్ధపడ్డ ప్రభువులూ, మంత్రులూ, దండనాథులూ దొరకని ప్రతి కవికీ భగవంతుడు కలలో ప్రత్యక్షమై తనపేర పుస్తకాలు వ్రాయించుకొన్నాడు. దీన్నిబట్టి భగవంతుడికి తెలుగు భాషమీద ఎంత అభిమానమో ఋజువవుతుంది : ఇక చివరకు నా పధ్నాలుగో ఏటనో పదిహేనో ఏటనో నేను వ్రాయ ప్రారంభించిన ప్రబంధముకూడా విష్ణుమూర్తి కోరికవల్ల ఆయనకే అంకితము చేసినట్లు జ్ఞాపకము. "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్" నా కెందుకు అనుకున్నాను. ఆ ప్రబంధము అంకితము పుచ్చుకోడానికి అంతకంటె తెలివిమాలిన

వాడు నా కప్పట్లో దొరకలేదు ! ఆ ప్రబంధము ఏది అని ఎవరయినా అడుగుతా రేమో ! శ్రీ శివ శంకరశాస్త్రి నా చేత ఒక చిన్న ఏకాహము చేయించారు. అందులో ఆయనే స్వయంగా హోతగా ఉండి ఆ ప్రబంధము అగ్నిహోత్రుడికి ఆహుతి చేయించి, హవ్య వాహుడిద్వారా శ్రీ మహా విష్ణువు తిరుహస్తాలకు అందేట్లు చేసి నారు. ఆ ప్రబంధముపేరూ, ఇతివృత్తమూ మరిచిపోయినాను.

ఆధునికులలో కొక్కొండ వెంకటరత్నం పంతులు, వేదము వెంకటరాయ శాస్త్రి, వాసుదాసు, వసురాయకవి, తిరుపతిశాస్త్రి ప్రభృతులు ఎన్నో ఫాషన్లు తెచ్చినారు. అయితే వారిలో తిరుపతి వెంకటేశ్వరులు పూర్వాంధ్ర కవి శిఖామణు లలో చివరివారనీ, నవ్యాంధ్ర కవులలో మొదటివారనీ నా ఉద్దేశము. వారు అవ ధానాలు ఫాషను చేసిన సంగతి జగద్విదితముగదా ! ఇంక జంట కవిత్వ మొకటి వారు తెచ్చిన ఫాషనే. రామకృష్ణ కవులు, వెంకట పార్వతీశ్వర కవులు, కొప్ప రపు కవులు, శంకర దీక్షితులు (అంటే చింతా భీమ శంకరము, చింతా దీక్షితులు) సత్యాంజనేయులు (అంటే విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు) శేషాద్రి రమణ కవులు, పింగళి లక్ష్మీకాంతం కాటూరి వెంకటేశ్వరరావులు ఇంకా ఎంతమందో లెక్కలేదు. వెంకట శాస్త్రిగారు తెలుగు పద్యాలు చక్కగా చదివే కొత్త పద్ధతికూడా ఒకటి ఫాషనులోకి తెచ్చినారు. ఇది ఇప్పటికీ తెలుగు దేశ మంతా వ్యాపించే ఉన్నది.

ఈ సందర్భములో కొప్పరపు సోదర కవులు తెచ్చిన ఫాషను చెప్పడం మరవరాదు. వారు ఆశుధార చెప్పుతూ దేశములో సంచారము చేసిన మొదటి రోజులలో వా రెంత పండితాదరము గడించారో చిన్నవాళ్ళకు చాలా మందికి తెలియక పోవచ్చును. వారు మొదటిసారి గుంటూరు వచ్చినప్పుడు నాకు పది పదకొండేళ్ళు ఉంటవి అనుకొంటాను. నేను సభకు వెళ్ళలేదు. అయితే సంస్కృ తాంధ్ర పండితులైన మా నాన్నగారు ఆ సభకు వెళ్ళివచ్చి ఇంట్లో, వారిని మెచ్చు కుంటూ అన్న మాటలు నా కిప్పటికీ జ్ఞాపకమున్నవి. చాలాసేపు పరిపరివిధాల మెచ్చుకొని చివరకు సాక్షాత్తు రామకృష్ణులే అవతరించి వచ్చినారని అన్నారు. వారు ఫాషనులోకి తెచ్చిన ఆ శుకవిత్వముతో పూర్వాంధ్ర కవిత్వము అంత రించినది.

ఇక నవ్యాంధ్ర కవిత్వములో ఫాషన్లు :

నవ్యాంధ్ర కవిత్వము రాయప్రోలు సుబ్బారావుగారు 1913వ సంవత్స రములో 'తృణకంకణము' ప్రకటించడముతో ప్రారంభమైనదని అస్మదాదుల మతము. దాని ప్రకాశకులు తమ పీఠికలో ఇట్లన్నారు :

''మన భాషయందలి కావ్య ప్రపంచమును శాసించిన లాక్షణికులు కవిత్వ మునకు పాత్రములగు విషయములకు సైతము ననుల్లంఘ్యమగు ప్రహరి నిర్మించి విడిచినందున పాశ్చాత్యాదర్శముల ప్రోద్బలము దొరకనంతవరకు మన కవులు పాడిన పాటలనే పాడవలసిన వారైరి..."

''కాల ప్రభావమున నట్టివి భూగర్భమునుండి వెలికి దీయబడి గత కాలపుం జరిత్ర సరణిం దెలుప నుపయుక్తంబు లగుటకయి వస్తు ప్రదర్శనాగారముల నిలుపబడు విగ్రహాదుల గతిం జెందు స్థితినుండుట యొక కొన్ని కారణంబులచే విషాదకరంబె..."

"లాక్షణికులు మాత్రము సర్వాధికార ధూర్వహులుకారు; సాధారణముగ భాషా సంప్రదాయముల లక్ష్యమున నుంచుకొని కవులు తమ రచనల సర్వ స్వతంత్రులయి మెలగిరి..."

నవీన మార్గరచనలలో ముఖ్యమయినది 'లిరిక్' అను ఆంగ్లేయ రచనకు సరివచ్చు 'భావ గీతము'. కవి తనకు సురుచిరమగు నొక భావమునుగొని అందు తన హృదయము నిమిడ్చి రచించును. ఇందు కథయు వర్ణనలు నుపాంగములు. పెరవైపులకు జింతలం బరపి యల్లుట యనవసరంబగుట నీ విధ రచనల కవి హృదయ మొక్క విషయంబున కేంద్రీకృతమయి మిక్కిలి యాహ్లాద కరం బగును.

''దైవనియతిం బ్రసక్తమైన 'నిర్గత ప్రణయము' విశుద్ధప్రేమముగా ప్రతి ఫలించు 'ప్రకృతి రహస్యమే' ఇందు వర్ణింపబడినది".

ఈ మాటలు ఇంత విరివిగా ఉదాహరించుటకు కారణమున్నది.

తృణకంకణము, కష్టకమల, స్నేహలతాదేవి, తెనుగుతోట, స్వప్న కుమా రము 1913-1914 సంవత్సరాలలో ప్రకటించినారు. అందులో 'తృణకంకణము' అభినవ కవితామండలి ప్రకటించినట్లు లేకపోయినా 'కష్టకమల' సూచికలో ఆ మండలివారు 'తృణకంకణము' కూడా తమదే అని అది ద్వితీయ ప్రచురణమనుటలో సూచించినారు. అంతకు మునుపటి 'లలిత'ను ఉదాహరించలేదు.

నాకప్పుడు 12, 13 ఏళ్ళు కాబట్టి, నేనప్పుడు ప్రబంధయుగములో ఉన్నందువల్లా ఆ ప్రచురణలు నా దృష్టిలోకి రాలేదు. అయితే శ్రీ శివశంకరశాస్త్రితో స్నేహమయిన తరువాత 1917 లో వాటికోసము ప్రత్యేకము బెజవాడవెళ్ళి రామమోహన గ్రంథాలయములో చదివినాను. నాకా పుస్తకాలు దొరకడము పేదకు పెన్నిధి దొరికినట్లయింది. ఇంతటి కవి తెలుగుదేశంలో పుట్టినాడా అనిపించింది. ముఖ్యంగా అందులో తెలుగుతోట ఎన్నిసార్లు చదివినానో చెప్పలేను. ఆధునిక కవులలో రాయప్రోలు వారి గ్రంథాలతో ముగ్ధులు కానివాళ్ళు ఎవరూ లేరనడము అతిశయోక్తి కాదు.

అంతకుమునుపే నవ్యకవిత్వము ఉన్నా అది ప్రచారములోకి తెచ్చి ఫాషనులోకి తెచ్చినది మొదట రాయప్రోలు వారే. తృణకంకణ పీఠిక, ప్రకాశకులు వ్రాసినట్లున్నా సుబ్బారావుగారేనో, వారి మిత్రులలో ఎవరో ఒకరు వారి ఊహలకు అనుగుణముగానో వ్రాసినారని నా నమ్మకము. కాబట్టి దానిబాధ్యత వారిదే.

అందులోనుంచి పైని ఉదాహరించిన వాక్యాలవల్ల నవ్యకవుల లక్షణాలు స్పష్టపడతవి. అందులో మొదటిది లాక్షణికులమీద దండయాత్ర. పాశ్చాత్య కవిత్వపద్ధతులమీద ఆదరము. పూర్వ కవిత్వముమీద నిరసనలేకపోయినా నిరసనషువలె స్థూలదృష్టికి కనపడేమాటలు వాడడము. ఆధునికులమీద అభిమానము. కవుల నిరంకుశత్వము ఉద్ఘాటించడము. ఇంతే కాదు. నవ్యకవిత్వ మిత్రులు కొందరూ, శత్రువులందరునూ నేటి కవిత్వాన్ని 'భావకవిత్వము' అంటున్నారు. ఆ మాట వాడకపోయినా ఆ పీఠికలో 'Lyric' అనే పదాన్ని 'భావగీతము' అని అనువదించి 'భావకవిత్వము' అనే పదానికి మార్గదర్శకులైనారు. మళ్ళీ 'కష్టకమల' సూచికలో 'మేమీ నవ్యకవితా ప్రచారమునకు ముందడుగు మోపినప్పటినుండియు వలయు ప్రోత్సాహగౌరవము లబ్బినందున కెంతయు సంతసించుచున్నాము' అని ప్రకాశకులు వ్రాసినారు. కాబట్టి వారే 'నవ్యకవిత' అనే నామము వాడినారు. అందులోనే 'భావపరిచయము' అనే శబ్దము వాడి 'భావము' మీద ప్రత్యేకాభిమానము చూపినారు. తెనుగుతోటలో 'పాడుమమ్మ గీతాసఖీ భావపదము'అనే పాదము 9 సార్లు ఉచ్చరించి గీతా సఖ్యము చేసినారు.

నవ్యకవులకు ప్రణయము, ప్రకృతి, వాటి రహస్యాలూ చాలా ఇష్టమైనవని మీకు తెలుసును. పైని ఉదహరించిన వాటిలో చివరమాటలు మళ్ళీ ఎత్తి వ్రాస్తున్నాను. "దైవనియతిం బ్రసక్తమైన నిర్గతప్రణయము......" ఇందు వర్ణింపబడినది.

నేటి కవిత్వము అర్థముకాదు; అందుకే అది అభావకవిత్వమని ప్రతిపక్షులంటున్నారు. అందులో కూడా కొంత సత్యము లేకపోలేదు. పై వాక్యానికి ఎవరైనా అర్థముచెప్పండి! తృణకంకణము చదివిన తరవాత ఆ కథనుబట్టి ఆ వాక్యము అర్థము ఊహించవలసినదే కాని ఊరికే ఆ వాక్యము అర్థముకాదు.

నవ్యకవులలో ఇంకో ఫాషను ఉన్నది. ద్వివచనములో కాని బహువచనములో కాని సభ్యులు లేకుండానే కవితామండలి స్థాపించడమునకు కూడా వారే ప్రథములనుకొంటాను.

నవ్యకవులకు ప్రత్యేకమైన కవితాసామగ్రి ఉన్నదని అందరికీ తెలుసును. ఈ మధ్య అతినవ్య కవులు (ultra-moderns) తెస్తున్న సామగ్రి మాత్రము ఆయనకు తెలియదుకాని, మిగతా నవ్యకవుల కవితాసామగ్రి అంతా రాయప్రోలు వారే మొదట ఫాషనులోకి తెచ్చినారు. ఈ కవితాసామగ్రిలో మొదటిది భావాలు. తర్వాతది ప్రణయము, మూడోది ప్రకృతి. దానివెంబడి ఇంకా ఎన్నో ఉన్నవి. కోయిల ఒకటి. కోయిలమీద పద్యాలురాయని నవ్యకవిలేడు. ఇక నీరదకుమారులు, కుమార హరిణులు, కవికుమారులు, మాధుకర కుమారులు, బ్రాహ్మణ కుమారి లేగొల్ల కొమిరె–ఇన్ని ఎందుకు! కుమారశబ్దము ఎన్నిచోట్ల వాడవచ్చునో అన్నిచోట్లావారు వాడివేసినారు. ఇంకా కవితా సామగ్రిలోని పూదోటలు, మావిచిగుళ్ళు, శిరీషపుష్పాలు, మధువు, లతలు, కన్నెలు, రాధ, కృష్ణుడు–ఇవన్నీ రాయప్రోలు వారు తెచ్చిన ఫాషనులే. నవ్యకవులకు 'షెల్లీ' మీద అభిమానము ఫాషనుచేసినది కూడా వారే. చివరకు మాటలన్నీ అర్థమైనా భావము గోచరించకుండా చెప్పే కవిత్వమునకు కూడా వారే అక్కడక్కడ దారిచూపించినారు. వారి తెనుగుతోట అనే కావ్యము నాకు అభిమానమైనది. అందులో పూర్తిగా తేటగీతి వాడినారు. తేటగీతిలో ఉన్న సొగసు అంతా వారందులో చూపించినారు. 'ఆధునిక కవిత్వమంటే తేటగీతాలు వ్రాయడమా?' అని మా నాన్నగారు అడిగేవారు. ఆ ప్రశ్న తోచినది మా నాన్నగారికి ఒక్కరికే కాదనుకుంటాను. నవల అంటే ముందు బాటసారిని వర్ణించడమని అయిపోయినట్టు నవ్యకవిత్వమంటే కొంతకాలము తేటగీతి వ్రాయడమయి పోయింది.

తేటగీతి అనేటప్పటికి వెంకట పార్వతీశ్వర కవులు వెంటనే జ్ఞప్తికివస్తారు. వారి గీతాలుకూడా చాలా మధురంగా ఉంటవి. అయితే వారు తేటగీతి రచనలో కొత్త ఫాషను తెచ్చినారు.

ఎంత ఆనంద మున్నదో ఎవరి కెరుక
ఎంత సంతోష మున్నదో ఎవరి కెరుక
ఎంత ఆహ్లాద మున్నదో ఎవరి కెరుక
ఎంత ఆమోద మున్నదో ఎవరి కెరుక
ఎంత హర్షంబ దున్నదో ఎవరి కెరుక

ఈ విధంగా ఒక్కమాట మార్పుతో హాయిగా పంక్తులకు పంక్తులు, పేజీలకు పేజీలు పెరిగిపోయేటట్లు గీతా లల్లడము లోకానికి నేర్పినారు. ఇంకో పద్ధతి కూడా పద్యాల అల్లికలో తెచ్చినారు.

మధుర చంద్రికలలో మధురామృతంబు
మధురామృతంబులో మధుర రసంబు
మధుర రసంబులో మధుర భావంబు
మధుర భావంబులో మధుర రూపంబు
మధుర రూపంబులో మధుర తేజంబు...

ఈ విధంగా అన్యోన్యాశ్రయమైన పదాలూ ముక్తపద గ్రస్తాలూ పోషను చేసినారు.

వారు తమ 'ఏకాంత సేవలో' అవ్యక్త మాధుర్యము లోకమున వెదచల్లినారు. అర్థము మాత్రము నిలవదీసి అడగకూడదు. ఇంతలో 1920 లో సాహితి పత్రిక వచ్చింది. సాహితీ సమితిలో సభ్యులు ఒక్క శివశంకరశాస్త్రి మాత్రమే కాదు. సమితి కవులవల్లనే నవ్యకవిత్వానికి ఒక స్థైర్యము సమకూరింది అడనము అతిశయోక్తికాదు. సమితి సభ్యులలో ఒకణ్ణి కాబట్టి సాహితీ సమితినిగూర్చి ఎక్కువ చెబితే రసవంతముగా ఉండదేమో అని టూకీగా పోనిస్తాను. పూర్వాచార పరాయణులైన మా కొమాండూరి కృష్ణమాచార్యులుగారు 'తాలింఖానా' కవిత్వము వాడుకలోకి తెచ్చినారు. ఆయనవలెనే ఆయన పద్యాలుకూడా మాంసలంగా ఉంటవి. ఆయన ఆధునిక కవు లందరివలె సన్నగాలికి ఎగిరిపోయేటట్లు ఉండరు. నాబోటివాళ్ళు నలుగురు ఆయన చాటున దాక్కొని ఎంత ప్రభంజన ధాటినుంచి అయినా తలదాచుకోవచ్చును. విరహోత్కంఠితలో—

జరఠాదిత్య మరీచి కోజ్జ్వలములై
శైలాగ్రముల్ రంజిలెన్
సరసీజోదర బద్ధ షట్పద లస
ఝ్ఝంకార గీతామృత

స్ఫురణన్ దుర్భర కర్ణతాప మొదవెన్
ఫుల్లాబ్జ పత్రేక్షణుం
దరుదేరం దడవాయె మన్మథ ధను
ర్జ్యా ఘోష మెట్లోర్చెదన్.

విలసత్కోమల నీలమేఘ రుచితో
పీతాంబ రాచ్ఛాదితో
జ్జ్వల దివ్యాంగముతో విశాలదృఢ వ
క్షః పీఠ భాగంబుతో
బలభిద్వారణ తుండ దండ నిభమౌ
బాహుద్వయ స్ఫూర్తితో
లలనా మన్మథు దేగుదెంచునని యే
లా వ్యర్థ సంభావనల్.

ఇటువంటి పద్యాలు ఆధునిక కవులు వ్రాశారంటే త్వరగా నమ్మరు. ఆయన 'కుసుమాంజలి' 'హర్ష చరిత్రము' అంతా ఇట్లాగే ఉంటవి. ఆయన నాయికలో : గాఢ నితంబ భారలు, కుచకుంభ విజృంభణలు, పుంభావ క్రియాదక్షలు. అయితే ఏమి ? ఆరోగ్యహీనులు ఎక్కువమంది ప్రబలుతున్న ఈ రోజులలో ఆయన తెచ్చిన ఫాషనులు నిలవడంలేదు.

ఇంతలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మాలోచేరి కవిత్వములో 'ఏడుపు' ఒకటి ఫాషనులోకి తెచ్చారు. ఆయన సరిగ్గా కృష్ణమాచార్యులవారికి కవుంటర్పార్టు (Counter Part). ఆయన కృష్ణపక్షము ఎరగనివా రెవరూ ఉండరు. అయితే దానికంటె ముందు 'కన్నీరు' అనే పుస్తకము వ్రాశారు. అందులో పాటలు సర్వ సామాన్యంగా తెలుగు దేశంలో బ్రహ్మ సమాజ మతస్థులు అంతా పాడుతూ ఉంటారు. అక్కడినుంచీ కవులంతా ప్రణయంతోపాటు ఏడుపుకూడా సాగించారు. ఇప్పుడు కృష్ణశాస్త్రి చాలించినా ఇప్పటికి పత్రికలలో ఏడుపు వినబడుతూనే ఉంటుంది. పెద్దన్న ఏడ్చాడు, తిమ్మన్న ఏడ్చాడు, భట్టుమూర్తి ఏడ్చాడు, శ్రీనాథుడు ఏడ్చాడు. దేవులపల్లివారితోపాటు ఏడవని నవ్యకవిలేడు. కాని కృష్ణ శాస్త్రిగారు అందులో స్పెషలిస్టు.

"మీరు మనసారగా నేడ్వనీరు నన్ను
నన్ను విడువుడు.........

వెక్కి వెక్కి రోదింతును
ఏడ్చిపైతు నెలుంగెత్తి ఏడ్చిపైతు" అన్నాడు.

విశ్వనాథ సత్యనారాయణగారు తెచ్చిన ఒకటి రెండు ఫాషన్లు చెప్పవలె. పద్యాలలో అముక్తమాల్యదలోవలె ఎక్కడివో మారుమూల పదాలు వాడడమే కాకుండా పద్యాల నడకలలో క్రొత్త పోకడలకు విశ్వనాథవారు పెట్టిందిపేరు. సంస్కృతములోకంటె ఆంధ్రభాషలోఉన్న ప్రత్యేకతే ఇది అని ఆయన మతము. ఆ సిద్ధాంతము సరియైన దనడానికి ఆయన్ని అనేక నవ్యకవులు అనుకరించడమే సాక్ష్యము.

ఇట్లా వీరంతా భావాలు ఎట్లాఉన్నా భాష మాత్రము గ్రాంధిక భాష అనండి, కృతక భాష అనండి, ఆ భాషలో వ్రాస్తున్నారు. పూర్వాంధ్ర కవిత్వ ములో భవి కవులతోపాటు శివకవులు ఉన్నట్లుగానే ఇంకొక రకము కవిత్వము కూడా సుబ్బారావుగారి కవిత్వముతోపాటు బయలుదేరింది.

గురజాడ అప్పారావుగారు వ్యావహారిక భాషలోకూడా సరసమైన కవిత్వము చెప్పవచ్చునని తమ పద్యాలవల్ల ఋజువుచేశారు. అందుకు వృత్తాలకంటె దేశీయ మైన ఛందస్సులు అనుకూలమైనవని అవి వాడుకలోకి మొదట తెచ్చినారు. మన ఇళ్ళలో ప్రతి ముసలమ్మకూ వచ్చిన 'గుమ్మడేడే గోపిదేవీ' అనే పాట ఉన్నదే - అది 14 మాత్రలుగల మాత్రాచ్ఛందస్సు - దానికి ముత్యాల సరమని పేరుపెట్టి తేటగీతికి కొత్త పోటీ తెచ్చినారు. వారు ఇంకా ఇతర మాత్రాచ్ఛందస్సులుకూడా వాడుక చేశారు.

అమ్మలగన్నా అమ్మల్లారా
విన్నారమ్మా ఈ కథనూ
పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడ బొమ్మా పూర్ణమ్మా
కొండకి నడుమా కోనొకటున్నది
కోనకి నడుమా కొలనొక టున్నది
కొలని మధ్యనూ కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మా
ఆయా వేళల పూసే పూవులు
ఆయా వేళల అందిచ్చి

బంగరు దుర్గను భక్తితో కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా.

ఈ ధోరణిలోనే బసవరాజు అప్పారావుగారుకూడా పాటలు వ్రాయడం మొదలుపెట్టినారు. చివరకు నండూరి సుబ్బారావుగారువచ్చి శిష్ట వ్యవహార భాష లోనేకాక పని పాటలు చేసికొనే జనము మాట్లాడే భాషలోకూడా ఉత్తమ కవిత్వము చెప్పడము సాధ్యమవుతుందని 'యెంకి పాటల' వల్ల నిరూపించినారు. దానిమీద ఎన్ని గాలి దుమారాలు రేగినా, ఎవరెన్ని తిట్టినా అది నవ్య కవిత్వములో నిశ్చలంగా నిలిచిపోయింది. ఈ కొత్త ఫాషనులో ఎంతమందో 'కనికీ', అనీ 'సీతీ' అనీ ఇంకా ఏమేమో పేర్లతో ముగ్ధనాయికలను సంబోధిస్తూ పాటలు అల్లడం సాగించినారు.

అప్పటినుంచీ శివకవిత్వమూ భవి కవిత్వమూ ఏకమైనవి. ఈ నవ్య సాహిత్య పరిషత్తు వచ్చింది. ఆ పంథ, ఆ ఐక్యము శ్రీ కవి కొండల వెంకటరావు గారి శివరాత్రి ప్రభలోని పునుకుల గలగలంబూ, అజకపాలం, డొక్కు డుబు డుబుక్, అశ్శరభలతో కలిపి వినిపించారు.

అన్ని ఫాషనులలోకీ సరికొత్త ఫాషను శ్రీ శ్రీ తెచ్చినాడు. పాపము! రాయప్రోలు సుబ్బారావుగారు కష్టపడి చదివి ప్రబంధాల్లోనుంచి ఏరి తెచ్చిన కవితా సామగ్రి అంతా దూరంగా ఒక్కసారి గిరాటు పెట్టినాడు. కొత్త సామగ్రి అంతా Ultra modern కవిత్వములోనుంచి కొట్టుకుతెస్తున్నాడు. అతని 'మహాప్రస్థానము' లో కుళ్ళిన ఎముకలు ఉష్ణ రక్తకాసారము చూపినాడు. శ్రీశ్రీ తెచ్చిన కవితా సామగ్రి ఆయన కావ్యాలలోంచి వెతికి చెప్పవలసిన అవసరం లేకుండా నవకవనానికి ఏయే సామగ్రి కావాలో ఒక్కచోట కూర్చి పెట్టినాడు. 'నవకవిత' అనే కావ్యంలో—

సిందూరం, రక్తచందనం
బంధూకం సంధ్యారాగం
పులి చంపిన లేడి నెత్తురూ
ఎగరేసిన ఎర్రని జెండా
రుద్రాలిక నయన జ్వాలిక
కలకత్తా కాళిక నాలుక

కావాలోయ్ నవకవనానికి
ఘాటెక్కిన గంధక ధూమం
పోటెత్తిన సప్త సముద్రాల్
రగులుకొనే రాక్షసి బొగ్గూ
బుగులుకొనే బుక్కాగుండా
వికసించిన విద్యుత్తేజం
చెలరేగిన జన సమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి
రాబందుల రెక్కల చప్పుడు
పొగగొట్టపు ఝూంకార ధ్వని
అరణ్యమున హరీంద్ర గర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్ర విరావం
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.

గణపతిశాస్త్రి నవ్వుతూ ఇది 'శ్మశాన కవిత్వం' అన్నాడు. శ్రీశ్రీని మించుతూ శ్రీరంగం నారాయణబాబు 'రుధిర జ్యోతి' అనే కావ్యమాల వ్రాస్తున్నట్టున్నాడు. వారి 'దేశమాత' లో—

ఎండాకాలం
పగళ్ళు నెగళ్ళు
మండే రోడ్డు
కాలం కాలిన గుడ్డ పేలికై
ధూళి రేగినది
... ... ...
వీధి కాలువను బురద నీటిలో
విశ్రమించిన శ్వానాధు డొక్కడు...'

'సంక్రాంతి పండుగనాడు' అనే కావ్యములో

'కాలిన ప్రేయసి దేహం
చమురుకంపు ఈ లోకం' అన్నాడు.

'కపాల మోక్షం' అనే కావ్యంలో

భూత పిశాచాల్ బొబ్బరిల్లినవి

... ... ...

తురకల గోరీలందూ

క్రైస్తవుల సమాధులలోనూ

హిందూ శ్మశాన వాటుల

కపాలమ్ములు వికవిక నవ్వినవి.

పుణికలు పులకరించినవి

కంకాళములు ఘల్లున మ్రోగినవి

... ... ...

కపాల మోక్షం ! కపాల మోక్షం !!

ఇంతలో దేశిరాజు కృష్ణశర్మ దయ్యాల పెళ్ళిచేస్తూ-

'అర్ధరాతిరి అడవిమార్గం

ఆవులించిన అంధలోకం' అనీ

దయ్యాలు భూతాలు ప్రేత పిశాచాలు

శాకినులు ఢాకినులు కామినులు భైరవులు

బ్రహ్మరాక్షసి తండ్రి భ్రూణహత్యల తల్లి'

వీళ్ళచేత 'హెహేభాయి హాహోభాయి

అహోహం, ఒహోహం' అనిపించాడు.

'భవిష్యత్తు'లో

"చింతల్ల తోపులో జీర్ణించె తొలిపొద్దు

ముండ్లలో పొదలలో రొదతోడి సొదలలో

గుబురుకొన్నది కోర్కెకు మిగిలిపోయెను తెలివి

వల్ల కాడునపుర్రె పాటపాడింది" అన్నాడు.

ఎంత పూర్వాచార పరాయణులు కూడా ఇది కవిత్వమనక తప్పదు. ఈ బీభత్సమంతా ఏమిటని అంటారు. అయితే ఆలంకారికులందరూ రసాలు ఎనిమిదన్నా, తొమ్మిదన్నా, పదన్నా అందులో బీభత్సరసము కూడా ఒకటి అని అంగీకరించారుగా ! ఇంత మందినీ చెప్పి రుక్మిణీనాధశాస్త్రి తెస్తున్న భాషను చెప్పకపోతే అతనికి కోపంవస్తుంది. అతనూ ఈ బీభత్సకవిత్వం కొంత వ్రాశాడు. దానితోపాటు

అతను ఆధునిక కవుల parody లు వ్రాశాడు. అనగా అచ్చతెలుగులో చెప్పవలసి వస్తే కోతి కొక్కిరాయ కవిత్వమన్నమాట. ఇతరుల కవిత్వాన్ని వెక్కిరిస్తూ అనుకరణ పద్యాలు వ్రాసేదీ. వాళ్ళెవరైనా పది అంటే నలభై పెట్టేది. అందులో అతను బాకీ ఏమాత్రమూ ఉంచుకోడు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ మధ్య సామ్యవాదులను టోపీవేయడానికి కొత్త ఫాషను తెస్తున్నారు. అది 'ఆకలి'. వారు 'ఊర్వశి'ని విడిచి 'ప్రవాసము'చేసి ఇప్పుడు 'ఆకలి' చేపట్టినారు.

అయితే ఇంతమంది ఇన్ని ఫాషనులుతెస్తే సాహితీసమితి సభ్యుడవైన నీవేమి ఫాషను తెచ్చినావని నన్నడుగుతారేమో! నేనిప్పటికి ఏ ఫేషనూ తీసుకురాలేదు. కాని ఒక్కటి మాత్రము ఫాషను చేయాలని ప్రయత్నిస్తున్నాను. నేను వేదాలంటే, శాస్త్రాలంటే చెప్పకోలేదు కాబట్టి నాకు వాటిమీద ప్రమాణబుద్ధి ఎక్కువ. ఈ ప్రమాణబుద్ధి, అంటే సనాతనత్వము, ఫాషను చేయవలెనని ప్రయత్నిస్తూన్నాను. ఎదురీతగా ఉన్నది. ఈ నవనాగరపు ఫాషనులన్నీ పోగా పోగా కొన్నాళ్ళకు ఈ ప్రమాణబుద్ధి మాత్రం ఫాషను కాకూడదా అని నా ఆశ. నవనాగరికులకు మొదట వెలమవారి మీసాలూ, తరువాత తిరుపతి వెంకటేశ్వరుల కత్తెర మీసాలుగా మారి వాటిని కత్తిరించి కత్తిరించి, కోసి కోసి, చివరకు ఇప్పుడు మొత్తముమీద శుద్ధ శ్రోత్రియమైన clean shave ఫాషనులోకి రాలేదా? అట్లాగే ప్రమాణబుద్ధి మాత్రము ఏ కాలానికో ఫాషను కాకపోతుందా?

కవిత్వమంటే కొత్త కొత్త ఫాషనులు తీసుకురావడమేనా? ఎన్ని ఫాషనులు మారినా నిశ్చలంగా ఉండే ధర్మము ఏదైనా ఒకటి కవిత్వానికి ఉన్నదా! అటువంటి ధర్మం ఉన్నదంటే యెవరి కవిత్వములో యెంత ఉన్నది?

పాశ్చాత్య దేశాలలో ఏదోఒక కొత్త ఫాషను తెస్తేనేకాని పుస్తకం బాగా అమ్మకము కాదు. పుస్తకము అమ్మకము కాకపోతే కవికి జీవనోపాధి ఉండదు. కాబట్టి ప్రతికవీ ఏదో ఒకటి కొత్తది సమకూర్చాలి. రసవంతంగా చెప్పినాడా లేదా అనికాదు వారు వేసేప్రశ్న. ఏమి కొత్తది అమర్చినాడు? అని ప్రశ్నిస్తారు. అందువల్ల నవనాగరికులు పాదాలతో నడవడం చాలించి పాదరక్షలతో నడుస్తూ ఉంటే, అతి నవనాగరికులు తలకిందా కాళ్ళపైనా పెట్టి శీర్షాసనంతో నడవవలసి వస్తున్నది. పాశ్చాత్యులు పుస్తకాల అమ్మకము కోసము ఏదోవిధంగా కొత్తకోసము దేవులాడుకోవలె. అయితే మన అదృష్టంచేత మనకా కర్మంలేదుగా! మనము

వ్రాసే పుస్తకాలు విరివిగా కొనేవాళ్ళు మనదేశంలో లేరు. క్రొత్తగావ్రాసినా పాతగా వ్రాసినా, మెచ్చుకొన్నా తిట్టినా, మన కవులు వ్రాసే పుస్తకాలు ఖర్చుకావు. వేరే జీవనోపాధి లేకపోతే పస్తుపడుకోవలసిందే ఇంతమంది నవ్యకవులు తమ పుస్తకాలు అచ్చువేసినారుగదా ? ఒక్కరైనా అచ్చుఖరీదు పుస్తకాల అమ్మకమువల్ల వసూలు చేశారూ ?

ఎట్లా వ్రాసినా కొననిదానికి ఈ అవస్థలెందుకు ? అవసరము లేకపోయినా నూతనత్వము కోసము దేవులాడడ మెందుకు ? కవిత్వములో జీవమనండి, రసమనండి అది ఉంటే చాలదా ?

[ ప్రతిభ ]

# నరుడు - నారి

—శ్రీమతి లత

రసికులైనవారు రమణుల కొకవేళ
వంగు టదియు ధర్మ వర్తనంబు
విల్లు నారికెపుడు-పేర్మిమై వంగదా ?
చిత్ర జాతరూప సింగ భూప.

విల్లు నారికీ, నరుడు నారికీ ఒంగుతూనే ఉంటారు. సామాన్యంగా స్త్రీ అంటే పురుషుడికీ, పురుషుడంటే స్త్రీకీ ఆపలేని వాత్సల్యంతోపాటు, అవధుల్లేని అనుమానంకూడా అధికంగానే ఉంటుంది. "బాబోయ్ ! స్త్రీ !" అని పురుషుడూ, "మగవారినిలా నమ్మరాదే చెలీ" అని ఆడదీ అనుమానం పడుతూనే ఒకరి నొకరు ప్రేమిస్తూ ఉంటారు.

అసలు మానవుని ఆంతర్యంలాంటి విచిత్ర పదార్థం మరోటి కనపడదంటే అతిశయోక్తికాదు. ఊపిరి పీల్చడం ఎంత సహజమో అన్యోన్య ఆకర్షణకూడా అంతే. ఊపిరి పీల్చి బ్రతకటంలో ఎంత హాయి ఉందో అన్యోన్యం ఆధారపడటంలో కూడా అంతే హాయి ఉంది. అలా కాకుండా 'స్త్రీ అంటే నమ్మకద్రోహి' అని పురుషుడూ, పురుషుడంటే మోసగాడని స్త్రీ అభిప్రాయం ఏర్పరచుకుంటే మానవ సమాజమే నరక ప్రాయమౌతుంది. అందులో తనచుట్టూ తాను ఊపిరి ఆడకుండా నిర్మించుకున్న అనార్కలీ సమాధి లాంటి ఈ సమాజంలో మాత్రం నమ్మకం లేకపోతే సుఖమేలేదు.

అసలు సుఖమనేది ఔన్నత్యమనేది మనసులో ఉంది. ఏది మంచి ? ఏది చెడు? అనే వాటికి సరిహద్దు గీతలుకూడ మానవుని మనసులోనే ఉన్నవి. ఒకరికి మంచిగా ఉన్నది మరి ఒకరికి చెడుగా ఉండవచ్చును. ఒకరికి అనుసరణీయమైన ఆచారం మరొకరికి వర్జనీయంగా కనపడవచ్చును.

రసికులూ రమణీమణులూ ఒకరి నొకరు సందేహించటం అంత మంచిది కాదు. పెళ్ళి ఫోటోలో ఒకరి ప్రక్క ఒకరు చిరునవ్వు నవ్వుతూ చూచేవారికి

వీరిద్దరికీ ఇతర ప్రపంచం బొత్తిగా కనబడటంలేదు గావున పాపం అనిపించేంత అన్యోన్యంగా ఫోటో తీయించుకుంటారు. అంతే, ఆ ఫోటో తీయించుకుంటున్న సమయం అయిదునిమిషాలూ అయిపోయిన తర్వాత కొన్నాళ్ళవరకూ అదోవిధంగా ఉంటుంది వ్యవహారం. ఆ తరువాత అయ్యగారు విసుక్కోవటం అమ్మగారు ఏడవటం. ఆ పైన మావాళ్ళు నాగొంతుకుని కోశారని రమణి. మావాళ్ళు నాపీక కత్తిరించారని రమణుడూ విలక్షణంగా శోకాలు పెట్టడం. ఆ తరువాత 'ఛీ' 'ఫో' అనుకోవడం.

ప్రస్తుత నాగరికతలో రసికులూ, రమణులూ ఈ విధంగా నైనా ఉంటారు గాని ఇంకో విధంగా మార్పు చెందుదామని వారు కలలోనయినా అనుకోరు. అదే తమాషా మునిమాణిక్యం నరసింహారావుగారు వ్రాసినట్లు ప్రతిఇల్లాలూ కాంతంలాటి దయితే బాగానే ఉంటుంది. కాని అలాకాదు మరి. ఎన్ని వ్యాసాలు వ్రాసినా, ఎన్ని ఉపన్యాసాలు దంచినా దాంపత్య జీవితంలో లోటు దంపతులు పూడ్చుకోవలసిందే కాని వ్యాసాలవల్లా కథలవల్లా ఈ షణ్మాత్రమూ ప్రయోజనం లేదు.

అనువుగాని మనువూ మనసులేని సొగసూవృధా. ఆ రెండూ ఉన్నప్పుడు దరిద్రమూ ఈతి బాధలూ అంత బాధించవనుకుంటాను. అప్పుడు రసికుడు రమణికి వంగినా, రమణి రసికునికి దాసోహమన్నా కావ్య నాయకీ నాయకులే అవుతారుగాని అపహాస్యాలపాలు కారు. ఎంత దంపతులయినా ఇంకెంత ప్రేమ జలధిలో మునిగి తేలుతున్నా కొన్ని సరిహద్దుల్లోనే వారు రాణిస్తారు గాని ఆ గీతలు దాటితే ఏ ఒకరికీ సుఖంలేదు.

ఒకరిమీద ఒకరికి అధికారంకూడా పరిమిత మయితేనే మంచిది. అధికారం చేసి హక్కులు నిలబెట్టుకోవాలనుకొనే వారికి ఏనాడూ సుఖం ఉండదు. ఎవరి పరిధులు వారు అధిగమించకుండా ఉంచేనే ఆ ఎదుటివారికి ఏర్పడిన ప్రేమా గౌరవమూ సహజంగానే అధికమవుతవి. అందుకేం సందేహంలేదు. అలా కాకుండా ఒకరినొకరు వంచాలని ప్రయత్నిస్తే జీవిత ధనుస్సులో నారి తెగిపోతుందని మాత్రం మరచి పోవద్దు.

(ఊహాగానం – ఆంధ్రప్రభ)

# మతిమరపు

—శ్రీ అప్పజోడు వేంకటసుబ్బయ్య

మానవుని నిత్యజీవితములో తరచుగ తటస్థించువానిలో మతిమరపొకటి. ఈ మంచుతెర మనస్సునందలి విషయముల మరగుపరచును. మతిమరపను మంచుతెరకు విషయస్ఫురణ సూర్యోదయము.

తలగోకికొనుట మతిమరపునకు మొదటి గుర్తు. మొగము ముడుచుట, బొమను ముడివేయుట, పెదవికొరికి ఆలోచనా ముద్రవేయుట-మొదలగునవన్నియు మతిమరపును దెలుపు అనుభావములే. ఈ అనుభావములకు ప్రభావము లేకపోలేదు. ఒక్కసారి తలను గోకగనే కొందరికి మరచినమాట మతికివచ్చును. మరి కొందరికి తలతాట లేచినను మాటమాత్రము మతికిరాదు. అలవాటునుబట్టి ఈ అనుభావములకు ప్రభావముండును.

మానవునకు మరపుగలుగుట సహజము. తెలిసిన విషయములనన్నిటిని అన్ని తరుణములందును జ్ఞాపకముంచుకొనలేము. అట్లుంచుకోగలిగిన వాడు మానవుడు గాడు-అతడొక దివ్యుడైనను గావలెను లేక యంత్రమైనను గావలెను. జ్ఞాపకశక్తికి కొన్ని హద్దులున్నవి. ఆ హద్దులలో తరతమ భేదముండును గాని, హద్దేలేని బుద్ధిబలము ప్రకృతి విరుద్ధము.

మెదడులేని విషయము లధికమగుట, మానసికమైన సోమరితన మేర్పడుట, మెదడునకు గ్లాని కలుగుట, చిత్తమున కేకాగ్రత చెదరిపోవుట, ఏ విషయముననో ఏకాగ్రత ఎక్కువగుట - మొదలగు వానిని మతిమరపునకు కారణములుగా చెప్పకొందుము.

మతిమరపునకు, మేధావులు ప్రేమికులు ప్రపంచమున పేరుపొందినారు. "అయ్యో! మరచితి"నని ఆవేదనపడు వానిని, 'అది మేధావి లక్షణ'మని ప్రక్కవాడు పరిహసించుట మనకు పరిచయమైన విషయమే! మహా మేధావియైన న్యూటను, ప్రయోగశాలలో పనిచేయుచుండగ మిత్రుడొకడు వచ్చి పలుకరించి నాడట. న్యూటను పలుకలేదట. ప్రయోగములో నిమగ్నుడైన న్యూటను పలుక

కుండుటలో వింతలేదు. భోజన సమయము మించిపోవుచుండ, న్యూటను కొరకు తెచ్చిన భోజనము నా మిత్రుడు తిని, స్థిమితముగ కూరుచున్నాడు. కొంత సేపటికి న్యూటను వచ్చి, ఎప్పుడు వచ్చితివని మిత్రుని పలుకరించి, ఖాళీగిన్నె చూచి నవ్వు కొని "మిత్రమా నా మతిమరపు చూచితివా, పంపిన భోజనము నెప్పుడోతిని, మరల గిన్నె వెదకుచున్నా"నని, పలుకుచు కూరుచున్నాడట. ప్రక్కనున్న మిత్రుడు ఫక్కున నవ్వి "ఆ భోజనము ముగించినది నీవుగాదు, నే''ననినాడు. "అలాగా" అని న్యూటను తెల్లబోయినాడట. ఏ ఆలోచనలోనో మునిగి అగ్గిపుల్లను నోటనిలిపి, సిగరెట్టుతో పెట్టె గీచి-గీచి పాడుపుల్ల మండలేదని పారవేయు 'ప్రొఫెసరు' లుండకపోరు. కొందరు ప్రొఫెసరుల నిత్యపరిశోధనలో, ప్రధానభూమిక వహించు నది కళ్ళజోడు వేట. కొందరు పండితులు, పరమపదము నన్వేషించుట దేవుడెరు గునుగాని, పొడుముపెట్టె నన్వేషించుట మాత్రము ప్రసిద్ధము. అట్టిది మేధావుల మతిమరపు.

ఇక ప్రేమికులు. ప్రియురాలిని ప్రియుడు, ప్రియుని ప్రియురాలు, ఎదుట చూచినపుడుగాని ఎదలో ఊహించుకొన్నపుడుగాని, స్వప్నసీమలలో విహరించుట జగద్విదితము. అట్టివారిలో పరధ్యానము పిలిచిన పలుకును. ఇట సామాన్యుల సంగతికంటె రాధాకృష్ణుల స్థితినిదెలుపు శ్లోకమొకటి చెప్పదగినది.

"రాధాపునాతు జగదచ్యుత దత్తచిత్తా
మంథాన మాకల యతి దధిరిక్త పాత్రే
తస్యాస్తన స్తబక చంచలలోల దృష్టిః
దేవోపి దోహనధియా వృషభమ్ నిరున్ధన్."

ఈ ప్రేమికులలో ప్రదర్శింపబడినది మరపుయొక్క విశ్వరూపము గాని వేరుగాదు.

మతిమరపులోని చిత్రములు చాలమందికి పరిచయమైనవే. సంవత్సరము మారినపుడు జాబులలో, తేది, నెల, తప్పులేకుండ పడినను ప్రక్కనే పాత సంవత్సరము పదిరోజులైన పడకమానదు. జాబు వ్రాయదలచి మరచిపోయి మరు నటిజాబులో, 'జవాబు రాలేదని' మిత్రునితో నిష్ఠురములాడుట, వ్రాసిన జాబు పుస్తకములో పదిరోజులు భద్రపెట్టి తేదీ మార్చకయే 'తపాలుపెట్టె'లో వేయుట, పెట్టెలో పడవేయదలచి, జేబులో జాబుపెట్టుకొని, పగలంతయు తిరిగి, రాత్రిపూట చొక్కావిప్పటలో జారిపడిన జాబును చూచి సిగ్గుపడుట-తరచుగ జాబుల పట్ల

తారసిలు మతిమరపులు. తాళపుచెవి కొరకు ఇల్లంతటిని గాలించి, అడిగి అడిగి అందరిని విసిగించి, ఎట్టకేలకు నడుము తడవుకొని లేక జేబుచూచుకొని నాకడనే యున్నదని నవ్వుకొనుట నిత్యజీవితములో చాలసార్లు చూడనగును. అప్పుడప్పుడు త్రోవలో ఇద్దరెదురు పడుదురు. అందొకడు నోట 'సిగరెట్టు' నిలిపి ఆవలివానిని అగ్గిపెట్టె అడుగును. అతడిచ్చిన అగ్గిపెట్టెతో 'సిగరెట్టు'ను ముట్టించుకొని, ప్రక్క జేబులో ఆ పెట్టెను పడవేసికొనుచు 'పోయివస్తా'నని బయలుదేరును. ఇచ్చినవాడు "అగ్గిపెట్టె..." అనగానే-"అయ్యో! మరచితి"నని అందిచ్చి తెల్లమొగముతో తొలగిపోవును. అడుగుట బాగుండదని అగ్గిపెట్టె వదలుకొను ఉదారులు కూడ ఉండకపోరు. కొందరు పోస్టాఫీసుకడ, సంతకము చేయుటకు ప్రక్కవానిని 'పేనా' అడుగుదురు. సంతకముచేసి జేబులో పెట్టుకొని చకచక సాగిపోవుదురు. ఇచ్చినవాడిక లాభములేదని "పేనా..." అని నోరుతెరచి అడుగగనే "సారీ'' అనుచు చేతికిచ్చి సాగిపోవు ప్రబుద్ధులు కొందరు. 'రైలుబండి'లో పయనించుచు ఎదుటనున్న అందగత్తెమీద ఏకాగ్ర దృష్టితో, దిగిపోవునపుడు చెప్పులు మరచి, కాలు చుఱ్ఱుమన్నపుడు చింతించువారు కొందరు. ఆ తదేకధ్యానమున దిగవలసిన ఊరు దాటి ప్రక్కఊరుచేరి పరితపించువారు మరి కొందరు.

ఇట్టి మరపులు శతసహస్ర సంఖ్యాదికములు. పై మతిమరపులన్నింటిలో పరిహాసమున్నది కాని ప్రమాదము లేదు. కొన్ని మరపులు కొంపలు ముంచును. గొప్ప ఉద్యోగమునకై దరఖాస్తుపెట్టి, పరిశ్రమించి దానినిపొంది, అందు ప్రవేశించవలసిన రోజు మరచినచో బ్రదుకుతెరువు పాడగును.

మతిమరపు నడుపులో పెట్టువానిలో 'డైరీ' వ్రాయుట, పునశ్చరణ ప్రధానములు. దైనిక జీవితములో ముఖ్యమైన విషయముల మరువకుండ ప్రతిదినము వ్రాసియుంచునది డైరీ. అటు జరిగిపోయిన విషయములను, ఇటు జరుగవలసిన విషయములను, అది కడుపున బెట్టుకొని కాపాడుచుండును. విప్పిచూచిన వ్యక్తికి, అవి స్ఫురణకు వచ్చును. 'డైరీ' వ్రాయుట మతిమరపునకు మానుడుమందు. జ్ఞాపకశక్తికి దీపిక. 'డైరీ' వ్రాయుట దినచర్యలో నొక భాగమగుట వాంఛనీయము. నిత్యము 'డైరీ' వ్రాయువ్యక్తి విషయములు మరచిపోవుట కవకాశము లేదనుమాట నిజమే గాని, 'డైరీ' వ్రాయుటయే మరచిపోవు మహాత్మునిగూర్చి మనమేమి చెప్పగలము?

పునశ్చరణ అనగా అనుకొనిన దానినే అప్పుడప్పుడనుకొనుట. స్నేహితుడు రైలుకు వచ్చురోజున 'స్టేషను' కేగదలచి, మరచిపోవుట మక్కిలి తరచుగ

జరుగును. మూడునెలల పిదప పదవతేదీ మిత్రుని కలియుటకై 'మెయిలుబండి' కడకు పోవలసియున్న, ప్రతినెల పదవతేదీ ఆ విషయము నొక్కసారి ప్రస్తావించు కొన్నచో మరచిపోవు ప్రమాదము తగ్గిపోవును. కొన్ని యెడల విషయమునెంత జపముచేసినను, మార్గమధ్యమున మతిమరపు ప్రవేశించకపోదు. "అణాకు బెండ కాయలు, బేడకు దొండకాయల"ని కూరగాయల అంగడివరకు జపముచేసి, చివరకు మరపుతో అణాకు దొండకాయలు బేడకు బెండకాయలు బేరమాడి తెచ్చుట, అసాధారణమైనను అసంభవము మాత్రము గాదు. ఇంత జపముచేసినను మార్గ మధ్యమున ఏ తగవులాటయో కంటబడిన, ఆ జపములోని విషయములు తెలియ కుండగనే తారుమారుకాగలవు. సామాన్యముగ మతిమరపు అప్రధాన విషయముల పట్లనే అధికముగ నుండును.

అందుచే అప్రధాన విషయములను ప్రధాన విషయముల కనుబంధములుగ గుర్తుపెట్టుకొన్నచో వానిని మరచిపోవు అవకాశము తక్కువగును. అన్నము తినుట కనుబంధముగ నుంచుకొన్నచో మందు త్రాగుట మరచిపోము. అటులని, అన్నముతిని, ఆయాసముతో పడకగదిని ప్రవేశించి, మందు త్రాగుటను మరచు వారుండరని భావముగాదు. కాగా హృదయమును కదిలించిన సన్నివేశములు మరపురావు. సన్నివేశ మెంత చిన్నదైనను మనస్సుమీద నది వేసిన ముద్రను బట్టి మరపు దూరమగును. అంతేగాక, అభిరుచి అధికముగ నున్న విషయములలోగూడ మరపు ప్రవేశింప లేదు. ఇందుకు నేటి విద్యార్థులను ఉదాహరింపవచ్చును. కొందరు విద్యార్థులు, సినీమారంగ మందలి నటీనటీనటుల పేళ్ళను, వారిపుట్టు పూర్వోత్త రములను ఒక్క పొరపాటు లేకుండ వల్లింపగలరు గాని శాకుంతలము నెవరు వ్రాసిరో చెప్పలేరు. మరికొందరు ప్రపంచమున ప్రసిద్ధులైన 'క్రికెట్టు' ఆటగాండ్ర చిరునామాలు, వారు ఒక్కొక్క పందెమున ఎన్ని పరుగులు చేసినది, అరచేత అగుపించినట్లు చెప్పగలరుగాని, ఆటవెలది గణము లెవ్వియో చెప్పలేరు. అభిరుచికి మరపుమీద అంత ప్రభావమున్నది. చరిత్ర నభిమాన విషయముగ చదువువాడు అందలి తేదుల నన్నింటిని తప్పులేకుండ తెలుపగలడు గాని, లెక్కలలో ఒక్క సూత్రమునైన సక్రమముగ చెప్పలేడు. రసాయనిక శాస్త్రముపై అభిమాన మున్న వాడు, అందు పదార్థ ధర్మములను, వాని ప్రభావములను పేర్కొన గలడు గాని, చరిత్రలో గాంధీ పుట్టిన తేదీని గుర్తుపెట్టుకొనలేడు. ఈ చరిత్రనుగాని, రసాయనిక శాస్త్రమును గాని హృదయ పూర్వకమైన అభిమానముతో అభ్యసించినపుడే అందలి

సంగతులు స్మృతిలో నుండును. విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన అభిమాన విషయముల జాబితాలో నిది సులభమైనదని చదువు వానితో ఈ మతిమరుపు మైత్రి చేయక మానదు.

కొన్నియెడల మరపు స్వభావమునకు సూచిక. ఒకడు పరుల యందలి మంచిని మరచిపోయి చెడ్డ మాత్రము జాగ్రత్తగ గుర్తుంచుకొనును. మరొకడు ఇతరులందలి మంచిమీద దృష్టి నిల్పి చెడుగును గూర్చి మరచి పోవును. దీనిని బట్టి మొదటి వానిది దోమ తత్త్వమనియు, రెండవ వానిది తుమ్మెద తత్త్వమనియు తెలియగలదు. దోమకు మురికి మీద మక్కువ. తుమ్మెదకు తేనేమీద మోజు. కొందరు తామీయవలసిన బాకీలను మరచి పోవుదురు. తమకు రావలసిన వానిని తలచుచుందురు. మరికొందరు రావలసిన వానిని విస్మరించి, తామీయవలసిన వాని పట్ల తహ తహ లాడుదురు. అప్పుడప్పుడు కొందరు కావలెనని మతిమరపు నభినయింతురు. పెద్ద కాలముగ పరిచయమున్నవాడుగూడ మిత్రులతో గలిసి ఎక్కడో ఎదురుపడి "నిన్నెక్కడో చూచినట్లున్నదే" అని నొసలు ముడిచి ప్రశ్న వేయును. ఆ యభినయమున తన ఆధిక్యమును ప్రదర్శింపబోవును. ఎదుటివాడు గడుసరియైన "నేను గుర్తులేనా- క్రిందటిఏడు కల్లంగడికడ కలిసితిమిగదా" యన్నచో ఆతని జన్మలో నట్టి మతిమరపు మరలరాదు. పై విషయములన్నింటిలో సామాన్యముగ లౌకికమే ప్రధాన భూమిక వహించిన మతి మరపునకు గూడ తావులేక పోలేదు.

మతిమరపు కేవలము తూలనాడ దగినదికాదు. అది మేధావి లక్షణమను మన్ననను పొందినది. అంతేగాక మతిమరపు కొన్ని విషయములలో అనుగ్రహించు టయే అదృష్టమగును. అట్టి వానిలో అవమానము మొదటిది అభిమానవంతునకు తలవంపు స్ఫురణకు వచ్చినపుడెల్ల అతని హృదయము మండుటెండకు పంట భూమివలె బీటలువారును. ఆ వ్యక్తి ఉత్సాహమున కా తలవంపు వేరు పురుగు; అభివృద్ధికి గొడ్డలిపెట్టు. అట్టి అవమానములపట్ల మతిమరపు అపేక్షింపదగినది. విఫలమైన ప్రేమపట్ల విస్మృతి మంచిది. కాగా, మిత్రుడుగాని, మరొకడుగాని, తాను చేసిన తప్పు తెలిసికొని పశ్చాత్తప్తుడై మన్నింపుమని ప్రార్థించినపుడు క్షమిం చుట ఉత్తమము. క్షమించిన మరుక్షణమున ఆతని తప్పునే మరచుట ఉత్తమోత్త మము. అట్టి మరపు మనస్సుల కలుపగలదు. మైత్రిని పెంచగలదు. ఇంతేగాక, పెదవిదాటినచో ప్రాణాంతకమై, ప్రయోజన శూన్యమైన రహస్యము, తనదైనను

ఎదుటివాని దైనను వెంటనే మరచిపోవుట మంచిది. చెప్పగూడదని ఎంత జాగ్రత్త పడినను అది గుర్తున్నచో, చిచ్చును కప్పియుంచి నట్లగును గాని చల్లార్చినట్లు గాదు. ఏ దుర్ముహూర్తమున నైనను అది దహింపక మానదు. మరచిపోవలసిన వానిలో దానముకూడ చేర్చదగినదే. దానములలో గుప్తదానము గొప్పదనిపించుకొన్నది. ఇచ్చి మరచిన దానము ఇంకను గొప్పది. ఇట నొక్క విషయమును మరువరాదు. కొన్ని విషయముల పట్టుబట్టినను మరచుట మహాకష్టము. మరచుట సాధ్యమనిగూడ చెప్పజాలము. కాని అట్టి విషయములనుండి హృదయమును విముఖము చేయు కృషియే కోరదగినది.

కొందరి మతిమరపు ప్రక్కవారికి రక్షయగును. అట్టివారిలో అధికారులొకరు. తమ తప్పులపట్ల ఉన్నతాధికారులకున్న మతిమరపు, తక్కువ ఉద్యోగస్థులకు వర ప్రసాదము. ఆ మతిమరపు గుణముల పట్ల యుండెనా అభివృద్ధి కాటంకము. క్రూరములైన మృగములకు, క్రూరులైన మానవులకు మరపున్నచో, అది మానవ జాతికే శ్రీరామరక్ష.

(వ్యాసమంజరి)

# కిళ్ళీ కొట్టు

*—శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి*

**కి**ళ్ళీకొట్టు మన భారతదేశములోని ప్రతి గ్రామములోనూ ఉండును. అది కొండొకచో వీధి మలుపున ఉండును. మలుపులో చింతచెట్టు లేదా నిద్ర గన్నేరు చెట్టు ఉండును. ఆ చెట్టు చిగుర్ల కొంగలుండును. దిగువన కిళ్ళీకొట్టు. కొట్లో కొండొకచో వయస్సు ముదిరిన ఆడది, గుళ్ళో విగ్రహంలా, బలసిన చిలకలా, చలికాలంలో రగ్గులా, పేదవాడి కంట్లోని పర్మనెంటు కలలా, గుమ్మటంలా కూర్చొనుట కద్దు.

ముదిరిన ఆడది కానిచో, వయస్సు ముదరని పాతికేళ్ళ వయసుకాడయినను ఉండవచ్చును. అట్టివాడు జుట్టంతా నీటుగా ఎగదువ్వుకొనును. నుదుటిమీంచి వెనక వరకూ ఆ జుట్టు పొడవు పరహా రంగుళాలుంటే, అతని నుదుటి వెడల్పు మాత్రం అంగుళమున్నరే ఉండును. మొత్తం మొహంఅంతా చిన్న నూనె గరిట అంతే ఉండినను, అది అంతయు జిడ్డుగ నుండును. అతను తలకి రాసుకున్న నువ్వులనూనె అంతా గిన్నెలోకి పిండితే పావలా ఖరీదునూనె జుట్టునిండా మిగిలిపోగా మరో పావలా ఖరీద్ది గిన్నెలోకి దిగును. అతని జుట్టు ఎవరిదో పెద్దమనిషిది తెచ్చి తగిలించినట్లూ, అతని నిక్కరు అతని చిన్న తమ్ముడిది తెచ్చి తొడిగినట్లూ ఉండును.

ఇలా పెద్ద స్త్రీయో చిన్న పురుషుడో కూర్చుండే కిళ్ళీకొట్టు ఇంకా ఎట్లుండుననగా – కొంగల రెట్టలు కాతాదార్లమీద పడకుండా కొట్టుముందు చల్లని పందిరి యుండును. కాతాదార్లంతా చెట్టునీడకింద కొట్టు (దగ్గిర పందిరి) నీడకింద డబుల్ నీడలో హాయిగా కూర్చొందురు. కూర్చొని, కొట్లోని సీసాలవైపూ సీసాలలోని రకరకముల వస్తువులవైపూ, వస్తువులతో బాటు సీసాలలో శాశ్వత నివాస మేర్పరచుకొనిన ఈగలవైపూ తన్మయ స్థితిలో చూచుచుందురు. ఇప్పట్టున ఒక గమనిక – మానవుడు ఈ లోకంలో ఎవర్ని ప్రేమించినా ప్రేమించకపోయినా తనని తాను ప్రేమించుకుంటాడు. అందుచేతనే అద్దాల్లేని కొట్లకంటె అద్దాలున్న కిళ్ళీకొట్లకి

ఎక్కువ బేరాలుంటాయి. ఆ అద్దాల్లో కాతాదార్లు తమతమ అందాలని తిలకించుకొని తనివి తీర్చుకొంటారు. పందిరికింద హాయిగా కూర్చొనేందుకు వీలుగా రెండు కొయ్యబల్లలు ఉండుటయు, ఆ బల్ల లెప్పుడూ చాలా బిజీగా యుండుటయు సర్వ సాధారణమైన విషయము.

అట్టి కిళ్ళీకొట్టువద్ద మీరు మిఠాయి లేక మసాలా కిళ్ళీలు మీ ఇష్టానుసారము కొనవచ్చును. కిళ్ళీకొట్లవద్ద కిళ్ళీలే కాకుండా జాడీబీడీలున్ను, వాచి సిగరెట్లున్ను కూడా అమ్మకము చేయబడును. మీరు చిన్నవారైనచో అవి అక్కడ కొనుబడి చేసుకొని ఇంటిలో తెలియకుండా అక్కడనే కాల్చుకొనవచ్చును. అగ్గిపెట్టె కావలసి వచ్చినచో అదికూడా కొనుబడి చేసికొనవచ్చును. లేనిచో కాలే చేంతాడుకాని, మండే దీపపుబుడ్డికాని, మీ కక్కడ నిప్పుకి కొరత లేకుండ సిద్ధముగా లభించ గలవు.

మీకు దాహము కలిగినచో కిళ్ళీకొట్టువద్దకు పొండు. అచ్చట మీకు అల్లి కాయ సోడాలే కాకుండా, లెమనుసోడాలే కాకుండా రకరకాల రంగుబుడ్లు దొరక గలవు. అవి త్రాగినచో మీ దాహబాధ తీరగలదు. మీకు తక్కువ డబ్బులుండి ఎక్కువ ఆకలి వేయుచో అప్పుడుకూడా మీరు కిళ్ళీకొట్టువద్దకే పొండు. అచ్చట మీకు పండిన అరటిపండ్లు మెండుగ లభించును. అవి తినినచో మీ ఆకలి తీరును. అరటిపండ్లు తినుచూ నంజుకొనుటకుగాను మీ కచ్చట గాజు సీసాలలో భద్ర పరచిన కొబ్బరుండలు, ఎర్ర పంచదారుండలు, స్ట్రాంగు పెప్పరమెంటులు, చాక లేటులు వగైరాలు విరివిగ లభింప గలవు.

రౌడీ మూకలతోచేరి మీకు తలలు బ్రద్దలు చేసుకొనవలెనను తలంపు కలిగి నదా ? వెంటనే కిళ్ళీకొట్లవద్దకు పొండు ! పొండు ! అచ్చట దొరకు సోడాబుడ్లను దొరకబుచ్చుకొని వాటిని మిక్కిలి చక్కని మారణాయుధమువలె మీరు ఉపయో గించుకొనవచ్చును. మీకు దెబ్బ తగిలినదా ? వెంటనే కిళ్ళీకొట్టువద్దకు పొండు. ఆలసింపకుడు. అచ్చట సోడాతో దెబ్బను శుభ్రముగా కడిగికొని, కాచు కలిపిన సున్నము పూసుకొన్నచో మీకు తగిలిన దెబ్బ త్వరితముగా మానగలదు.

మీకు బ్రహ్మానందము కావలెనా ? పిరికితనమనే జ్వరమును మీరు పోగొట్టు కొనుటకున్ను, కష్టాల విషబాధలను మీరు దులుపుకొనుటకున్ను, మీ దేహమునకు విశ్రాంతి, మీ మనసుకు ఉల్లాసమూ కలిగి మీకు బ్రహ్మానందము సిద్ధించుటకున్ను అనువుగా మద్యపానపు శాఖవారి రహస్యానుమతిపై కొన్ని కొన్ని ప్రత్యేకమైన

కిళ్ళీకొట్లవద్ద ఒకటవరకం వంటసారా సరసమైన ధరకు మీకు లభింపజేయ బడ గలదు. మీకు స్త్రీ వాంఛ ఉన్నచో...... మీకు స్త్రీవాంఛ యున్నదా ? చిత్తము చిత్తము ! సంగతి గ్రహించితిని. మీకు వాంఛ అధికమై కంపెనీలు దూరమై భార్యలుగాని, ఏతచ్ఛమాన చారికలుగాని కరవైనప్పుడు మీరొక ఆడ కిళ్ళీకొట్టు పరిచయ భాగ్యమును ముందుగానే సంపాదించుకొని యున్నయెడల మీకు సంభవించిన తాత్కాలిక కష్టదశ నిమిషములో కడతేరిపోవునే !

మీరు కళాకారులా ? మీకు సౌందర్యాపేక్ష కలదా ? మీరు ఇంకెక్కడకూ పోకుండ కిళ్ళీకొట్లవద్దకు పోండు. కిళ్ళీకొట్లలో పటములుకట్టిన క్యాలెండర్ల బొమ్మలలో రంగు రంగులుగా పొందిన స్త్రీ సౌందర్యమును మీరు కనులారా గ్రోలి, ఆనందించి ఆ సౌందర్యమునకు మించిన సౌందర్యము, భూ ప్రపంచములో లేనే లేదని గ్రహించగలరు !

మీరు భక్తులా ? మీకు భగవంతుడు కావలెనా ? మీకు భక్తియే కావలెనా ? మీకు భక్తియే కావలెనన్న అది కిళ్ళీకొట్లవద్ద మెండుగ లభించు ముఖ్య పదార్థములలో నొకటికదా ! మళయాళపు కిళ్ళీకొట్లయందు గురువాయూరు సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని మీరు దర్శించగలరు. కన్నడపు కిళ్ళీకొట్లయందు శాంత సాయిబాబాను మీరు కనులార గాంచగలరు. అరవయ్యరు కొట్టునందు మధుర మీనాక్షినిగాని, రామేశ్వరునిగాని ప్రాంతీయపు ఆరుముగమునుగాని మీరు వీక్షించగలరు మహమ్మదీయుల కిళ్ళీ కొట్టయినచో పటముకట్టిన కురాను సూక్తులు మీరు చదువ గలిగినచో చదువుకొనగలరు లేదా నయనానందకరముగ కాంచగలరు. ఇవి యేవియును గాక, 'జాను దెనుంగు' కిళ్ళీకొట్టే అయినచో శ్రీ వేంకటేశ్వరునిగాని, సింహాచలాధీశునిగాని, అన్నవరం సత్తెన్నారాయుడినిగాని, కాళహస్తీశ్వరునిగాని, కనక మహాలక్ష్మి, కనకదుర్గనుగాని, ముమ్మడివరపు బాలయోగి వారినిగాని మీ తనువు పులకింప, మీ డెంద ముప్పొంగజూచి, ఆ మేరకు మీ పాపములను కడతేర్చుకొని ఆపాటి పుణ్యమును మీరు మూటగట్టుకొనగలరు.

ఈ లోపున మీ రొక సోడాత్రాగి, ఒక కిళ్ళీ బిగించి ఒక సిగరెట్టు అంటించి కనులు కాయలు కాచేలా సిటీ లేక రూటు బస్సుకొరకై వెయిటు చేయవచ్చును. రాత్రివేళలందు మీరు కిళ్ళీకొట్లవద్ద బ్రాకెట్టు చీట్లు వ్రాయించుకొనవచ్చును. పోస్టాఫీసులు మూసిన ఏ సమయమందైననూ హెచ్చు ధరలకు, కవర్లు కార్డులు స్టాంపులు అన్నియును మీరు లభింపజేసికొనవచ్చును. అర్ధరాత్రి సమయములో లాడ్జింగు

హావుసులోని మీ తాత్కాలిక ప్రేయసికి ఎమర్జంటుగా తోముడుసబ్బు, పౌముడు పౌడరు, వాసన్నూనె, రబ్బరుపన్నె, సిగపిన్ను ఇత్యాదులు కావలసి వచ్చినచో మీరు లాడ్జిబోయ్‌ని కిళ్ళీకొట్టువద్దకు తగిలినచో అవి యన్నియుకూడా అధిక ధరలకు అచ్చట లభించగలవు.

ముక్కుపొడుము, పొగచుట్టలు, వార పత్రికలు, బూతు చిత్రములు, తల నొప్పి మాత్రలు, వక్కపొట్లములు, దారపుండలు, పండ్లపొడులు వగైరా వగైరాలు కావలయునన్నచో సరసమైన ధరలకు అవికూడా కిళ్ళీకొట్లవద్ద మీకు లభింపజేయ బడగలవు. మీకు లోకంపోకడ, సామాన్యుని వేదాంతము, రంగుల కథలు, పుక్కిటి పురాణములు ఇత్యాదులు కావలయునన్నచో అవి లభ్యమగుచోటు కిళ్ళీ కొట్టుగాక వేరొండు గలదే – అదియుంగాక, వర్ణ విద్వేషములు, మత వైషమ్య ములు, ప్రాంతీయ దురభిమానములులేని మన కిళ్ళీకొట్లు మన పుణ్య భూమిలో బంగారు జాగాలు. అతి పవిత్ర స్థలములు, మన జాతికి గర్వకారణములు.

వేయేల ? సిరిసంపదలకు, బీదసాదలకు, గాంధీ నెహ్రూలకు, వరదలకు వర్ధంతులకు ఆలవాలమై హిందూ బౌద్ధ శిఖ్ఖు జైన పారశీక ముసల్మాను క్రీస్తా నీలకూ, పెను అమీరులకూ కడు గరీబులకూ ఉనికిపట్టయి తిరోగమనమును ఆపు కొని పురోగమింప ప్రయత్నంచేసే మన పవిత్ర భారతదేశపు వర్తమాన (సెక్యు లర్) సౌభాగ్యమునకు మన కిళ్ళీకొట్లు అతి ముఖ్య చిహ్నములు, మచ్చు వజ్రపు తునకలు.

(జయశ్రీ 1967 – 'రాజు – మహిషి')

# చుట్ట

—శ్రీ ముని మాణిక్యం నరసింహారావు

చుట్ట త్రాగడము సనాతనమైన ఆచారమేనా, లేక ఈ యుగమువారు అలవరుచుకొనిన ఒక దురభ్యాసమా అని ప్రశ్న వచ్చింది.

పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా మన దేశానికి పొగాకు తీసుకొని వచ్చినాడనీ, అంతకుముందు మన దేశవాసులకు పొగాకు సంగతి తెలియదనీ, ఒక వదంతి మాత్రము ఉన్నది.

కాని ఈ విషయం అంగీకరించడానికి ఏమాత్రమూ వీలుపడదు. మన ప్రాచీన గ్రంథాలలో ఈ చుట్ట ప్రశంస వచ్చినది. కాబట్టి చుట్ట తాగడము చాలా ప్రాచీనమైన ఆచారముగా మనము అంగీకరించవలసి ఉంటుంది.

భీముడు చుట్ట తాగేవాడని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పవచ్చును. భారతము లోనే కావలసినంత సాక్ష్యము దొరుకుతుంది.

విరాట పర్వంలో అన్నాడూ "మొలమోపి పెక్కు చుట్టల్ పలు త్రాటం జుట్టి గోప భావం బమరన్" అని.

భీముడు క్షణక్షణానికీ చుట్టుకోలేక చాలా పెద్దవైనవిన్నీ, బరువైనవిన్నీ అయిన చుట్టలు ఎక్కువగా ఒకేసారి చుట్టుకొని వాటిని చాలా త్రాళ్ళతో బిగించి, ఒకచోట పడేసి ఉంచుకొనేవాడు, కావలసినప్పుడల్లా ఒకటో రెండో తీసి కాల్చుకొనేందుకు.

''కోప భావం బమరన్'' అని ఎందుకు అనవలసి వచ్చిందీ అంటే,

''... వెధవ చుట్టలు చుట్టీచుట్టీ ప్రాణం విసిగిపోయి, చివరకు తన మీద తనకే కోపం వచ్చింది" అని చెప్పవచ్చు. లేకపోతే ఇంకొక విధంగా చెప్పవచ్చు. పాండవులు అజ్ఞాత వాసంలో ఉన్నారు. వారంతా విరటుని కొలువులో ఉన్నారు. అప్పుడు తీరిక సమయంలో ఎప్పుడో భీముడు ఈ చుట్టలు చుట్టుకొని, ''మహా

రాజునై యుండికూడా ఎంతగతి పట్టిందినాకు. చుట్టలుచుట్టి ఇచ్చేందుకు ఒక్క సేవకుడైనా లేకపోయెను గదా!" అని వాపోయినాడు అని చెప్పినా చెప్పవచ్చు.

సాహిత్యంలోనే ఇంకో నిదర్శనం చూపిస్తాను; చుట్ట సంగతి మనవాళ్ళకు తెలుసును అంటానికి.

"ఎంచక నా గమనమునకు ఇంచుక చుట్టయిన కానిమ్ము" అని కళా పూర్ణోదయంలో ఉన్నది. కళా పూర్ణోదయుడే ఈ మాట అని ఉంటాడు. ఏమనీ అంటే, ఈ ప్రయాణంలో నాకు ఒక చుట్టఅయినాసరే ఇయ్యవలసిందీ, అని!

"చుట్ట అయిన కాని యిమ్ము" అంటే "ఒక చుట్టముక్క అయినా ఇయ్యవయ్యా" అన్నమాట.

అంటే ఆ కళా పూర్ణోదయుడు చుట్టేతరంకూడా త్రాగేవాడని ప్రాకరణికార్థం. అది ఏదో మనము ఇప్పుడు ఊహించలేము.

ధర్మరాజు ఒకసారి ఏదో ప్రసంగంలో చుట్ట అంటే ఎవరికీ కోపం రాకూడదు అని చెబుతూ, "చుట్టయును పగయును భేదం బెట్టి జనులకు తగదు" అన్నాడు. చుట్ట తాగేవాడు కాకపోతే దానిని అంతగా వెనకేసుకురాడు.

కాటూరు వెంకటేశ్వరరావుగారు పడుకొనబోయేముందు రెండు మూడు చుట్టలు చుట్టుకొని, పక్కనున్న బల్లపై పెట్టుకొని నిద్రపోయేవారు. "పడుకోబోతూ ఉంటిరి-ఇప్పుడు త్రాగరుకదా! ఎందుకండీ చుట్టలు చుట్టుచున్నారూ?" అని అడిగాను.

"రేపు ప్రొద్దున నిద్రలేవడముతోనే కావాలయ్యా. అప్పుడు చుట్టుకోటం అంటే బద్ధకంగా ఉంటుంది. అందుకని ఇప్పుడే చుట్టలు చుట్టుకొని పడుంటాను. భూభారాన్ని మోసే ఆదిశేషువుకూడా ఇల్లాగే చేస్తాట్ట! చుట్ట చుట్టుకొని పడుండె అని భాగవతంలో ఉన్నది" అన్నారు.

"విష్ణుమూర్తికి 'చుట్ట వాలుజోదు' అని పేరు ఎందుకు ఉన్నది?" అని అడిగితే ఏమి సమాధానం చెపుతారు? ఏదో పోనీలే అని ఊరుకుంటూ ఉన్నా కాబట్టి సరిపోయిందికాని; అసలు చుట్టతో ఆయనకు ఏమి సంబంధం? ఎందుకు గ్రంథంలోకి దిగడము! ఆయన చుట్ట త్రాగేవాడని తెగేసి చెప్పి ఊరుకుంటాను.

అయితే శ్రీ విష్ణు పాదారవింద సేవకులూ, శ్రీ ఏడుకొండల వేంకటరమణుని భక్తులూ మొదలైన వారిచే సేవించబడే చుట్టలకు తిరుచుట్టలు అని పేరు. మనము తాగేవి మామూలు చుట్టలు. అంతే భేదం.

కాబట్టి భారత కాలంనాటికే చుట్ట త్రాగే అలవాటు మనకు ఉన్నట్టు తేలి పోయింది.

మరొక్క విషయముకూడా తెలుస్తున్నది. గురుజనుల సమక్షంలోనూ, స్త్రీల యెదుటా చుట్టతాగేవారుకారని భారతంలో ఉన్నది.

ఎక్కడ ఉన్నదీ అనవచ్చు. త్రాగవచ్చునని ఎక్కడ ఉన్నది? త్రాగ వచ్చునని లేదుకాబట్టి త్రాగకూడదు అనే ఉన్నట్లు మనము విధిగా భావించవలె. ప్రతి పక్షులకు అనుకూల దృష్టాంతము లేనపుడూ, మనము చెప్పినదానికి దృష్టాంత విరోధము లేనపుడూ స్వపక్షస్థాపన జరిగినట్లే భావించుట తర్క సమ్మతము. ఇతి తర్కః.

స్త్రీల సమక్షంలో చుట్ట తాగడము నిషేధమే అయినప్పటికీ, ప్రియురాలితో ఏకాంతంగా ఉన్న సమయంలో చుట్ట తాగడము ఆనుపూర్వీక సంప్రదాయముగా కనిపిస్తుంది. భార్య ప్రియుని దగ్గరకుచేరి తమలపాకుల 'చుట్టలు' ఇచ్చినట్లు అనేక చోట్ల వర్ణితము. పాండురంగ మాహాత్మ్యంలో ఈ విషయము స్పష్టంగా చెప్పినాడు. "తనదు తొయ్యలి, వీడ్యము చుట్టయీన్" అని ఉన్నది. భార్య తమలపాకులూ చుట్టాకూడా ఇచ్చినట్లు చెప్పబడియున్నది.

బంధువులు, స్నేహితులు, వచ్చినపుడు భోజనానంతరం అందరికీ తలొక చుట్ట ఇయ్యడము ఇప్పటికీ మనలో ఆచారంగా యున్నది. ఈ ఆచారము భారత కాలంనాటికే ఉన్నదని ఊహించడానికి ఆధారాలు దొరుకుతున్నవి. శ్రీకృష్ణభగ వానులవారి యింటికి బంధుజనులంతా వచ్చినారు. ఆ వచ్చినవారిలో పాండురాజు తనయులూ, ధృతరాష్ట్రుని కుమారులూ కూడా ఉన్నారు. శ్రీకృష్ణుడు మొదటినుంచీ పాండవులయందు స్నేహభావంతో ఉంటూ, ఆదరణ చూపిస్తూ, పక్షపాతం ప్రకటిస్తూ ఉండినాడు.

ఒక సందర్భములో చుట్టలు ఈయడములో కూడా ఈ పక్షపాతమే ప్రదర్శించి, పాండుతనయులకు తలొక చుట్టయిచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు. అల్లాగ పక్షపాతంతో ప్రవర్తించటానికి కారణము ఊహించడమూ కష్టముకాదు. పొగాకు ఆ రోజులలో చాలా ప్రియంగాఉండి సర్వజనలభ్యంగా ఉండేదికాదు. మహారాజులు మాత్రమే చుట్ట తాగేవారు. పాండవులు అయిదుగురు. ఆ అయిదు గురికి అయిదు చుట్టలు ఇయ్యడము అంత కష్టమైన పనికాదు. ధార్తరాష్ట్రులు

నూర్గురు. అంతమందికీ చుట్టలు ఇయ్యడము కష్టం. ఈ కారణముచేతనో, లేక పాండవ పక్షపాతి కావడముచేతనో శ్రీకృష్ణభగవానులు పాండవులకు మాత్రము చుట్టలు ఇచ్చి, ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు. అప్పుడు భీష్మాచార్యుడో కృపాచార్యుడో అంటాడు— "పాండవులకు ధార్తరాష్ట్రులు పుండరీకనేత్ర చుట్టరికంబున నీకు నీకు నొక్కరూప" అంటాడు.

"హే మహానుభావా, కృష్ణా! పాండవులు, ధార్తరాష్ట్రులు అనే భేదం ఉండ కూడదు. చుట్టరికంబున అనగా చుట్టలు పంచియిచ్చే విషయంలో అందరూ నీకు ఒక్కరూప, అందరూ సమానులే సుమా!" అంటున్నారు ఆ ఆచార్యులవారు. చుట్టకు సంబంధించిన స్నేహమే చుట్టరికమని ముందు నిరూపిస్తాను. ఆచార్యుల వారితో సంబంధం ఉన్నది కాబట్టి అవి తిరుచుట్టలే అయిఉంటవి.

చుట్ట తాగడము ప్రధానంగా రాజుల పరంగానే కనబడుతుంది గాని సామా న్యుల విషయంలో అంత వ్యాప్తిలో ఉన్నట్లు కనబడదు. ధర్మరాజు నిర్మించిన మయసభ సంగతి చెప్పే సందర్భంలో సభాపర్వంలో, సామంతరాజులు చుట్టు కొనిరి"— అని ఉన్నది. "ఏమిచుట్టి ఉంటారు?" చుట్టలే చుట్టుకొని ఉంటారు. ప్రాకరణి కార్థము.

ఇల్లాగ భారతంలో ఎక్కడచూచినా చుట్టలసంగతి బహుళంగా ఉన్నది.

ఇంకొక సంగతి జ్ఞాపకం వచ్చింది. విష్ణుమూర్తికి చుట్టలంటే మహా ఎక్కువైన ప్రీతిఅని చెప్పటానికి రెండుమూడు నిదర్శనాలు కనబడుతున్నవి. విష్ణువుకు శంఖుచక్రాలు ఉన్నవి అన్నది అందరికీ తెలిసిన విషయమే.

శ్రీరంగనాధుడికి చుట్టయందు ఉంచుకున్నటువంటి ప్రేమవల్లనే తన శంఖ మునకు 'చుట్టుగుల్ల' అని పేరుపెట్టుకొన్నాడు. చుట్టుగుల్ల అన్నా చుట్టగుల్ల అన్నా ఒకటే అర్థము. అల్లాగే తన చక్రాయుధానికి చుట్టుగయిదువు అని కూడా ముద్దు పేరు.

అసలు ఆయనకే చుట్టువాలుదారి, చుట్టువాలుజోదు అనేపేర్లు ఉన్నవి. చుట్టకే రూపాంతరము చుట్టు. చుట్టబడినది కాబట్టి చుట్టు—పెట్టు తిట్టు, కుట్టు, మొట్టు, శబ్దంబులవలె ఏర్పడినది.

పూర్వకాలంలో రాజులకోసం చుట్టలు తయారుచేయడానికి ప్రత్యేకంగా ఒక ఇల్లు ఉంటూ ఉండేది. దానినే చుట్టిల్లు అనేవారు. చుట్టలు చుట్టడానికే ఏర్పడ్డ

ఇల్లు 'చుట్టిల్లు' అయింది. ఇది నట్టిల్లువంటి శబ్దము. నడు + ఇల్లు నట్టిల్లు అయినట్లే, చుట్ట + ఇల్లు చుట్టిల్లు అయింది.

చుట్టలు తాగేవారు ఇద్దరు కలియడముతోనే వారిద్దరికి ఇట్టే స్నేహము కుదిరిపోతుంది. ఆ ఇద్దరిలో ఒకరు చుట్టచుట్టుకొని నోరువిప్పి ఏమాటా అనకుండానే రెండవవానివైపు చెయ్యిచాపడముతోనే, ఆ రెండవ మనిషి నిప్పుపెట్టె తీసి అతని చేతిలో పెడతాడు.

సాధారణంగా మొదటి పెద్దమనిషి రెండుచుట్టలు చుట్టి పక్కనున్న పెద్ద మనిషికి ఒకటి ఇయ్యడమే ప్రాకటము.

ఇల్లాగ చుట్టసంబంధంగా ఇద్దరు మనుష్యుల మధ్య ఏర్పడిన సంబంధమే చుట్టరికము అయినది. ఇదే చుట్టరిక శబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థము.

ఈ వ్యాపారం ప్రాచుర్యంగా బంధువులమధ్యనే జరుగుతూవచ్చిన కారణాన చుట్టరికము అంటే బంధుత్వము అనే అర్థము స్థిరపడిపోయి రూఢము అయింది. దీనినే సముదాయార్థము అని కూడా అంటారు. ఇప్పటికే చుట్టము అంటే బంధువు అనే అర్థమేకాకుండా స్నేహితుడు అనే అర్థముకూడా ఉన్నది.

చుట్ట, పొగ అనే మాటలకు తర్కశాస్త్రంతో ఉన్న సంబంధముచూస్తే, చుట్టయొక్క ప్రాశస్త్యమేకాక తర్కశాస్త్రమును రచించిన గౌతముడూ, వాత్స్యాయనుడూ, దిఙ్నాగాచార్యులవారూ, గంగేశోపాధ్యాయులూ మొదలైనవారు చుట్టా, పొగా, ఈ రెండిటికిని గల సంబంధమును బాగా గుర్తించినవారు అని స్పష్టంగా బోధపడుతుంది.

తర్కంలో అనుమాన ప్రమాణవాదము అనబడే ఒక వాదము ఉన్నది. ఆ వాదన ఇల్లాగ ఉంటుంది. "ఎక్కడ ధూమముఉన్నదో అక్కడ అగ్ని ఉన్నది. ఇక్కడ ధూమము ఉన్నది కాబట్టి ఇక్కడ అగ్ని ఉన్నది." ఈ వాదననే ఇంగ్లీషులో 'సిలోజిజమ్' అంటారు.

ఈ రకము వాదనకు ప్రమాణం నాచే వ్రాయబడిన 'విచిత్రతర్కం' చూడ నగును. "ఎక్కడెక్కడ ధూమము ఉన్నదో అక్కడక్కడల్లా అగ్ని ఉన్నది" అన్నది హేతువాక్యము.

ఆ హేతువాక్యమే దోషయుక్తము అయితే వాదము దోష భూయిష్ఠము అవుతుంది. హేతునిర్ణయము చేయడంలోనే తార్కికుని ప్రతిభ ప్రదర్శితము

అవుతుంది. అందుచేత తార్కికుడు హేతుపుష్టికోసమూ, వైయాకరణి ధాతుపుష్టి కొరకూ చూస్తూ ఉంటారు.

ఆ సంగతి అల్లాగఉంచి ప్రకృతానికి వద్దాము.

ఇప్పుడు పైనచెప్పిన వాదనలో హేతుపుష్టి ఉన్నది. ఎందుచేతనూ అంటే పొగఉన్న చోటల్లా అగ్ని ఉంటుందీ అన్నవిషయాన్ని కాదని ఎవరూ అనలేరు.

కొంచెము తార్కిక పరిభాషలోకి వెడితే ధూమానికీ అగ్నికీ నియత సంబంధము ఉన్నది అని అంటారు. ఆ రెండూ ఎప్పుడూ కలిసిఉంటవి. పొగ ఉన్నదీ అంటే, అగ్నిఉన్నదన్నమాటే. అందుకనే 'యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః' అని చెప్పాడు శాస్త్రకారుడు.

పై హేతువాక్యాన్ని తార్కికుడు ఎట్లా నిర్మించగలిగినాడూ? అనిప్రశ్న. "చుట్ట త్రాగడాన్నిచూచి" అని జవాబువచ్చినట్లు చెప్పితీరాలె-ఇంకో మార్గంలేదు. ఎందుకంటే, ఆ నియత సంబంధం ఒక్క ఈ విషయంలోనే అనుమానానికి అవకాశంలేని పద్ధతిలో కనిపిస్తుంది. చుట్టలో అగ్నిఉంటే నోట్లోనుంచి ధూమము వస్తుంది. అగ్నిలేకపోతే ధూమంరాదు. యత్ర యత్ర వహ్నిర్నాస్తి తత్ర తత్ర ధూమోఽపినాస్తి.

అయితే "చుట్ట కాల్చుచుండగా ధూమము వచ్చుటయూ అచ్చట అగ్నియూ ధూమమును కలిసియుండుటయూ మేము చూచితిమి" అని యీ తార్కికులు ఒప్పుకోరు. ఒప్పుకోక 'యత్ర ధూమస్తత్రాగ్నిః యథా మహానసః' అంటారు. ధూమమూ అగ్నీ వంటయింటియందు నియత సంబంధముతో ఉన్నవి అని అన్వయ దృష్టాంతము ఇస్తారు.

ఇల్లాగ అనడము కేవలము చుట్టయందు వ్యతిరేకభావము ఉంచడమువల్లనే కాని మరొకటి కాదు. చుట్టకు ఈ విధంగా అన్యాయం జరిగింది తార్కికుల చేతులలో.

ఈ కారణముచేతనే ఈనాటికి తర్కం చదువుకొన్న వారికి చేతిలో చుట్ట ఛస్తేకాలదు. ఈ విషయం నిజమో అబద్ధమో తెలుసుకోవలెనంటే జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారిని, తిరువెంగళాచార్యులు గారిని అడుగవచ్చు.

నిజానికి ధూమానికి, అగ్నికి ఏకాంతిక సంబంధం మహానసములో ఛస్తే కుదరదు. అక్కడ సంగతి మా కాంతాన్ని అడిగాను. ఏమిటి నిజంసంగతి చెప్పు.

ధూమము ఉన్నచోట్లనెల్లా అగ్ని ఉంటుంది అంటాడు న్యాయదర్శన గ్రంథకర్త. అది నిజమేనా ?" అని.

తర్కశాస్త్రం రచించిన గౌతముడే కానీ ఆ గ్రంథాన్ని తెనిగించిన వెంకట రమణశాస్త్రిగారే కానీ ఎవరైనాసరే, ఈ ధూమాగ్నుల మధ్యనున్న సంబంధం విషయంలో కాంతం చెప్పినదానికి కటిక్కన తలవంచవలసిందే గాని కాదంటానికి వీలులేదు. ఈ విషయంలో ఆమె నిర్ణయము ప్రమాణవాక్యము. దానికి విప్రతిపత్తి లేదుకాబట్టి ఆమె వాక్యం సర్వతంత్ర సిద్ధాంతముగా అనగా ఇతర శాస్త్రములకు వైరుధ్యంబు లేనిదానినిగా అంగీకరింపక తప్పదు.

"అనేకసార్లు ఊరికే పొగరాజుతుందేగాని నిప్పురాజదు. ఎప్పుడైతే నిప్పు రాజి అగ్ని ఏర్పడుతుందో అప్పుడు పొగఉండదు" అని ఆమెగారు తెగేసిచెప్పింది.

మహానసములో ధూమాగ్నులమధ్య నియత సంబంధంలేదు. ఒక్కచుట్ట కాలుస్తున్నప్పుడే ఎట్టిని నిప్పూ పొగా కలిసిఉంటవి.

కాబట్టి యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః అన్నవాక్యం చుట్ట దహన సంస్కారాన్నిచూచే అనబడ్డది. గౌతముని కాలంనాటికి చుట్ట కాల్చడము మిక్కలి వ్యాప్తిలోఉంది అనేది సిద్ధాంతము.

అభ్యుదయ రచయితలు అన్నట్లు ఆ కాలంలో రాజులను సంతోషపెట్టడానికే సకలశాస్త్రాలూ, కావ్యాలూ పుట్టినవి కాబట్టి, రాజులు చుట్టకాల్చడానికి సంబంధించిన ఈ వాక్యం తర్కశాస్త్రంలోకి ఎక్కింది. కాబట్టి ఇంతకూ తేలిన విషయము ఏమిటీ అంటే చుట్ట పంపిసీమీదే తర్కశాస్త్రం పుట్టిందీ అని. ఉదాహరణలలో మహానసములోవలె అని చెపుతారు తార్కికులు, అల్లాఅనక యత్రధూమస్తత్రాగ్నిః యథా దహనసంస్కార వైఖరీః అని ఉండాల్సింది.

సాధర్మ్య నిరూపణ ఇల్లాగ చుట్టకు సంబంధంగా ఉండకపోవడానికి కారణము కూడా మనము ఊహించవచ్చు. మొదట్లో రాజులకు సంబంధించిన తర్కశాస్త్రంలోకి ఎక్కించారు. కాని తరువాత రాజులప్రతిభ తగ్గింది. బ్రాహ్మణుల ప్రాబల్యం వచ్చింది. చుట్ట త్రాగడము రాజులలో ఉండేదని చెప్పాను. వారు క్షత్రియులు. అనగా బ్రాహ్మణేతరులు. బ్రాహ్మణేతరుల ఆచారాన్ని పేర్కొని దానికి తర్కశాస్త్రంలో ప్రాధాన్యము ఇయ్యడము, తర్కశాస్త్ర గ్రంథకర్తలైన బ్రాహ్మణులకు ఇష్టంలేకపోయి ఉంటుంది. అందుకే తమకు ఇష్టమైన మహానస విషయము ఉదాహరణగా చేర్చినారు.

బ్రాహ్మణులవలన బ్రాహ్మణేతరులకు జరిగిన అన్యాయాలలో ఇది యొకటి.

ఇక అలంకార శాస్త్రంలో చుట్టకు కావలసినంత ప్రమేయము ఉన్నది. అదిప్పుడు తేలేవిషయంకాదు. సంస్కృత వాఙ్మయంలో చుట్టప్రశంస కొద్దిగా ఉన్నదని చూపిస్తాను. కాళిదాసు మేఘసందేశంలో మేఘములు చుట్టలతో పోల్చబడినవి. మేఘములు చుట్టలు చుట్టుకొని గగనమార్గాన సంచరిస్తున్నవట!

ధూమజ్యోతి స్సలిల మరుతా అన్నచోట ధూమప్రశంస వచ్చింది. కాబట్టి కాళిదాసుకు చుట్ట తాగడమూ, దానివలన పొగను పుట్టించడము అనే విషయాలు తెలిసే ఉండాలె.

చుట్ట తాగడములో రెండు విశిష్టమైన పద్ధతులున్నవి. చక్కని ఒక పేటికలో కొన్ని చుట్టలనుపేర్చి దానినీ, ఒక నిప్పుపెట్టెనూ, పక్కనున్న గుండ్రని బల్లపైపెట్టి ఒక పడకకుర్చీలో శయనించి ఠీవిగా చుట్టను ముట్టించి ఆప్యాయంగా ధూమపానం చేయడము ఒక పద్ధతి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ పద్ధతిలో చుట్ట కాలుస్తారు.

అరుగుపైనగాని లేక మరొక చోటగాని చాపపై నడ్డిగంవేసి కూర్చుని చుట్ట తాగడము మరొకపద్ధతి. కాటూరువారు ఈ పద్ధతిలో చుట్ట తాగుతారు.

ఈ రెండవ పద్ధతిలో కూడా ఠీవి, రాజసము, హుందాతనము, సరళతా, స్నేహభావమూ, మొదలైన సుగుణాలు ప్రదర్శితము కావడానికి అవకాశాలు ఉన్నవి.

చక్రవాకములు సూర్యునియందు, చకోరికలు చంద్రునియందు, తుమ్మెదలు పువ్వుల గుత్తియందు ఎలాంటి అనురక్తి కలిగిఉన్నవో అలాగే కవులు కూడా కాటూరివారి చుట్టతాగే పద్ధతియందు అనురక్తి కలిగియున్నారు.

చుట్ట, బీడి, సిగరెట్టు, అనేవి ఉపాధిభేదంచేత వేరువేరు వస్తువులుగా కనపడుతూ ఉన్నప్పటికీ వానిలో ఉపహితమైయున్న మూలపదార్థము ఒక్కటే.

ఒకటే పరమాత్మ పదార్థము త్రిమూర్త్యాకారమును పొందినట్లే, ఇదీనూ. ఈ మహదర్థమును ఎఱిగిన కారణాన పండితులూ కవులూ అయినవారు ఈ త్రిమూర్తులనూ సేవిస్తూ ఉంటారు. ఎట్లాగయినా ఈ త్రికములో పర్వతాలలో మేరువువలె, శిఖరాలలో కైలాసములాగ, సముద్రాలలో క్షీర సముద్రమురీతి,

యశోవైభవము కలిగి జగద్వ్యాపకమైన కీర్తిని కలిగియున్నది ఒక్కచుట్ట అనే చెప్పవలసి వస్తుంది.

చుట్ట తాగడమువలన అనేక ప్రయోజనములు సిద్ధిస్తూఉన్నవి. రాజకీయాలలో శేముషీదురంధరుడైన చర్చిల్ చుట్ట తాగడమువల్లనే అసమానమైన ప్రజ్ఞను సంపాదించినట్లు జగద్విదితము.

దేవులపల్లి, కాటూరి ప్రభృతులు చుట్టతాగుతూఉన్న కారణానే, మహాకవు లైనట్లు మనము ఊహించవచ్చును.

చుట్టను ముట్టించి విలాసంగా పొగనువదలి, వర్తులాకారమైన చిన్న చిన్న మేఘమండలాన్ని సృష్టించగా అవి మందమంద గతిని ఆకాశంలో విహరిస్తూ ఉంటే, పంక్తులుగానిలిచిన బలాకములవలెనూ, బిసకిసలయములను పాథేయముగా గొని మేఘునివెంట కైలాసమునకై పోవుచున్న రాజహంసలవలెను కనిపిస్తవి.

అదీకాక, ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్ట సానుం వప్ర క్రీడా పరిణత గజప్రేక్షణీయందదర్శ అనే శ్లోకపాదం కూడా జ్ఞాపకం వస్తుంది.

చుట్ట మనస్సుకు కలిగిన వ్యాకులతను పోగొడుతుంది.

అలసటను తీరుస్తుంది.

దాహాన్ని ఉపశమింపజేస్తుంది.

విరహార్తులను శమింపజేస్తుంది.

చుట్ట తాగడమువలన కలిగే ఆనందము, మధురమైన కావ్యమును చదివి నపుడూ, ప్రియురాలు బుగ్గపై చిటికవేసి సరసోక్తులు ఆడేటప్పుడూ కలిగే ఆనంద ముతో సమానమైనది అని చెప్పవచ్చును.

కోపము, ద్వేషము, వంటి మనోవికారాలను పోగొట్టటానికి చుట్టవంటి వస్తువు ఇంకొకటిలేదు.

మిత్రునివలె ఆదరించేది, ప్రియురాలివలె లాలించేది, తల్లివలె బుజ్జగించేది ఒక్క చుట్టేకాని మరొకటి కాదు.

ఈ వ్యాపారము ఒక్కటే పీయూషపానమువలె మధురమైనదీ, శరద్రాత్రివలె మనోహరమైనదీ అయిఉన్నది.

కాబట్టి మనము అందరమూ కూడా ఈ చుట్టకు ప్రణత శిరస్కులము కాకతప్పదు.

చుట్ట యొక్క మాహాత్మ్యమునూ, పరువమునూ, ప్రయోజనమునూ, గుర్తింపని కొందరు నాస్తికులు, దానిని గురించి అపభాషణచేస్తూ ఉండటము చాలా శోచనీయము.

"హే చుట్టే అహం త్వాం ఉపాసే
తమసోమా జోతిర్గమయ"

(శ్రీ మునిమాణిక్యం రచనలు)

# నిద్ర

—శ్రీ వావిలాల సోమయాజులు

అది యాముక్తమాల్యద పాఠము. నాకు వెట్టి నిదుర వచ్చుచున్నది. సర్వావయవములనెడి సంకెలలనుండి జారుచు నే నెటకుఁ బోవుచున్నాఁడనో నాకె యెఱుకలేకుండెను. శ్రీ కుప్పయాచార్యులవారు పాఠమునాపి కుదురైన గొంతుకతో 'నిద్రా దేవత నిన్నుఁ బూనెఁగదరా నిర్భాగ్య దామోదరా!' అను పద్య పాదమును ఘనజటవైచి చదువుచుండ మిత్రుడు నన్నుఁ దట్టి మేల్కొల్పినాఁడు. మఱి యొక సహాధ్యాయి నేఁ దెప్పరిలి స్వస్థితికి వచ్చునంతలో నాచార్యులవారిని "స్వామీ! నిద్రకును నొక దేవత యున్నదా!" అని వినయముతోఁ బ్రశ్నించినాడు. ఆ దొడ్డ పండితుఁడు "ఔను. జ్యేదేవి; అలక్ష్మి... జగదేకమాతకు జ్యేష్ఠభగిని" యని సమాధానము చెప్పినారు. నిదుర మబ్బులు నన్నుఁ బూర్తిగ విడిపోయినవి.

సహపాఠి మఱల నాచార్యులవారిని జ్యేష్ఠాదేవి రూపాదికమునుగూర్చి ప్రశ్నింప వారు "అలక్ష్మీం త్వాం కురూపాని కుత్సిత స్థానవాసినీ... అలక్ష్మీం కృష్ణ వర్ణాం, ద్విభుజాం కృష్ణ వస్త్ర పరిధానాం, లోహాభరణ భూషితాం శర్కరా చందన చర్చితాం, గృహసమ్మార్జనీ హస్తాం, గర్ధభారూఢాం, కలహ ప్రియాం" అని యేమేమో పఠించుచు నాపై దృష్టి నిల్పుచు మందస్మిత మొనర్చినారు.

"ఏమి దామోదరా! తామీ లోకమునకుఁ దిరిగివచ్చినట్లేనా?" అను వారి ప్రశ్న కవనత శిరస్కుఁడనుగాక ప్రౌఢముగ బ్రతిస్మిత మొనర్చి 'ఇట దామోదర శబ్దౌచిత్య మెట్టిదో సెలవిం'డని వారిని వేడుకొంటిని. వా రొక చిరునవ్వుతో నా చిలిపితనమును గమనించి 'ఉదరేదామ యస్యేతి దామోదరః'-యశోద మృద్భక్షణం మొనర్చిన బాలకృష్ణుని నడుమున బలుపుతోఁ గట్టినది కనుక దామోదరుడైనాఁడు. మన్నుఁ దినినట్లు నిద్రవోవు మిమ్ము నిద్రాదేవత పాశబద్ధులఁ గావించుటచే మీరును దామోదరులే!" అని సెలవిచ్చినారు. ఆనాడు భారతీయులు నిద్రకు నొక దేవతను సృష్టించుకొనినారని నాకుఁ దెలిసినది.

ప్రాచీన కాలమున బాబిలోనియను జాతివారు నిద్రపట్టకున్న 'లోహార్' అను నిద్రాదేవతను బూజింతురనియు, నేటి 'ఫిన్నిష్' జాతివారికి 'ఉని' యను నిద్రాదేవత 'ఉంటాయో యను స్వప్నదేవత లుండియున్నారని మఱికొంత కాలము నకుఁ ఉదివి నేర్చుకొంటిని. నిజము! సమస్త శక్తులును దేవతలుకదా! నిద్ర యొక శక్తి! ఒక దేవత!!

నిద్ర సృష్టియం దొక విచిత్రమైన సృష్టి. 'అది దుప్పటి వంటిది. దానిఁ గప్పుకొన నవసరములేని వ్యక్తి యెవఁడు? నిద్ర యన్నాతురున కాహారము, తృష్ణాతురునకు దాహము, శీతోష్ణ బాధితుల కది యుష్ణము, శీతము; మిత్ర రహితులకు మిత్రము, నిలయ విహీనులకు నీడము, మనోబాధితులకు మహనీయాంజనము. ఇన్ని సుగుణములు గల్గియు నిది మృత్యువును బోలియుండుట యొక్కటియే యందలి దోష'మని యొక జిజ్ఞాసు వభిప్రాయ మిచ్చినాఁడు.

బంపుటతప్ప మృత్యు వొనర్చు సర్వ కృత్యములఁ గావించుటకు నిద్ర సమర్థమైనది. మృత్యువుతో నిద్రకున్న సహజ బాంధవ్యమును గుర్తించిన యొక భావుకుఁడు 'నిద్ర యొక జాతి మృత్యువు; నిరయనము దాని జన్మభూమి; అయ్యో నరకము దీనిని దఱిమివేసినది; స్వర్గము చేరనీయలేదు' అని పలికినాడు. దీనిని బట్టి నిద్రకు నివాసభూమి 'త్రిశంకు స్వర్గ' మన్నమాట!

నిద్రామృత్యువుల కొక ధర్మసామ్యమున్నది. ఇవి రెండు నావహించినపు డాత్మకు స్వాతంత్ర్యము లభించును. రెంటియందును శరీరి విముక్తుఁ డగును. ఈ కారణముననే పెద్దలు నిద్రామృత్యువులఁ గూర్చిన నిండు విజ్ఞానము కలవాఁడు పరమ వివేకి యని పలికినారు.

'మన జన్మమే యొక నిద్ర; ఒక విస్మృతి'. జన్మయను నిద్రలో నాత్మ నిజదేశమునువదలి సుదూరము వచ్చుచున్నా'దని యాంగ్ల తాత్త్విక మహాకవి వర్డ్సువర్తు ప్రవచించినాఁడు. ఇట్లు వచ్చిన ప్రాణి విజ్ఞానియునుగాఁడు; అజ్ఞానియునుగాఁడు. సర్వకాలములం దతనికిఁ తన నిజ స్వరూపమును గుర్తించుటకుఁ దగు నవకాశము లున్నవి. అన నతనికిఁ బ్రత్యభిజ్ఞావకాశమున్న దన్నమాట!

'నిద్ర తంద్ర భయము క్రోధ మాలస్యము దీర్ఘసూత్రతలవలన లక్ష్మి సంప్రాప్తింప'దని యార్యోక్తి. దీనినిబట్టి దురదృష్ట హేతువులలో నిద్ర యొకటగుచున్నది. అంత మాత్రమున నిద్ర దరిద్రహేతువని నిర్ణయింప వీలుకాదు; పనికి రాదని పరిహరింపఁ బొసఁగదు. నిద్ర ప్రాణాధారమనియు నది లేకున్న నారోగ్య

వినాశనమగుననియు నార్య క్షేమేశ్వరుని యభిప్రాయము. "నిద్ర మనో మాలిన్యమును క్షాళన మొనర్చును; అవయవముల కౌజ్జ్వల్యము నేకూర్చును; శరీర దోషములను రూపుమాపును; ధాతువులను సుస్థితిలో నిల్పును; యోగ గమ్యమైన యానందమును బ్రసాదించును'' అని యీ విద్వద్వరేణ్యుని సూక్తి.

నిద్రాశబ్దార్థమే యీ యర్థమును నిరూపించుచున్నది. 'నియతు ద్రాన్త్యం ద్రియాణ్యత్రేతి నిద్రా'. ఇంద్రియములు నియతముగ దీనియం దంతరితములై యుండుటచే నిద్ర నిద్రయైనది. దీని కొక రీతిగఁ బర్యాయ పదములైన స్వాప్న సంవేశనములకును నర్థమిదియే.

శ్రీనాథ మహాకవి — 'కంటికి నిద్రవచ్చునె... జిహ్వకు న్వంటక మించునే... శాత్రవుఁ డొకఁడు తనంతటివాఁడు కల్గినన్' అని స్వర్ణ నగౌద్ధత్యమును సహింపఁజాలని వింధ్య పర్వతముచేఁ బలికించినాఁడు. ఈర్ష్య నిద్రాభంగ కారణము. అంతియకాదు. 'అలుక యెత్తిన వానికి, నర్థచింతకునకు, నాతురునకుఁ గామ గోచరాత్మకునకు వచ్చునే ? ఎన్నఁబడి జనులెఱింగిన యిన్నాలుఁగు తెఱఁగు లందు నెయ్యదియైన నన్ను మొగుడ నీదటె నా కిన్నియుఁ గలుగంగ నిద్ర యేటికి వచ్చున్' అని కవిబ్రహ్మ తిక్కన సోమయాజి సౌప్తిక వధోద్యోగ పూర్వ రంగమున వికల మానసుఁడై యున్న యశ్వత్థామచేఁ బలికించినాఁడు.

నిద్రా భావమున కివి కొన్ని కారణములు. కోపి పగసాధించు కోర్కెతో నిద్రఁ జెందఁడు. శత్రునిరాసక్రియా మార్గాన్వేషణమున మనసు లగ్నమై యుండుట వలనను నిద్ర కలుగక పోవచ్చును. అర్థచింతకుని యాలోచనా తత్పరత నిద్రాశూన్యునిఁ గావించుచున్నది. ఆతురునకుఁ గామగోచరునకు శరీర స్వాస్థ్యావస్థా భేదాదులవలన నిద్ర రాదు.

నిద్ర కలుగక పోవుటకుఁగల కారణములు స్వాస్థ్య, శారీరక, మానసికములని త్రివిధములుగ వైద్య శాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. శరీరమునందు 'బ్రొమైన్' అను పదార్థము తక్కువగుటవలన నిద్రకు భంగము కలుగుననియు నది ప్రత్యేకముగ నొక వ్యాధి కాదనియు, నొక వ్యాధికి బాహ్యచిహ్నమనియు జోన్‌డక్‌వంటి విజ్ఞుల యభిప్రాయము. 'నిద్ర మన కెందులకుఁ గల్గుట 'లే' దను నాలోచనతో నిద్రా సమయమును బోఁగొట్టుకొని విమ్మట రేయెల్లయు జాగరణ మొనర్చువారు నేఁటి ప్రపంచమునఁ బెక్కురున్నా'రని యిటీవల నొక శాస్త్రజ్ఞుఁడు పత్రికా ముఖమునఁ బ్రకటించినాఁడు.

దీర్ఘనిద్రఁ గలవానిఁ జూచి కుంభకర్ణుఁడను బిరుదమును బ్రసాదించుట పరిపాటి. కుంభకర్ణుఁడు లంక కంపించునంతటి కోలాహల మొనర్చినఁగాని మేల్కొనెడివాఁడు కాఁడఁట ! పురాణ స్త్రీలోకమున నూర్మిళాదేవి నిద్రలో నుత్తమ శ్రేణి గడించుకొనినది. పౌరాణిక వ్యక్తులమాట దూరముగనుంచి చారిత్రక కాలమునకు వృత్తము. సుప్రసిద్ధుఁడగు గ్రీకు చరిత్రకారుఁడు హెరడోటస్ తా నారు మాసములు నిద్ర మేల్కొని యారు మాసములు నిదురించు జాతులఁ జూచినట్లు రచనలలోఁ జేర్కొనినాఁడు. ఇది సత్యమో ! మఱి యసత్యమో !!

కొలది కాలము క్రిందట 'అన్నాస్వాన్ పోవెల్' అను అమెరికా దేశస్థురాలు భర్త మరణవార్త వినిన వెనువెంటనే నిద్రావస్థనొంది ముప్పదియొక్క సంవత్సరములు గడచిన తఱువాత మేల్కొనినట్లు వార్తా పత్రికలఁ బ్రకటితమైనది. ఇది యభూతకల్పన మనుటకు వీలులేదు. ఇట్టి విచిత్రములు సకృత్తుగనైనఁ గొన్ని ప్రపంచమున జరుగుచునే యున్నవి.

జంతుకోటికి దీర్ఘనిద్ర యొక విశేష గుణము. వాని కది సహజావబోధము. 'ఆకులపాటు' ప్రారంభముకాఁగా నాస్ట్రేలియాలోని ఒపోస్సం, డింగో, యాంటీటరువంటి జంతువులు, కొన్ని సర్పజాతులు, క్రిమికీటకములు దీర్ఘనిద్రకు సిద్ధపడుచుండును. ప్రతి సంవత్సరము నిది తప్పదు. ఎవరో ప్రబోధించిన ట్లావని కాయా ప్రాణికోటులు పూనుకొనును. ఈ దీర్ఘనిద్రయం దొక వైచిత్రియున్నది. ప్రాణుల యవయవము లన్నియు నొకమారుగ నిద్రావస్థ నొందవు. ఒక క్రమము ననుసరించి యొక్కొక యవయవమే నిద్రనొందును. కొన్ని యవయవములు నిద్రించుచున్నప్పుడు మేల్కొనిన నన్యావయవములు మత్తు పదార్థమును జేకూర్చుకొనుచుఁ గొంత కాలము బహు భారముతో జీవయాత్ర సాగించుచుఁ గన్పించును. ఈ స్థితిలో వాని శరీరోష్ణత యర్థమగును.

దీర్ఘ నిద్రనొందుచున్నదివాంధమును నీటముంచినను, జుంచును జావమోదినను మేల్కొనవట ! 'మొంబా' జాతిసర్పము జాగృదవస్థలో నతిభయంకరమైనది. 'లాన్సుకోలమ్' అను శాస్త్రజ్ఞుఁడది దీర్ఘ నిద్రయందున్నప్పుడు మేల్కొల్పు "నన్ను నిద్రింప"నిమ్మని బ్రతిమాలుకొనినట్లుగఁ బ్రవర్తించినదఁట ! ఎలుఁగుబంట్లు కొన్ని ప్రదేశములందిట్టి దీర్ఘ నిద్రావస్థలోనే ప్రసవించి మేల్కొనిన విమ్మట రెండుమూఁడు నెలల వయస్సుగల బిడ్డలతో నాడుకొనును. ఈజిప్టు దేశమునందలి నత్తలైదారేండ్లు నిదురించుచుండునట ! అందముగనున్న యొక నత్తగుల్లను దెచ్చి

బ్రిటిష్ వస్తుప్రదర్శనాలయమునఁ బ్రదర్శింప నయిదు సంవత్సరములు గడచిన పిమ్మట నందలి నత్తమేల్కొని నడువసాగి యధికారుల నాశ్చర్యచకితుల నొనర్చి నట్లా మ్యూజియము చరిత్రవలనఁ దెలియుచున్నది.

ఈ రీతిగఁ గ్రిమి కీటకములు జంతువులు నిద్రవోవుటకుఁ గారణమా యాకాలముల వాని కాహారములై యుండు క్రిమికీటకములు నిద్రించుటయే. శీతకాలపు బాధను దొలగించుకొనుటకునుఁ దనసంతానమునకుఁ దల్లియగు ప్రకృతి దీర్ఘనిద్రను బ్రసాదించినది. ఆకాశవీధులనెగసి యుష్ణమును బడయఁగల పక్షులు, తేనియను సేకరించుకొని రెక్కలాడించుచుఁ బట్టునకు వెట్టతనము గల్పింపఁగల తేనెటీఁగలు నిట్టి దీర్ఘనిద్రనొందవు.

మానవ జీవితచరిత్రయందు నిద్రకు సంబంధించిన విచిత్రాంశములు కొన్ని కన్పించుచున్నవి. జగజ్జేత అలెగ్జాండరు పర్షియా చక్రవర్తి 'డెరయస్' మీదఁ బ్రచండ యుద్ధమును బ్రకటించునాఁడు సుదీర్ఘమగు నిద్రనొందినాఁడట ! ఒకానొక యత్యవసరమైన రాచకార్యమునకై యతనిని మేల్కొల్ప సేనానాయకుఁడగు 'పర్మనియస్' ఎంతయో యత్నించి విఫలమైనట్టు గ్రీను దేశచరిత్రలవలన వ్యక్త మగుచున్నది.

ఆత్మహత్యఁ జేసికొన నిశ్చయించుకొనిననాఁడు కేటో చక్రవర్తికి దీర్ఘనిద్ర పట్టినదఁట !

సెక్టస్‌పాపేను జయింపవలసిన సమయము. సముద్రయుద్ధ మతి తీవ్ర తరముగ సాగుచున్నది. తాను నాయకత్వము వహింపవలయును. లేకున్న సమస్తమును దారుమారై తీవ్రతమప్రమాదము సంభవించును. అట్టి స్థితిలో 'అగస్టస్ సీజరు' మృత్యువుతోఁ దుల్యమైన నిద్రనొందినాఁడు. ధైర్యమొనర్చి తానే సర్వసేనాధిపత్యమును స్వీకరించి శత్రువుల హతమార్చి విజయముతోఁదిరిగి వచ్చిన మహాసేనాని 'ఎగ్రిపా' బహుకాలము విజయవార్తను దెల్పుటకై యీ సీజరు మేల్కొనునంతవఱకు వేఁచియుండవలసి వచ్చింది.

దీర్ఘ నిద్రయందుండియే కొంద ఱితరులు జాగ్రదవస్థలోఁ జేయఁగల కార్య కలాపములను నిర్వర్తింపఁగలరు. జేసీరైడర్ - అను పదునైదేండ్ల కన్యక నిద్రావస్థలో నెన్నియో గ్రంథములఁ జదివినది. ఆమెకు జాగ్రదవస్థయందును నందలి విశేషములన్నియు జ్ఞప్తియుండుట విశేషము. ఆమె నిదురింప నారంభింప

నదేవనిగ నిద్రించునఁట! ఆమెను బరిశీలింప బంధువులు ముసాచ్యు సెట్సులోని ఓల్డెన్ వైద్యశాస్త్రజ్ఞున కొప్పఁజెప్పిరి. అతఁడు బహువిధ పరిశోధనలజరిపి 'యిద మిత్థమని నిర్ణయింపలేకున్నాను. నా మతి చెడుచున్న'దని నివేదించినాఁడు. అమెరికా దేశమునందలి యొక సుప్రసిద్ధ రచయిత నిద్రాసమయముననే నిజ రచనలఁ 'టైపు' జేసెడివాఁడు. జాగ్రదవస్థనొందిన పిమ్మట నవి తన రచనలేనా యను ననుమాన మతనికిఁ గలుగుచుండెడిదఁట! 'ఇట్టి దీర్ఘ నిద్రావస్థలందుఁదాను బూర్వము భావించిన రూపకము లందలి పాత్రలు కన్పించి సంభాషణము సాగింపఁదన రచనలు సాగుచున్నవని చెప్పు కవియున్నాఁడని స్వాన్సు విశ్వ విద్యాలయ తత్వశాస్త్రోపాధ్యాయుడు 'హీత్' ఒక విశిష్టోపన్యాసమునఁ జేర్కొని నాఁడు. నిదురించుచుఁ గొన్ని గృహకృత్యము లొనర్చుట ప్రపంచమునందన్ని దేశములందును సర్వసామాన్యమైన నిద్రావైచిత్ర్యము.

నిద్రాసమయ పరిమితినిగూర్చి లోకమున భిన్నాభిప్రాయములున్నవి. నెపోలి యను చక్రవర్తి 'పురుషుల కారు గంటలు, స్త్రీల కేడు గంటలు, బుద్ధిహీనుల కెనిమిది గంటలు నిద్రచాలు'నని పల్కినటులఁ దెలియుచున్నది. కాని యా చక్రవర్తి వాటర్లూయుద్ధానంతరము హెలీనాద్వీపమున దినమునకుఁ దొమ్మిది గంటలు దీర్ఘ నిద్ర ననుభవించినట్లు జీవితచరిత్ర చెప్పుచున్నది. బిస్మార్కు, హంబోల్టు, చర్చిలులవంటి ప్రసిద్ధ రాజకీయవేత్తలు నాల్గుగంటలకంటె నిద్రపోనివారు కన్పించు చున్నారు. 'నలుబది యెనిమిది గంటలు తీక్ష్ణమైన కృషియొనర్చిన పిమ్మట నెనిమిది గంటల నిద్రచాలునని శాస్త్రజ్ఞుఁడు ఎడిసన్ మహాశయుఁ డభిప్రాయపడినాఁడు.

'ప్రాణికోటికి నిద్ర యత్యవసరము కా'దని నిరూపింపఁగల ననెడు స్థిర నిశ్చయముతో హార్వర్డు పరిశోధనాలయమునఁ బ్రవేశించిన యొక యువకుఁడు రెండువందల ముప్పదియొక్క గంటలు మేల్కొనిన తరువాత నిఁక దానిని కొనసాగింపలేక బాధపడి యట్టె విరమించినాఁడు. మిగిలిన జీవితమున నతఁ డున్మత్తుఁడైనాఁడు.

నిద్రాకాల నిర్ణయము దేశకాల వయోనుకూలములని నిశ్చయింపవచ్చును. పసిపిల్లలకుఁ బదియునారు గంటల నిద్ర యత్యవసరము. మహాకవి కాళిదాసు 'పద్మినీజాతి స్త్రీ జాము కాలముకంటె మించి నిద్రింప'దని పలికియున్నాఁడు. అల్ప కాలనిద్ర నారోగ్యశాస్త్రవేత్త లంగీకరింపరు. నిద్ర సమయము నెనిమిది గంటల నుండి యారుగంటలకుఁ దగ్గించుకొనుటచే 'కలోరిక్' శక్తిని బాతిక పాళ్ళు విస్తార

ముగనుపయోగింపవలసి యుండునని వారి నిర్ణయము. నిద్రనీరీతిఁ దగ్గించుకొనుట వలనఁ జర్మవ్యాధులు, శరీర దౌర్బల్యము, మనోమాంద్యము, కలుగునని వారందురు.

పరిశోధింపఁదగిన యంశములలో నిద్ర నతిప్రముఖమైన దానినిగ శాస్త్రజ్ఞులు పరిగణించినారు. వారు కడుశ్రద్ధతోఁ బరిశోధనలు సాగించుచున్నారు. నిద్రను గూర్చిన యే యొక యంశమునైన 'నిదినిర్ణయ'మని చెప్ప వీలుకల్గక పోవుటచేఁ జమత్కార గర్భితముగ నొక శాస్త్రజ్ఞుఁడు "నిద్రనుగూర్చిన మా పరిశోధనల సారాంశము రాత్రి శయనించుట యుదయము మేల్కొనుట" యని యభిప్రాయ మిచ్చినాఁడు.

నెబ్రస్కా విశ్వవిద్యాలయము నందలి వైద్యకశాలాలలో జహార్ అను నాచార్యుఁడు నిద్రనుగూర్చి దీర్ఘ పరిశోధన లొనర్చి కొన్ని విశేషాంశములఁ బ్రకటించియున్నాఁడు. ఆధునిక ప్రపంచమున నిద్రపట్టనివారు విశేషముగనున్నారు. వారు రెండుతెగలవారు. శాంతియుతమైన నిద్రకావలయునని కోరుకొనుచు నిద్రా సమయిమును దప్పించుకొని పిమ్మట బాధపడువారు మొదటి తెగవారు. వ్యాధి గ్రస్తులు రెండవ తెగవారు. వయసు మరలినవారికి నిద్రపట్టకపోవుటకుఁ గారణము, చిన్నతనమున వారిని దలిదండ్రులు బలవంతముగ నిద్రపుచ్చుటయే యని యొక యభిప్రాయము. నిద్రకొఱకను నుద్దేశముతో మనస్సునుగాని, శరీరమునుగాని శిక్షింప యత్నించుట మంచిదికాదు.

"జంతువులు త్వరితముగ మృతినొందుటకుఁ గ్రమమైన నిద్రలేకుండుటయే గారణము. కళాశాల విద్యార్థులు ముప్పదియెనిమిది మారులు, మధ్యమవయస్సుగల వారే బదిమూడు మాఱులు నిద్రలోఁ గదిలెదరు''— ఇవి జహార్ అను శాస్త్రజ్ఞుని పరిశోధనమువలనఁ దేలిన కొన్ని యంశములు.

'శయ్యమీఁదఁజేరి సున్నితముగా సుఖనిద్ర నొందుటకంటె నదృష్టవంతులకు వేఱొక శుభలక్షణములేదని యొక తాత్వికుఁడనినాఁడు. అలసిపోయిన అవయవ ములు కష్టపడుట కిచ్చగింపనపుడు క్రమముగ విశ్రాంతినొందు యత్నమారంభిం చును. తొలుదొల్త ఘ్రాణశక్తి, తరువాతరసన, పిమ్మట క్రమముగ స్పర్శజ్ఞానము, శబ్దగ్రహణశక్తి తప్పిన పిమ్మట మనస్సు వ్యవహరించుట మానివైచును. జోషు వారోసెట్ అను విజ్ఞాని, నిద్రారంభదశలో నిత్యజీవితమునందలి కొన్ని విశేషాంశ ములు జ్ఞప్తికివచ్చుట, పిమ్మటఁ గొన్ని మధురములైన కోర్కెలు జన్మించుట,

యటుతరువాత సుఖాభిలాషలు కలుగుట, భ్రమలు కొన్నిపుట్టి తదుపరి నిదుర ముంపు, స్వప్నావస్థ యేర్పడు'నని నిరూపించినాఁడు.

అందఱకును నిద్రకలుగు కాలము సమముకాదఁట! కళాశాల విద్యార్థుల కిరువదిఎనిమిది నిమిషములు, నడివయసు నున్నవారి కిరువదియైదు నిమిషముల కాలము కావలయునట! స్త్రీలకుఁ బదునైదు నిమిషములకాలము చాలునఁట!

నిద్రలోఁ గదలినంత మాత్రముననఁగలఁత నిదురకాఁజాలదు. పసిబిడ్డవలె నిద్రపోవుట పరమప్రయోజనకారి. "మొద్దువలె నిద్రించిన వాఁడెద్దువలెఁ బని యొనర్చు''నను సామెతయున్నది.

ఏకాదశినాఁడు సంపూర్ణ జాగరము వ్రతవిధానములం దనుశాసింపఁబడినది. దశమియేక భుక్తము; ద్వాదశిపూర్ణ భోజనము. 'దివానిద్రయోగభంజక'మని యోగ కుండల్యుపనిషత్తు పలుకుచున్నది. పూర్వరాత్రి నిద్ర సౌందర్యసంవర్ధకమని పాశ్చాత్యులలో నొక ప్రథయున్నది.

పూర్వము టర్కీదేశములోని అంకారా విశ్వవిద్యాలయ విద్యార్థిలోకము పగటి నిద్దురను గూర్చి కొన్ని పరిశోధనలు సాగించినది. వారి పరిశోధనల ఫలితాంశములు రాత్రినిద్ర మానవునకుఁ బనికిరాదనియు, దీర్ఘనిద్ర నిష్ప్రయోజన కరమైనదనియును ప్రతి వ్యక్తియును బగలొకమాఱు మూఁడు గంటలు మఱల నొకమాఱు రెండు గంటలు నిద్రించుట కలవాటుపడిన మిగిలిన కాలమంతయు శ్రమయనుకొనకుండఁ బనిఁజేయవచ్చునని వారు సిద్ధాంతీకరించినారు. వారి పరిశోధనలవలన రాత్రి పదియునురెండు గంటలు నిదురించువారి మించి పైరీతిగ నిదురింపనలవాటు పడినవారు పనిచేయవచ్చుననియు, వారలకే విశేషవిశ్రాంతి చేకూరునట్లును వెల్లడియైనది. పరీక్షా ఫలితములందును పగటినిద్ర నొందువారే ప్రథమ గణ్యులైనారట! వీరి పరిశోధనలయందలి సత్యాసత్యములెట్లున్నను వీరి మార్గము వైద్యశాస్త్రమునకు సామాన్య ప్రకృతికి విరుద్ధమగుటచే నీ విద్యార్థులకు 'ఉలూక'ములను నామము కొంత కాలము ప్రపంచమున విశేషప్రాచుర్యము వహించినది.

"నిద్ర సుఖమెఱుఁగదు, ఆఁకలి రుచినెఱుఁగదు", ఈ సామెత యాంధ్ర భూమి నతిప్రసిద్ధమైనది. అయినను సుఖనిద్రకును సుందరమగు శయ్యకును సన్నిహితమగు సంబంధమున్నది. శయ్యా ప్రాముఖ్యమును గుర్తించిన నెపోలియను

చక్రవర్తి 'జగత్తునందలి సమస్త సింహాసనములిచ్చినఁబ్రతిగ నా శయ్యను విడువలే'నని పలికినాఁడు. మానవుఁడు శయ్యయందు జన్మించుచున్నాఁడు; శయ్యయందుఁ బెరుగుచున్నాఁడు; శయ్యయందు మరణించుచున్నాఁడు. దేశకాల పాత్రములననుసరించి శయ్యావిభేదములెట్లు మార్పునొందినను శయ్యతప్పదు. అర్జున గౌరవానురాగములఁ జూఱఁగొనిన భీష్ములవారి కుత్క్రాంతివేళ నుజ్వలమగు నంపశయ్య పర్యంకమైనది. మఱియొక మహారాజునకుఁ బట్టజశయ్య శయనీయమై యొప్పియుండును. జగత్కారణుఁడు వటపత్రశాయి; శేషతల్పశాయి. ప్రాచీన భారతీయ చక్రవర్తులలో సౌవర్ణపట్టజ కీటజాండ శయ్యల నిర్మించుకొని యనుభవించినవారున్నటులఁ దెలియుచున్నది. శయనసంవేశనము ప్రాచీన శృంగారచతుష్షష్టిలో నొకటైనట్లు 'నాగరకవృత్తము'వలన నభివ్యక్తమగుచున్నది. మాగధ, వైతాళిక, సౌఖశాయని కాది భృత్యులవలనఁగల పరమప్రయోజనము నర్థశాస్త్రాభిజ్ఞు లెఱిఁగియుండుటచే రాజప్రాసాదములందు వారి యావశ్యకతను నిరూపించియున్నారు.

నిద్రకును గొన్ని నియమము లున్నవి. 'భుక్త్వాశత పదం గచ్ఛేత్' 'వామపార్శ్వేన సంవిశేత్' అని సుశ్రుతము. దక్షిణపుఁ దలాపి యొక ధర్మము. నిద్రారంభవేళ నది మృత్యుతుల్య మగుటచే అగస్త్య కపిలాస్తీకాది పుణ్య పురుష స్మరణము ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీకాది చిరంజీవుల పరిగణనము లావశ్యకములని యార్యుల నమ్మకము. ఆంజనేయ దండకమును బఠించుచుఁగాక నిదురింప నిచ్చగింపని ప్రాచీన మర్యాదను బాటించు నాంధ్రులు నేఁటికిని గన్పించుచున్నారు. పాశ్చాత్య దేశములందు నిట్టి యాచారము లేకపోలేదు. థామస్ బ్రౌన్ 'భగవత్ప్రార్థనము లేక నే నెన్నఁడును నిదురింప'నని పలికినాఁడు. వామనస్తుతి పరత్వమున నిదురలేఁచుట యేనాఁటి యాచారమో యేమో! 'ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై' తుదకుఁ ద్రిజగముల నిండిన త్రివిక్రముఁడు వామనుఁడు. ఆయనను స్తుతించుటవలన నా రీతి వృద్ధినొందు కోర్కె యీ స్తోత్ర పాఠకులందును ద్యోతక మగుచున్నది.

పొడగరి తనమునకు నిద్రకును సన్నిహిత సంబంధ మున్నదని శాస్త్రజ్ఞులంగీకరించినారు. ఆర్థరు రేనాల్డు అను నొక పరిశోధ కాగ్రేసరుఁడు "నూరు దినములు నిద్రపోకుండునట్లుగ నిల్పుటచే విద్యార్థు లరయంగుళము తగ్గిపోవుట తటస్థించిన"దని చెప్పినాఁడు. సీల్ జహార్ అను శాస్త్రజ్ఞుఁడు" నిద్రా సమయమున మస్తిష్కము తగ్గుటయును, శరీరము వృద్ధినొందుటయు జరుగు"నని తన పరిశోధనా ఫలితమును వెల్లడించినాఁడు.

కళాకారులను నిద్రా సౌందర్య మాకర్షించినది. సాహిత్యోపాసకులు తమ కావ్యముల "స్వప్న సుందరులఁ" జిత్రించినారు. అవంతి సుందరియం దగ్రగణ్య. విఖ్యాత రచయితల యమూల్య కల్పనా విన్యాసములకు నిద్రావస్థయు ప్రోద్బలక మైనది. పురాణ కవులకుఁ గృతిపతులైన దేవతామూర్తులు నిద్రా సమయములందుఁ గన్పించి కృతి నర్థించినారు. ఇందుల కాంధ్ర సాహిత్య ప్రపంచమున హరిహర నాథు డక్కవి బ్రహ్మ తిక్కన సోమయాజికి దర్శనభాగ్య మొసఁగుట ప్రబల తార్కాణము. 'జోల - లాలి' ఇత్యాది నిద్రా సాహిత్యము ప్రతి దేశమున నొక సాహిత్య శాఖయై విలసిల్లుటఁగన నిద్రకు నిత్యజీవితమున నెట్టి ప్రాముఖ్య మున్న దియు వెల్లడి యగుచున్నది. ఈ ప్రాముఖ్యమును గుర్తించియే యొకమాఱు వర్డ్స్ వర్తు మహాకవి నిద్రాదేవి కటాక్షము తొలఁగినపు డొక కావ్య మిట్లు చెప్పినాఁడు.

"ఒకదాని వెనుక నొకటి ప్రశాంతముగ గమించునవి గణమును, ఝంకార మొనర్చు తుమ్మెదలను, గ్రిందికి దుముకు వాహినులను, మందమంది వాయువు లను, సముద్రమును, మృదులమగు సస్యక్షేత్రములను, నీర పటలములను, స్వచ్ఛ మగు నాకాశము నొకదాని వెనుక నొకదానినిఁ గ్రమముగ నూహించితిని. అయి నను నిద్రా విహీనుడనై నిలువవలసి వచ్చినది. నా పుష్పోద్యాన వనతరువులపై నిల్చి కూయు పులుఁగుల కలధ్వనులు కోకిలా కరుణార్ద్ర గీతములను వినవలసి వచ్చినది. ఈ రీతిగ నిన్నటి దినమును మఱియు రెండు దినములు గడిచినవి. కాని నేను నీపై నే మార్గమునసైన విజయము నొందజాలక పోయినాఁడను. దేవీ! ఈ రాత్రియు నన్నిట్లె వాడిపోనీయకుము. నీవులేని యుదయకాల సౌభాగ్య మేమున్నది? దినమునకును దినమునకును మధ్య దివ్యమగు నో యంతరమా! నూతన భావములకు నానందకరమగు నారోగ్యమునకుఁ దల్లివగు నో ప్రియమాతా! రమ్ము".

వైతాళికుల సాహిత్య మంతయు నొకచోఁ జేర్చిన యందుఁ గొన్ని విశేషము లుండకపోవు. భారత గాయకలోకము ప్రాభాతిక రమణీయ రాగ ఫణితుల, నందు ముఖ్యముగ దేశాక్షి భూపాల మలయమారుతాది రాగముల, నిష్టదైవతముల నీనాఁ డును మేల్కొల్పుట యాచారముగనే యున్నది.

ప్రపంచ శిల్పులు యోగనిద్రా ముద్రితులైన మూర్తుల శిల్పించినారు. 'ధ్యానీ బుద్ధ' 'ప్రజ్ఞాపారమిత' 'ప్రతిమా' శిల్పము లిందు జగద్విఖ్యాత కృతులు. పాశ్చాత్య ప్రపంచమున లీచ్ ఫీల్డు కెథిడ్రలులోని నిద్రా దంపతుల శిల్ప ఫలకము నిద్రా శిల్పమునకు నిస్తులమైన నిదర్శనము.

నిద్ర తాత్వికుల దృష్టి నాకర్షించినది. భారతీయ ద్రష్టలు దీనిని స్వప్న యోని, స్వప్న జన్మభూమిగ దర్శించినారు. నిద్రా సమయమున ప్రత్యగాత్మ బుద్ధ్యంతః కరణతో నుండునట! 'ఓ జననీ! నిద్రా! నీవు మా యొద్దనుండి తొలఁగిపొమ్ము. అశ్వినీ దేవతలు నిన్నతి జాగరూకతలో బరిశీలించు చున్నారు. వారి కంటఁబడక నీ వెట్లు రాఁగలిగితివి?' మొదలగు నర్థములుగల సూక్తము లథర్వ వేదమున నాకాలమునందు విచ్చేసిన నిద్రాదేవి నుద్దేశించి కన్పించుచున్నవి. ఆ శ్రుతియందే నిద్ర దేవపత్నుల గర్భాండ మనియును, గలలు దేవతలనియును చెప్పఁబడి యున్నది.

నిద్రా తత్వమునుగూర్చి ప్రవచింప వలసినదని గార్గ్య సౌరాయణీ మహర్షి పిప్పలాదు నీ భరత భువియం దెన్ని సహస్ర వర్షములకుఁ బూర్వమో యిట్లర్థించి నాఁడు.

"భగవంతుడా! పురుషునియందు నిద్రవోవునని యెయ్యవి? మేల్కొను నవెయ్యవి? ఇందు స్వప్నావస్థను బొందు దేవత (ఇంద్రియము) యెప్పుఁడు? నిద్రాసుఖ మెవ్వరిది? దేనిపై నియ్యవి సంప్రతిష్ఠితములై యున్నవి."

ఈ ప్రశ్న పరంపరకుఁ బిప్పలాద మహర్షి యొసఁగిన సమాధానమునందు భారతీయ నిద్రా విజ్ఞానము నిరూపితమై యున్నది.

"సంధ్యాసమయ సూర్యు నతని కిరణము లేరీతి యతని తేజోమండలమును జేరుకొనుచున్నవో యటులనే సర్వేంద్రియములును నిద్రా సమయమున మనస్సుతో నేకీభవించుచున్నవి. అందువలన నింద్రియ వ్యాపారముండదు. ఈ కారణముననే పురుషుఁడు నిద్రించుచున్నాఁడని చెప్పెదరు. ఆ మనస్సు తేజసాభిభూత మైనపుడు సుఖానుభూతి నొందును."

"యయేష సుప్తేషు జాగ్రతకామమ్ కామమ్ పురుషో నిర్మిమానః దదేవ శుక్రమ్ దద్బ్రహ్మ". ఈ కఠోపనిషద్వాక్యమువలన 'నిద్రితునియందు మేల్కొను నది బ్రహ్మ' యని భారతీయ తాత్వికుల నిశ్చయమైనట్లు వ్యక్తమగుచున్నది.

సృష్టికి నిద్ర యత్యవసరము. జగత్కారణుఁడగు విష్ణువు నిద్రా ముద్రితుఁడై శరదారంభమున మేల్కొని పునస్సృష్టి నారంభించును. ఆ మహామహుని జాగ్రదవస్థారంభవేళా సౌందర్యముఁగనిన మహాకవి యాంధ్ర నిద్రా సాహిత్యమున నిరుపమాన రత్నమగు నీ పద్యములో దాని నిట్లు వర్ణించినాఁడు.

"అభినవోన్మేష చిహ్నంబైన తొలిచూపు
కౌస్తుభాలోక రేఖలకు నలగఁ
సాంగ భంగంబైన యావులింతకు వేల్పు
లంగుళీ స్ఫోటంబు నాచరింప
సౌఖశాయ నికులై సంవర్త భృగ్వాది
మునులు హస్తాంభోజములు మొగుడ్ప
ధృత చేతనంబులై దివ్యాయుధంబులు
జయజయ ధ్వనులతో సంస్తుతింపఁ
గలువ రేకులువోని పెంజిలువరేని
యరఁటి కుబుసంబు పొరలు మైనంటియుండ
నిదుర మేల్కాంచి కూర్చుండు నుదధినడుమ
విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు".

నిదుర మేల్కొనువేళ నీరాజన మెత్తుట భారతదేశమున రాజ ప్రాసాదముల యందలి ప్రాచీనాచారము. తా ననుభవించిన యీ యాచారము స్మృతికి వచ్చిన శ్రీ రాయల కిట్టి దర్శనము కల్గినది.

"సాంధ్య రాగలహరి సామి రంజితములై
తిరిగి మింట నిదురఁ దెలసినట్లై
యిందిరాధిపతికి నెత్తు కర్పూర నీ
రాజనంబు లన శరద్ఘనములు".

(మణి ప్రవాళము)

# మౌనం

—శ్రీ అడపా రామకృష్ణారావు

"మాట వెండి, మౌనం పసిడి;

మాట మానుషం, మౌనం దివ్యం"

అనే భావంతో ఒకజర్మన్ సామెతఉంది. ఇటువంటి సామెతలను చూసినా, సాహిత్యాన్ని చూసినా, మొత్తానికి ప్రపంచంలో వివిధజాతుల ప్రజలు మాటనూ మౌనాన్నీకలిపి పరీక్షించి, చివరకు మౌనంవైపే మొగ్గుచూపారనిపిస్తుంది. కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా ?" అని ఒకరంటే "చెప్పడానికేమీ లేనివాడే అందరికంటె అధికంగా మాట్లాడతా"డని మరొకరన్నారు. "ఆడనిమాట అపకారం చెయ్యద"ని ఒకరంటే, "మౌనం వాదించినట్లు మాటలు వాదించలే"వని మరొక రన్నారు. "వాదంలో బలంలేనప్పుడే కంఠానికి స్థాయిహెచ్చుతుం"దని ఒకరంటే, "మెదడు బరువుగా లేనప్పుడే నాలుక వదులుగా ఉంటుంది" అని మరొకరన్నారు. "చిన్నచిక్కులే చప్పుడుచేస్తాయి. నిజమైన ఆపదలు నిశ్శబ్దంగా ఉంటా"యని ఒకరంటే, "నీచుల నిందలను మౌనంతో ఎదిరించేవాడే మహనీయు"డని మరొక రన్నారు. "ఆనందసౌధానికి మౌనం ప్రథమసోపాన"మని "నిశ్శబ్దంలో దేవతల గుసగుసలు విన్పిస్తా"యని మరొకరన్నారు. ఈ విధంగా ఎందరో మహానుభావులు మాటకంటె మౌనంమేలని నిరూపించడానికి ప్రయత్నించారు.

ఇక మతాలసంగతి సరేసరి. ఆధ్యాత్మిక వికాసానికి మౌనం ముఖ్యనియ మంగా చాలా మతాలు ప్రతిపాదించాయి మనకు మౌనులు, మౌనముద్రాలంకారులు, మౌనవ్రతాలు, మూగనోములు పరిచితమే. ఏ మతంలోనైనా యోగసాధనకు మౌనం ముఖ్యాంగమే. పర్షియాలోని 'మిత్ర'దేవత ఉపాసనకు దీక్షపొందేవారు ముందుగా నోటిమీద కుడిచేతి వ్రేలినుంచుకొని 'మౌనం' అనే మాటను ముమ్మారు ఉచ్చరించాలట; ఎందుచేతనంటే మౌనమే సజీవదైవానికి సాక్ష్యస్వరూపమట. ఇక క్రీస్తు ప్రార్థన ఎలాచెయ్యాలో తన శిష్యులకు చెపుతూ "వంచకులమాదిరిగా నలుగురి మెప్పుపొందాలని నడివీధిలో ప్రార్థనలు చేయకండి. గదితలుపు వేసుకుని

ఏకాంతంలో నిశ్శబ్దంగా ప్రార్థించండి. ఈశ్వరుడు అంతర్యామిగనుక మీ నిశ్శబ్ద ప్రార్థనల నాలకిస్తా"డని బోధించాడు.

మౌనాని కింతప్రాధాన్యం కలగడానికి కారణం శబ్దంలో అమోఘమైన శక్తి ఉన్నదనే నమ్మిక. అందుకే మాటలను తూచివాడాలని శాస్త్రాలు చెపుతాయి. పైగా పూర్వులు 'తథాస్తు' దేవతల భయంకూడా ఒకటి కల్పించారు. రఘువంశరాజులు మితభాషులని కాళిదాసు వర్ణించాడు. శ్రీరాముడు 'ఒకమాటా, ఒకబాణము, ఒక భార్యావ్రతు'డని త్యాగరాజు కీర్తించాడు. విప్రులయందు 'నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కు-దారుణాఖండల శస్త్రతుల్యము' అని భారతం చెపుతుంది.

నిజంగా కొన్ని పరిస్థితులలో మౌనం మంచిదే. అందుకేమీ అభ్యంతరం లేదు. తెలియని సంగతులనుగురించి వ్యర్థప్రసంగాలు చెయ్యడంకంటే నోరుమూసుకుని కూర్చోవడం అన్నివిధాలా మంచిదే, లేకపోతే నోటినుంచి ముత్యాలురాలవు కాని అజ్ఞానం మాత్రం బయటపడితీరుతుంది. చెప్పడానికేమీ సంగతులు లేనప్పుడు ఆ విషయాన్ని మాటల సాక్ష్యంతోసహా ఋజువు చెయ్యవలసిన అవసరమేమీలేదు. అందుకే భర్తృహరి

'సర్వవిదులగు సుజనుల సభలలోన
మౌనమె విభూషణము మూఢ మానవులకు'

అని చెప్పారు. నోరెత్తని బుద్ధిహీనుడు కూడా పండితుడేనని ప్రజలు భావిస్తారని బైబిల్ చెపుతుంది. ఐతే ఆ విధంగానే అజ్ఞులగు దుర్జనుల సభలలో పండితులకు కూడా మౌనమే విభూషణంకావచ్చు. ఈ వ్యవహారమంతా గ్రహించిన వాడుగనుకనే గ్రీక్ వేదాంతి పైథాగరస్ తన శిష్యులు, ఐదేళ్ళపాటు తన దగ్గర చదువుకున్న తర్వాతగాని నోరు విప్పకూడదని ఒక నియమం ఏర్పరిచాడు. ఈ లోపల వాళ్ళు చర్చించడాని కేవిధంగానూ అర్హులుకారనీ, కనుక ఏదైనా వాళ్ళు మాట్లాడినా అది వ్యర్థప్రసంగమే అవుతుందనీ అతని అభిప్రాయం.

ఇక విదేశరాయబారులు తమ దేశానికీ తాము వెంచేసిన దేశానికీ మధ్యఉండే అగోచరసుకుమారమైన స్నేహసూత్రాన్ని దృఢంచేసినా చెయ్యకపోయినా, కనీసం తెగిపోకుండానైనా చూడాలిగనుక చిత్తంవచ్చినట్లల్లా తమ అమూల్యాభిప్రాయాలను వాళ్ళు వెళ్ళడించడానికి వీలుకాదు. అందుకే డీన్ ఇంగ్ అనే ఇంగ్లీషు వ్యాసకర్త చమత్కారంగా విదేశరాయబారులు దాదాపు ఆరు భాషలలో మౌనంగా ఉండడం నేర్చుకొన్నారనీ, పైగా భాష అభిప్రాయాలను కప్పిపుచ్చడానికేర్పడిన సాధనమని కూడా వాళ్ళు గుర్తించారనీ అన్నాడు.

ఐతే అన్ని పరిస్థితులలోనూ మాటకంటె మౌనమే శ్రేష్ఠమంటే మాత్రం అదికూడా సరియైన వాదంకాదు. 'ఆడనిమాట అపకారం చెయ్య'దన్న రచయిత కేవలం అప్రియమైన విమర్శలను, నిందలను చెయ్యకపోవడంలో ఉండే సౌక ర్యాన్ని దృష్టిలో ఉంచుకుని ఆ మాట అన్నాడు. కాని నిజంగా ఆడనిమాట అపకారం చెయ్యదా అని ఆలోచిస్తే ఒక్కొక్కప్పుడు, ఆడిన మాటకంటె ఆడని మాట ఎక్కువ అపకారం చేస్తుందనిపిస్తుంది. మెప్పును, స్నేహాన్ని, లాలనను, ప్రేమను ఆశించి పొందక పోవడంవలన కలిగే నిరుత్సాహమూ, నిస్పృహా ఎంతో కఠినమైన విమర్శకు గురియైనప్పుడుకూడా కలగవు. చక్కగా వ్రాయడానికి ప్రయత్నించే విద్యార్థి కృషిని మెచ్చుకోని ఉపాధ్యాయుడూ, నిద్రాహారాలు మాని కష్టించి పని చేసిన సేవకుడి విశ్వాసాన్ని గుర్తించి ప్రశంసించని యజమానీ, మమతతో నిండిన మనస్సుతో సమీపించిన ప్రియురాలిని ఆదరించి మాట్లాడని పురుషుడూ, ఉపకారం పొందికూడా ఉదాసీనత వహించే కృతఘ్నుడూ తమ మౌనంతోచేసే అపకారాన్ని ఎటువంటి క్రూరమైన మాటలతోనూ చెయ్యలేరు. తా నొక ఘనకార్యం చేసినట్టు భావించి మెప్పుకోసం చేతులుచాచి దగ్గరకు చేరిన పసిపాప చిరునవ్వును తుడిచి వేసే మౌనం ఏ విధంగా హర్షించ దగినది ? తన విషాద గాథను చెప్పుకుని గుండె బరువు తగ్గించుకోవాలని సమీపించిన స్నేహితునికి సానుభూతి చూపించనీయని మౌనం ఏ విధంగా ఘనమైనది ? ఇటువంటి పరిస్థితులలో మాటకంటె మౌనం మేలని ఎవరనగలరు ?

లౌకిక బంధాలను తెంచుకొని, ప్రాపంచిక కర్మ కలాపాలకు దూరమైన మునులకూ, యోగులకూ మౌనం నియమం కావచ్చు. ఇంకా ప్రపంచంలోనే కన్నీ టికీ, చిరునవ్వుకూ దూరం కాకుండా జీవించేవారికికూడా కొన్ని సందర్భాలలో మౌనం విభూషణం కావచ్చు. ఐతే మాటకు పరిమితులున్నట్టే, మౌనానికికూడా పరిమితులున్నాయని మాత్రం గుర్తించవలసి ఉంటుంది. ఒకవేళ నిజంగా 'మాట వెండి. మౌనం పసిడి' అని అనుకున్నా, పెట్టెలలో దాచుకోవడానికి పసిడి పనికి వస్తుందికాని, నిత్య వ్యవహారాలకు మాత్రం వెండితోనే ఎక్కువ పని ఉంటుంది. అందుకే జర్మనుకవి గెథే "మౌనంలో జ్ఞానం వికసిస్తుంది. కాని శీలం మాత్రం జన మధ్యంలోనే ఏర్పడుతుంద" దన్నాడు.

(26-10-1957 స్వతంత్ర; వెలుగు-నీడలు)

# అన్నదానం

—శ్రీ దాను వామనరావు

"అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణ భవానివై
సాక్షి గణపతి గన్నతల్లివి సద్గుణాకర శాంభవీ
మోక్ష మొసగెడి కనకదుర్గవు మూలకారణ శక్తివీ
శిక్ష జేతువు సర్వలోకము శ్రీగిరి భ్రమరాంబికా—"

'శ్రీమత్పార్వతీ పతయేనమః, భోజనకాలే భగవన్నామ స్మరణ, హరహర మహాదేవ్' అని మన భారతదేశంలో హిందూసంఘములో మారుమ్రోగినట్లుగా యింకొక దేశంలోగాని, యింకొక జాతిలోగాని, ఎన్నడూ మారుమ్రోగలేదని, ఢంకామీద దెబ్బకొట్టి, ఘంటాపథంగా చెప్పవచ్చు. కాశీవంటి మహాపుణ్యక్షేత్రము నందు బ్రహ్మాండమైన పండిత పరిషత్తులు జరుగుతూఉండేవి. ఆ సమావేశములకు సకలశాస్త్ర పారంగతులును, నియమనిష్ఠాగరిష్ఠులును వేదపండితులును చాలమంది హాజరవుతూ ఉండేవారు. అట్టి పండితమండలికి, ఆ సమావేశములు జరిగినంత కాలమూ నిరతాన్నప్రదానము చేయుటకు కాశీనగరములో కొన్ని సత్రములు శాశ్వతముగా ఏర్పాటుకావలసి వచ్చింది. ఇటువంటి పండితగోష్ఠి సమావేశము ఒక్కచోటనే దీర్ఘకాలంగా జరుగుతూ ఉండడమున్నూ ఆ పండితులకందరికీ, అక్కడ భోజనాది వసతులు ఏర్పాటు చేయడమున్నూ, అందుకొరకై ధనికులైన వారున్నూ ప్రభువులైన వారున్నూ పూనుకొని తగిన వసతులు కల్పించి వస్తుసామగ్రులను సప్లయిచేయడమున్నూ, ఒక మహాక్రతువుగా బ్రహ్మాండమైన సత్కార్యముగా భావించి నిర్వహించేవారు. అటువంటి సత్కార్యనిర్వహణమే సత్రయాగం అన్నారు. సకల మునిజన శరణ్యంబైన నైమిశారణ్యంబున శౌనకాది మహామునులు సమావేశమై పురాణేతిహాసంబులను సకలజన సామాన్యానికి సుబోధకంగా వివరించి చెప్పుతూ ఉండేవారు. ఆ విధంగా నైమిశారణ్యం ప్రజాబాహుళ్యానికి సద్గోష్ఠిని సత్కాలక్షేపమును కల్పించినటువంటి ప్రయోజన విద్యాపీఠంగా ఉండేది. అచ్చుగ్రంథాలు అనేటటువంటివి లేనటువంటి కాలంలో ప్రతివాడున్నూ భారతభాగవత

రామాయణాదుల తాటియాకు ప్రతులు వ్రాయించి తెచ్చుకొని చదవడం అసాధ్యం, అసంభవం. కాని, యీ గ్రంథములలోని రమ్యమైన కథానందర్భములందు అనేక వేదాంతవిషయములు, లోకనీతులు, రాజనీతులు, బోధింపబడుతున్నవి. సంఘంలో జనసామాన్యానికి కావలసిన ఐహికాముష్మిక జిజ్ఞాస కలుగజేయుటకున్నూ, దైవ భక్తి, పాపభీతి, లోకనీతి, శాస్త్రరీతి బోధపడుటకున్నూ, యీ పండితసమావేశము లందు మహా తపస్సంపన్నులైన, త్రికాలవేదులైన పుణ్యపురుషులగు మహాత్ముల ముఖతః యీ పురాణములను సవ్యాఖ్యాన విమర్శలతో, వింటూ ఉండడంకంటె, ప్రజలకు యింకొక పరమానందకరమైన ప్రసంగంగాని, ప్రసక్తిగాని ఏదైనా ఉండగలదా ? ఈ పురాణ కాలక్షేపాల మూలంగానే సంఘబాహుళ్యానికి కావలసిన ఐహికజ్ఞానమూ, ఆత్మజ్ఞానమూ అచ్చు గ్రంథాలులేని ఆనాటి అతిప్రాచీనకాలంలో అవలీలగా వెదజల్లుటకు వీలైంది. ఇటువంటి పండితప్రసంగ సమావేశాలు ప్రజాసా మాన్యంకోసం బహిరంగసమావేశాలుగా జరుపబడుతూఉండేవి. ఈ బహిరంగసభలు, సమావేశాలు మాత్రమేగాక పండితులైనవారు అనేక సూక్ష్మవిషయములను వారిలో వారు పరస్పరం చర్చించుకొనుటకు అవకాశము ఏర్పడేది. ఇటువంటి పండితులను సమావేశపరచడం చాలా అవసరమైన విషయం. ప్రభువులు అందుకు పూనుకోవాలి. అందుకు కావలసిన సకలసదుపాయ భోజనవసతి సౌకర్యములను కల్పించాలి. ఇటువంటి మహాయాగములు, పండితసద్గోష్ఠి అనేదిమాత్రము నిత్యవిధిగా జరుగుతూ ఉండాలి. అందుకొరకై చేయబడే భోజనవసతి సౌకర్యములు దీర్ఘకాలం సాగుతూ ఉండాలి. దానినే సత్రయాగం అన్నారు. అటువంటి సత్రయాగంకోసం నిర్మింప బడిన శాలలు కొన్ని స్థిరంగా ఉండవలసిన అగత్యం కనిపించింది. వీటినే సత్రయాగశాలలు అన్నారు. కాశీవంటి మహా పుణ్యక్షేత్రములందు చాలామంది పండితులు స్థిరస్థాయిగా మకాములేర్పరచుకొనుచుండుటవల్ల అక్కడనే మహాపండిత పరిషత్తులు తరచుగా నిత్యవిధిగా జరుగుతూఉండేవి. ఆ కారణంచేత అక్కడనే పెద్దపెద్ద సత్రయాగశాలలు అనగా సత్రములు స్థిరంగా ఏర్పడ్డాయి. సత్రయాగం అంటే ఏమిటో అని సంఘవిజ్ఞాన వికాసానికి ఎంత అవసరమో గ్రహించినట్లయితే యీ అన్నసత్రముల ప్రయోజనం కూడా మనకు సులభంగా బోధపడుతుంది. అటువంటి సంఘవిజ్ఞాన వికాసమునకై యీ విధంగా ప్రభువులు, ధనికులు తమ ద్రవ్యమును విద్వినియోగం చెయ్యడంకంటె మరొక పుణ్యకార్యంలేదని గ్రహించారు. తదాదిగా నైమిశారణ్యంలో శౌనకాది మహామునుల సమావేశంగా ప్రారంభమైన

సత్రయాగమునకుగాను ప్రారంభింపబడిన సత్రములు స్థిరస్థాయిగా దేశమంతటా విస్తరించినవి.

అన్న సత్రములకొరకై చేసిన ఖర్చు పండిత బృందముల సద్గోష్ఠులకొరకై ప్రజల విద్యావికాసముకొరకై చేయబడిన ఖర్చుగా రాజులు, మంత్రులుకూడా గ్రహించగలిగిన కాలం అది. పుణ్యక్షేత్రములకూ దేవస్థానములకూ వినియోగింపబడే నిమిత్తమై స్వామి కైంకర్యార్థముగా చాలామంది పరోపకారపారీణులు, ధార్మికులు, తమ ద్రవ్యాన్ని, స్థిరచరాస్థులనూ దానంచేస్తూ ఉండేవారు. ఆ దేవస్థానముల ఆదాయములను సద్వినియోగంచేస్తూ పండితులను అక్కడ పోషిస్తూ ఉండేవారు. ఆ పండితులవద్ద విద్యాభ్యాసం చేయగలవారి కొరకై విద్యాపీఠములు ఉండేవి. ఈ పండిత సద్గోష్ఠి కొరకున్నూ విద్యార్థుల కొరకున్నూ సత్రములు నిర్మింపబడుతూ ఉండేవి.

కాని కాలం మారిపోయింది. భగవద్భక్తికీ ప్రజల భుక్తికీ సంబంధంలేదనే కాలం వచ్చింది. శాస్త్రజ్ఞానం భుక్తికేకాని ముక్తికి కాదన్నారు. సత్రాలు అనేవి సాపాటుకోసమే కాని సద్గోష్ఠికొరకు కాదన్నారు. విద్య నేర్చుకొనడం విద్యార్థికి ఎందుకయ్యా అంటే విద్యార్థియొక్క భుక్తికోసం జీవనోపాధికోసం. విద్య నేర్పడం అనేది ఉపాధ్యాయునకు ఎందుకు పచ్చినపని అంటే ఉపాధ్యాయుని భుక్తికోసం, జీవనోపాధికోసం. బ్రతుకలేక బడిపంతులుపని అన్నారు. కనుక విద్య నేర్పడం భుక్తికోసం - విద్య నేర్చుకొనడం భుక్తికోసం - ఒకప్పుడు విద్యా పీఠాలకూ, అన్న సత్రాలకూ అవినాభావ సంబంధం అత్యంత సన్నిహితంగా ఉండేది. చదువు చెప్పెడి గురువులు తామే స్వయంగా విద్యార్థులకు భోజన వసతి సౌకర్యాలను కలుగజేసి తాము నేర్చిన విద్య అంతా సాంగోపాంగంగా ఏళ్ళకొలదీ విద్యార్థులను పోషించి వారికి నేర్పేవారు. విద్యార్థులవద్ద నెల జీతాలు పుచ్చుకొని, తమ విద్యను అమ్ముకోలేదు. కీ॥ శే॥ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రులుగారు తమ గురువువద్ద ఆ విధంగా చదువుకొన్నారు. కీ॥ శే॥ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రులుగారు తమ శిష్యులకు తమ సంగీత విద్యను ఆ విధంగా బోధించి వారిని తరింపజేసి తాము తరించారు. విద్యను అమ్మేటటువంటి విద్యాపీఠములు ఆ కాలంలో లేవు. అన్నమును విక్రయించే టటువంటి సత్రములులేవు.

కీ॥ శే॥ వీరేశలింగం పంతులుగారు రచించిన ''సత్యరాయాచార్యుల దేశయాత్రలు'' అనే గ్రంథంలో సత్యరాయాచార్యులు మళయాళ మంత్రములు నేర్చ

కొనుటకై ఆంధ్ర దేశంనుంచి మళయాళమునకు ప్రయాణమైనాడు. మద్రాసు మహా నగరంలో మొదటిసారిగా రైలుదిగి సరాసరి "ముక్కాలు రూపాయిచ్చి" జట్కా చేసికొని రామస్వామి మొదలియారువారి అన్నసత్రమునకు చేరాడు. ఆనాడు ద్వాదశి కావడంచేత అక్కడ అవిశ ఆకు కూరతోసహా భోజనం చేశాడు. తన భోజనానికి అయిన చార్జీ (మొత్తం) యివ్వవలెనని సత్యరాయాచార్యులవారిని సత్రపు అధికారి అడిగేసరికి ఆయన ఆశ్చర్య పోయినాడు. 'అన్న సత్రం' అని బయట వ్రాయబడించి. అందువల్ల సత్రంలో ఉచితంగా భోజనము పెట్టబడునని ఆయన భ్రమించాడు. కాని యీ సత్రంలో అన్నం విక్రయిస్తారని సత్యరాయాచార్యులవారు ఎన్నడూ అనుకోలేదు.

'సత్రము' అనే శబ్దానికి ఆంధ్ర నిఘంటువులో మాత్రము ఇంకా 'అన్న విక్రయశాల' అనే అర్థం వ్రాయలేదు.

సత్యరాయాచార్యులు బహుశః రాజమహేంద్రవర ప్రాంతంనుంచి అనగా గోదావరీ ప్రాంతంనుంచి బయలుదేరిన ఆంధ్రుడు అగుటచేత 'సత్రం' లో అన్న విక్రయంచూచి ముక్కుమీద వేలు వేసికొన్నాడు.

తూర్పు గోదావరి జిల్లాలోని గన్నవరములో కన్నపు దొంగలకుకూడా కడుపునిండా భోజనముపెట్టి సత్కరించిన డొక్కా సీతమ్మగారు సాక్షాత్తూ ఆంధ్ర దేశంలో అవతరించిన అన్నపూర్ణాదేవి. "అతిధు లేతేర నడికిరేయైన బెట్టు, వండ నలయదు వేవురు వచ్చిరేని అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి" అనే పెద్దన గారి పద్యం ఆమెకు పూర్తిగా వర్తిస్తుంది.

సస్యశ్యామలమై పాడిపంటలతో తులతూగుతూ ఉండేటటువంటి కోనసీమ ప్రాంతంలో జరిగిన అన్న ప్రదానాలు, మహా సంతర్పణలు తలుచుకుంటే, ఆంధ్ర ములో పంచమ వేదమునకు పునాదివేసిన నన్నయ్యభట్టువంటి మహా పండితుడు ఆంధ్ర మహా భారతమును సుక్షేత్రమైన గోదావరీ తీరంలో ప్రారంభించక ఊసర క్షేత్రాల్లో ప్రారంభిస్తాడా ? అనిపించగలదు.

గోదావరీ తీరంవలె గోల్కొండకూడా ఒకనాడు అన్నదానానికి ప్రసిద్ధి వహించింది. గోల్కొండ నవాబుల కాలములో అనగా అక్కన్న మాదన్నలు మంత్రులుగా ఉండి అధికారం నిర్వహిస్తూన్న రోజులలో ఆంధ్రదేశంలోనే అనేక ప్రాంతములు ఘోరమైన కరువులతో మలమల మాడిపోయినాయి.

'అన్నం దేవర సన్న గిల్లితే గోలకొండకు జాతుంరే' అనే పాట ఒకటి ఆ కాలంలో పరిపాటి అయింది. అక్కన్న మాదన్నలు ఆ కరువు రోజులలో అనేక అన్నసత్రములు వేయించారు. అన్నాతురులైన ప్రజలకు యీ సత్రములలో నిరంతరముగా భోజనము పెట్టుతూ ఉండటానికి ఏర్పాట్లు చేయించారు. ఈ సత్రములన్నింటినీ తనిఖీచేసి రిపోర్టులు వ్రాస్తూ ఉండడానికి సత్రాల ఇనస్పెక్టర్లను నియమించారు. ఆనాటి రిపోర్టులు కొన్ని చరిత్ర పరిశోధకులకు లభించాయి. ఒకానొక సత్రము తాలూకు వ్యవహారములను వివరిస్తూ ఒక ఇనస్పెక్టరు వ్రాసిన విషయం గమనించదగియున్నది.

ఆ సత్రంలో అందరూ భోజనం చేస్తున్న సమయంలో ఒక బ్రాహ్మడు కందిపచ్చడి మరికొంత వడ్డించ వలసినదిగా అడిగినాడట. అప్పుడా వంట బ్రాహ్మణుడు మరికొంత పచ్చడిని వడ్డించుటకు నిరాకరించాడు. అందుమీదట ఉభయులకూ కొంత ఘర్షణ జరిగింది. అప్పుడా వంట బ్రాహ్మణుడు ఆగ్రహావేశుడై భోజన పంక్తిలో కూర్చున్నవానిని కొట్టి ఎంగిలి విస్తళ్ళు పడవేసే టటువంటి గోతిలోనికి యీడ్చినాడు.

ఈ విధంగా వడ్డించేవాడు మనవాడు కానప్పుడు పై అధికారులు ఎంత అన్నదానం చేసినప్పటికీ, మనకు అన్యాయం తప్పక జరుగుతుంది. వడ్డించేవాడు మనవాడైతే కడపంక్తిని కూర్చున్నా భయంలేదు. సమస్త పదార్థములూ సమృద్ధిగా వడ్డింపబడగలవు. చెక్కుపూటుగా షడ్రసోపేతంగా భోజనం చేయవచ్చు. కడపంక్తిలోకూర్చుని వడ్డించేవానిని ఆశ్రయించడంకంటె, లోపలి పంక్తిలో కూర్చుంటే ఆయా పదార్థాలు మున్ముందుగా వడ్డన అవుతూ ఉంటాయి. అటువంటి లోపలి పంక్తి భోక్తలకు మర్యాదలోపం సామాన్యంగా జరుగదు. యజమాని ఒక్కొక్కప్పుడు స్వయంగా వారి పంక్తికివచ్చి వడ్డన చేయడంకూడా కలదు. బయటి పంక్తిలోని వారికన్న లోపలి పంక్తిలోనివారికి యథేచ్ఛగా కావలసినది అడిగి వడ్డించుకొనే స్వాతంత్ర్యం ఎక్కువగా ఉంటుంది. సమృద్ధిగా ఝూరీతో గంగాప్రవాహంలాగున నెయ్యి వడ్డించని యెడల "అన్నదానంచేసే మహారాజు అన్నీ సప్లయిచేస్తే వడ్డించేవాడివి నీ చెయ్యి వెనక్కి పోతున్నదేం?" అని ఆగ్రహించి లాగి లెంపకాయకొట్టి అధికారంచేసి ఆజ్యం వడ్డించుకొన్న ఆంధ్ర భోక్తలు ఆ కాలంలో ఉండేవారు.

ఒక బ్రాహ్మడికి వివాహ సమయమందు సదస్య సంభావనలో చాలా తక్కు-వగా ముట్టింది. అతని సాటివాళ్ళకు అర్ధరూపాయిఇస్తే అతనికి పావలా యిచ్చారు. ఆ కారణంచేత సంభావనలో వచ్చిన పావలా లోటును నేతిలో తీస్తానని శపథంపట్టి పెళ్ళితో భోజనానికివచ్చి ఝారీల కొలది నెయ్యి తన విస్తరిలో వడ్డించేటట్లు చేసి తన కోపాగ్నికి ఆ నేతిని ఆహుతిచేశాడు. ఇటువంటి అగ్ని హోత్రావధానులను చూసి ఆనందించే గృహస్థులుకూడా ఉండేవారు. అట్టివారి భోజన శక్తికి మెచ్చి పాకితోషికాలుకూడా ఇచ్చిన యజమానులు ఉన్నారు. భోజనం అంతాఅయి ఆఖరు ఘట్టంలోకి వచ్చిన సమయంలో పెద్దపెద్ద లడ్డూలుతెచ్చి ఎక్కువ లడ్డూలు తిన్న దొడ్డ బ్రాహ్మడికి భూరి దక్షిణలిచ్చి సత్కరించిన అన్నదాతలుకూడా ఉండేవారు.

ఆనాటి సంతర్పణలు, సమారాధనలు, అన్నదానాలు, విశేషంగా జరిగి నటువంటి గోదావరీ ప్రాంత కోనసీమ గ్రామాలలోని అటువంటి దాతలు అటువంటి భోక్తల కథలు పురాణగాథలవలె వింటేనేచాలు. నేటి కాఫీ హోటళ్ళ కషాయాలు త్రాగి కాలక్షేపం చేసేవారికి అసలైన ఆకలి ప్రబోధం కలుగుతుంది.

మన ప్రాచీన భోక్తలలో ఒకప్పుడు ఉండినటువంటి భోజన పుష్టిగాని, భోజన తత్పరతగాని, ఒక విధమైన ఉపాసనవలె పరిణమించింది. అన్నపూర్ణాదేవి యొక్క ప్రియభక్తులు వీరు. 'అన్నం' బ్రహ్మ స్వరూపం అన్నారు. "భోక్తాచ బ్రహ్మ"-భోక్తకూడా బ్రహ్మ స్వరూపం అన్నారు. తినే భోక్తయున్నూ తినబడే అన్నమున్నూ రెండూ బ్రహ్మ స్వరూపములే - అటువంటి సందర్భంలో బ్రహ్మను బ్రహ్మ తింటున్నాడని గ్రహించాలి. ఆ విధంగా భుక్తిలో భోక్తలీనం కావడంవల్లనే పరబ్రహ్మ సాక్షాత్కారం అవుతుంది అన్నారు. ఒక పెద్దమనిషి చెక్కపూటుగా విందు భోజనంచేసి భుక్తాయాసంతో శ్వాస ఆడక వీధి అరుగుమీద పరుండి చాలా బాధపడుతూ ఉన్న సమయంలో ఒక మిత్రుడు అతనిని సమీపించి "స్వామీ! రవ్వంత వామూ ఉప్పూ నలిపి తెచ్చియిస్తాను పుచ్చుకోండి. దానితో భుక్తాయాసం తగ్గుతుంది తమకు" అన్నాడు. అని ఆ భోజన తత్పరుడు ఆ మాటలను లక్ష్యం చేయలేదు - "వాముపోయ కడుపులోకి పోయేటంత సందుఉంటే, ఇంకొక్క లడ్డూనే తినగలను - చాలును. నీ హితోపదేశం పోపో'' మ్మన్నాడు. ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకు భీష్ములవారు అంపశయ్యమీదనే పరుండినట్లుగా, అతడు భుజించిన ఆహారం జీర్ణముఖమునకు వచ్చేవరకు ప్రశాంతంగా భగవంతుణ్ణి స్మరించు కొని బాధను ఓర్చుకొన్నాడు.

ఇటువంటి భోక్తలు కొందరు అన్నపూర్ణాదేవిని స్మరించి ఆత్మ సాక్షాత్కారం కూడా పొందిఉన్నారు. చిత్రాన్నంలోగాని (అనగా పులిహోరలోగాని) ఆవడలలో గాని తరచుగా ప్రత్యక్షమయ్యేటటువంటి మిరపకాయలతోసహా నిశ్శేషంగా అతి శ్రద్ధగా ఆరగించేటటువంటి ఒక మహాశయుడు (ఒక మహాశనుడు) గాఢ నిద్రలో ఒకనాడు "ఆహా...హా..." అని కలువరించడం సంభవించింది. "ఏమిటది ?" అని కేకవేసి అతనిని మేల్కొల్పుటకు ప్రయత్నింపగా, అతని కంటివెంట బొటబొటమని ఆనంద బాష్పాలుకూడా వచ్చాయి. అతనికి ఆ నిద్రలో ఏదో భగవత్సాక్షాత్కారం అయినదని అందరూ భావించాము. తెల్లవారిన తర్వాత నిజ సందర్భ మేమిటని అతనిని ప్రశ్నింపగా అతడు తన స్వప్న వృత్తాంతము సవిస్తరంగా చెప్పాడు. వేణుగోపాలస్వామి ఆలయమునకు తాను వెళ్ళినట్లుగాను అక్కడ ధనుర్మాసం ప్రసాదంగా తనకు కోరినంత పులిహోర వంచిపెట్టబడినట్లున్నూ కల వచ్చిందట. ఆ పులిహోరలోని మిరపకాయలను విడిచిపెట్టకుండా తాను ఆరగిస్తూ ఉండగా ఆనంద పరవశత్వంకలిగి ఆహా అని కలువరించడమున్నూ మిరపకాయల ఘాటువల్ల తన కంటివెంట ఆనంద బాష్పాలు ప్రవహించడమున్నూ సంభవించిన దన్నాడు.

ఇంతటి శ్రద్ధాసక్తులతో భోజనంచేసే భోక్తలు శ్రాద్ధ సమయంలో లభించడం వల్ల నిజంగా పితృదేవతలు పితృలోకంనుంచి దిగివచ్చి ఆసక్తితో ఆదరణతో ఆరగిస్తున్నారనే భావంతో ఆనందించే గృహస్థులున్నారు. పూర్వ మొక గృహస్థు ఇంట్లో అతని భార్య వినయ విధేయతలతో సహకరించుటవల్ల పెట్టవలసిన శ్రాద్ధం చాలా శ్రద్ధాసక్తులతో ముగించాడు. అతని యింటి కొక సాహెబ్బుగారు ఆనాటి సాయంకాలంవచ్చి గారెలు వగైరాలతో భోజనంచేసి వెళ్ళిపోయేముందు అన్నదాత అయిన గృహస్థును ఆశీర్వదించడం తన కర్తవ్యం అని నిశ్చయించుకొన్నాడు. "ఏమండీ మన యింట్లో గారెలు, పాయసం అన్నీ చేశారు. ఏమిటి విశేషం?" అని ప్రశ్నించాడు. "ఏమీలేదు సాహెబ్బుగారూ ! నా మొదటి భార్య శ్రాద్ధం యీ రోజున" అని ఆ గృహస్థు జవాబు చెప్పాడు. అది యజమాని భార్యకు సంబంధించిన ఒక శుభకార్యం అని ఆ సాహెబ్బుగారు భ్రమపడ్డాడు. అందువల్ల "బాబూ ! మీ యింట్లో ఎప్పుడూ మీ భార్యాగార్ల శ్రాద్ధాలు సమృద్ధిగా వృద్ధి అవుతూ ఉండాలి. అంతే నేను కోరేది" అని ఆ సాహెబ్బు నిష్కపటంగా దీవించి వెళ్ళిపోయినాడు.

అన్నదాతల ఖ్యాతి ఏ విధంగా అడుగంటిందో అదే విధంగా అన్ని దినాలలో అన్నదానం మిన్న అనేటటువంటి ఖ్యాతి అన్నదానానికికూడా పోయింది. ఇది సత్రముల యుగంకాదు. హోటళ్ళ యుగం. ఇది సంతర్పణల సమారాధనల యుగం కాదు. ఇది టీపార్టీల యుగం.

'అక్షయంబుగ కాఫీ హోటలున
అయ్యరే భగవంతుడై'

అవతరించి సర్వాంతర్యామిగా వెలసిన యీ యుగంలో ప్రతి కాఫీ హోటలు లోనూ భోజనకాలే రేడియోలో తాజా తారల కీర్తనలు అక్షయంబుగా వినిపిస్తూ ఉన్నాయి. 'అక్షయంబుగ కాశిలోపల' అనే సంకీర్తనను, సత్రాలకు స్వస్తి చెప్పడమైంది. కాని సర్వవర్గ సర్వవర్ణ సమాన ప్రతిపత్తిని ఉద్బోధించెడి వన సమారాధన సంతర్పణ భోజనములను కార్తీకమాస మందైనను జరుపుతూ ఉండడం అవసరం. నైమిశారణ్య సమావేశ సంప్రదాయార్థములను యీ వనసమారాధనల మూలంగా నైనను సంస్మరించడం శ్రేయస్కరం.

(5-11-1952 - ఆంధ్ర పత్రిక - కాలక్షేపం)

# ఆశ - నిరాశ

—శ్రీ నండూరి రామమోహనరావు

నువ్వు ఆశా వాదివా? నిరాశా వాదివా? అని ఎవరైనా ప్రశ్నిస్తే మరో ఆలోచన లేకుండా నిరాశా వాదినని చెప్పేస్తాను. ఎందుకంటే నేను నిజంగా లోలోపల ఆశావాదిని. కాని, ఆ ముక్క ఎప్పుడూ పైకి చెప్పను. స్వానుభవంవల్ల ఈ జీవిత సత్యం నేర్చుకున్నాను.

ఒకటికాదు. రెండుకాదు. నేను పుట్టి ఎరిగిన తరవాత ఎన్నో అనుభవాలు నెత్తిమీద మొట్టుకుంటూ వచ్చాయి. ఎన్నోసార్లు తలబొప్పి కట్టింది. దాంతో ఇహ లాభంలేదని నిరాశావాదిగా మారిపోయాను, ఆశావాదిగా ఉంటూనే.

కొన్ని ఉదాహరణలిస్తేగాని ఈ జీవిత సత్యం మీకు బోధపడదు.

నాకు బాగా జ్ఞాపకంఉన్న ఒక అనుభవం నా ఆరోగ్యానికి సంబంధించింది. ఒకసారి స్నేహితుల దగ్గిర - పబ్లిగ్గా - బడాయి పోయాను; నాకు జ్వరం వస్తే రాదని, ఇంతవర కెప్పుడూ రాలేదని.

రెండో రోజునో మూడో రోజునో చచ్చేంత జ్వరం ముంచుకొచ్చింది. ఆ చెబ్బ దెబ్బ నెల్లాళ్ళదాకా మంచం పట్టాను.

అప్పటినుంచి పద్ధతి మార్చేశాను. ఎవరైనా నన్ను "ఏమోయ్, బావున్నావా?" అని అడిగితే, "ఆ, ఏం బావుండడంలెండి, ఎప్పుడూ ఏదో నలతగా ఉంటూనే ఉంటుంది. ఆరోగ్యం బొత్తిగా చెడిపోయింది. నీరసంగా ఉంటోంది" అని సమాధానాలు చెబుతూ ఉంటాను. అలా చెప్పడంవల్లే ఆరోగ్యానికి, అనారోగ్యానికి మధ్యస్థంగా బతు కీడ్చుకొస్తున్నాను.

దీనికి నేను కనిపెట్టిన ఒక సూత్రం వుంది. 'నా కెప్పుడూ జ్వరంరాదు' అని బడాయిగా చెబితే జ్వరానికి కోపం వస్తుంది. "ఓహో! వీడిపని ఇల్లా ఉందా? వీడి పొగరు అణుస్తానాగు!" అని మీది కొస్తుంది.

అలా కాకుండా "ఒంట్లో బాగుండడంలేదుసార్ !" అని వినయంగా చెబితే "ఫరవాలేదు. వీడు బుద్ధిమంతుడిలాగానే ఉన్నాడు" అని దయతలిచి జ్వరం మన జోలికిరాదు.

అంటే ఏమిటన్నమాట ? మనుష్యులకి జంతువులకేకాక, ప్రాణంలేని వస్తువు లకీ జరగబోయే సంఘటనలకీకూడా పరేంగిత జ్ఞానం ఉంటుందన్నమాట. అవి మన్ని ఏడిపించాలంటే ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాయి. అనుగ్రహం కలిగితే ఆకాశాని కెత్తేస్తాయి. నిజానికి అవే మన జీవితాన్ని తమ చెప్పు చేతల్లో ఉంచుకొని మన్ని నడిపిస్తున్నాయి.

ఈ విషయం మీకు అర్థం కావడానికి మరికొన్ని ఉదాహరణలు చెప్పాలి.

మౌంటు రోడ్డులో మీరు ఒకటో నంబరు బస్సుకోసం నిలబడతారు. మీరు అర్జంటుగా వెళ్ళవలసి ఉన్నట్టు దానికి తెలిసిపోతుంది. ఎంతసేపు ఎదురుచూసినా ఛస్తేరాదు. మీకు అక్కర్లేని నంబర్ల బస్సులెన్నో వస్తాయి, పోతాయి. ఆరుద్ర మల్లే 'నీవు ఎక్కదలచిన బస్సు ఎప్పుడూ ఒక జీవిత కాలం మిస్సు—' అనుకుంటూ నిరాశలో కుంగిపోతుంటారు.

అయితే, ఇక్కడే మీకు నేను చెప్పిన నిరాశావాదం అక్కరకు వస్తుంది. (నిరాశ వేరు, నిరాశావాదం వేరు) అప్పుడేం చెయ్యాలంటే, 'ఆ, నీ పిచ్చిగాని, ఇప్పుడు ఒకటో నెంబరు బస్సు ఎందుకు వస్తుంది ? రాదు రాదు. అదిగో ఆ వచ్చేది ఇరవై ఒకటో నెంబరు బస్సు. అదేం, స్పష్టంగా నంబరు కనబడుతుంటేనే ?' అనుకోవాలి. ఊరికే అనుకోవడంకాదు. తన్ను మోసగించడానికి అలా అనుకుంటున్నట్లు ఆ ఒకటో నంబరు బస్సుకి తెలియకూడదు. నిజంగానే, మనస్ఫూర్తిగా చిత్తశుద్ధితో నిరాశ చేసుకోవాలి. మనం బస్సుకోసం ఎదురుకూడా చూడకూడదు. మనలో మనమేదో ఆలోచించుకుంటూ పరధ్యానంగా ఉండాలి. అప్పుడు ఠపీమని ఒకటో నంబరు బస్సు వచ్చేస్తుంది. హాయిగా దానిలో ఎక్కి వెళ్ళిపోవచ్చు.

ఇలా ఎన్నిసార్లు నాకు జరిగిందో చెప్పలేను. ఎన్ని రకాల సందర్భాల్లో జరిగిందో చెప్పలేను.

ఏది జరగాలని కోరుకుంటామో అది జరగదు. ఏది జరుగుతుందని కలలో కూడా అనుకోమో అది అమాంతంగా జరిగిపోతుంది. ఇది జీవిత సూత్రం.

మీరు ఏదన్నా ఉత్తరం కోసమో మనియార్డరుకోసమో ఎదురుచూస్తూ

ఉంటారు. పోస్టువాడికోసం చూసిచూసి మీ కళ్ళు కాయలు కాస్తాయి. పువ్వులుకూడా పూస్తాయి. ఊహు. పోస్టువాడు మీ ఉనికిని గుర్తించనే గుర్తించడు. అందరికీ ఉత్తరాలిస్తాడు; అందరికీ మణియార్డర్లు ఇస్తాడు. మీకు మాత్రం ఎన్నిసార్లు అడిగినా జాలిగా "లేదుసార్" అంటాడు. రోజూ అడుగుతుంటే, "నీ మొహానికి మణియార్డరు కూడానా ?" అన్నట్టు ఒక చూపుచూసి జవాబివ్వకుండా వెళ్ళి పోతాడు.

అప్పుడు మీరు నిరాశ చేసుకుని గుండెరాయి చేసుకుని ఎదురు చూడ్డం మానేస్తారు. మీ పనిలో మీరు మునిగిపోయి దాని సంగతే మరిచిపోతారు. అప్పుడు హఠాత్తుగా 'ఎంవోసార్ !' అంటూ ఎక్కడలేని గౌరవం తెచ్చిపెట్టుకొని సలాం చేస్తున్న పోస్టువాడి కంఠం కోకిల కూతకంటే తియ్యగా వినిపిస్తుంది.

మీరు ఒక పెద్దమనిషితో పనితగిలి మైలాపూర్ నుంచి అష్టకష్టాలుపడి కోడంబాకం వెళతారు. ఆయన ఇంటిదగ్గర ఉంటాడని మీరు అనుకుంటూ, ఆయనతో మాటాడవలసిన విషయాలన్నీ తూ. చా. తప్పకుండా మాటలు, పాటలు, సినేరియోతో సహా స్క్రిప్టు అంతా సిద్ధంచేసుకుని వెడతారు. ఆయన ఇంట్లో ఉండడని మీకు గ్యారంటీగా రూపాయిన్నర స్టాంపు కాగితంమీద రాసిస్తాను.

అలా కాకుండా "అబ్బే ఆయన ఇంట్లో ఉండడు. ఎందుకుంటాడూ ? ఉండవలసిన అవసరం ఏముంది ? బహుశా ఊళ్ళోకూడా ఉండడు. ఉండడయ్యా, నీక్కాదూ చెప్పేది ?'' అని పూర్తిగా నిరాశతో, కేవలం డ్యూటీగనక వెడుతున్నట్టు వెళ్ళండి. నూటికి 90 పాళ్ళు ఆయన మీకు దొరుకుతాడు. దొరక్కపోయినా ఫరవాలేదు. మీ రెలాగూ ఉండడనే అనుకుని వెళ్ళారు కనుక మీరు నిర్ఘాంతపోరు; కుంగిపోరు. ఏమీ జరగనట్టు మామూలుగా ఇంటికి తిరిగి వచ్చేస్తారు. అదే నేను మొదటినుంచీ మొత్తుకుంటున్న నిరాశా వాదంలోఉన్న గొప్పదనం!

నాకు తెలిసిన ఒకాయనకి నాలుగేళ్ళ కూతురుంది. ఆ అమ్మాయి 'మూగ మనసులు' సినీమా పాటలన్నీ చాలా బాగా పాడుతుందని అందరితో చాలా గర్వంగా చెప్పుకునేవాడు. ముఖ్యంగా 'గోదారీ గట్టుందీ' అనేది మరీ బాగా పాడుతుందట. ఎవరూ నమ్మేవారుకారు, నాలుగేళ్ళ పిల్లేమిటి బాగా పాడడమేమిటని.

ఒక రోజున నలుగురు స్నేహితులను, ఇంటికి ఆహ్వానించాడు. స్పెషల్‌గా బజ్జీలు చేయించాడు. కాఫీ ఇచ్చాడు. తరువాత పాటకచ్చేరీ. కూతుర్ని ఒళ్ళో కూర్చోపెట్టుకుని 'పాడమ్మా, వాళ్ళంతా వింటారు' అన్నాడు.

ఆ పిల్ల పాడలేదు. ఎంతసేపు బతిమాలినా నోరెత్తలేదు. చివరి కాయన గట్టిగా గదమాయించాడు. 'పాడతావా లేదా ?' అని ఆ అమ్మాయి బావురుమంది. ఇహ ఆ పెద్దమనిషి ఎంత సిగ్గుపడి పోయాడో చూసుకోండి.

మీరు ఆఫీసులో ఏదో పొరబాటు చేశారనుకోండి. ఆఫీసరు చూడొచ్చాడా అని ధీమాగా, దర్జాగా ఆఫీసుకి వెళ్ళారా ? తప్పకుండా అవాళ మీకు తిట్లు చివాట్లు తప్పవు. అలా కాకుండా, 'బాబోయ్ ! ఆఫీసరు తిడతాడు గావునోయ్ దేవుడా ! ఏదీగతీ నాకు ?' అని భయపడిపోతూ వెళ్ళండి. ఆఫీసరు మీ సంగతే ఆలోచించకుండా తనపని తను చేసుకుపోతాడు.

ఇవాళ వర్షం వస్తుందని గొడుగు తీసుకువెళ్ళండి. వర్షంరాదు. వర్షంరాదని గొడుగు మానెయ్యండి. తడిసి ముద్దయిపోయి వస్తారు.

కథల పోటీలో మీకు ప్రైజు వస్తుందని ధీమాగా ఉండండి. రాదు. రాదనుకోండి. వస్తుంది. (రావచ్చు)

ఎలక్షన్‌లో గెలుస్తా ననుకోండి. గెలవరు. డిపాజిట్టు పోతుందనుకోండి. పోదు. గెలిస్తే గెలవచ్చుకూడా.

ఇలా ఎన్ని ఉదాహరణలైనా చెప్పగలను. ఒక్క మాటలో చెప్పాలంటే ఏది కావాలని కోరితే అది రాదు. వద్దనుకున్నది, రాదనుకున్నది వస్తుంది. ఇది నేను కనిపెట్టిన జీవిత రహస్యం.

అందుకే నా సలహా వినండి. ఏది జరగాలని మీకు కోరికగా ఉంటుందో దాన్ని ఎప్పుడూ కోరుకోవద్దు. అది జరగదనే - వీలైతే జరగకూడదనే - కోరుకోండి. అలాగే ఏది జరగకూడదని మీకు లోపల ఉంటుందో అదే జరుగుతుందని భయపడిపోతూ ఉండండి. మీకు జీవితంలో ధోకా ఉండదు.

ఈ నిరాశా వాదంతోకూడిన ఆశా వాదాన్ని ఒక సిద్ధాంతంగా 'డెవలప్' చేయడం మాత్రమే నేను చేసినపని. ఇది మన అందరిలోనూ కొద్దోగొప్పో ఉంటుంది. అందుకే మనం ఏదో ఈ మాదిరిగానైనా బతుకు వెళ్ళదీస్తున్నాము. లేకపోతే ఎప్పుడో మట్టి కొట్టుకుపోయే వాళ్ళం కాదుటండీ !

(జ్యోతి 1967)

# చెవులు

—శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

ముద్దు వచ్చినప్పుడల్లా విద్యార్థుల్ని "హరి మీ చెవులు కొయ్యా!" అనేవారు వెనకటికి మా మేష్టారు ఒకాయన. అప్పుడు ఆయన అంటూండే మాటల్ని ఇప్పుడు సావకాశంగా కూర్చుని జ్ఞాపకం తెచ్చుకుంటూంటే రకరకాలైన భావాలు వస్తూంటాయి.

అవును. చెవులు కోసేస్తే ఎలా ఉంటుంది ముఖం? చూడడానికి వికృతంగా ఉండదూ? చెవులులేని తలని ఊహిస్తే నున్నగా గుండ్రంగా పొన్నకాయలాగ కొత్తగా అసహ్యంగా కనిపించదూ? అసలు చెవులవల్లే మనిషికి అందం వచ్చిందేమో! ఒక్క మనిషికే అన్న మాటేవిటి? సమస్త జంతుజాలానికీ చెవులే అందమేమో! ఎటెన్షన్‌లో ఉన్న సోల్జర్లలాగ నెత్తిమీద నిటారుగా నిలబడిఉన్న చెవులు గుఱ్ఱానికి ఎంతో దర్జానీ మరెంతో ఆకర్షణనీ తెచ్చిపెడతాయి. దూరాన్ని ఉన్న దూడ అరుపుని చెవులు రిక్కించుకొని వింటూండే ఆవు ఎంత అందంగా కనిపిస్తుందని!

చెవులపిల్లికి ఉన్న అందం అంతా చెవుల్లోనేకదా! రెండు పక్కలా మహారాజు వేయించుకొనే వింజామరలులాగ ఇటూ అటూ పెద్దపెద్ద చెవులు కదుపుకుంటూ హుందాగా నిలబడిఉన్న ఏనుగు బలేషోగ్గా ఉంటుంది. ఇలా ప్రతి జంతువూ విలాసంగా చెవులు ఆడించుకుంటూ గర్వంగా అందంగా కనిపిస్తాయి. మురారిలాంటి ప్రముఖ సంస్కృత నాటక కర్తకి జంతువు చెవులు, అందులో మరీ ఆలాంటి ఇలాంటి కాదు, గాడిదలాంటి జంతువు చెవులు కావలసివచ్చాయి కావ్య వస్తువుకి. అభ్యుదయ రచయితల్నీ విప్లవ రచయితల్నీ కూడా మించిపోయి ఆయన సూర్యాస్తమయాన్ని గాడిద చెవిలోని ఎర్రదనంతో పోల్చాడు.

జంతువులు చెవుల్ని కదుపుతాయి. వాటి చెవులు అవి చెప్పినట్లు వింటాయి కాని మనిషి చెవులే మహా పెంకివి. ఎంత ప్రయత్నించినా అవి ససేమిరా కదలవు. వాటికి సర్వసత్తాకమైన స్వతంత్ర ప్రతిపత్తి ఒకటి ఉంది. అవి ఎప్పుడో మనిషి

అధీనంనుంచి విడిపోయి స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి. ఇలా తను చెప్పినా వినని చెవుల్ని పట్టుకుని చేసేదేంలేక జాలిగా నిస్సహాయంగా చూస్తూ ఉండి పోయాడు మనిషి, ఎదిగిన కొడుకు ఎదిరిస్తూంటే తలపట్టుకుని కూర్చున్న తండ్రి లాగ. జంతువుల చెవులేనయం బుద్ధిగా చెప్పినట్లు వింటాయి. మనిషికిలేని 'చెవుల్ని శాసించే శక్తి' జంతువులకి ఉండడాన్ని చూసి కొందరు ఈర్ష్యపడి చచ్చీచెడీ చెవుల్ని కదపడం నేర్చుకున్నారు. అదిచూసి మిగిలిన మనుష్యులు వాళ్ళని జంతువులు అని అవహేళన చేశారు అసూయతో. ట్వెల్త్‌నైట్ నాటకంలో మేరియాచేత మాల్‌వోలియోని షేక్స్పియర్ అనిపిస్తాడు 'Go shake your ears' అని హేళనగా. అంటే చెవులు కదపడాన్ని మనిషి తను చెయ్యలేడు తోటివాడు కదిపితే చూడలేడు అన్నమాట !

"అసలు చెవులు ఉండడం, అవి కదపడం, ఇదంతా ఎందుకు ? పూర్తిగా చెవులు లేకపోతే పోలే ?" అన్నాడు ఓ చెవలయ్య. అతని వాదన ఎంతో సకారణంగానూ సహేతుకంగానూ కనిపించిందినాకు. ఎమంటే అతను చిన్నప్పుడు ఎక్కాలూ పాఠాలూ అప్పచెప్పలేకపోయినప్పుడల్లా పంతులు చెవి నులిపేవాడట. ఎర్రగా కందిపోయి అది రోజల్లా మంటపెడుతూ ఉండేదట. దాంతో ఏడుపువచ్చి "ఈ వెధవ చెవి లేకపోతే బాగుండును. ఇది ఉండడంవల్లేకదా పంతులు మెలి పెడుతున్నాడు !" అనుకొనేవాడట ! చెవులు పట్టుకొని గుంజీలు తియ్యవలసి వచ్చినప్పుడూ అలాగే అనుకొనేవాడట !

ఆ చెవి గాడ్పు ఈ చెవికి కొట్టినప్పుడూ, కారంతింటే గూబ గుయ్యిమన్నప్పుడూ, చలికాలంలో విధిగా చెవికి మఫ్లర్ చుట్టుకోవలసి వచ్చినప్పుడూ, తలంటేటప్పుడు వాళ్ళమ్మ చెవిలో నూనెపోసుకోమన్నప్పుడూ, కురుపువేసి చెవిపోటు వచ్చినప్పుడూ, ఈ చెవులు కాస్తా కోసి అవతల పడేస్తే బాగుండు నని పించేదట !

చెవుల్ని తెంపాడాలనే వ్యక్తి ఇంకొకడు ఉండేవాడు. అయితే అతని కారణాలు వేరు. తలకి అటూ ఇటూ అసహ్యంగా ఈ చెవులేవిటి అందమైన భవనం మీద అటూ ఇటూ మొలిచిన రావిమొక్కలులాగ ? దొప్పచెవులూ, దోర చెవులూ, పిల్లి చెవులూ, పిట్ట చెవులూ, పొట్టి చెవులూ, సొట్ట చెవులూ ఉండడంకంటే లేకపోవడమే అందం. శ్రీకారంలాంటి చెవులంటూ ఊసుపోక వర్ణించారుకాని కవులు, ఆలిచిప్పలులాగ అంతంత పెద్దవి ఉంటే మాత్రం ఏం అందం ? చెవులు లేకపోతే

చేపకేం లోటువచ్చింది ? పక్షులు అందంగా లేవూ ? పాముకి ఉన్నాయా చెవులు ? అయినా పాము చెవులనే పేరు ఎంత శాశ్వతంగా నిలబడి పోయింది ?

అయినా ఎందుకొచ్చిన ఈ చెవులు, నా కర్థంకాక అడుగుతాను ? రెండు చెవులూ దోరపెట్టుకుని విద్యార్థులు పాఠాల్ని వింటారుకదా ! ఆ చెవిలోంచి వచ్చిన విజ్ఞానాన్ని ఈ చెవిలోంచి వదిలెయ్యడమేకాని, కాస్త, కాస్తంటే కాస్త, బుర్రలోకి ఎక్కించు కుంటారా ? పోనీ, విద్యార్థుల మాట వదిలేద్దాం. దేశాన్ని ఉద్ధరిస్తున్నాం అనే నాయకుల మాటేవిటి ? ఒక్కొ వరసని చెవిని ఇల్లు కట్టుకుని పోరుతున్నామే, "మీ దర్జాలు కాస్త ఆపండయ్యా, ముందు దేశంలో దారిద్ర్యం సంగతి ఆలోచించండయ్యా" అని ? వాళ్ళ చెవిని పడుతోందా మనమొర ? ఇంక అలాంటప్పుడు ఆ చెవులు ఉండేం, ఉండకేం ?

ఈ చెవులు మంచి మాటలు వినడానికి ఉపయోగ పడుతున్నాయా ! అబ్బే ! చెప్పుడు మాటలకీ చెరుపు సలహాలకీ మహబాగా పనికివస్తున్నాయి. చాడీలు విని ఎంతమంది అమాయకులికి అన్యాయం చేస్తున్నారు పై ఆఫీసర్లు ? చెడు సలహాలు వినేకదా విజ్ఞానవంతులుకూడా అజ్ఞానులు అయిపోతున్నారు ? అందువల్ల ఈ చెవులు అవశ్యం పోవలసినవే, అందులో ముఖ్యంగా ఆఫీసర్లవీ, అధికార్లవీను.

పైగా ఈ చెవులవల్ల బీదవాడికి సవాలక్ష సమస్యలు. ఎప్పుడూ చెవికోసిన మేకలా గోలుగోలు మంటూంటాడు. అటు అప్పులవాళ్ళ తిట్లూ, ఇటు అధికార్ల చివాట్లూ వినాలి. భార్యాబిడ్డల సాధింపులూ బెదిరింపులూ సరేసరి చెవినిపడుతూనే ఉంటాయి. దాంతో ఆవేశం, ఆరాటం, ఆవేదనాను. చెవుడుంటే, ఇంకా కావలిస్తే అసలు చెవులేలేకపోతే ఈ బాధలు ఉండవుకదా ? బీదవాడికి తన చెవులతో బాటు భార్యాబిడ్డల చెవులు కూడా ఒక సమస్యే ! వాళ్ళచెవులికి దుద్దులూ రింగులూ అంటూ అలంకారాలు అమర్చిపెట్టాలి. తన బాధలకి కారకులైన వాళ్ళందరినీ చాపచుట్టగా కలిపికసిగా తిట్టుకోడానికి కూడా వీలులేదు. గోడలకి చెవులుంటాయి. మనుష్యులకి ఉన్న చెవులతోటే ఛస్తూంటే ఈ గోడలకి కూడాను, ఖర్మ !

పోనీఅని ఈ చెవులు చైతన్యం లేకుండా పడిఉంటాయా అంటే అదేంలేదు. భయంకరమైన యుద్ధాల్ని సృష్టించి మరీ వదుల్తాయి లోకంమీదకి. చెప్పుడుమాటలు వినే చెవులుండబట్టేకదా కర్ణుని మాటలు విని దుర్యోధనుడు తనుచెడి, దేశాన్నంతటినీ కురుక్షేత్ర మహా సంగ్రామంలో ముంచి సర్వనాశనం చేశాడు. రామరావణ సంగ్రామానికి కూడా ఆ శూర్పణఖ మహాతల్లి చెవులేకదా కారణం ?

మానవుడికి మహాసమస్యగా తయారయి ఎన్నో అవాంతరాల్ని సృష్టిస్తూన్న ఈ చెవులుపోసీ పూర్తిగాపోతే మంచిదేమో అనుకుందాం అంటే, నాకో రెండుమూడు అభ్యంతరాలు స్ఫురించాయి. మనుష్యులికి చెవులు లేకపోతే, పాపం రాజకీయ నాయకులు బెంగపెట్టేసుకోరూ ? వాళ్ళ ఉపన్యాసాల సరదా తీరేదెట్లా ? వాళ్ళ డంబాలు ఎవరికి చెప్పుకుంటారు ? ఎవరు వింటారు ? పైగా విజ్ఞానం సంపాదించుకోవాలంటే మనిషికి వినడం ఒక మార్గంకదా ? మరి చెవులు లేకపోతే ఆ వినడం ఎలా ?

సరేనయ్యా ! మనిషికి చెవులులేకుండా చేద్దాం. మరి సంగీత విద్వాంసులు చెవిలేకపోతే ఎలాపాడతారు ? ఎవరికి వినిపిస్తారు ? అనాదిగా వాళ్ళకి వస్తోందే, ఓ చేత్తో చెవిమూసుకుని రెండో చెయ్యిచాపి సంగీతకచేరీ చెయ్యడం అనేసంప్రదాయం? ఇప్పుడా చెవికాస్తా తీసేస్తే ఎలా ? అన్నింటికంటే ముఖ్యం కళ్ళజోళ్ళు పెట్టుకొనే వాళ్ళ సంగతి. బస్సులలోనూ రైళ్ళలోనూ ఎదుటి సీటుమీదకి కాళ్ళుజాపినట్లు, కళ్ళజోళ్ళ కాళ్ళువెళ్ళి చెవులమీద విశ్రమిస్తున్నాయి. చెవులు తీసేస్తే కాళ్ళు విరగ కొట్టినట్లు అయిపోయి, అవి ఆశ్రయంలేని అనాధలుగా అల్లాడిపోవూ ? చెవులగుబిలి తీసి జీవించేవాళ్ళ బ్రతుకు ఏంగాను ? E. N. T. స్పెషలిస్టులు, N. T. లుగా మాత్రం మిగిలిపోతారే ? అందువల్ల మనుష్యులికి చెవులు ఉండడమే మంచిది. అవసరం కూడా.

నిజమే - అవసరమే కావచ్చు. కాని డార్విన్ సిద్ధాంతం ప్రకారం "ఈ అవయవం అనవసరం. నాకు ఎందుకువచ్చింది దేవుడా" అంటూ ఈ సురోమంటూ ఆ అవయవాన్ని కనక ఏ జీవిఅయినా ఉపయోగించకపోతే అదిక్రమంగా అదృశ్యం అయిపోతుందట. మనుష్యులకి తోక అలాగే పోయిందట. చెవులు కూడా అలా పోయేప్రమాదం ఏర్పడింది. ఏమంటే, పాఠశాలల్లోనూ కళాశాలల్లోనూ వినడం ద్వారా వచ్చే విజ్ఞానంకంటే చూడడంద్వారా వచ్చే విజ్ఞానమే శాశ్వతంగా ఎక్కువ కాలం ఉంటుందనే భావం నానాటికీ బలపడుతోంది. అంటే చెవియొక్క పనిని తగ్గించేస్తున్నాం అన్నమాట ! అలాగే క్రాప్ చేయించుకొనేటప్పుడు చెవిపట్టుకోడానికి విసుక్కుంటూ ఈ చెవిలేకపోతే బాగుండును అనుకుంటున్నారు మగవాళ్ళు. మగ వాలికికూడా శ్రీకారంమీద శీతకన్ను పడింది. జుట్టుతో చెవిని ఎంత కప్పుకుంటే అంత ఫేషన్ అయిపోతోంది ఇప్పటి స్త్రీలకి. అంటే చెవి ఉండడం వారికి చాలా చిన్నతనం అనిపిస్తోందన్నమాట ! ఇలా స్త్రీపురుషులందరిచేతా ఈసడింపబడుతూన్న ఈ చెవి ఇంక ఎంతకాలం ఉంటుంది ? ఏమైనా, పాపం, చెవికి చెడ్డరోజులు వచ్చి పడ్డాయి.

(ప్రగతి - యథాలాపం, 21-5-1971)

# నేను

—శ్రీ గుడిపాటి వెంకటచలం

ఉద్యమాల పేరుచెప్పి, ప్రబోధాలూ ప్రచారాలూ అంటూ కాల్చుకుతినీ, జనాన్ని మనవెనకాలే ఊరేగమనడం, ఇందువల్ల నీకు స్వతంత్రం వస్తుంది, సౌఖ్యం లభిస్తుంది, స్వర్గం జేరుకుంటావు, పరలోకంలో హాయిగా ఉంటావు, ఒచ్చేజన్మలో అంతా ఆనందమే అంటూ త్యాగాలు చేయించడం, ఆహూతీ ఆత్మార్పణలకి పురి కొల్పడం అన్యాయం.

అన్నింటిలోకీ అన్యాయం వైరాగ్యబోధ. అంతా చాలా సందేహాస్పదమైన పరలోకానికీ, పునర్జన్మకీ, చేతులోఉన్న సుఖాన్ని ఒదులుకోమనడం; ఆ పరలోకాల్లో వీళ్ళకికలిగే సుఖాలేమిటో ఎటువంటివో ఒక్కరికీ సరిగా తెలీదు. ఒచ్చే జన్మలో తాను ఈ మనిషినే అనుకోడం ఎంత తెలివిలేనితనం! చిన్నప్పటి 'నేను' యిప్పటి 'నేను'ని ఎందుకైనానంటే జ్ఞాపకంవల్ల. Continuity of Personality లేకపోయిం తరవాత, నా ఆత్మో ఏదో ఎన్నిరూపాలెత్తితే అందరు భేదమైన మనుషులౌతాము కాని, ఒకే మనిషిని కాము. నా ఎదుటనున్న గేదె సుఖదుఃఖాలు ఎంత నావో ఇప్పుడు, వచ్చే జన్మలోని 'నేను'తో కూడా యీనాటి 'నాకు' అంతే సంబంధం. పాపాలుచేసి సుఖించే మనుషుల హాయిని భరించలేని యీర్ష్యనీ, నిష్కారణంగా తమకి కలుగుతున్న కష్టాల్నీ సమర్థించుకునేందుకు, ధర్మాత్ముల మనసుల నమ్మి కల్పించుకునే మాయలు యీ పరలోకాలూ పునర్జన్మలూ.

చావడమంటే అర్థం ఈ 'నేను' అనేభావం నశించడం. అది మిగిలేఉంటే ఇంక మరణమూ, పునర్జన్మలూ, చాలా స్వల్పమైన మార్పులు. ఆ 'నేను' అనేదే లేకపోతే నాకూ ఈ ఇసుకరేణువులకూ భేదమేలేదు. ఈ 'నేను' అనేది రెండువిధాల నశించవచ్చు. ఈ దేహంతోపాటు అదీ పోవచ్చు. అనేకజన్మల తరవాత మాయం కావొచ్చు, లేక ఏ పరమాత్మలోనో లీనంకావచ్చు. ఏదైనా ముందోవెనకో నాశనమే. అనంతమైన కాలంలో ఈ నా 'నేను' కొన్నాళ్ళు ఇట్లానిలిచి, ఆడి, ప్రేమించి, బాధ

పడి, ఇంక ఏంమిగలకుండా మాయమైపోతుంది. లక్షలకొలది 'నేను'లు రావొచ్చు. కాని నా 'నేను' మాత్రం ఉండదు. లోకం ఉండనీపోనీ, ఇంక నాకేం సంబంధం.

ఈ దేహంతోపాటు 'నేను'కూడా నశిస్తుందంటే నీతి, ధర్మం, యుగాలు, అభివృద్ధి, త్యాగం, శాశ్వతం, ఇవన్నీ ఉత్త పిచ్చిమాటలు. నాలుగు నిమిషాలు మాత్రమే ఉండే'నేను', యీ తెరమీద కదిలే 'నేను' నా సుఖం నేను చూసుకుని అస్తమించక, యీ గోలలన్నీ ఎందుకు పెట్టుకోడం? పాపం, పుణ్యం, నీతి, అవినీతి, ఇవన్నీ చాదస్తం. సుఖం, బాధ- ఈరెండే నాకు కావాలి. ఎవరెట్లాచస్తేనేం ? ఎంత మందికి క్షోభకలిగితే నేం ? ఎన్ని నీచకార్యాలు చేస్తేనేం ? బతికున్న నాలుగు రోజులూ నా సుఖం నేను చూసుకుంటాను. లోకాన్ని ప్రజల్ని ప్రేమించకుండా, అందర్నీ హింసించి అధర్మంలో, దుర్నీతిలో, స్వార్థంలో నువ్వు సుఖపడగలవా, అని అడిగితే- "అట్లా సుఖపడే అదృష్టవంతులు ఉన్నారు. అది నా చేతకాదు. అది నా బలహీనం. గర్వపడవలసిన విషయంకాదు" అనవలసి వస్తుంది.

మరణం తరువాత మిగులుతాం అన్నామా ? ఇంతకన్న వెయ్యిప్రశ్నలు బయలుదేరుతాయి. 'మిగలము' అంటే జవాబులేదు. ఏదో మిగులుతాము ; అనే విశ్వాసం. నాశనం కాము అనే ప్రోద్బలంతప్ప అది మన instinct of Preservation నీడ కావచ్చు. ఏమీ సుఖం లేనివాడు సుఖం వస్తుందని ఆశలేనివాడు, మృగాలమల్లేనే, కారణంలేకుండా బతకాలని ఆశపడతాడు. అట్లానే చచ్చింతర్వాత కూడా మిగులుతామనేది కూడా అట్లాంటి వెర్రిఆశకి ఫలితమైన అబద్ధమే కావొచ్చు.

మిగులుతాము. అంటే వెంటనే ఏమి మిగులుతాము ? ఈ దేహంకాదు. క్రొత్తదేహం. సూక్ష్మదేహమా ? ఈ దేహం కలగాలంటే ఎక్కడో 'ఓవం' నుంచి ప్రారంభమై ఎంతోకాలానికి ఎదిగింది. ఆ దేహం అమాంతంగా వచ్చేస్తుందా ? ఈ మనస్సు ఉంటుందా ? మెదడుమీద ఆధారపడే మనస్సు, మెదడులేకుండా ఎట్లా నిలిచింది ? కళ్ళు కాలిపోయినా ఇంకా చూడగలమా ? 'చూపు' అనేది నేర్చుకోడానికి యీ జన్మలో రెండుమూడేళ్ళు పట్టింది. ఆ శరీరంలోనో ? మరి ఆ శరీరానికి ఆకలి ఉండదా ? ఈ మనస్సు అంటే ఏ మనస్సు ? బాల్యంలోదా, యౌవ్వనంలోదా, వృద్ధాప్యమా ? ముసలివాడి మనసు అంత క్షీణించింది కదా ? ఆ బతుకులో కూడా అట్లాంటి మనస్సే ఉంటుందా ? 'నేను' ఏ 'నేను ?' 'పిల్లనేను', 'పడుచునేను', 'ముసలినేను', ఈ మూడింటికే ఎంతభేదం ? మనుషులకేనా ? పురుగులకీ, చెట్లకీ,

రక్తకణాలకీ, మరణం తరవాత జీవితం ఉందా? వాటికి సూక్ష్మశరీరాలు ? మర్రిచెట్టు సూక్ష్మశరీరం. బొద్దింక సూక్ష్మశరీరం ఉన్నాయా ?

మెదడుకీ మనసుకీ సంబంధమేమిటి ? నిప్పుకీ, వేడికీ, దీపానికీ కాంతికీ ఉండే సంబంధమా ? ఐతే నిప్పు ఆరిపోగానే వేడిఆరిపోవాలి. కాని మనస్సుఅనేది వేరుగా ఉండి, ఈ దేహాన్నీ మెదడునీ ఉపయోగించుకుంటోందా ?

ఆ మనసు శాశ్వతమా ? లేక ఆ మనసుకూడా శాశ్వతమైన ఆత్మకో దేనికో సాధనమా ?

వేదాంతంప్రకారం యీ లోకాలన్నీ మాయ. ఒకటే సముద్రం. జీవులన్నీ ఆ సముద్రంలో కలిసిపోతాయి. ఇంకా చివరికి తరిచామా, అసలు జీవులూలేరు, జన్మలూలేవు, సృష్టీలేదు. ఉత్త్భ్రమ అంటారు. ఎవరికి భ్రమ? జీవుడికి? జీవుడూ-భ్రమేగా ? ఆ యీశ్వరుడికే ! ఈశ్వరుడూ భ్రమఐతే ! ఏమీ లేనిదానికి యిదంతా ఉందని భ్రమ.

మోక్షం పొందినవాళ్ళకి పునర్జన్మ లేదట. అసలు భేదమే లేకుండా కలిసిపోయిన తరవాత మోక్షం పొందినవాళ్ళు అని వేరేలెక్క ఎట్లా ఉంటుంది ? ఆ మహా సముద్రంలో మోక్షం పొందిన నీటి బిందువులు, ఇవి మళ్ళీ పుట్టకూడదని చీట్లు అతికిస్తారా ?

ఈ నిర్వాణానికీ, నిరీశ్వరత్వానికీ భేదమేమిటి ? వేదాంతులు నిరీశ్వరవాదులే.

ఏంలేకుండా పోతేనేం, మిగలకుండా దేంటోనో కలిసిపోతేనేం ? 'నేను' లేకపోయింతరవాత అదేదో శూన్యమో, శక్తో మిగిలి ఉంటేనేం, లేకపోతేనేం, 'నాకేం !' జన్మతరవాత అంతమైపోతేనేం, ఆ వెయ్యిజన్మల తరవాత లయమైపోతేనేం ? కాలిబూడిదైతేనేం ? చీకి మన్నైపోతేనేం ?

ద్వైతమతాలవాళ్ళు, వైష్ణవులు, మహమ్మదీయులు, క్రిస్టియనులు, బ్రహ్మసమాజంవాళ్ళు, చావుతరవాత మిగులుతామనీ అదేదో యీశ్వరుడి సమక్షంలో ఆనందంగా బతుకుతామనీ, 'నేను' అనేవన్నీ యిట్లానే మిగులుతాయనీ, అంటారు. మిగిలి ఆనందంగా గడపడమనేది బావుందిగాని, ఆ 'ఆనందం' అనేది ఎట్లాంటిది అని ప్రశ్నవస్తుంది. మార్పులేని అనంతం అయిన ఆనందం మనసుకి అందదు. మార్పు అనగానే లక్షప్రశ్నలు బైలుదేరతాయి. మిగులుతామంటారే ! ఏమిటి

మిగిలేది ? 'నేను' అనేది, తక్కినవాటికన్న భిన్నంగా కావడంచేతనే నిలిచిఉంది. ఒకే ఆనందాన్ని ఒకే విధంగా అనుభవించేందుకు, అందరూ భేదంలేకుండా ఒకే విధంగా కావాలి. భేదమే లేకపోతే యీ 'నేను'లన్నీ ఏకత్వాన్ని పొందితే, అద్వైతం అయింది.

మృత్యువుతో అంతమైనా మానవ జీవితంతో ఐక్యమై, స్వార్థాన్ని మరిచి మానవసౌభాగ్యానికై పాటుపడమనే నవీనశాస్త్రజ్ఞులు మానవ జీవితంలో ఐక్యం కమ్మంటే, వేదాంతులు యీ సృష్టిశక్తితో ఐక్యం కమ్మంన్నారు. అంతే భేదం. ఎందుకు ఐక్యం కావాలి ? అంటే యెవరూ ప్రత్యుత్తరం యివ్వలేరు......

రేపు చచ్చేనేను-ఈ రైల్లోంచి పక్కస్టేషనులో దిగేనేను సుఖంగా కూచోక, రైలుపెట్టెలు, యెందుకు ఈడుస్తూ యీ నాలుగు నిమిషాలు గడపాలి ? నాకేం తెలీదు. ఈ రైలు యెక్కడికి పోతుందో, ఏమవుతుందో ? ఇది శాశ్వతమనీ దీనికో గమ్యస్థానం ఉందనీ నాకురూఢిఏమిటి ? ఈ మధ్య యే బ్రిడ్జిమీద, ఏ బాంబులకింద బోల్తాపడుతుందో ! నే నెందుకు నాకాలాన్ని సౌఖ్యాన్ని త్యాగంచెయ్యాలి ! అంటే ? పోతే యీ అర్థరాత్రి మేలుకుకూచుని యిదంతా యెందుకు రాస్తున్నాను ?

బెర్ట్రండ్ రస్సెల్, ఇన్‌గర్సాల్, వెల్సు, మొదలైన జ్ఞానులూ, కమ్యూనిస్టు బోధకులూ, ఏదో లోకక్షేమం, జీవితప్రవాహం, మన జీవితాన్ని లోకంతో సమన్వయించే ఆనందం, ఇట్లాంటివి మాట్లాడతారు. వీళ్ళకి అనంతజీవితంలో నమ్మకంలేదని వాళ్ళు అన్నా, వీళ్ళకి sub-conscious గా ఎంత నమ్మకమో అనిపిస్తుంది. వాళ్ళు అన్ని మూఢవిశ్వాసాలలో నమ్మకం ఒదులుకోగలిగికూడా విశ్వమానవ సౌభాగ్యం, ముందుయుగాల వారియెడల మన కర్తవ్యం, లోకాభివృద్ధి, ఇట్లాంటి మూఢత్వాన్ని ఒదులుకోలేక పోవడానికి కారణమేమా అనిపిస్తుంది. ఇట్లాంటి గొప్ప ఆశయాలూ యత్నాలూ లేకుండా తన సౌఖ్యమేచూసుకొనే జీవితం యిట్లాంటి యోధులకూ, ఉదారులకూ దుర్భరం. పూర్వపు ధర్మాలలో మతాలలో నమ్మకంలేదు వాళ్ళకి, అందుకని యీ కొత్త మూఢమైన గొప్ప ఆశయాల్ని కల్పించి కప్పుకున్నారేమో అనిపిస్తుంది. మానుషజీవిత సముద్రంలో 'నేను'ని కలిపేసుకుని, తద్వారా అమృతత్వాన్ని పొందుతామనీ, మానవాభివృద్ధి ప్రయత్నంతోఐక్యమై తద్వారా ఆనందాన్ని పొందాలనీ, లోకంకోసం స్వార్థాన్ని త్యాగంచెయ్యాలనీ బోధించే నిరీశ్వరవాదులు. నిజంగా వీరి బోధనల్ని వీరు నమ్మితే, అంతరాత్మలోనూ ఆత్మ శాశ్వతత్వంలోనూ నమ్ముతున్నారన్నమాటే !

మనుష్యుల్ని నీతిమార్గాన ఉంచేందుకు నరకం, స్వర్గం, అని పాతమతాల వాళ్ళు ఎన్ని అబద్ధాలు మాట్లాడారో, ఇంకోవిధంగా యీ కొత్త శాస్త్రజ్ఞులు కూడా ఏదోలోకపు అభివృద్ధీ మానవ జీవితప్రవాహం, ఆత్మశాంతి, ఇట్లాంటి కొత్త అబద్ధాలు కల్పించి మతంలేకుండా నీతిని లోకంలో నిలబెట్టాలని చూస్తున్నారు.

అనంతకాలంలో యీ భూమిమీద మనుష్యజీవితమే మొన్న ప్రారంభించింది. ఇంక నాలుగుదినాలలో మాయమవుతుంది అంటాయి వీళ్ళ 'సయిన్సు'లన్నీ. భూమి సూర్యుడికి దగ్గరగా జరిగి మాడ్చేస్తుందని కొందరూ, సూర్యుడు చల్లబడి భూమి బిగుస్తుందని కొందరూ, ఏ ఉల్కాయో భూమిని కాల్చేస్తుందని యింక కొందరూ. ఈ నాలుగునిమిషాల 'నేను'ని యీ నాలుగుదినాల మనుష్యజీవితంలో కలిపితేమాత్రం ఏంసుఖం ? అంటుంది reason. కాని reason కి ఎదురుతిరిగి ఏదో తృప్తినిస్తుంది వీరికి మానవసేవ.

అందుకని ఈ reasonless feeling - sentiment ని reasonable చెయ్యాలని నిరీశ్వరవాదుల ప్రయత్నం. ఎందుకంటే దేవుణ్ణీ, పరిపాలననీ, శిక్షా బహుమానాల్నీ తీసేస్తే, యీ నీతికీ, ధర్మాలకీ, త్యాగాలకీ, లోకక్షేమయత్నాలకీ కారణం నిలవదు. ప్రతిఫలాపేక్షతోకాదు. service for service sake. Truth for truth's sake అని, నిష్కామ వేదాంతంలో తెలీకుండానే చేరిపోతారు, నిరీశ్వర వాదులూ కమ్యూనిష్టులూ. అందువల్లనే యీ రేషనలిస్టులంత స్వార్థ త్యాగులూ, ఉన్నతులూ మానవసేవా పరతంత్రులు, తెలివిగా యోచించి ముందు యుగాలకి పాటుపడేవారూ, కనపడడం అరుదు. కాని for its own sake మాత్రం ఎందుకుచెయ్యాలి అంటే ప్రత్యుత్తరంలేదు.

These rationalists are so reasonless.

'మిగలము' అనుకుంటే ఎన్నో ప్రశ్నలు. మరి ఈ 'నేను' తెలుసుకోడం, యీ లోకం, అభివృద్ధి, ఇవన్నీ యేమిటి ? మనిషికి అతని consciousness ఎట్లా వొచ్చింది ? సయిన్సు మనిషిని అణువులపోగు, ఉత్త 'కార్బన్' అంటుంది. ఆ కార్బన్ మెషీనులోనించి యీ మనసు, యీ తెలివి ఎట్లా పుట్టింది ? అంతేకాదు యీ ఆవేదన, యీ కోర్కులు, అనంతంగా యోచించే, విలువలుకట్టే, అందాలుచూసే యీ శక్తి, ఇదంతా ఉత్త అణువుల కూడికేనా అనిపిస్తుంది. ఎంత పోల్చిచూసుకున్నా లోకంలోని తక్కిన గొప్పశక్తులకీ మనిషిలో ఉండే మనోశక్తికీ గొప్ప వ్యత్యాసం తోస్తుంది. ప్రపంచమంతా వ్యాపించే ప్రపంచాన్ని పరిపాలించే కొన్ని

గొప్ప సూత్రాలు కనిపిస్తాయి. ఆ సూత్రాలకీ ఈ మనోశక్తులకీ సంబంధమున్నట్లు తోస్తుంది. ఆ శక్తులన్నీ మానవ మనోనిర్మితాలుగనక ఆ సంబంధం ఉన్నట్లు కనపడుతుందేమో! ఎన్ని శాస్త్రాలైనా ప్రపంచ వస్తుసంబంధాలుగాక, వాటిలో ఆ సంబంధాలున్నట్లు యోచించుకొనే మనసులో మాత్రమే ఉన్నాయేమో - అడివిలో పువ్వుల్ని, సముద్ర అగాధంలో రంగుల్ని, అర్థరాత్రి అందాల్ని, అనుభవించే ప్రపంచజ్ఞానం ఒకటి ఉందేమో!

ఉత్తమనసుతో ఎంత యోచించినా, "మిగులుతాము" అనుకోడం ఉత్త భ్రమలాగు తోస్తోంది. ఎట్లా మిగులుతాము? ఆ ఆత్మ అనేది ఉండడం, ఏదో సూక్ష్మ దేహంలో ఉండడం, ఎక్కడో ఓ మూల ఏడుస్తో కూచోడం, ఇంకో దేహంలో ప్రవేశించడం ఇవన్నీ ఉత్త silly గా absurd గా disgusting గా కనపడతాయి. ఉత్త బూడిదై పోవడం చాలా healthy, noble, worthy గా కనపడుతుంది.

కాని మృత్యువుతో ఆఖరైతే, ఈ 'నేను' కి ఇంత గొప్పగా సమర్థించుకునే, With its assurance and insistence and feeling of Permanence. ఆ 'నేను' కి అర్థంలేదు. ఉత్త మోసంలాగు తోస్తుంది మళ్ళీ.

మనకి రూఢిఐన విలువలు, బాధా, సుఖమూ, ఆ సుఖమూ చాలా slippery and flimsy. ఒక్కబాధే రూఢి. జీవితమంటే బాధనించి తప్పించుకునే ప్రయత్నం లాగు కనపడుతుంది. కాని ఆ బాధనించి తప్పించుకోడం అంత సులభమైన పని కాదు. తప్పించుకోలేని బాధలు అనేకం. మనసులో ఏ నివారణ లేకుండా పుట్టే బాధలుకూడా పీటికితోడు. ఏ డబ్బూ, ఏ స్నేహితులు, శక్తి తీసెయ్యలేని బాధలు అనేకం. ముందు బాధలు కలగకుండా ప్రస్తుతం పడవలసిన బాధలు ఎన్నో.

ఈ బాధలు పడేందుకు ఒక 'నేను' ఉంది. దానికి అతుక్కుని ఒక దేహం ఉంది. ఆ 'నేను' లేకపోతే దేహం బాధించదు. ఆ మతాలూ, ఆధ్యాత్మికాలూ ఆ 'నేను' ఎట్లాగో శమింపచేసేందుకు ప్రయత్నాలు లాగున్నాయి. కాని ఎంత మందికి అది చేత నవుతుంది? ఆ 'నేను' ని కొంతవరకన్నా తప్పించేందుకు ఈ ఏకాగ్రత సాధనం లాగుఉంది.

ఏకాగ్రత సాధిస్తే చాలు, అంతకంటే సుఖంలేదు. అయినా సుఖం అనేది ఎక్కడ ఉండి ఏడిసింది మనస్సులోగాక! మన మనసుకి నిరంతర సుఖం కలిగించుకోగల శక్తి దొరికితే అంతకన్న ఏం కావాలి?

నేను లోకైక చక్రవర్తినని నమ్మి, దాంతో ఏదీ నన్ను చలింప చెయ్యినంత పిచ్చి నాకు ఎక్కితే, అంతకన్న నా కేం కావాలి? నేను పిచ్చివాణ్ణి మీ కందరికీ - నాకు నేను పిచ్చివాణ్ణి కానంత కాలం నాకేం బాధ! షాంపెయిను తాగితే, బైటి నుంచి ఏ కారణమూ లేకుండానే, జీవితం ఘోరంగా ఉన్నా, ఆ గంటలు గొప్ప సౌఖ్యంగా ఉంటాయి. విరామంలేని, మళ్ళీ తెలివిరాని, ఏ లక్ష్యమూలేని షాంపెయిను ఆనందంలో ఎప్పుడూ ఉండగలిగితే అంతకంటే కావలసింది ఏముంది?

కాని అలా ఉండగలమా? గడిచిన జీవితాన్ని తలుచుకోవడం, ఆ క్షోభ, ఆ గర్వం, ఆ డాబు ఇతర్లతో చెప్పుకోవడం, ప్రస్తుత బాధల్ని ఏ కరువు పెట్టడం, ఇదంతా చేస్తూంటేనే కాని మనలోని 'నేను' కి సంతృప్తి ఉండదు. మునలి వాళ్ళలో 'నేను' ఇంకా సంకుచితమైనట్లు, నీచంగా తయారైనట్లు, నా మనస్సుకి తోస్తుంది. అయితే నిజంగా ఆ నీచత్వం వాళ్ళలో ఉందా? నా మనసుకి ఉన్నట్లు తోచినందుకు ఉందా? నా మనసులోనే ఉందా?

అయినా నా మనస్సు ఇలాంటి దేవిటి? ఎప్పుడూ ప్రశ్నిస్తుంది. ఎన్ని తిట్లు తిన్నా, ఎన్ని ఇబ్బందులు వచ్చినా, ఎంతమంది పాడు మాటలన్నా, ఇదివరకు పుస్తకాల్లో ఏదో ఒకటి గట్టిగా చెప్పావు ఈ మ్యూజింగ్సులో అన్నిటి అడుగు భాగాలూ ఊడగొడుతున్నావు ఎక్కడ నిలవడం అంటూ చివాట్లు పెట్టినా, ఇంకా అర్ధరాత్రులు ఇట్లా యోచిస్తుంది, రీజన్ ఎంతవరకూ తీసికెళితే అంతవరకూ వెళ్ళి. ఏదో విశ్వాసం, ఇతరుల మనసుల్ని యోచించేట్టుచేసి, జీవిత మార్గంమీద కాంతిని పడేస్తాననీ, ఆధారంలేని నమ్మకం, పట్టు విడవక ఇంకా వెతుకుతున్నానని నాలోని 'నేను' కి గర్వం.

(మ్యూజింగ్స్ - తెలుగు స్వతంత్ర)

# మనీ - సెన్స్

—శ్రీమతి పురాణం సీత

మనీ ఉన్నప్పుడు చాలామంది మగాళ్ళకు సెన్స్ ఉండదు. డబ్బున్నన్నాళ్ళూ సెన్స్ లేకపోయినా మొహం కలకలలాడుతూ ఉండబట్టి ఆడాళ్ళు సహిస్తారు ఎలాగో ఓలాగ. ఆ మనీ అయిపోగానే సెన్స్ బయటపడుతుంది. మొహం వ్రేలా డేస్తారు. దిగులు చూపులు చూస్తారు. జాలేస్తుంది చెప్పొద్దూ... అప్పడే యకవున్ టెన్సీ, బ్యాంకింగు మొదలెడ్తారు. ప్యాసుబుక్కు, పర్సు, చిచ్చికాగితాలు ముందేసుకుని లెక్కలు కడ్తారు. ఛాన్స్ దొరికితే ఎగిరిపోదామని చూస్తూంటారు మనమీద. పూర్ క్రీచర్స్ ఈ మగాళ్ళు... డబ్బుందా... ఎక్కడైనా అని అడుగుతారు దీనంగా... ఎక్కడుంటుంది?

చెంబులూ, గ్లాసులూ, పెట్టెలో వెనక అరలు, పుస్తకాల మధ్యన, దండాన వ్రేలాడేసిన మాసిన చొక్కాలు, పాంట్ల జేబులన్నీ వెతుకుతారు. అన్వేషణ - అందులో సిల్లీ ఉత్తరాలు, బస్సు టికెట్లు, సినిమా అవుట్ పాసులు, బిల్లులు, నానా చెత్తా చెదారము, గుండీలు, బ్లేడ్లు, పెనిసిలు ముక్కలు, ముక్క కంపుకొట్టే చేతి రుమాళ్ళు ఉంటాయికాని, అగ్గిపుల్లలూ పన్ను కుట్టుకునే గుండుసూదులూ క్లిప్పుల మధ్య డబ్బు ఎక్కడన్నా ఉంటుందా? డబ్బు బ్యాంకుల్లో ఉంటుంది. పోస్టాఫీసులో ఉంటుంది. ఆఫీసులో కేషియర్ దగ్గరుంటుంది. మనదగ్గిర సెన్స్ ఉంటుంది. డబ్బు ఉండదు. ఇవి రెండూ వేరువేరు పదార్థాలు. ఒకటి ఉన్నప్పుడు ఒకటి ఉండదు. ఈ రెండూ ఉన్నవాళ్ళు చాలా పెద్దపెద్ద వాళ్ళుసార్! వారి జోలి మనకెందుకు!

కృష్ణపక్షం నెలనెలా వచ్చేస్తూంటుంది. అప్పుడు ఈ మగాళ్ళను (ట్రీట్ దెం విత్ కేర్) ఆడాళ్ళే రక్షించాలి. కళ్ళు లోతుకుపోయి ఉంటాయి. ఛాతీ వీపుకు అంటుకుపోయి వంగివంగి నడుస్తారు. నోట్లోంచి ఏవో మాటలు వస్తాయికాని అవి వినిపించవు. చేతులు ఎప్పుడూ జేబులో పెట్టుకుంటారు. జేబులు పెద్దవి కుట్టినట్లు అప్పుడే తెలుస్తుంది. టైలరుమీద విసుక్కుంటారు. రోడ్లు పొడుగ్గా కనిపిస్తాయి.

అప్పుడో అయిదు రూపాయలనోటు పోనీలే పాపంగదా అని ఎదురుగుండా ఝళిపించా మనుకోండి.

"నైస్ గర్ల్ - ఇదెక్కడిదే - ఇదెక్కడిదీ" అంటూ మీద కలియబడి పోతారు.

"మంది కాదండీ" అంటే

"డోంట్ బి సిల్లీ" అంటారు.

"మొన్న చీటి గుడ్డల వాడొస్తే చెరోబ్లవుజు పీసూ పుచ్చుకున్నాం తరువాత ఇస్తామని. వాడొస్తే ఇచ్చేయమని పంపుపక్క ములగచెట్టువాటా జానకి పట్టుకొచ్చి యిచ్చింది."

"డోంటాక్ రాట్ ! థాంక్ హర్ - ములగచెట్టు జానకీ దీర్ఘ సుమంగళీ భవ ! ఆ నోటిలాగ ఇచ్చేయ్. ఇమ్మంటుంటే - వినపడ్డంలే - వెనక్కి దాస్తావెందుకు ? మళ్ళీ గాజులు చిట్లిపోవడానికా ?"

నవ్వొస్తుంది ఆ ఆత్రంచూస్తే - మళ్ళీ అంతలో కోపం.

"ఆల్ రైట్. వెధవ ఫైవ్‌రుపీస్ కోసం నోటికొచ్చినట్లల్లా అబద్ధాలాడేస్తున్నావ్. నీ దగ్గరుండే ఆట్లాడుతున్నావ్. కానీ - రవురవాది నరకాల్లో పడిపోతావ్ మొగుడ్ని యిట్లా ఏడిపిస్తే...'' అని చిన్న దులుపు దులిపేస్తారు.

"ఆ బ్లవుజ్ పీసెస్ ఎందుకంట నా డబ్బు తగలేసి కొనేయడం ? మీ ఆడాళ్ళకి మనీ సెన్స్ ఉండదు. ఎలా ఉంటుంది ? డబ్బు సంపాదించడం ఎంత కష్టమో తెలిసేడిస్తేగా, మగవాడు బయట ఎంత కష్టపడి చెమటోడిస్తే ఇంట్లోకి నాలుగు రూపాయలు ఎలా వస్తున్నాయో నీకేమన్నా తెల్సా ?" అని చెమటోడ్చడం డిమాన్స్ట్రేట్ చేసి చూపిస్తారు.

(మగాళ్ళు ఇంట్లో చెమటోడ్చరు. కాఫీల్తాగుతారుట. ఇంట్లో చెమటంతా ఆడాళ్ళే ఓడుస్తారు.)

అప్పుడా అయిదు రూపాయలనోటు బల్లమీద పెట్టేసి వెళ్ళిపోతే దానికేసి క్రూరంగా చూసి, మడిచి జేబులో పెట్టుకుని 'డర్టీ గర్ల్' ఉండే లేదంటూ ఏడిపిస్తుంది. దీని తాతసొమ్ము ఏవన్నా తెచ్చి నాకిస్తుందా ? నా డబ్బే తీసి దాచి గమ్మత్తులు చేసి నాకు ఇస్తూ ఉంటుంది. ఎప్పుడో మెత్తగా తంతే సరి. దీని కింత

అలుసివ్వగూడదు. అని లోపల అనుకుంటారు కాబోలు. ఐ డోంట్ కేర్ - పైకి 'హల్లో' అన్నా లోపల మగ ఏడుపు ఉండకుండా ఉంటుందా మరి! ఆ ఇస్త్రీ మడతల క్రింద దాక్కున్న మగాడి పొగరుమోత్తనం దౌర్జన్యం, అహం, టీవి ఎక్కడకు పోతాయి? అప్పుడప్పుడు బయట పడ్తుంటాయి.

అందుకే కృష్ణ పక్షంలో మగాళ్ళకు 'సేఫ్ డిస్టెన్స్' లో ఉండాలి. రక్షించేది మనమే అయినా రక్షిస్తున్నామనే సెన్స్ కలగకూడదు. బుసకొడ్తారు. కాపురాలు పాముల్తో చెలగాటమే ఒక విధంగా. ఎక్కడ్నుంచో వచ్చిన అమ్మాయి, ఎవరో అబ్బాయితో తనువు గడుపుకోవడమంటే మాటలా? జీవితం సర్కస్‌లో కాల్జారితే లేవడం కష్టం. మళ్ళీ మళ్ళీ అవే ఫీట్లు చేయాల్సొచ్చినా 'రింగ్ మాస్టర్' దయ మీద ఆడదాని బ్రతుకు ఆధారపడి ఉంది. చెడగా చెడగా కాపురములు కావు.

డబ్బు ఎవరు తెస్తారో వారిదే గౌరవం. వారికే అథార్టీ. జిత్తులు తెలిసిన వారికే జీవితం వెన్నెల. తెలియనివారి కది చిట్టడవి. చీకట్లో చిందులు తొక్కాల్సిందే - పాలు విరిగిపోతాయి. జీవితం గడ్డ కట్టుకుపోతుంది. బెల్లం ముక్కలాంటి పెళ్ళాం మంచుముక్కయి ఊరుకుంటుంది. పారిజాతాలు మొలవ్వు, బ్రహ్మ జెముడు డొంకలు లేస్తాయి జీవితనందన వాటికలో.

అప్పుడు సినిమావాళ్ళూ, కవులూ, కథకులూ చేసిన మోసం తెలుస్తుంది. పట్టుచీర చిరుగ ట్టేసరికి ఆదర్శాల పల్లకీ విరుగుతుంది. హీరోలాంటి మొగుడు విలన్ అవుతాడు. రంగుల దేరా వెలవెల బోతుంది. వలపుజండా హాఫ్ మాస్ట్‌న ఎగుర్తూ ఉంటుంది. మొగుడు మొద్దులాగ, పిల్లలు పిశాచాల్లాగ కనిపిస్తారు. అప్పుడు ఫిట్లొస్తాయి. మధ్య మధ్యన పురుళ్ళు, వెంటవెంటనే డాక్టర్ల బిల్లులొస్తాయి. వెలిసిపోయిన చీరలు చుట్టుకుని, బుజాలమీద కుట్లూడిన జాకెట్లు తొడుక్కుని, వంటిల్లు కడుక్కుంటూ, అంట్లగిన్నెలు తోముకుంటూ జీవించాలిసొస్తుంది. ఎమ్మే ప్యాసయిన అమ్మాయికయినా ఇవి తప్పవు. కడుపూ కాలూ ఎలానూ తప్పవుకదా! లేడీ డాక్టరయినా వేవిళ్ళు అనుభవించాలి. తన డెలివరీ తనకు భయమే!

అప్పుడు మొగుడుమీదకు మనసు పోవటం తగ్గాక, పిల్లలమీద మమకారం సన్నగిల్లాక ఎక్కడికైనా పారిపోవాలని ఉంటేమట్టుకు ఎక్కడికి పోతుంది ఆడది? అంచేత చీప్‌గా నోములు, వ్రతాలు, పూజలు, ఏకాహాలు, సప్తాహాలు, స్వాములార్లు, తీర్థయాత్రల గొడవల్లో పడిపోతారు. పడిపోయి కొంప గుండం చేస్తారు. అలాంటి ఆడవాళ్ళకే పిశాచరూపు లొస్తాయి. వాళ్ళే కొడుకుల్ని కోడళ్ళని

కూతుళ్ళని కాల్చుకుతినేది. వాళ్ళకళ్ళకు పాతవన్నీ గొప్పవే. కొత్త అంటే పడదు. మార్పుకి లొంగరు. వర్తమానంలోని ప్రతిదాన్నీ ద్వేషిస్తూ గతాన్ని గబ్బిలాయిల్లా పట్టుకు వ్రేలాడుతారు.

వీరంతా జరీ కండువాల్లో, పట్టు చీరల్లో, మళ్ళూ ఆచారాల్లో తమ కుళ్ళంతా దాచుకుని సంప్రదాయమనీ, గోంగూరనీ, వంశమనీ, కులమనీ, మర్యాదలనీ గోల చేస్తారు. అవసరమైతే నానా గడ్డీ కరుస్తారు. కరిపిస్తారు. ఏకధాటిగా ఏ కరువు పెట్టడం మాత్రం మానరు నీతులు.

అంచేత నాకు ముసలితనం వద్దు.

డొక్కు కారులా, విరిగిపోయిన కుర్చీలా, సొట్టబిందెలా, అట్టలు చిరిగి పోయిన పుస్తకంలా, పాత గడియారంలా, నేను బ్రతకలేను. కొమ్మనుంచి పువ్వు రాలిపోయినట్లు రాలిపోవాలి. గాలినై మబ్బుల్లో తేలి వెళ్ళి నక్షత్రాలతో కబుర్లు చెప్పుకు వస్తాను.

అప్పుడు వెన్నెలంతా నేనే!
ప్రవాహాన్నై పరవళ్ళు తొక్కుతాను.
కడలి నేనే! కన్నీరు నేనే!
ఆశ నేనే! ఆకాశమూ నేనే!

వెల్తురంతా నేనే అయి మిలమిలా మెరిసిపోతాను.

అరుగో మావారొస్తున్నట్లున్నారు. ఆ చీదడవే చెప్తోంది – ముసుగెట్టుకు పడుకుంటా.

లేపొద్దని చెప్పండి.

చెప్తారుకదూ ప్లీజ్......

(ఇల్లాలి ముచ్చట్లు – ఆంధ్రజ్యోతి)

# బరువు సామానులు

—శ్రీ తురగా కృష్ణమోహన్‌రావు (ప్రవీణ్)

పూర్వం రైల్వేవాళ్ళు ఒక ప్రకటన చేసేవారు- 'సామాను తక్కువ తెండి; ప్రయాణం సుఖంగా చెయ్యండి' అంటూ, ఇటువంటి ప్రకటనలు చేయడంవల్ల ఎలాగూ లాభంలేదని కాబోలు. ఇటీవల దాదాపు మానుకున్నారు. ప్రయాణం సుఖంగాచేస్తే. మనకి బాగుండదు. ప్రయాణం చేసినట్టుగానే ఉండదు. మన పెట్టెలు పక్కవాడి కాళ్ళమీద పెట్టాలి. ఒకవేళ వాడే వాడికాళ్ళు మన పెట్టెపై పెట్టుకు కూర్చుంటే, దువ్వెనకనో, అద్దానికనో, మందుసీసాకోసమో, టిక్కెట్టు తీసుకోడానికో, ఐదు నిమిషాలకోసారి పెట్టెతెరుస్తూ, ప్రతిసారీ వాణ్ణి కాళ్ళుతీసి గాలిలో పెట్టుకోమనాలి. సామాన్లు పెట్టుకొనేచోట మనుష్యులు పడుకుంటారుకనుక, మనుష్యులు కూచునేచోట సామాన్లు పెట్టాలి. పిల్లవాడికి పాలు. ఆ పాలకో ఫ్లాస్కు, ఫ్లాస్కుకో సంచీ, సంచీకోబుట్ట. పిల్లవాడు పాలు ఒలకపోస్తే, వాణ్ణి తుడవడానికి ఒకగుడ్డ. నేలఒలికిన పాలను తుడవడానికి ఒకగుడ్డ. గుడ్డలో మూటకట్టిన ఆవకాయ జాడీలోంచి ఊటకారి, పక్కనకూచుని చుట్టకాల్చుకొంటున్న ఆసామీ చెప్పులవైపుకి ప్రవహిస్తూంటే, తుడవడానికి వేరేగుడ్డ. గుడ్డలు ఉతకటానికి సబ్బు, సబ్బులు వగైరా పెట్టడానికి ఒకబుట్ట. ఇదిగాక, తడిగుడ్డలు పెట్టడానికి ఒకటి. పొడిగుడ్డలకి వేరొకటి బుట్టలు. మాసిపోయినబట్టలు కూరెయ్యడానికి ఒకహోల్డాల్, సామానువెరశీ-నాలుగైదు సంచులు మూడునాలుగు బుట్టలు, రెండుమూడు పెట్టెలు ఒకటిరెండు పరుపులు.

ఇవన్నీ కూలివాడికిస్తే కొంపకూల్చేస్తాడు వాడు. అందుకని చిన్నవి పరమానందయ్య శిష్యుల్లాంటివి, అన్నీ లెక్కపెట్టి పట్టుకోడానికి ప్రయత్నించి - మనం ఒక్కొక్కటి ప్లాట్‌ఫారంపై పడేస్తే పట్టుకురావడానికి కుర్రాణ్ణినియోగించి ముందుకు నడుస్తాం. కుర్రాడు జారవిడిచినవన్నీ కూలివాడే తీసుకువస్తూంటే, ఎలాగూ కూలి ఎక్కువ ఇవ్వాల్సి ఉంటుందికదా అని టికెట్‌తప్ప మిగతా సామాను అంతా కూలి వాడి నెత్తిమీద పెడతాం. వాడు జెట్‌విమానంలా ముందుకు పోతూంటే, మనుష్యుల

తలకాయలపైనుంచి గాలిలో కన్పిస్తూన్న మన సామానువైపే చూస్తూ టికెట్ కలెక్టర్ చేతుల్లో మనీపర్సు పెట్టేసి పరుగెత్తుకుపోతాం. టికెట్ కలెక్టర్ మనీపర్సు వంక తెల్లబోయి చూస్తూంటాడు. మనం ముందుకుపోయి, కూలివాడికి డబ్బివ్వ డానికి చూసుకుని, పర్సులేక, పొరపాటున టికెట్ ఇవ్వబోయి, పొరపాటున తల గోక్కుంటూ ఉంటే, అగ్నిసాక్షిగా మన అసమర్థతని వివాహమాడిన ఇల్లాలో, లేక తండ్రిపోలిక కాకుండా తల్లిపోలికవచ్చిన కుర్రాడో, వెనకనేవస్తూ టికెట్ కలెక్టర్ చేతుల్లోంచి మనీపర్సు లాక్కొనివస్తారు. ఆయన మరోసారి తెల్లబోతాడు.

సామాను ఎక్కువగా పట్టుకెళ్ళవద్దని అందరికీ నీతులు చెప్పేవారు కూడా తాము ప్రయాణం చేసినప్పుడు మాత్రం బళ్ళకొద్దీ సామానుతీసుకొని బయలుదేరడం నాకు తెలుసు. నే నెరిగున్న ఒకమేష్టారు ప్రయాణమైతే, ఆవకాయ జాడీలు, పనస కాయబుట్టలు, ఫ్లాస్కులు, చెంబాలు, గరిటెలు, కంచాలువంటి సామాన్లు పట్టుకు బయల్దేరాల్సిందే. కొండొకచో మంచాలు పట్టుకెళ్ళడం కూడా కద్దు. పనసకాయ బుట్టలు, ఆవకాయ జాడీలు పట్టుకెళ్ళడంవల్ల ప్రయాణీకుల్లో గౌరవం పెరుగుతుందని ఆయన అన్నాడు. ఎన్నిసార్లు బ్రతిమాలుకున్నా చోటులేదన్న పెద్దమనిషి ఆవకాయ జాడీఉన్న బుట్టని పక్కనపెట్టగానే, త్రాచుపాముని చూస్తే ప్రకటించినంత భక్తిని ప్రకటించి, దూరంగా జరిగి కూచుంటారట. చెంబాలు, గ్లాసులు, ఫ్లాస్కులవల్ల-రైల్వే కంపార్టుమెంటులో పరపతి సౌకర్యాలు పెరుగుతాయట. మరి కంచాలు, మంచాలు ఎందుకంటే తాను వెడ్తూన్న చుట్టాలని అనవసరంగా ఇబ్బందిపెట్టడం ఇష్టంలేకనే తన కంచం తన మంచం తీసుకుపోతూంటాడట. కావలసిన సామాన్లు మాత్రమే తీసుకెళ్ళమని అందరితో చెప్తూంటాను. నేనూ కావలసినన్ని మాత్రమే తీసుకెడు తూంటాను' అన్నారాయన.

మా యింటిపక్క సుబ్బారావుగారిది అసలు సామాన్లు ఎక్కువలేకుండా ప్రయాణం చేయకూడదనే తత్వం. పట్టుకువెళ్ళడానికి సామానులేకపోతే, తాళాలు వేసి మూడు కాళీ ట్రంకుపెట్టెలు తీసుకుబయల్దేరేవాడాయన. 'గంగిగోవుపాలు గంటెడైననుచాలు' అన్నట్టు, అవసరమున్నవీ అందంగా ఉన్నవీ సామానులు ఒకటోరెండో తీసుకువెళ్ళడం మంచిదికాదా? 'కడివిడైననేమి ఖరముపాలు?' అన్నట్టు, ఆ గాడిద బరువంతా మోసుకొనకపోతే ఏమైంది? అని ప్రశ్నించాను ఒకసారి ఆయన్ని నేను. ఆ రోజుల్లో దొరికేవి నీళ్ళపాలు, కల్తీపాలుకనుక, ఎక్కువరేటిచ్చి గంగిగోవుపాలు అనుకొని గంటెడు తీసుకోడంకంటె, తక్కువ

రేటిచ్చి ఖరముదైనాసరే కడివెడుపాలు తీసుకోడం మంచిది' అని అభిప్రాయం వెలిబుచ్చారాయన.

పైగా, సామాను తీసుకువెళ్ళకపోవడంలోకల నష్టాలను ఆయన వివరించారు. తేలికగా మనం సామాను తీసుకెడితే, దొంగలుకూడా తేలికగానే ఎత్తుకుపోతారట. బరువైనవీ ఉల్లావకాయలాగ రుచీవాసనా వ్యాపించేవీ పట్టుకువెడితే పోలీసుకుక్కల సహాయం అక్కరలేకుండానే దొంగల్ని పట్టుకోవచ్చుట. 'సామాను లేనివాడు లంచంఇస్తేగాని రైల్లో మంచిసీటు సంపాదించలేడు. కూలివాడికి సామానుకీ సీటుకీ కలిపి కంట్రాక్టు ఇస్తే, పాపభీతి లేకుండానే సీటు సంపాదించుకోవచ్చు,' అన్నారాయన. సామానులేకుండా వచ్చినవాళ్ళని హోటలువాళ్ళుకూడా కొంచెం ఇదిగానే చూస్తారని ఆయన చెప్పారు. మనకంటె కూడా సామానంటేనే హోటలువాళ్ళకి గౌరవమనీ, మనంలేకుండా సామానే ముందుచేరినా వాళ్ళు గది ఇచ్చేస్తారనీ, సామానులేకుండా మనంవెడితే గది యివ్వడానికి సందేహిస్తారనీ అన్నాడు.

ఆయన చెప్పింది నిజంలాగే కనిపిస్తూంది. మనందరమూకూడా వ్యక్తుల కంటె వ్యక్తుల సామానుకే ఎక్కువ విలువ ఇస్తాం. మనుష్యులు నడుస్తూన్న ప్రదర్శన శాలల్లా ఉండాలి. ఈ సంగతి తెలిసిన ఆడవాళ్ళు మొదటినుంచీ పట్టు చీరెలపైనా, బంగారు నగలపైనా మక్కువ చూపుతూ వచ్చారు. చీరలూ నగలూ కేవలం అరువు తెచ్చుకున్నవని తెలిసినప్పుడుకూడా తోటి ఆడవాళ్ళు, మగవాళ్ళు వాళ్ళని గౌరవించకుండా ఉండలేరు. అంబలి మాత్రమే తాగడానికి శక్తి ఉన్న మారాజులు, మీసాలకి సంపెంగనూనె రాసుకునే తత్వంకూడా ఇందుకే ప్రబలింది. బేంకులూ ఇన్సూరెన్సుకంపెనీలు ప్రభుత్వాలు అవసరమున్నా లేకపోయినా లక్షలూ కొండొకచో కోట్లూ ఖర్చుపెట్టి అనేక అంతస్థులుగల భవనాలు నిర్మించే అలవాట్లుకూడా అందువల్లే ఏర్పడ్డాయి. రానురాను మనిషంటే విలువ తగ్గడం లేదుగాని, మనిషిపేరు చెప్పి చేసే ఆర్భాటాలకు విలువ పెరిగిపోయింది. అంటే మనిషి విలువ తగ్గినట్టేమరి.

'ఎక్స్' గారి మేడ బాగుందంటే, ఎక్స్‌గారి విలువ పెరిగినట్టుకాదా? అన వచ్చు. ఎక్స్‌గారినిబట్టి మేడకి విలువ పెరగాలికాని, మేడనిబట్టి ఎక్స్‌గారిదికాదు. మంత్రి కుటీరంలోఉన్నా దానికి విలువ పెరుగుతుంది. సమర్థుడు, సహృదయుడు, మంచివాడు మంత్రిఐతే, ఆ పదవికి విలువ పెరుగుతుంది. ఆ సమర్థత, సహృదయత లేనప్పుడు ఆ పదవీ, ఆయనఉన్న మేడా, ఆయన ఆధ్వర్యం వహించే

ప్రభుత్వశాఖ, ఆయన మంత్రి పదవి నిర్వహిస్తూన్న ప్రభుత్వం అన్నీ డీవేల్యూ అవుతాయి. సమాజంలో మనం నిర్వహించే పాత్రలు మనకు అర్హతనిబట్టే లభిం చవు. అర్హతని సంపాదించుకోడానికి కృషి చేయడమే మన ధర్మం.

ప్రయాణాల్లోనేకాదు. జీవితంలోకూడా అనవసరమైన సామాన్లు మోసుకు పోతూంటాం మనం. నష్టాలు, కష్టాలు, కోపాలు, తాపాలు, ద్వేషాలు, రోషాలు - ఇవన్నీ మూటకట్టుకొని నెత్తిమీద వేసుకుంటేగాని జీవితంలో ముందుకు అడుగు వెయ్యలేం. ఇవన్నీ బ్రేక్ వేన్‌లో పడేసి హాయిగా కంపార్టుమెంటులో కూచుని ప్రయాణం చేయడం మనకి చేతకాదు. మన కుటుంబంలో అందరికి తినడానికి తిండి ఉండాలి. కట్టుకోడానికి బట్ట ఉండాలి. చదువు, విజ్ఞానం, ప్రేమ, అభి మానాలతోబాటు పండుగలూ పబ్బాలూ జరుపుకొనే ఉత్సాహం ఉండాలి ఇవన్నీ ఉంటే పక్కింటివాడి మేడకంటె మనది ఒక అడుగు తక్కువఉన్నా ఫరవాలేదు. ఇవి లోపిస్తే పక్కమేడకంటె పదింతలు మన మేడ పెద్దదైనా లాభంలేదు.

(మాటకచ్చేరి - స్వాతి)

# వాయిదాలు

—శ్రీ రావూరి వెంకట సత్యనారాయణరావు

నిజం ఆలోచిస్తే ఇది వాయిదాల యుగంగా కనిపిస్తోంది. ప్రతి విషయంలో వాయిదాలు... వాయిదాలు...

పూర్వం కోర్టుల్లో ఏమైనా కేసులు జరుగుతూంటే 'వాయిదా' వేశారనీ, వేయించు కొన్నామనీ చెపుతూ ఉండేవారు. పల్లెటూళ్ళలో ఉండేవారు – "పై నెలలో బస్తీకి వెళ్ళాలి. ఆరో తారీఖున వాయిదా" అంటూ ఉండేవారు.

బస్తీనుంచి ఏ వస్తువు అయినా తెచ్చుకోవలసిన అవసరంవస్తే "ఈ సారి వాయిదాకు వెళ్ళినప్పుడు తప్పకుండా తీసుకురావాలి" అంటూ ఉండేవారు.

ఒకరిమీద కేసుపెట్టినవారు, వ్యాజ్యం వేసినవారు, ధీమాగా చెపుతూ ఉండేవారు "వాణ్ణి ఒదిలి పెడతానా ? వాయిదాల గానుగకుకట్టి బస్తీచుట్టూ తిప్పనూ ! వాయిదా వాయిదాకూ వంద వదిలిపోతాయి ! అప్పుడు కాని రోగం కుదరదు" అని.

వాయిదాలు వేసినప్పుడల్లా పల్లెటూరినుంచి సాక్షులుకూడా వెడుతూ ఉండేవారు. వారికి భోజన వసతులు, రైలు ఖర్చులు, ఇతరత్రా వాడుకోవడానికి కొంత పైకం ఇస్తూ ఉండేవారు. ఇలా వెళ్ళేవారిని చూచి "ఆయనకేం వాయిదాల తిండితో హాయిగా బ్రతికి పోతున్నాడు" అనేవారు.

కేసుల్లో సాక్ష్యం చెప్పేవారూ, సలహాలిచ్చేవారూ, తమకు లాభం రావాలనే ఉద్దేశంతో "భగవంతుని దయవల్ల ఇంకో పది వాయిదాలు పడితే బాగుండును. పాతబాకీ ఒకటి తీరిపోతుంది" అనుకుంటూ ఉండేవారు.

ప్లీడర్లు కొంతమందికి ఎక్కువకేసు లుండడమువల్ల కేసులు వాయిదాలు వేయించవలసిన అవసరం వస్తూ ఉంటుంది. అందువల్ల వ్యాజ్యాలునడిపే వారలాటి చోటునే కేసులు ఇప్పించి వాయిదాలకు సొమ్ము గుప్పిస్తారు పార్టీలచేత.

"ఇన్ని వాయిదాలు పడుతున్నా యేమిటి ?" అని పార్టీ గోలపెడితే "వాయిదాల విషయం ఆలోచిస్తున్నారా ? ప్లీడరుగారి వాయిదా ఆలోచించు" అని దబాయిస్తూ ఉంటారు.

ఇలా కేసుల సందర్భంలో మాత్రం వాయిదాపేరు ఎక్కువగా వినిపిస్తూ ఉండేది ఇదివరలో. పోతే పల్లెటూళ్ళలో వాయిదా పద్ధతిమీద కొందరు వర్తకులు వచ్చి ఇత్తడి సామానులూ, బట్టలూ ఇచ్చిపోతూ ఉండేవారు. అయితే వీటికి ఒక్కటే వాయిదా ''కోతల వాయిదా.''

అంటే పంటకాలం రాగానే ఆ వ్యాపారులువచ్చి కూర్చునేవారు అరుగులమీద. వాయిదా డబ్బు వడ్డీతోకూడా పుచ్చుకొని వెళ్ళేవారు. అయితే అలా పుచ్చుకొన్న వారిని ఇతరులు కొంచెం హాస్యంచేస్తూ ఉండేవారు.

ఒక ఇల్లాలు వాయిదాకుకొన్న బిందె చంకన పెట్టుకొని నీళ్ళు తెస్తుందను కోండి చెరువునుంచి. అది చూచిన మరో ఇల్లాలు ''వాయిదా బిందెకే అంత చిందులు త్రొక్కాలా ఏమిటి?'' అనడం కద్దు. అలాగే వాయిదా చీర ధరించిన వాళ్ళను ''ఆవిడచూడు. వాయిదా చీరకే వందమాట్లు వొళ్ళు విరుచుకొంది'' అనడం వింటూ ఉండేవాళ్ళం.

''కాదంటే కాదని చెప్పు
అవునంటే మనసిటు త్రిప్పు
వల్ల మాలిన వగలే జూపి
వాయిదావేస్తే వల్లకాదు పో...''

అంటూ ఒక జానపద నాయకుడు పాడుకొన్న పాట ఒకటి ఉంది. ఇదే భావాన్ని సినీమాల నాయకుడు ఇలా పాడాడు.

'వయ్యారి భామా
వాయిదా వేయకే'

ఈ వాయిదా లనేవి ప్రణయంలో చాలా వింత ఘట్టాలు కల్పిస్తాయి.

నిజాని కీవాయిదా ప్రణయాలు ప్రియుణ్ణి ఒక ఒడ్డుకు చేరుస్తాయినే నమ్మకం ఉండదు. ఇలాంటి ప్రణయాన్ని గురించి ఒక కాలేజీ విద్యార్థి డైరీలో వ్రాసుకున్న గేయం చూస్తే ఎవరికన్నా మనస్సు ఉసూరుమంటుంది.

'ఎగ్జామినేషన్సు తర్వాత
వేసిన వాయిదా
వెకేషన్సు చివరదాకా వేశావు...
అప్పుడు నీ ఎదుట హాజరైతే

కాన్వకేషన్ దాకా వాయిదా
వేసి పొమ్మన్నావు.
అప్పుడు మళ్ళీ హాజరైతే
ఎంప్లాయిమెంటు రానిమ్మని
పెద్ద వాయిదా వేశావు.
అప్పుడు మళ్ళి హాజరైతే
'అన్‌ఫిట్' పొమ్మని
కేసే కొట్టివేశావు....
ఈ వాయిదాల ప్రణయం
ఎన్నటికీ మానని వ్రణం'

'ఆరుమెట్లు' అనే నాటికలో ఆ ధనవంతుడు వాయిదాల పద్ధతి ప్రేయసిని దర్శించి వస్తూ ఉంటాడు. వెళ్ళినప్పుడల్లా నజరానా చెల్లించి వస్తూ ఉంటాడు. ఆయన దగ్గరఉండే నౌఖరుకు తన ప్రణయగాధ చెపుతాడు. అతడు పల్లెటూరి నుంచి క్రొత్తగా బస్తీకి వచ్చిన వ్యక్తి.

అందుచేత యజమాని తిరగడం పదేపదే ప్రియురాలిని ప్రార్థించడం అతని కెంతమాత్రం నచ్చలేదు. అందుకని యజమానితో అంటాడు. "ఈ వాయిదాలేమి టండీ! లోకువై పోరూ! కనపడ్డప్పుడే కాయోపండో తేల్చేసుకోవాలి. ఆడది రమ్మన్నప్పుడల్లా వెడితే మగాడు అడుగూడిన కూజా అయిపోతాడు....

మా పల్లెటూళ్ళో ఇలాకాదు. ఎవడన్నా మతిఉండో లేకో ప్రేమిస్తాడనుకోండి. అవతలవాళ్ళు వాయిదావేస్తే చిత్తం అంటూ వచ్చెయ్యడు. "మళ్ళీ నీ దగ్గరకే రావడందేనికి? నీ కంటె అందమైనవాళ్ళు చాలామంది ఉన్నారు దేశంలో" అంటూ మీసం మెలివేస్తూ తిరిగొస్తాడు" అని.

వాయిదాలు వెయ్యడమనేది కొందరికి బాగా అలవాటు. ఉద్యోగాలకువెళ్ళినా అప్పు అడగడానికి వెళ్ళినా వాయిదాలు వేస్తూఉంటారు. ఉద్యోగం అడిగితే "ఇంకోసారి కనిపించు చూద్దాం" అంటారు. ఎన్నిమాట్లు వెళ్ళినా 'ఇంకోసారి' అలాగే ఉంటుంది.

చివరకు వెళ్ళినవాళ్ళకు వళ్ళుమండి ఈ డొంకతిరుగుడు సమాధానం దేని కయ్యా! వల్లకాదని చెప్పరాదూ...ఎక్కడన్నా నీళ్ళకావిడన్నా మోసుకుబ్రతుకు తాను" అని రావడందాకా వస్తుంది.

కొందరిళ్ళలో భార్యలు భర్తలతో ఏదైనా చెప్పదలచి 'ఒకమాట చెప్పాలి మీతో' అంటే "ఇప్పుడుకాదు...రేపుచెప్పు" అంటూ వాయిదావేసి వదిలించుకోవడం కూడా కద్దు. మర్నాడడిగితే 'వెటర్నరీ' ముఖంపెట్టి ఇప్పుడు కాదనడం జరుగుతూ ఉంటుంది. అసలు కొందరు ప్రాణనాధులు ఒక్క చిరునవ్వుకు కూడా 'క్వార్టర్లీ' వాయిదాలు వేస్తూఉంటారు.

మొన్న ఒకాయన అంటున్నాడు "ఆ దుర్మార్గుణ్ణి తన్నకతప్పదు. అదైనా ఒకసారి పూర్తిగాతన్ని ఊరుకోవడంకాదు. వాయిదాలప్రకారం వెళ్ళి తన్నిరావాలి. లేకపోతే వాడికి గుర్తుఉండదు" అని.

వాయిదాల ప్రభావం ఒక్కచోటేవిటి-వ్యాపారంలో, రాజకీయాల్లో, ప్రభుత్వ కార్యకలాపాల్లో అన్నింటిలో ప్రవేశించింది. ఈ వాయిదాలలో ఆమోదం ప్రమోదం కూడా ఉంది ప్రమాదంతోపాటు.

(ఆషామాషీ - ఆంధ్రప్రభ)

# ఆవకాయ

—శ్రీ పుచ్చా పూర్ణానందం

"ఆవకాయ ఖావో అమరలోకం జావో
ఆవకాయ మనదేరా ఆంధ్రుల గర్వమిదేరా."

అని యేనాడో ఆంధ్రమహాఋషి సెలవిచ్చాడు. అవును, ఆమాట అక్షరాలా నిజం. ఆవకాయ కూర్పూనేర్పూ ఆంధ్రవనితల ప్రత్యేకసొత్తు. ఈ ఊరగాయల రాణి, రుచులకాణాచి, తెనుగోడి తుర్ఫుయేస్, ఆంధ్రమహిళల గారాలకూచి త్రిలింగ దేశంలోనే అవతరించటం ఆంధ్రజాతి అదృష్టమే సుమీ. ఆంధ్రుడూ ఆవకాయ విడదీయలేని జంట, ఇన్సపరబుల్స్. వేదాలు, ఉపనిషత్తులు, గీత, బ్రహ్మ సూత్రాలు ఒకసిబ్బెలో, ఒక్క ఆవకాయముక్క మరోదాంట్లో వేసితూస్తే ఇదే మొగ్గు. లచ్చమ్మ కింత సంపద ఉందేకాని, నిక్షేపమైన యీ ఊరగాయ ఏది? జగజ్జనని కొండమ్మ కింత శక్తికలదేకాని, ఇంత చక్కని చవులూరించు పచ్చడికే నోచుకోలేదు. వాణెమ్మ వీణ మీటుతూకూనిరాగాలు తీస్తుందికాని, ఛాలెంజి, ఆవకాయ వేయమను చూద్దాం. ముజ్జగంబులలో దినికి ఉజ్జీయేలేదు.

అత్యాయిత పరిస్థితుల్లో, అవసరపు వస్తువులధరలు మింటను ముట్టుతుంటే, అధిక వ్యయంతో ఆవకాయపెట్టడం కుటుంబానికీ దేశానికీ అరిష్టదాయకమని ఆవిడా ఆయనా శీతాకాలంలో ఏకాభిప్రాయానికి వచ్చి కృతనిశ్చయులు కావడం, వసంత ఋతువురాగానే ఇంటింటా ఆవకాయ క్రతువుసాగగానే పట్టుదల సడలడం, చాలా కొంపల్లో తీవ్రమైన సివిల్‌వార్ లేవడం మామూలే – అసలే లోటుబడ్జెట్, పర్సు పెర్మిట్ చెయ్యదు అని అతడు గిలగిల్లాడినా, ఆర్థికశాస్త్రం, తర్కం, యుక్తివాదాలు ఎన్ని ప్రయోగించినా పిల్లాజల్లా ఉన్న కొంపలో, ఇల్లన్న తర్వాత సంగ్రహంగా కొద్దోగొప్పో విధిగా వేసితీరాలి, సీజనుదాటితే తలక్రిందుగ తపస్సుచేసినా లభ్యం కాదని, ప్రతివాది వాదనలో రీజనూ రైమూలేదని, ముప్పొద్దూ కంచాలు నడపాలంటే మగాడికేమితెల్సునని, తను చెప్పేదే సమంజసమూ సమర్ధనీయమూ అని, అప్పః నిమిత్తం అన్యదేశాలకు వెళ్ళవలసిన పనిలేదని, పాలవాళ్ళకు, కిరాణాకొట్టుకు,

బొగ్గులవాళ్ళకు, బట్టల దుకాణానికి వచ్చేనెలకు వాయిదావేశానని అవసరానికి ఆ డబ్బు వినియోగించుకోవచ్చని ఆర్థికమంత్రిణి ఆర్గుమెంటు చెప్పేసరికి, గృహమేధి పరాజయంతో మూడు గ్లాసుల మంచినీళ్ళు పుచ్చుకొని మెత్తబడడం, అఖండ విజయంతో ఆమె కిలకిల్లాడుతూ పైటచెంగుతో అతగాడి నుదురుతుడవం, ఆయన కర్చీఫ్‌తో కళ్ళద్దాలు క్లియర్ చేసికొని సర్వవిధాలా సహకరించడం ఎల్లరికీ తెలిసిందే!

మార్కెట్ కాయ దీనికి పనికిరాదు. రాజుగారితోట, పెత్తందారు తోపు, దేవుడివనం, సులేమాన్‌బాగ్, కలెక్టరాఫీసూ, కాల్వగట్టులూ వెతకాలి. విరామం లేకుండా ఆరామములన్నీ గాలించాలి. ఆవకాయకు ప్రసిద్ధమని అక్కడక్కడ సకృతుగా ఒకటో అరో కల్పతరువులు విరాజిల్లుతూ ఉంటాయి, మనుష్యుల్లో మహాత్ములు అరుదుగా వెలసినట్లు. దీనికి ఆరు మాసాలు ముందే అడ్వాన్సు రిజర్వేషన్; పాత వాడకందార్లచేత రికమెండేషనూ; తోటఆసామీని స్తోత్రంచేయాలి, తోటమాలిని ఉబకేయాలి; ఇంతాచేస్తే కోటాసిస్టమ్. ధరలో బేరమాడకూడదు. కాయ ఏరడానికి వీల్లేదు. చిన్నా పెద్దా వేసినవేవో కిక్కురుమనకుండా తీసుకోవాలి. పులుపూ పీచూ టెంకను గురించి ఏవంకా ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని విమర్శచేయగూడదు. రూల్సును ఉల్లంఘించినచో కఠినమైన చర్య; కోటారద్దు; వచ్చే ఏడుచెట్టుచాయలకు రానివ్వకపోవడం. ఇన్ని అవస్థలూపడి గృహస్థుతెస్తే, శ్రీమతి శ్రీవారి తెలివితేటల్ని క్వశ్చన్‌చేస్తూ "ఆహా, ఓహో, ఏమికాయ సెలెక్ట్ చేశారండీ!" అని మూతి విరుపుతో యీసడించి రిమార్కులు విసరటం.

మిరపకాయలు మొదటి కోతవే మణుగుల్లో ముందుగానే తెప్పించి భద్రపరచి ఉంచాలి. పల్నాటి వీరచిహ్నమైన ఎర్రటి కన్నుచెదరే కాయ వాడాలి. ఎలాంటి ఎరుపో – కవిసింహం మాటల్లో –

అరుణోదయం ఎరుపు, ఆంజనేయమూతి ఎరుపు
కాకినోరు ఎరుపు, కాళి నాలుక ఎరుపు
కళ్ళ కలక ఎరుపు, కాకరపండు ఎరుపు
చిలుకముక్కు ఎరుపు, చింతచిగురు ఎరుపు
రక్కసపండు ఎరుపు, రక్కసి తిండి ఎరుపు
వండునిప్పు ఎరుపు, పల్లవాధర మెరుపు
పుచ్చబద్ద ఎరుపు, పచ్చి పుండు ఎరుపు

కొరివిదయ్య మెరుపు, కొరివికార మెరుపు
కమలము ఎరుపు, తములము ఎరుపు
గోగుపువ్వు ఎరుపు, గురువింద గింజెరుపు
పగడాలు ఎరుపు, లాల్‌పగిడి ఎరుపు
పోస్టుబాక్సు ఎరుపు, పోలీసుటోపి ఎరుపు
సింధూర మెరుపు, ఎఱ్ఱ సముద్ర మెరుపు
సోషలిస్టు జండా ఎరుపు, రైలు గార్డ్‌ఫ్లాగ్ ఎరుపు
అన్ని ఎరుపులను తలదన్నె, ఆవకాయ ఎరుపు.

కనుక ఆవకాయ పరువు కాపాడాలంటే ఒకటో రకం మిరపకాయ సంపాదించాలి. రోళ్ళకు కొక్కు కొట్టించాలి. పాత రోకళ్ళకు పొన్ను వేయించాలి. కత్తి పీటలు సానపట్టించి అదనుకు పదునులో ఉంచాలి. పనిమనిషి సమ్మెకు సిద్ధపడి ఉండాలి. కూలివారు హైరేటు డిమాండ్‌చేస్తే తలవంచాలి. అనుకోకుండా అర్ధాంగికి అనుకోని ఇబ్బంది మబ్బులేని పిడుగులావస్తే, స్థితప్రజ్ఞుడవై ఆవకాయ క్షేత్రంలో నిలబడాలి. అన్నివైపులా సహకారం శూన్యమైతే వీధి తలుపు మూసి, పురుష సింహమే కారం లవణం వగైరా దంచాలి. పీటలు చేటలు తట్టలు బుట్టలు జల్లెళ్ళగట్రా సరికొత్తవి తెచ్చిఉంచాలి. ఎంతో దూరాలోచనతో వాయ 'షార్పెన్' చేయించినా లేత సొరకాయలు కోయగలవుకాని, స్వంత కత్తిపీటలు మామిడి కాయని చూడగానే పెడమొహం పెడతవి. పక్కింటివాళ్ళ మడత కత్తిపీటలు ఎరువుతెస్తే వంకర్లుపోయి చిల్లర జగడాలు తెస్తాయి. అప్పుడు మేదరిగారిని తెచ్చి ఆవకాయ జాతర జరపాలి. స్వయంగా వెళ్ళి తెలికల ఆసామీని పొగిడి దగ్గరుండి గానుగలోది తాజానూనె తేవాలి వార్షికంగా వస్తూన్న వల్లూరు నన్న ఆవాలునే వినియోగించాలి. పాతవి పరిశుభ్రంగా కడగడమేకాక 'న్యూ ఇయర్ మోడల్‌వి' రెండో మూడో నూతన మరజాడీలు అమర్చి ఉంచాలి.

సంసారంగుట్టు, ఆవకాయరట్టు, అన్నారు. 'ఫలానివా రింట్లో ఆవకాయ పెడుతున్నారహో!' అంటూ వాడకట్టంతా టాంటాం వేయాలి. ఈ కొలుపులో ఇరుగూ పొరుగూ పాత కక్షలు పూర్తిగా మరచిపోయి నిండు కో ఆపరేషను ఇస్తారు. సాన్నిహిత్యం, సమ్యక్‌దృష్టి, సమాజ సేవాపరాయణత్వం, సామూహిక శ్రమదానం, ఆవకాయతంతు సాధించిన ఘనవిజయాలు. అమ్మలక్కల 'టీమ్ వర్కు' కనులారా కాంచి తీరాలి; కోలాహలంతో కొన్ని ఏకాహాలు, కొన్ని సప్తా

హాలు; తెలుగునేల పల్లెబస్తీ తేడాలేక ఆవకాయ పండుగ వేడుకతో యథాశక్తి జరుపుతారు.

దీనికో 'స్టాండర్డ్ స్పెసిఫికేషను' పారంపర్యంగా వస్తోంది. కాయయొక్క టెంక, పీచు, కండ, పులుపు, ఊటనుబట్టి, ఉప్పు, పిండి, కారం పాళ్ళు మార్చాలి. ఆవకాయ స్పెషలిస్టులు అయిన అవ్వల డైరక్షన్లు అవశ్యం శిరోధార్యం. ఫిఫ్టీ - ఫిఫ్టీ మూకకు ఈ సబ్జెక్టులో టెక్నికల్ నాలెడ్జి మృగ్యం. గ్రంథస్థం కాకుండా కంఠస్థం మీద ఆధారపడుతూ అనుశ్రుతంగా అందింపబడుతూ వస్తూన్న విద్య ఇది. ఇల్లు కట్టిచూడు, పెళ్ళిచేసిచూడు అన్నారుకాని ఆవకాయ వేసిచూడు అనాలి. అప్పుడు తెలిసివస్తాయి అవస్థలు. సామగ్రియొక్క సరియైన పాళ్ళు బామ్మలకు క్షుణ్ణం. మామూలు ఆవ, గుత్తి ఆవ నీళ్ళపు ఆవ, బెల్లపు ఆవ, ఎండు ఆవ, వెల్లుల్లి ఆవ, నూపప్పు ఆవ, పెసర ఆవ, వెరైటీ సమదృష్టితో పెట్టాలి. ఉత్తరాంధ్రులు కలెక్టరు మామిడిని ఆప్యాయంగా బెల్లపు ఆవకాయగా పెడతారు. ఊరగాయలో తీపికి దక్షిణాంధ్రులు వ్యతిరేకులు. బెల్లం నాన్ బెల్లం మతాలు, యిటీవల తెనుగు జాతి సమైక్యత దృష్ట్యా చిరకాలపు కాంట్రవర్సీకి స్వస్తిచెప్పి అయోధ్య సయోధ్య వారు సామరస్యంగా సాధించిన పరిష్కారం ఏమిటంటే రెండూ వేయమన్నారు. ఏ జిహ్వకు ఏది రుచ్యమో అదే గ్రాహ్యం. పానకాలయ్య పార్టీవారు, గరళ కంఠుడు పార్టీవారు కలిసిపోయారు. పండితులూ పామరులూ, ధనాఢ్యులూ బలాఢ్యులూ, సోమరి జీవులూ శ్రమ జీవులూ, అత్తరు జీవులూ చెమట జీవులూ, పేలస్ వాసులూ పర్ణశాల వాసులూ తెనుగుతల్లి సంతానమంతా యథాశక్తి ఆవకాయ పెట్టారు. ఈ అభిమానమైన పికిల్ పిసినికొట్టును సైతం టికిల్ చేస్తుంది. హంస కమలమును, చాతకము నీలాంబుదమును, చక్రవాకం ప్రభాకరుని, చకోరం సుధాకరుని కోరుపగిది అసలైన సిసలైన ఆంధ్రుడు సదా ఆవకాయనే వాంఛించును. పై తెల్పిన సదరు కవి సింహం ఇంకా ఏమన్నాడంటే —

ఎచ్చోట కేగినా ఆవకాయ ముచ్చటే,
ఏ యింటి కెళ్ళినా ప్రత్యక్ష మగునయ్య
ఆంధ్ర గృహలక్ష్మి గారాబు బిడ్డ
సకల చవుల సమ్రాట్టు సుమ్ము.
అగ్నిసాక్షిగగొన్న అంబుజాక్షినివీడి
అమెరికా వెళ్తాడు ఒంటరిగను

దీన్ని వదలలేక వెన్వెంట గొనిపోవు
హార్లిక్సు సీసాలా భద్రపరచి;
ఏమి దినుసో యెంత సొగసో కిలాడి టక్కులాడి
మెస్మరైజు చేసింది ఎల్లరి మనసు
ముక్కోటి ఆంధ్రులను ఒక్కటిగ జేసింది
ఏకైక నాయకత్వం కట్టబెట్టారు శాశ్వతముగ;
రోగుల్ని భోగుల్ని, బాంకర్సుని బేంక్రప్ట్సుని
సమదృష్టి చూచేటి సామ్యవాది
ఏ యోగబలమో ఏ యాగఫలమొ
ఆంధ్ర దేశమునందు అవతరించింది.
శిలలు పులకించు మోడులు చిగిరించు
పిల్లలు ఇకిలించు పెద్దలు సంతసించు
ఆవకాయ మెక్కేసి హిమగిరి ఎక్కేసి
గర్జించగా 'మావో' మ్యావు మనును
చాతుర్వర్ణ్యాలూ కలిసి అంతా ఆవకాయ వర్ణమే
పంపాలి సందేశం చతుస్సాగర పర్యంతం
వంకాయ బజ్జికి నేస్త్రరత్నమ్మ వేడి ఇడ్లీకి సిసలైన జోడు
పులుసుముద్దకిచ్చు దోహదంబు
పప్పుకూడుకు మంచి ఒప్పులాడి
రొంప రోగాన్ని తక్కున చంపివేయు
మందకొడిని మార్చు పందెపు మనిషిగా
పెరుగు బువ్వకు పెద్దచెలికాడు
సాటి చెట్నీలు దీనికి దీటురావు
అతి జీర్ణశక్తికి ఔషధ తుల్యంబు
అన్ని రుచులలోను అగ్రతాంబూలమ్మ
ఆవకాయ రుచిని అసలు మరువగలేము.

మండు వేసవిలో పల్లె పట్నాలలో ప్రతి యింటా ప్రతి పూటా, కొత్త ఆవకాయ ఆరగింపు. 'శాంపిల్' చూడమని వీరు వారికీ వారు వీరికీ రాచిప్పలతో పంపడం, ఇవన్నీ వేరువేరుగా కలిపి అర్జంటుగా 'ఎక్స్పర్ట్ ఓపీనియన్' కోసం

పంపడం. వాటినిబట్టి ఆ యా వారలు 'ప్రొపోర్షన్సు' సరిచూసుకొంటూ తిరగ కలపడం.

ఆదెమ్మ దాంట్లో ఆవపిండి అర్థశేరు పొయ్యాలి. అప్పాయమ్మగారి ఆవకాయలో ఉప్పేచాలదు. కామాక్షమ్మగారికాయ నిలవదు. నిర్మలమ్మగారిది నిక్షేపంగా ఉంది. వకీలుగారిది అన్నీ వంకలే – డాక్టరుగారిది డాబుగా ఉంది. ఇలా సరదాగా సంభాషిస్తూ మొదట్లో మధ్యలో చివర్లో ఇదే కలుపుతూ, ఆవకాయ స్మరణతో ఆరగింపు సాగిస్తారు. 'చచ్చు పచ్చళ్ళు మురదాబాద్, ఆవకాయ జిందాబాద్' అంటూ భావిపౌరులు, వర్ధమాన ఆంధ్రవీరులు, తెనుగుకిశోరాలు అయిన బాలురు ఎంగిలి కంచాలముందే ఎలుగెత్తి ఆవకాయ నినాదాలు చేస్తారు.

లండన్ కానీండి లక్నో కానీండి – బెల్‌గ్రేడ్ కానీండి బెనారస్ కానీండి – సింగపూర్ కానీండి సింగరాయకొండ కానీండి – ఎక్కడఉన్నా అల్లుళ్ళ దగ్గర్నుంచి సాంకేతిక భాషలో జాబులు వస్తూంటాయి "మీ అమ్మాయికి వాంతులనీ, ఆవకాయ తప్ప మరేమీ యిమడడంలేదనీ, కడిగిన ఆవకాయ ముక్కలు మాత్రం అమోఘంగా చప్పరింస్తోందనీను". దాంతో ఇంటి యజమాని గ్రాండ్ ఫాదర్ కాబోతున్నందుకు గర్వంతో గృహిణిని పిలిచి "ఉత్త అమ్మమ్మవని తెలియదు సుమా" అని అన్యాపదేశంగా ఆ శుభవార్త అందించి అభినందించడం కద్దు. ఎరిగినవాళ్ళు వెళ్తుంటే జరుగురుగా పిండివంటల సహితంగా పావుజాడీ ఆవకాయ పంపడం, అప్పచ్చులు చేరాయికాని ఆవకాయ గల్లంతు అని అమ్మాయి ఉత్తరం వ్రాయడం, కాస్సేపు గగ్గోలుపడినా వదహారణాల తెలుగు బుల్లోడు జిహ్వాచాపల్యంవల్ల కిక్కుర్తిపడి ఆ ఆవకాయని కాస్తా దారిబత్తెంకింద జమవేసి కొన్నందుకు గర్వపడడం పరిపాటి. దూరానఉన్న కూతుళ్ళు, కోడళ్ళు వ్రాసే జాబుల్లో "యోగ క్షేమాలు పంక్తిన్నర, ఆవకాయ అయిపోవడం, దాని అవసరం తెలియబరచడం, వగైరాలు పేజీన్నర – మీరు వస్తూంటే తీసుకురండి – లేదా పార్సెల్‌లో పంపండి. కాని అడ్డమైనవాళ్ళనీ నమ్మి వాళ్ళద్వారా పంపించకండి. అని చివర ఒక హెచ్చరిక. ఈ వస్తువును పార్సెల్ చేసేటప్పుడు ఎర్రటి వస్త్రం క్లాత్‌రేపర్‌గా వాడడం శ్రేయస్కరం. లేనిచో అనేక దిక్కుమాలిన అనుమానాలకి హేతువు. లోపల మృతకళేబరాన్ని మూటకట్టారేమో అని రక్షకభటులు అటకాయింపు.

జన్మతః ఆంధ్రుడికి మామిడిపై మమతలావు. పుస్తకం పట్టుకుంటే పెద్దమ్మవారు ఆవహించే విద్యార్థి, పక్కవారి దొడ్లో మామిడి పిందెల్ని దులిపి ఉప్పు

కారంతో జత చెయ్యమంటే 'ఓ యస్ రెడీ' అంటూ లేచి కూచుంటాడు. శివరాత్రి నుంచే శివలింగం సైజులో మామిడి పిందెల దర్శనంకోసం భక్త శిఖామణులంతా తదేకధ్యానం చేస్తారు. అమృత వారాశియైన ఆవకాయని అధికంగా గ్రోలి అమృతమయులై అద్వైత సిద్ధిని పొందిన ఆంధ్రు లెందరో ఉన్నారు.

వెనకటికో మాటు ఇద్దరు కొంటె కుర్రాళ్ళు హోటల్ఆమెపై కసితీర్చుకోవాలని ఆవకాయ అయిటమ్మీద కాన్సన్ట్రేట్ చేసేసరికి, అన్నిమాట్లు తిరిగి వడ్డించలేక వళ్ళుమండి ఆ హోటల్ఆమె జాడీ జాడీ పళంగానే తెచ్చి వాళ్ళ మధ్య ఎత్తిపడేస్తే, వాళ్ళిద్దరూ తల ఎత్తకుండా అహిమహి చెరిసగం వేసేసుకుని సమీపంలోఉన్న పప్పుగిన్నెనీ నేతి పాత్రనీ స్వాధీనం చేసుకున్నారట! అయ్యో ఏటి కేడాదీ ఉండవలసిన ఊరగాయ ఊడ్చుకుపోయిందే అనే ఏడుపు ఒక పక్కనీ, రెండు నిండు ప్రాణాలు ఈ ఆవకాయ ఘాటుకి లేచిపోతాయేమో అనేభయం మరో పక్కనీ పీకుతూంటే, ఆ వితంతువు కళ్ళు రెండూ చెరువులయి చివరికి ఎర్ర కలువలులా మారిపోయాయికాని, ఆ ఆకతాయి లిద్దరూ మాత్రం జిర్రున చీదలేదు. అలాంటి తెలుగు వీరుల్నికన్న మన తెలుగుతల్లి ఎంత ధన్యురాలు! జై ఆంధ్ర మాతా! చావలేదు! చావలేదు! ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర!

ఆ మధ్య నొక అవ్వగారిని భూశయనం చేశారు. 'నక్షత్రం మంచిదో కాదో పంచాంగం చూడండి. ఆవకాయ జాడీలు జాగ్రత్త. అవతల ఇంట్లోకి తరలించండి. మైలపడకుండా' అని ప్రాణం విడవబోతూ ఆ వీరమాత తుది సందేశం ఇచ్చింది.

మాట గొణుగుడు పడుతూంటే కొడుకులూ మనవలూచేరి చెవిదగ్గరగా బిగ్గరగా 'అచ్యుత' అనమని గోలపెడితే 'ఆ...వ...కా...య' అంటూ భౌతిక కాయాన్ని వదిలి వీరస్వర్గ మలంకరించింది. కోర్టు వ్యవహారంలో ప్రాణంమీదికి వస్తే ఒక అర్ధాంగి తన ప్రాణనాధునికి నయాపైసచోటు పెట్టలేదు. ఆ లతాంగే ఆవకాయ అవసరం గుర్తించి పెనిమిటికి అయాచితంగా బంగారు గాజుల జత దూసి యిచ్చింది. ఆదర్శ నారీరత్నం. త్యాగమే ఆమె మారుపేరు. అలాంటి మహిళా మణులు తెలుగు దేశంలో కోకొల్లలు. ఒక హరిదాసుకు దేవుడు సాక్షాత్కరించి బొందితో కైలాస మిస్తానని ఆఫర్చేస్తే, అచట ఆవకాయ దొరుకునా అని సూటి ప్రశ్నవేసి, లేదని సమాధానం రాగానే, అయితే రానని తేటతెల్లంగా తెలియజెప్పి, మరి కొంతకాలం ఆవకాయ సేవిస్తూ ఇహలోకంలోనే తిష్ఠవేశాడు. అట్టి ఆవకాయ దాసులనుకన్న ఆంధ్రమాత పూత చరిత్రని స్వర్ణాక్షరాలతో వ్రాయ

వలసిందే - అన్నపువేళ ఉల్లి ఆవ ఉండవలె, లేదా కన్నతల్లి ఉండవలె అన్న సామెత ఊరికే పుట్టిందా? నిష్ఠాగరిష్ఠులైన ఘనాపాఠీలు సహితం కోనసీమలో తరవాణి ఆవకాయ సపోర్టుతో సేవిస్తారని వినికిడికదా! కలకత్తా వేదపరిషత్తులో అమలాపురం అవధాన్లుదే ప్రథమ స్థానం అయిందంటే అందుకు కారణం ఏమిటి? అవధాన్లుగారు అంతవరకూ సేవించిన తరవాణీ ప్లస్ ఆవకాయే కారణం. ఇట్టి మహత్తర లోకోత్తర ఊరగాయతిన్న నోరుకు వేదపఠనం నల్లేరుమీద బండి.. అరవైయేళ్ళ క్రిందట జర్మనీవాడు వెతుక్కుంటూవచ్చి విశ్వనాధశాస్త్రిగారిని వాళ్ళ దేశం తీసికొనివెళ్ళి అధర్వణ వేదంలోని రహస్యాలు చెప్పించుకొని రెండు సార్లు యావత్ప్రపంచాన్నీ గజగజ లాడించాడు. ఆ మహామహునికి ఆవకాయవల్లనే అంతటి బ్రహ్మాండమైన వేదవిద్య అబ్బింది. ఈ మధ్య ఒక భూసురుడు కాలం చేస్తే దినవారాల్లో కాకి ముట్టకపోతే వారసులు పిండం ప్రక్కనే ఒక దొన్నెలో ఆవకాయపెట్టి లెంపలు వేసుకుంటే వాయస సంఘం సమ్మె విరమించి బృందగానం చేస్తూ విచ్చేసి అవకాయ సమేతంగా పిండాన్ని పితృలోకానికి ట్రాన్సుపోర్టు చేశాయి. వసురుద్ర ఆదిత్యాది రూపాల్లో ఏ రూపంలోఉన్నా ఏలోకంలో ఉన్నా ఆంధ్రప్రాణి ఆవకాయ ఎడబాటు సహించలేడు.

చుట్టానికి నవకాయ పిండివంటలు వడ్డించి 'మా ఆవకాయ చూడండి' అంటూ వద్దంటున్నా సర్వుచేసి ధీమాగా ఎలాఉంది అని ప్రశ్నించి 'భేష్' అనిపించుకొని విజయోత్సవంతో వంటింట్లో దర్జాగా ఆంధ్ర లలనామణి మురిసిపోతూ ఉంటే, ఎంతో నేత్ర పర్వంగా ఉంటుంది. బంధుమిత్రులను అతిధి అభ్యాగతులను పంచ భక్ష్య పరమాన్నాలతో మెప్పించలేము. ఒక్క ఆవకాయ ముక్కతో తృప్తి పరచ గలము. ఆకస్మికంగా ఎట్టి నోటీసూ లేకుండా రెండో ఆటసినీమాచూసి అర్ధరాత్రి విచ్చేసిన ఆలివైపు ఆత్మబంధు పుంగవుడికి రెడీమేడ్ అన్నాధరువు. ఆహితాగ్ని పరులు స్వహస్తం వాళ్ళు సైతం చాటుగా అడిగి దీన్ని వినియోగిస్తారు. అరిష ద్వర్గాలను అవలీలగా జయించవచ్చు. కాని ఆవకాయ క్రింద ముముక్షువులుకూడా దీన్‌దీన్. దీని శ్రవణంతో సారూప్యం, నామస్మరణతో సామీప్యం, క్రతువు కాల క్షేపంతో సాలోక్యం, మూర్తిధ్యానమందు సాయుజ్యం యిహలోకమందే సామాన్యుడు సుళువుగా సాధించుచున్నాడు. టానిక్కులూ వద్దు తాయత్తులూ వలదు. మండలం రోజులు ఆవకాయ నియమం తప్పకుండా పుచ్చుకుంటే వజ్రకాయం ఖాయం. ఉష్ణం ఉష్ణేన శీతలం అన్న ఆరోగ్య సూత్రానికి ఆవకాయే మాతృమూర్తి. దీని దెబ్బతో అజీర్ణం అంతరించి అతి జీర్ణవ్యాధి ప్రబలుతుంది.

ఔషధ రాజయిన శశాంకుడు పాపం 'క్రానిక్' పాండురోగం పేషెంటు. ఆవకాయ సంజీవని సేవిస్తే ఎనీమియాపోయి కళంకం తొలగి కలాపూర్ణు డౌతాడు. ధన్వంతరి ఆంధ్రేతరుడు కావడంతో దీన్ని అపత్స్యం లిస్టులో వేశాడు. కాని దరిమిలా ఉద్భవించిన తెలుగు భిషగ్మణులు నిషేధాన్ని నెట్టేసి అల్లరి లేకుండా సుట్టుచప్పుడుగా నిశ్చితంగా అవశ్యం పుచ్చుకోవచ్చని సలహా యిచ్చారు. ప్రకృతి వైద్యులు చాలామంది లౌక్యంగా రోగులకు వద్దంటారుగాని తాము మాత్రం దీన్ని అభిమానిస్తూనే ఉంటారు. మా క్లాసుమేటు ఒకడికి డబుల్ టైఫాయిడ్వచ్చి చచ్చి బ్రతికాడు. పథ్యానికి పాతబియ్యం కుంపటిమీద ఉడకేసి వాళ్ళమ్మ నీళ్ళకెళ్ళింది. తల్లి వచ్చేలోపల నెమ్మదిగా ఓపిక చేసుకొని లోనజేరి తనకు కేటాయించిన గిన్నె, అందరికనీ ఉడకేసిన అడ్డెడు తప్పేలా అన్నం మొత్తం రెండూ రాచిప్పడు ఆవ కాయ సాయంతో ఊడ్చి పారేశాడు. రోగం తిరగబెడుతుందేమోనని అందరూ కంగారు పడ్డారు. మృత్యుదేవతే వీణ్ణిచూసి భయపడి తోకముడిచి తన తండ్రి యముణ్ణి వాటేసుకుని వెక్కి-వెక్కి ఏడ్చి జడుపు జ్వరంతో మంచానబడి సంధిలో నానా అపస్మారకపు మాటలూ, మరణ తీపులూట! మరోసారి ఆ పెద్ద మనిషే విచిత్రమైన ఫీట్ చేశాడు. సుష్ఠుగా భోంచేసి మా హాస్టలుకి వచ్చాడు నన్ను చూడ డానికి. ఆ రోజే కొత్త ఆవకాయ వేస్తారని ముందుగా సమాచారం అందింది. వేళా కోళానికి 'ఏరా అబ్బీ?' అన్నా. 'రెడీ!' అన్నాడు. నిజానికి లోపల ఖాళీలేదు. పాళంలో పడ్డదని శక్రిటరీని అభినందిస్తూ అరకేజీ ఉపాయంగా ఆరగించి, గొంతు గొట్టంలో నిలిపి, బయటకు రాగానే అపాయం లేకుండా సొంతం కక్కేసి సరదాగా కబుర్లుచెప్పి వెళ్ళిపోయాడు.

మామిడి ఎంత ధన్యురాలో! దాని జన్మ సార్థకత చెందింది. ఆంధ్రుడి చేతిలో పడ్డది. చరితార్థురాలైంది. ఎంత చక్కగా సాకాడు! చంకన యెత్తు కున్నాడు. నాజూకు నేర్పాడు. పేరు ప్రతిష్ఠలు తెచ్చాడు. అసలీ కాంబినేషన్ కనిపెట్టిన పురాణ ఆంధ్ర పురుషుని పుర్రె యెంత దొడ్డదో - వాల్మీకి ఆదికావ్యం దీన్నిగూర్చి వ్రాయవలసింది. బాదరాయణుడు పదునెనిమిది పర్వాల భారతము వ్రాయకుండ ఆవకాయ చరితం వ్రాస్తే తను తరించి మనలను తరింప చేసేవాడు కదా. పోనీ, ఆదికవి నన్నయ ఆవకాయ మాహాత్మ్యం ఒరిజినల్ వర్క్స్, అల్లి రాజరాజ నరేంద్రుడికి అంకితం ఇస్తే మన ఆంధ్ర వాఙ్మయంగతి ఇంత అధ్వా న్నంగా ఉండేదా! మొదటినుంచీ తప్పటడుగులే - ఒక విప్లవ కవి మూడ్ రావ

టానికి మూడు చెంచాల ఆవపిండి చప్పరించి మూడు వేడివేడి గేయాలు గీకేశాడు. సమయానికి ఎర్రసిరా అందుబాటులో లేకపోతే కొత్తపాళీ ఆవకాయ ఊటలోముంచి వ్రాస్తే బూర్జువాలకి ప్రగతి నిరోధకులకి మంటెత్తి కన్నెర్ర అయింది. మార్కండేయుడు శివలింగం ఆలింగనం చేశాడుకాని ఆవకాయజాడీ వాటేసుకుంటే కాలుడు ఆ చాలికి వచ్చేవాడా ? ఎన్నికల్లో ఆవకాయపార్టీ నిలబడితే తక్కిన అన్ని పార్టీలూ సోదిలోకికూడా రాకుండా చిత్తుగా ఓడిపోతాయి.

పూర్వం అగ్నిహోత్రంలాంటి ఒక ఆఫీసరు, సిఫార్సుకి లంచానికీకూడా లొంగకపోతే, ఈ ఊరగాయ ప్రయోగించారట! దాంతో జావజావయి దిగజారాడు. ఆవకాయ చెంతనుండగ ఆంధ్రపుత్రుడ చింత యేలరా అని ఒక బావాజీ అనేవాడు. సదరు బైరాగే జీవాత్మను పరమాత్మను ఆవకాయతో అతికించవచ్చని దివ్య రహస్యం సెలవిచ్చాడు. ఆత్మాభిరాముడూ లోకాభిరాముడూ ఆవకాయ జాడీలో కలిసిమెలిసి జాయింటుగా కాలక్షేపం చేస్తారట. ఆవకాయోపాసనద్వారా బ్రహ్మోపాసనకు సోపానాలు నిర్మించవచ్చట. దీన్నే నమ్ముకుంటే బలం నీ బంట్రోతు, హుషారు హమేశా నీ గుమ్మంవద్ద కాపలాదార్! అగస్త్యుడు తెనుగోడు. యావజ్జీవితం ఈ ఊరగాయ తెగ తినబట్టే సముద్రాలన్నీ ఔపోసన పట్టగలిగాడట. ఆహా ఆ గోసాయికి తత్వాలేకాక ఎంత జనరల్ నాలెడ్జి! ఒక ఆవకాయ ప్రియుడు తన పిల్లలకి వోరల్ విల్లులో డైరక్షన్సు ఇచ్చాడు – తన చితిపై చందనపు చెక్క అక్కర్లేదని, అరజాడీ ఆవకాయ కుమ్మరించమని, చితాభస్మం గోదావరిలోనూ బుడమేరులోనూ వద్దు, గంగలోనూవద్దు, గుండ్లకమ్మలోనూవద్దు – ఊరగాయకు ప్రశస్తి చెందిన ఒక సహకారం మొదట్లో పోయమని తను వస్తురూపంలో ఆ మామిడి చెట్టుపై మకాం వేస్తానని.

ఆ మధ్య ఒక పిసినిగొట్టు శిఖామణి, లింగరాజు కజిన్ బ్రదర్, కూతురు పెళ్ళి చేశాడు. చీకటి మార్కెట్‌లో అల్లుణ్ణి పదివేలుపెట్టి కొన్నాడు. వరుడి క్లాస్‌మేట్స్ పాతికమంది వచ్చారు. ఆవకాయ వడ్డించాలని పట్టుపట్టారు. కన్యాదాత వీల్లేదని పెంకెపెట్టు. సడలించమని కాంతామణి హితబోధ చేసింది. వినలేదు. మాటలు ముదిరి ఎంగిలి చేతుల్తోనే ముష్టియుద్ధం. పోలీసు స్టేషనుకి ఫోను చేశాడు. వారు వచ్చి ముక్క చివాట్లు ఇతనికి వడ్డించి ఆవకాయ జాడీలు తెరిపించి శాంతిని కాపాడారు.

కొత్త ఢిల్లీలో వి. ఐ. పి. లకు కొత్త ఆవకాయ తగిలిస్తే పీటముళ్ళు పడ్డ

గడ్డు సమస్యలన్నీ విడిపోయి ఒడ్డున పడతాం. తెల్లోళ్ళకు దీని రుచిచూపి రివాజా చేసి డాలర్లు గుంజవచ్చు. విదేశీ ద్రవ్య సాయంతో ఆవకాయ ఫ్యాక్టరీలు పెట్టాలి. సర్కారువారు యీ ఇండస్ట్రీని జాతీయంచేసి స్వంత మిల్లులుపెట్టి చౌక డిపోలు తెరిచి పీడిత ప్రజానీకానికి స్వల్పధరకు అందేలాగ చూడాలి. ఈ కార్యక్రమం సక్రమంగా నెరవేరాలంటే ఆవకాయ తహశ్శీల్దార్లనువేసి ప్రభుత్వ సిబ్బందిని పెంచాలి. స్టేటు, సెంటరు, కాబినెట్లను విస్తృతంచేసి ఈ ఊరగాయ శాఖను ఒక అమాత్య శేఖరుడికి అంటకట్టవచ్చు. లేబరేటరీలుపెట్టి ఆవకాయ టెక్నాలజీలో పాండిత్యం పెంపొందించాలి. ఆవకాయ మిషనరీస్ బయలుదేరి పాదయాత్రచేసి ప్రపంచమంతటా ప్రచారం చేయాలి. ఆంధ్ర కాస్మనాట్ గురువు రాచ్చిప్పేడు ఈ పదార్థంకూడా పట్టికెళ్తే అంతరిక్షంలోంచి క్రిందికి దిగుతాడా ? బొర్ర కరగాలన్నా బుర్ర పెరగాలన్నా ఇదే చిట్కా. వాడవాడలా ఆవకాయ పరిషత్తులు జరపాలి. టోర్నమెంట్సు నడపాలి. ఆరితేరిన ఛాంపియన్స్‌నే మిలటరీలోకి 'రిక్రూట్' చెయ్యాలి. ఆంధ్ర జాతికి ఇంత పౌరుషం ఉందంటే తరతరాలనుంచీ ఈ ఆవకాయ మెక్కడమే – అణువణువునా నరనరానా ఎక్కింది. ఆవకాయ దండు అను పేరున నేషనల్ మిలీషియా స్టార్టు చేయాలి. ఉత్తరోత్తరా యమర్జన్సీవస్తే ఈ దండును గవర్నమెంటు ఉపయోగించవచ్చు. ఆవకాయ దళాలు బుర్రకథల ద్వారా దేశం నలుమూలలకు వెళ్ళి ప్రబోధం చేయాలి.

చిరకాలంనుంచి గుంటూరువారిని గోంగూర వారని, గోదావరితీర వాసుల్ని ఆవకాయ వారని ఒకర్నొకరు సరసమాడతారు. మృదుమధురంగా, లలితంగా, నాజూకుగా జోకులు విసురుకుంటూ ఉంటారు. ప్రాంతీయ అభిమానం లేకుండా చెప్పాలంటే ఉభయ గోదావరి మండలాలను కలిపి ఆవకాయ జిల్లా అని కొత్త నామధేయం తగిలించడం ఆవకాయకు న్యాయం చేకూర్చినట్లు అవుతుంది. అవసరం అయితే శ్రీకాకుళంలోనే ఇందును గురించి శిఖరాగ్ర చర్చలు జరపవచ్చు. ఆవకాయకు నెయ్యికి పొత్తు కుదరదు. చేతిమీదకుకూడా తిలతైలమే వాడేవారిని ఆవకాయ సమర్థిస్తుంది.

ఆడా మగా తేడా లేకుండా నచ్చే, ఆబాల గోపాలం మెచ్చే యీ పచ్చళ్ళ తిలకమ్మకు ప్రత్యేకత చూపాలి. ఆవకాయ ఆంధ్రయ్య లందరి అవిభాజ్యమైన ఆస్తి. ఎన్ని పంపిణీలు చేసుకున్నా ఇది మాత్రం ఉమ్మడి కుటుంబ సొత్తుగా అవిభక్తంగా అనుభవించాలి సుమా. కటకం కంచీ, బళ్ళారి బరంపురం, మదరాసు

మరాఠా, టెంకాసీ వారణాసీ, ఎక్కడికి పోయినా నీతోటే ఉంటుందీ ముద్దులాడి. వైయాకరుణు లియ్యది పుంలింగమా స్త్రీలింగమా అని కొంతకాలం తర్జన భర్జన పడ్డారు. కాని తత్వవేత్తలు దీని జెండర్ జోలికి పోవద్దని, పరమేశ్వరుడే అర్ధ నారీశ్వరుడు కనుక ఏ రూపంలోనైనా ఆవకాయని తలచవచ్చు కొలచవచ్చు అంటూ పరిష్కారం చేశారు.

ఆవకాయ ఆంధ్రునిపాలిట పెన్నిధి. కులమతజాతి వివక్షతలేని సెక్యులర్ పచ్చడి. తిరిపమెత్తైనా పెట్టితీరాలి. ఇచ్చునైననూ కష్టనైననూ వేసితీరాలి అని మహిళామతల్లుల ఏకాభిప్రాయం. గోంగూరను శివపరంగా ధ్యానిస్తే ఆవకాయను ఆదినారాయణునిగా పూజించి, ఆంధ్రుడు హరిహరాభేదాన్ని ఆచరణ రీత్యా చూపించవచ్చు. నరజన్మ తిరిగి ఎత్తామే అనుకో తిరిగి ఆంధ్రావనిలో పుడతాం అని నమ్మకం ఏమిటి ? అందుకే, ఈ జన్మలోనే యథాశక్తి ఆవకాయసేవ, ఆవ కాయ ప్రచారం చెయ్యాలి. ఆవకాయ గైడ్లూ, మేడ్ ఈజీలు, మార్గోపదేశికలు, కరదీపికలు, శతకాలు విరివిగా రావాలి. సర్కారువారు ఇటువంటి గ్రంథాల్ని అచ్చొత్తించి ఉచితంగా పంచాలి. కవులుకూడా కావ్యాలద్వారా, కథలద్వారా ఆవకాయస్తవంచేసి జన్మని చరితార్థం చేసుకొందురుగాక ! గీర్వాణం బాగా బలిసిన ఓ మిత్రుడు ఇలా స్తుతించాడు.

ఉపరితలే వస్త్ర కిరీట ధారణం
ముఖే ఘాటుఘాటు ఘుమఘుమల్ ఘ్రాణానందం
కంఠే ఊట పుష్కలం కుక్షోపిండి సుమనోహరం
మూలే తిష్ఠతి ముక్కాః అధోతలే కరోతి శీర్షాసనం
యావత్జాడీ సర్వాంగ సుందరం
గృహే గృహే శోభతే ఆవకాయామృతకలశమ్.

ఇంకా ఏమన్నాడంటే, మధురాష్టకం త్రిప్పి వ్రాయాలట.

పిండీ మధురం, ముక్కా మధురం
ఊటా మధురం, టెంకా మధురం
చర్మం మధురం, స్మరణం మధురం
పాతది మధురం, కొత్తది మధురం

అడుగూ బొడుగూ అంతా మధురం
యత్ర యత్ర ఆవకాయ వర్తతే
తత్ర తత్ర శ్లోకత్వ ముచ్యతే.

ఆయుర్దాయానికి అరవై సంవత్సరాల ఎక్స్టెన్షన్ ఆవకాయ ఇస్తుంది. చప్ప చప్పని చచ్చు పచ్చుళ్ళు తిని శతమానంవరకే బ్రతికే బదులు ముప్పూటా ఆవకాయే దంచి దర్జాగా హాయిగా రాయిగా నూట అరవై సమ్మర్లు యిహలోకంలో వెలిగించి అంతట గుడ్‌బైకొట్టి పరలోకంచేరి అమరత్వం పొందడం ఆంధ్రయ్య అదృష్టం.

(ఆవకాయ - అమరత్వం)

# గొప్పవాడి పక్కవాడు

—శ్రీ హితశ్రీ

గొప్పవాడు అనబడే వా డెంత గొప్పవాడో, గొప్పవాడి పక్కవాడుకూడా అంత గొప్పవాడే. ఎవరైనా కాదని వాదుకువస్తే అసలు గొప్పవాడికంటే గొప్పవాడి పక్కవాడే గొప్పవాడని బల్లగుద్ది చెప్పి తప్పక ఒప్పించగలను. పక్కవాడు లేని గొప్పవాడులేడు. ఈ మహా ప్రపంచంలో ఏ మూలైనా అలాంటి వాడున్నా ఎవరూ ఒప్పుకునేదిలేదు. అధవా ఒప్పుకున్నా ఆ పురుషుడు సజీవంగా లేకపోతేనే. నీడలేని మనిషిలా, పక్కవాడులేని గొప్పవాడంటూ ఎవడూ ఉండబోడని మళ్ళీ మనవి చేస్తున్నాను. ఈ ప్రకటన కొంతమందికి ఆశ్చర్యం కలిగించవచ్చు.

కుంచెలేని చిత్రకారుణ్ణి ఊహించుకోండి. కలంలేని కథకుణ్ణి ఊహించుకోండి. అలాగే పక్కవాడులేని గొప్పవాడు. ప్రతిభని ప్రచారంచేసే సాధనం లేకపోతే ప్రతిభ ఎలా రాణిస్తుంది? గొప్పవాడి గొప్పతనం పక్కవాడికి తెలిసినంతగా ఎవరికీ తెలియదు; చివరికి గొప్పవాడికికూడా. అవునా? కాన్యూట్ రాజుగారి కథ జ్ఞాపకం తెచ్చుకోండి. కావాలంటే నవీన హిందూదేశ చరిత్రనుంచికూడా ఉదాహరణ లివ్వగలను. ఒక జిల్లాలో ఒక గొప్పవాడున్నాడు - పేరెందుకులెండి - నిజంగా గొప్పవాడే. అవునా? అటువంటివాడు జిల్లా బోర్డు ఎన్నికలకి నుంచో వచ్చునా? ఊహుఁ! నుంచో నంటాడే! 'ఇంతమందిలో నా గొప్పతన మేమిటి? నన్నెవరెన్నుకుంటారు? నేఁ నిలబడను' అంటాడు. పక్కవాళ్ళు - గొప్పవాడి గొప్పతనాన్నిబట్టి పక్కవాళ్ళ సంఖ్యాబలం హెచ్చుతూ ఉంటుంది - ఉన్నారు. కాబట్టి "నువ్వు నిలబడవయ్యా చాలు! నీ గొప్పతనం నీకు తెలీదుకాని నువ్వు నడుం కట్టావంటె అపజయ మనేది లేదనుకో. అసలు నువ్వు ఎన్నికలకి నిలబడితే ఓట్లన్నీ వానకురిసినట్టు కురవ్వా నీ పెట్టెలో!" అని ఆయన గొప్పతనం ఆయనకు తెలియజేసి ఎన్నికలకి నుంచోపెట్టారు. ఓ పదివేలు పోతేనేంగాక, తకీమని ఆయన జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా నెగ్గి ఊరుకున్నాడు. చూశారామరి, ఇలాంటి ఉదాహరణలు లక్షోప లక్షలు.

గొప్పవాడి పక్కవాడు హిజ్ మాస్టర్స్ వాయిస్. అంతేకాదు - ఉస్ కే తస్ మన్, ధన్ ఔర్ ప్రాణ్. ఋజువు చెయ్యగలను.

ఏ గొప్పవాడూ తనని గురించి తాను గొప్పగా చెప్పుకోడు. చెప్పుకోటం ఇష్టం ఉండదనికాదు. అలా చెప్పుకుంటే ఏటవాలు బల్లమీదనుంచి జారినట్టుగా పీఠం మీదనుంచి జారిపోవలసి వస్తుంది. అంచేత పక్కవాడు గొప్పవాడి తరఫున వకాల్తా పుచ్చుకొని గొప్పవాడి స్వంత స్వరంకంటె పదిరెట్లు ఉచ్చైస్వరంతో అతని కంఠం కోరిక తీరుస్తాడు. "గొప్పవాడికి సొంత డబ్బా గిట్టదు. అంటే తన డబ్బా తనే వాయించుకునేటంత స్వార్థపరుడుకాడు. వాయించే వాళ్ళకి తన డబ్బాని వప్పజెప్పగల వితరణశాలి అతను'' అని చెప్పకనే చెబుతూ గొప్పవాడి కంఠానికి ప్రాతినిధ్యం వహిస్తాడు.

అసలు కొన్ని సమయాల్లో పక్కవాడే గొప్పవాడి 'వాయిస్'. గొప్పవాడికి ఎన్నో పనులుంటాయి. ప్రతి పనికీ స్వయంగా హాజరు కావటం కష్టం. బీదవాళ్ళకి స్కాలర్ షిప్పులూ, కొద్దిగా దూరపు బంధువులకీ, స్నేహితులకీ, స్నేహితుల స్నేహితులకీ, వాళ్ళ బంధువులకీ, స్వజాతివాళ్ళకీ, స్వస్థల వాసులకి నెరవేర్చాల్సిన సిఫారసులు లాంటివి ఉంటాయనుకోండి. ఇవన్నీ పక్కవాడు చూసుకుపోతాడు. ఎవరితో సిఫారసు చేయాలో ఆ ఉద్యోగి దగ్గరికి పక్కవాడు సిఫారసు చేయబడే వాళ్ళతోసహా వెళ్ళి, "అయ్యా, నేను ఫలానా గొప్పవాడి దగ్గర్నుంచి ఒచ్చాను. ఈ పనేదో కాస్త చేసిపెట్టండి" అంటాడు. ఆ ఉద్యోగి కాస్త తటపటాయించాడా, పక్కవాడు ఆగ్రహావేశ పరవశుడై ''ఏమండోయ్, గొప్పవాడు చెప్పలేదను కుంటున్నారేమో, గొప్పవాడిమాటా నా మాటా ఒక్కటే. ఆ మాటకొస్తే గొప్పవాడే నేను, నేనే గొప్పవాడు, నేను చెప్పిన ప్రతి అక్షరం గొప్పవాడు చెప్పినట్టే, గమనించారూ ? తర్వాత మీ ఇష్టం" అని బెదిరించి కోపంతో వెళ్ళిపోతున్నట్టు నటిస్తాడు. ఉద్యోగంమీద ఆశఉన్న ఉద్యోగి వెంటనే పక్కవాడి కోపోపశమనం చేయాలి సిందే - అంచేత పక్కవాడికి "హిజ్ మాస్టర్స్ వాయిస్'' అని బిరుదు ప్రదానం చేస్తే మీలో ఏ ఒక్కరికీ కష్టంగా ఉండదని నా నమ్మకం.

ఈ రోజుల్లో ప్రతిరోజూ ఎక్కడో ఒకచోట విందు జరుగుతూనే ఉంటుంది - అకారణంగానే - (బీదవాళ్ళ కనుకునేరు ; ఉన్నవాళ్ళకే. బీదవాళ్ళకి విందులుచేస్తే ఏమొస్తుందీ ?) ఐనా విందు చేయటం ప్రధానంగాని అందుకు కారణం ఉండటం ప్రధానంకాదు. గొప్పవాడికిరాని ఆహ్వానమంటూ ఉండదుగా. ప్రతి విందుకి

వెళ్ళటం గొప్పవాడికి అనవసర శ్రమ; అదికాక శరీరం మొరాయించటంకూడా కద్దు. ఇలాంటి సమయాల్లో పక్కవాడు గొప్పవాణ్ణి కనికరిస్తాడు. గొప్పవాడికి తీరిక లేకపోయిందండీ. నన్నే తననిగా భావించుకోమన్నాడు మిమ్మల్ని'' అని విందు తలపెట్టి నాయనతో ముచ్చటగా అనేసి పక్కవాడు గొప్పవాడి శరీరానికి ప్రాతినిధ్యం వహిస్తాడు. ఇందుకు విందుకు పిలిచిన పెద్దమనిషి నిరభ్యంతరంగా ఒప్పుకుంటాడు. ఎందుకొప్పుకోడు ? పక్కవాడి ప్రభావం ఆయనకి తెలియదు కనకనా ? పని గడిస్తే సరి, ఎవరయితేనేం ?

గొప్పవాడు అతిగా మాట్లాడడు. ఈ నియమం అతను విధిగా అమల్లో పెడతాడు. ఎంచేతంటారా ? అతిగా మాట్లాడటం అనేక విధాల అరిష్టదాయకం. మనిషి శరీరంలో మాట్లాడటానికి అమర్చబడ్డ అవయవాలు బహు ప్రమాదకర మైనవి. వాటిని అదుపులో పెట్టుకోకపోతే అవి భస్మాసుర హస్తాల్లా పరిణమించ గలవు. అసలు గొప్పవాడికి అతిగా మాట్లాడటానికి తీరిక, ఓపికకూడా ఉండవు. అతని నోటినుంచివచ్చే ప్రతి మాటా ఎంతో విలువైంది. ఆ మాటల్లోని గొప్పతనం, వాటిలోని అంతరార్థం, భావ గాంభీర్యం ప్రతివాడికీ అర్థమయేలా విప్పి చెప్పటం వాటిని వాఖ్యానించటం గొప్పవాడి పక్కవాడిపని. పక్కవాడు ఎంత గొప్పవాడైతే గొప్పవాడి మాటలు అంత గొప్పగా మనకి అర్థమవుతాయి. పక్కవాడికి గొప్ప వాడి మనస్సు కరతలామలకం. అంచేత గొప్పవాడి మాటల వెనకాల ఉండే గొప్పతనాన్ని మనకి విశదీకరించటంలో పక్కవాడి సహాయం మనకి అత్యవసరం. ఒక చిన్న సంఘటన జ్ఞాపకం వస్తోంది.

ఓ సభలో ఉపన్యసిస్తూ ఒకానాక గొప్పవాడు ఇలా అన్నాడు. ''నా అమూల్యమైన అభిప్రాయంలో...'' 'కొయ్ఁ' అని వెనకాల కూర్చున్న ఓ కొంటె కుర్రాడు హెచ్చు స్థాయిలో అన్నాడు. 'షెఫీల్డ్' అని మరో విద్యార్థి అందు కున్నాడు. సభలో కలకలం బయలుదేరింది. గొప్పవాడి రుమాలు చెమటని అరికట్ట టానికి ప్రయత్నించి దానికి లొంగిపోయింది. ఇంతలో గొప్పవాడి పక్కవాడు లేచి మేఘ గంభీర స్వరంతో ఇలా అన్నాడు. ''ఓ సభా సదులారా ! మీ రంతా మన గొప్పవాణ్ణి అర్థం చేసుకోలేక అలజడి ప్రారంభిస్తున్నారు. 'అమూల్యమైన అభిప్రాయం' అనే మాటల్ని మీరు అపార్థం చేసుకున్నారని నాకు తెలుస్తోంది. 'అమూల్యమైన' అనటంలో గొప్పవాడి అభిప్రాయం మీకు విశదపరుస్తున్నాను. అమూల్యము అంటే మూల్యం లేనిది, అంటే విలువలేనిది. 'నా అభిప్రాయానికి

విలువలేదు' అని అతను సవినయంగా మనవి చేశాడు. ఇది అతని నిరాడంబ రత్వానికి, వినయ విధేయతలకి తార్కాణ. 'అమూల్యమైన' అనటంలో గొప్పవాడు ఇంకో అభిప్రాయాన్ని కూడా వ్యక్తపరిచాడు. మూల్యం లేకుండా అంటే ఉచితంగా నా అభిప్రాయాన్ని మీకు చెబుతున్నాను అని. ఇది అతని పరోపకార పారీణతకి అద్భుతమైన నిదర్శనం. ఇది మీరు గ్రహించకుండా, గొప్పవాడిని ప్రశంసించక, అభిశంసించటం మన మూఢత్వాన్ని తెలియజేస్తుంది. గొప్పవాడిని హేళన చెయ్యటానికి సాహసించేముందు మనం ముందువెనుకలు బాగా ఆలోచించాలి.'' సభలో వాళ్ళంతా తెల్ల మొహాలు వేశారు. గొప్పవాడు చిరునవ్వుతో పక్కవాడివైపు కృతజ్ఞతతో చూశాడు. పక్కవాడికి గొప్పవాడి ఊహలు బాగా తెలుస్తాయి కనుక అతని తరపున వకాల్తా వెంటనే పుచ్చుకో గలిగాడు. ఆ క్షణంలో పక్కవాడు ఉండబట్టి సరిపోయిందిగాని లేకపోతే గొప్పవాడికి ఎంత పరాభవం జరిగేది! గొప్పవాడు తనంతటతను మాత్రం ఇలా సమాధానం చెప్పలేడా ఏమిటి? అని మీరు అనొచ్చు. గొప్పవాడికి మనసులో ఉంటే ఉండుగాక, వెంటనే అది నాలుక మీదికి రావొద్దూ? అదిగాక గాభరాలో అతను తన ఉద్దేశాలు మరిచి పోకూడదని ఎక్కడుంది?

గొప్పవాడి జుట్టెప్పుడూ పక్కవాడి చేతిలోనే ఉంటుంది. పక్క వాడిని కాస్త నిర్లక్ష్యంగా చూడటం సాగించాడంటే గొప్పవాడు చప్పున తలకిందులు కావలసిందే. పక్కవా డనబడేవాడు గొప్ప సమర్థుడని ముందే చెప్పాను. నిర్లక్ష్యంగా చూడబడ్డ పక్కవాడు గొప్పవాడి పతనం ఒక్క చిరునవ్వుతో సాధించగలడు. ఓ నలుగురు పెద్దమనుష్యులుచేరి ఫలానా గొప్పవాణ్ణి జరగబోయే మీటింగుకి అధ్యక్షుడిగా ఎన్నుకుందామని నిశ్చయించుకుంటా రనుకోండి. పక్కవాడి కీ సంగతి ముందే తెలుస్తుంది. ఎలా అంటారా? పక్కవాడి ప్రతిభ అటువంటిది. ఇంతకంటె నేనేం చెప్పగలను? ఆ పెద్దమనుష్యుల దగ్గిరికి వెళ్ళి పక్కవాడు ఏమీ తెలియ నట్టుగా "మీటింగుకి అధ్యక్షు డెవరు?'' అని అడుగుతాడు. సమాధానం విని ఒక చిన్న నవ్వు ఒలికిస్తాడు. వాళ్ళు వింతగా చూస్తారు. "హఁ - వాడా?'' అని పక్కవాడు నవ్వుకుంటాడు. "ఏం?'' అని ఆ పెద్ద మనుష్యులు అడగటం సహజమే. పక్కవాడు యిచ్చే సమాధానం నవ్వే. అది చాలు. అసలు నవ్వుచేసేపని ఈ ప్రపంచంలో మరోటి చెయ్యలేదు. నవ్వు మాహాత్మ్యం తెలియని దెవరికి? ఒకవేళ నవ్వుతో పని అంత సానుకూలం కాకపోయినా పక్కవాడికి విజయం సాధించటానికి మిగతా సాధనలు ఉండనే ఉన్నాయి.

గొప్పవాడు కాస్త లోకువగా ఉంటే అతని రాజ్యమంతా పక్కవాడే ఏలుతాడు. ఓ గొప్పవాడు అధికారంలోకి వచ్చాడనుకోండి. అతని పక్కవాడుకూడా అధికారంలోకి వచ్చాడన్నమాటే. గొప్పవాడు కాస్త బద్ధకస్తుడైతే, లేక మొహమాటస్థుడైతే, పక్కవాడి ఢాకకి ఎదురులేదు. అతడి ప్రభ అద్భుతంగా వెలిగిపోతుంది గొప్పవాడి అనుగ్రహం పొందాలంటే ముందు పక్కవాడి సమ్మతి పొందాలి. పక్కవాడికి ఆగ్రహం కలిగితే అభ్యర్థులికి శనిగ్రహం పట్టినట్టే భావించుకోవచ్చు. పక్కవాడి కొన్ని చర్యలవల్ల గొప్పవాడి అధికారం పోవటం సంభవిస్తే అది గొప్పవాడి దురదృష్టం. కొందరి కుట్రలవల్ల అలా జరిగిందని పక్కవాడు తప్పక గ్రహించగలడు.

పక్కవాడు గొప్పవాడికి తరగని ధనంలాంటివాడని చెబితే అతిశయోక్తి ఎంతమాత్రంకాదు. ధనం సాధించలేని పనులుకూడా పక్కవాడు సాధించగలడు. ఇంత చెప్పిన మీదట గొప్పవాడి ప్రాణం పక్కవాడేనని మీరీ పాటికి గ్రహించే ఉంటారు. ప్రాణమేమిటి, మానంకూడా.

గొప్పవాడికి ఇంతటి ప్రయోజన కారకుడయిన పక్కవాడిని తగు రీతిగా ప్రశంసించటానికి మన తెలుగు భాషలో నాకు పదాలు దొరకటంలేదు. పాడని రేడియోలా, తవ్వని ఖనిజంలా, పాతిపెట్టిన ధనంలా పక్కవాడులేని గొప్పవాడి గొప్పతనం నిరర్థకం. అది అడవినికాచిన వెన్నెల - పక్క వాయిద్యాలు లేని గాత్రం. ఎంత గొప్పదైతేమటుకు ఏం రాణిస్తుంది ?

గొప్పవాడనబడేవాడు ఎంత గొప్పవాడో గొప్పవాడి పక్కవాడుకూడా అంత గొప్పవాడేననీ, లేక అంతకు మించిన గొప్పవాడేననీ ఋజువైంది. గొప్పవాడి పక్కవాడు కావటం మూలంగా గొప్పవాడైన ఆ పక్కవాడికి పక్కవాళ్ళు ఉన్నట్టేనా ? అని తర్కం తెలిసిన కొందరు తమ సందేహం వాగ్రూపంలో వెలిబుచ్చవచ్చు. ఆ, ఉన్నారు అన్నమాటే; పక్కవాడై గొప్పవాడైన ఆ పక్కవాడికీ, వాడి పక్కవాడికీ, మళ్ళీ ఆ పక్కవాడికీ - ఇలా. మరి లేకపోతే ప్రపంచంలో ఇంతమంది గొప్పవాళ్ళు ఎలా ప్రచారంలోకి ఒచ్చారనుకుంటున్నారు ? ఇంకో రహస్యం చెబుతున్నా మీకు. పక్కవాడంటూ ఉంటే ప్రతీవాడూ గొప్పవాడే. పక్కవాడు లేకపోబట్టికాని మనలోమాట నేను మాత్రం గొప్పవాణ్ణి కాదూ ? ఆ

మాటకొస్తే మీలో గొప్పవాడు కానివాడెవడు? కాని మనందరికీ కనీసం తలో పక్కవాడూ లభిస్తేగాని మన గొప్పతనం ఎవడూ ఒప్పుకోడు.

అంచేత గొప్పవాడికి ఎన్ని సన్మానాలు చేస్తారో పక్కవాడికికూడా అన్ని సన్మానాలు అంత ఘనంగానూ చెయ్యాలని నా వాదం. పక్కవాడి ప్రతిభ బహుముఖమని మనవిచేశాను. ఈ పక్కవాడే లేకపోతే గొప్పవాడికి పుట్టగతుల్లేవు. గొప్పవాడి పక్కవాడు పుత్ర, పౌత్ర, ఐశ్వర్యాభివృద్ధులతో పుడమిని వర్ధిల్లుగాక.

(11-11-49, తెలుగు స్వతంత్ర)

# కన్ను

—శ్రీ అప్పజోడు వెంకట సుబ్బయ్య

ప్రాణికి కన్ను ప్రధానమైనది. "సర్వేంద్రియాణామ్ నయనమ్ ప్రధానమ్" అను సూక్తికూడ ఆ సత్యమునే చాటుచున్నది. అందము ఆనంద హేతువు. సౌందర్యమునుజూచి పులకించుట చూపులేనిదే సాధ్యముగాదు. కన్నులున్న ప్రతి మానవుడును సౌందర్యమునుజూచి సంతోషించుననుటయు సత్యముగాదు. ప్రకృతి లోని అందమైన వస్తువు, కొన్ని కన్నులలో ప్రతిబింబించును. ఆ నేత్రములు నిలువుటద్దములు మాత్రమే. అట్లుగాక కొన్ని కన్నులు తమలో ప్రతిబింబించిన అందమును అంతరంగములోనికి ప్రతిఫలింప జేయగలవు. అవియే నిజమైన నేత్ర ములు. కొన్ని కన్నులు గ్రుడ్డి అద్దములవంటివి. వానినిజూచి పరిహసించుటకంటె, "పాపము!" అనుకొనుటయే మేలు. గోడమీద అందమైన చిత్రమును కన్నుతోనే జూచి బాగున్నదని కదలిపోవు వ్యక్తి యొకడు. ఆ చిత్రమునుజూచి, క్షణము నిలిచి, ద్రవించిన హృదయముతో తలయూచి తరలిపోవు వ్యక్తి వేరొకడు. ఆ చిత్రముచూచుట మాని గోడకట్టుటకు కూలి ఎంతగునో లెక్క-వేయువాడు ఇంకొకడు. గుణమును గ్రహించి హృదయమును కదలించు కన్నే సార్థకమైనది.

కన్ను అందమును ఆస్వాదించుటకు కొరముట్టు మాత్రమేగాదు. అది అంద మునకు గుర్తుకూడ. అందమైనవారని చెప్పుచు "చెంపకు చారడేసి కను" లనుట ప్రసిద్ధమే. వాల్మీకి మహాకవి రాముని సౌందర్యమును "రామో రాజీవలోచనః" అని పునరుక్తి దోషమునకు జంకక వర్ణించుటయు, పోతన కృష్ణుని "నల్లనివాడు పద్మ నయనంబుల వా"డని వర్ణించుటయు, కన్ను అందమున కెట్టి గుర్తో తెలుప గలదు. జంతువులలో అందమైన కన్నుగలది హరిణము. అందుచేతనే హరిణ నేత్రము అతివల నేత్రమున కుపమానమైనది. గోడకు కొట్టిన మట్టిముద్దలవలె కదలికలేని కన్నులకన్న, చలనమున్న చక్షువులే సుందరములు. అనగా సుదీర్ఘత, చాంచల్యము చక్షువులకు శోభాకరములు.

గ్రుడ్డివా రందరు చూపులేనివారుగారు. కన్నులున్న వారందరు చూపున్న వారునుగారు కొందరికి ముఖముమీది కన్ను గుడ్డిదైనను మనస్సులోని కన్ను మహా సమర్థమగును. మనో నేత్రమునకు మహత్త్వము మెండు. బాహ్య నేత్రము లకు సామాన్యముగ భౌతిక రూపములే అగుపించును. ఆ రూపముల అంతస్తత్వ ములగూడ దర్శించగల నేర్పు మనో నేత్రమునకున్నది. కొందరికి కన్నులున్నను సునిశితములైన చూపులుండవు. అట్టివారు ప్రక్కనున్నవానినిగూడ పరిశీలించలేరు. ఒక విధముగ వారు కన్నులున్న గ్రుడ్డివారే. అట్లుగాక కొందరు సహస్రాక్షు లగుదురు. వారి వాడి చూపులు సూర్యుని చూపులకంటె సునిశితములు. ఇవి ఇనుప తెరల భేదించి వెనుకనున్నవానిని చూడగలవు.

కన్ను మానవుని మనస్సునకు సింహద్వారము. మనస్సునందలి సుఖము, దుఃఖము, మంచి, చెడ్డ, ఆగ్రహము, అనుగ్రహము – మొదలగు భావములు కంటి నుండి కన్పించగలవు. వైద్యులు నాడిచూచి గుండె స్థితిని గుర్తుపట్ట, ఇంగితజ్ఞులు చూపునుజూచి స్వభావమును చెప్పగలరు. చాలమంది వేషమందును, వచనమందును దాచుకొన్న భావములు చూపులో సాక్షాత్కరించగలవు. విరోధి సేనలచే బంధింప బడినను, విపరీత పరిస్థితులచే బాధింపబడినను, ధీరోదాత్తుని ఉదాత్తత నిలువెల్ల లోపించిన లోపించునేమోగాని చూపులలో మాత్రము సన్నగిల్లదు. దొంగ ఎట్టి నాగరకమైన దుస్తుల ధరించినను, ఎంతటి ధర్మోపన్యాసముల నిచ్చినను, ఆతని దొంగతనమును శరీరమంతయు దాచిన దాచగలదేమోగాని కన్నులు మాత్రము కప్పి యుంచలేవు. దోషిని విచారించినపుడు ఆతని మాటకంటె కంటినే పరీక్షింపవలెను. ప్రేమను ప్రకటించుటకు చూపుకంటె చక్కని సాధనములేదు. ప్రేమకు తొలి చూపు పునాదిరాయి. ప్రేమికుల పెదవులకంటె చూపులే మొదట సంభాషించు కొనును.

కంటికి కాంక్షలున్నవి. సామాన్యముగ నది మనస్సు రంజించు దృశ్యము లనే వర్శింప నిచ్చగించును. కాని మనస్సును బాధించు దృశ్యములగూడ ప్రద ర్శించునట్టిది ప్రపంచము. అది విధి విధానము. వికసించిన పూవు చూచిన కన్నే వాడిపోయిన పూవు జూచును. వెలుగు వెల్లికల చూచిన కన్నే కటికి చీకటుల గాంచును. కల్యాణమును జూచిన కన్నే కన్నీటి బిందువుల చూచును. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని విశ్వరూపమును సందర్శించి "నినుగంటి కృతార్థుడనైతి నింక నొల్ల నొరులజూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే" అని ప్రార్థించుట ఇట

పేర్కొనదగినది. ప్రపంచమున కొన్ని కన్నులు కోరుకొన్నవి చూచి గతించును. అవి యదృష్ట జాతకములు. మరికొన్ని కన్నులు చూడనొల్లని వానినిజూచి చితికి పోవును. ఇవి దురదృష్ట జాతకములు.

అధికారి కంటికి, ఆడువారి కంటికి ప్రభావము మెండు. (మగవారి కంటికి ప్రలోభము మెండా ?) మాటకు మానవుని చులకనచేయు స్వభావమున్నది. విరివిగా మాటలాడు అధికారికి విలువ యుండదను ప్రాతకాలపు మాట ప్రజలనోట విన్పించును. ఆ మాటలో నిజము లేకపోలేదు. చేయుటకంటె చేయించుటయే యజమాని బాధ్యత. యజమానియొక్క రెండు చేతులకంటె అతని కన్నులే గురుతర కార్యము నిర్వహించగలవు. వ్యక్తినిబట్టి సమయమునుబట్టి సూర్యచంద్రుల ప్రవర్తింప నేర్చిన కన్ను యజమానికి విజయ హేతువు అతని తీక్ష్ణమైన చూపు సోమరియైన సేవకుని శ్రమింపజేయగలదు. దోషిని దండించగలదు. అతని చల్లని చూపు అనుచరుల కానంద మొసగగలదు. ఉత్సాహము వృద్ధిచేయగలదు. పనులు జరుపుటకు పాలకుడు చూపును వాడుకొనుట ఉత్తమ పద్ధతి. అంత సమర్థమైన చూపులేనిచో మాటను వాడుకొనుట మారుపద్ధతి. అటు చూపు ఇటు మాట లేని అధికారి సన్యసించి సాధువులలో గలియుట మేలు.

ఇక ఆడువారి విషయము. మనస్సులోని భావముల వెలువరుటకు మగవారు మొదట మాటనే స్వీకరింతురు. ఆడువారు ఏడ్చుటకుగాని నవ్వుటకుగాని కొరముట్టుగా వాడుకొనునది నోటికంటె కంటినే. అది వారి తత్త్వము. కన్నీళ్ళు విషాదము వ్యక్తముసేయు మూకభాషణలు. కన్ను ఏడ్చుటయే ఎక్కువమంది యెరుగుదురు. కన్ను గొప్పగా నవ్వగలదు. ఎవ్వరికి విన్పించకుండ, ప్రక్కవారికి తెలియకుండ, అవసరమైన వ్యక్తి హృదయమును అట్టె తాకునట్లు నవ్వునవ్వును రువ్వగల నేర్పు నేత్రమునకే గలదు. ఆ శిల్పమున ఆరితేరినవి ఆడువారి కన్నులే. మగవారు ఆ విద్యలో అక్షరాలు మగువలకడ నేర్వవలసినదే. నోటి నవ్వుకంటె కంటినవ్వు తీవ్రమైనది. నోటి నవ్వును లెక్కపెట్టక తప్పించుకొని తిరుగు ధీరు లుందురు. కాని రమణుల కంటినవ్వు కొందరికి హాలిజి రామబాణము. వారి నవ్వులో పరిహాసమున్నదో ప్రేమ యున్నదో తెలియలేక అనుమానపడు అమాయకుల అవస్థ బ్రహ్మదేవునకు బోధపడవలసిందే. శకుంతల కుశాగ్రము గ్రుచ్చుకొనెనన్న మిషతో నిలిచి చూచిన వంకర యోరచూపులకు దుష్యంతునివంటి ధీరోదాత్తుని హృదయమే కలత నొందినది.

దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే
తన్వీస్థితా కతి చిదేవ పదాని గత్వా
ఆసీద్వివృత్త వదనాచ విమోచయన్తీ
శాఖాసు వల్కల మసక్త మపి ద్రుమాణామ్.

లతా విటపమున ఏకావలి తగులుకొన్నదన్న మిషతో ఊర్వశి చూచిన యోరచూపు పురూరవుని హృదయమును కలవర పెట్టినది.

ఊర్వశీ :- (ఉత్పతన భంగం రూపయిత్వా)
అహోలతా విటపే ఏకావలీ వైజన్తి కామేలగ్నా
(సవ్యాజం పరివృతం రాజానమ్ పశ్యన్తీ)
చిత్రలేఖే ! మోచయతావ దేనామ్.

రాజా :- (స్వగతమ్) ప్రియా మా చరితం లతేత్వియా మే
గమనేఽస్యాః క్షణ విఘ్నమా చరన్త్యా
యదియం పునర ప్యపాంగ నేత్రా
పరివృత్తార్ధ ముఖీమయా ద్యదృష్టా.

ఇక సామాన్యులమాట చెప్పనేల ? కాంత కన్ను ఎదుటివానికి కల్లు పోయ గలదు. అందుకు వాఙ్మయమందలి 'మదిరాక్షి' యను పదము సాక్ష్యము చెప్ప గలదు. కాగా, ఈసడింపు చూపులు, మాత్సర్యపు చూపులు, కొరకొర చూపులు, చురచుర చూపులు - ఈ రకపు చూపులన్నియు స్త్రీలకడనే సిద్ధిపొందినవి.

మన వాఙ్మయములో చూపు సామర్థ్యమును చక్కగా గుర్తించి సమగ్ర ముగ చిత్రించిన మహాకవి తిక్కన. మాటలు చాలని మానసిక చిత్రణలకు, కవి బ్రహ్మ కంటి వర్ణనలు వాడుకొన్నాడు. మచ్చునకు కొన్నింటి నిట ముచ్చటింప వచ్చును.

కీచకుడు సుధేష్ణను సందర్శింపవచ్చి అక్కకు ప్రణమిల్లినాడు. కాంచన పీఠము వేయించి "ప్రియము చూడ్కి మునుగువడ" తమ్ముని సంభావించినదట. తిక్కన సుధేష్ణ హృదయము నిట చూపులో చూపినాడు. అక్క చెల్లెండ్రున్న వారికే చూపు అనుభవ పునరుక్తమే.

కీచకునికి ద్రౌపదిపై కన్ను పడినది. అది తప్పని అక్క నయభయముల తెలియజెప్పినది. అక్కమాట కీచకున కాగలేదు. మీదు మిక్కిలి సైరంధ్రిని

గూర్పుమని పట్టుబట్టి సోదరినే ప్రార్థించినాడు. ఆమె దూతికకాదు. మహారాణి. కీచకుడు దుర్విదగ్ధుడు; బల గర్వితుడు. ఆమె తిరస్కారము పతికి ప్రమాదించును. అంగీకారము తమ్ముని తుదముట్టించును. పైగా అట్టి కోరికను అక్క మన్నించుట ఆడుజాతికే మాపులేని మచ్చ. ఇట్టి విషమ ఘట్టమున సుధేష్ణ ఎట్లు సమాధానము చెప్పగలదు? "తన తమ్ముని నల్లనెత్తి దండడి దొరగం జనుదెంచు నశ్రుపూరము కనుగొనలో మ్రింగికొనుచు గామిని పలికెన్" అని తిక్కన కంటి వర్ణనతో ఆమె హృదయ వ్యథకు వేయి పుటల వ్యాఖ్యానము గావించినాడు.

తిక్కన కంటినవ్వుకున్న గొప్పదనము గుర్తించినాడు. ఉత్తర గోగ్రహణ మున అర్జునుడు కృపాచార్యునితో యుద్ధము సేయవలసి వచ్చినది. అర్జునుడు కృపాచార్యుని ధనువు ద్రుంచి సూతుని తలనరికి అశ్వముల చంపినాడు. ఇక మిగిలినది గురువుగారు కృపాచార్యులవారే - కాగా అది మాటకు చోటులేని సంద ర్భము. కావున క్రీడి "లోచనముల నవ్వు నెఱయ గృపుని నాలోకించి" అతని వక్షంబున క్రూర భల్లంబు లేసెనట. ఆ కంటి నవ్వులో పరిస్థితుల ప్రాబల్యము, పార్థుని హృదయము పొడగట్టగలవు.

కురుక్షేత్రమున ధర్మరాజు శల్యునిదాక శల్యు డాతని చాపమును ద్రుంచి నాడు. ధర్మజుడు శీఘ్రముగ నొండు విల్లుగొని "కన్నుల నవ్వుచు" బాణముల వేసెనని కవిబ్రహ్మ వర్ణించినాడు.

భారత యుద్ధమున భీముడు కురు కుమారుల దాకును. "తమ్ములు వీగినం" దుర్యోధనుడు భీము నెదిర్చి తనువు తూటులు పడవేసినాడట. భీముడు సూతుని బిలిచి వేగము రథము పై కరిగి "కన్నుల నిప్పులు జాలనవ్వుచు" దుర్యోధను నెదుర్కొనెనట. "నిప్పులు జాలు" ఆ కంటి నవ్వు భీముని భయానక విజృంభ ణకు తిక్కన నిలిపిన దర్పణము.

ఇట్టివి తిక్కన భారతమున పరశ్శతములు. తక్కిన కవుల గ్రంథము లందును కొన్ని లేకపోలేదు. సారస్వతమందలి అట్టి చూపుల నన్నింటిని ఏరి చూపుట అనావశ్యక మగుటయేగాక అపేక్షితము గూడకాదు. ఉనికిని దెలుపుటయే ఉద్దిష్టము.

నిత్య జీవితములో కొన్ని చూపులు కన్పించును. వాని యెదుట మాటలు నిలువలేవు. అవి స్వయం సంపూర్ణములు. హృదయ వ్యాఖ్యానములు. అప్పు

డప్పుడు అట్టి చూపులలో ఆరు ఋతువులు సాక్షాత్కరించగలవు. కొన్ని చూపులిట పేర్కొనదగినవి.

నడుమునకు పైట బిగించికట్టి, కడవ చంకనబెట్టి పూబంతివలె పల్లెపడుచు ఏటి నీటికి బయలుదేరినది. నీట కడవ ముంచినది. నడుమున కెత్తుకొన్నది. నిండుగా పూచిన పూలమొక్కను నడుముపట్టి ఊపినట్లు ఆ కడవ బరువునకు యువతిమేను కదలాడి పోయినది. ఒకటి రెండడుగులు ఇసుకమీద వేసినది. త్రోవ మలుపు తిరిగినది. మలుపులోని ఈతచెట్టు మాటునుండి మనసిచ్చిన మామయ్య ముందుకు వచ్చినాడు. ఆ కడవ దించినాడు. ఆమెను కౌగిట తీసికొన్నాడు. అతని కౌగిటలో వ్రాలి సిగ్గుచే శిరమువంచి సర్వస్వము అర్పించునట్లు అరమోడ్పు కన్నులతో అతనివైపు చూచినది. అది చూపుగాదు. నవవసంత శోభ. ఆ చూపునకు మానవుని శరీరమేగాదు, మన్మథుని శరీరమైన మొగ్గతొడిగి విరియబూయవలసినదే. అట మాటకు తావులేదు. వేకువ వీచు లేతగాలులకు క్రొత్తగా వికసించిన గులాబి పువ్వుమీద మిసమిసలాడుచు మసలాడు మంచు బిందువువలె, కదలుచున్న ఆమె పెదవిమీద మాట ఒకటి మెదలాడబోయినది. సూర్యుని చూపున కరగిపోయిన మంచుబిందువువలె ఆతని చూపు చక్కిలి గింతలలో ఆ మాట ఏదో మరగిపోయినది. ఆమెది మాటలేని మధురమైన చూపు.

ఇందుకు భిన్నమైన సన్నివేశముండును. అప్పుడప్పుడు కాముకులు కొందరు కీచకునకు శిష్యులగుదురు. వారు తన్ను తిరస్కరించిన తరుణివెంటనే తిరుగ సాగుదురు. జడనుండి జారిపడిన పువ్వునుజూచి జన్మ తరించినట్లు తలచి, దానిని చేతనెత్తి ప్రక్కవారినిగూడ లెక్కచేయక ఆమె చేతి కందింతురు. అనుగ్రహింపుమన్నట్లు ఆమెవైపు చూతురు. పదిమంది యెదుట ఆ పొగరుబోతులతో ఆమె ఏమని పలుకగలదు? మెడమలిపి చురచుర ఒక్కచూపు చూడగలదు. ఆ చూపుతో ప్రచండ గ్రీష్మము ప్రజ్వరిల్ల గలదు. ఆ చూపుసోకినచోట భూమికూడ బ్రద్దలు కాగలదు. ఆ కౌశికుని చూపునకు కొంగచచ్చిన దేమొగాని ఈ కాంత చూపునకు కొండలే మండిపోగలవు.

కాగా చూపులలో పరమ పవిత్రమైన మాతృమూర్తి చూపు స్మరించదగినది. తొమ్మిది నెలలుమోసి, కడకు కష్టపడి ప్రసవించి సొమ్మసిలి పడిపోయి, ఎంతసేపటికో సేదదేరి, రెప్ప విప్పుటకుగూడ శక్తిలేక సగము విప్పిన కనురెప్పతో ప్రక్కన పరుండబెట్టిన చిన్న బిడ్డను చూచుకొను తల్లి చూపులో వేయి మేఘాలు అమృతమును వర్షింపవా?

పరదేశ మేగి తిరిగి వచ్చిన ప్రియుని తన అత్తమామలు, ఇరుగు పొరుగు అమ్మలక్కలు కుశల ప్రశ్నలు వేయుచుండ, క్రొత్త కోడలు ఉప్పొంగిన హృదయము నేమని విప్పిచెప్పగలదు? అప్పుడు మాటకు ఆమె నోట మొగమాట మెక్కువ. ఏ తలుపుమాటులో నిలిచి నునుసిగ్గు దొంతరలతో చాటుచాటుగ ఒక్క చూపు చూడగలదు. ఆ చూపులో శరజ్జ్యోత్స్న తీవెలు సాగగలదు. ఆ చూపులోని చల్లదనమునకు వికసించిన హృదయముతో తా పడ్డ ప్రయాణ శ్రమనంతను అత డొక్క క్షణమున విస్మరించగలడు. అంత హాయిని గూర్చునది ఆ చూపు.

పెద్ద బ్రదుకు బ్రదికి, గొప్ప పదవులు నిర్వహించి, దురదృష్టమను వేరు పురుగు తొలిచిన వృక్షమువంటి వ్యక్తి నడివీధిలో నిలిచి పలుకరించువారులేక తన పాటునకు పరితపించుచున్నాడు. ఆ వీటి ప్రజ లొకనాడు తనకు అడుగడుగున అంజలి ఘటించినారు. తన రాక నెరిగి తోరణములు గట్టినారు. నేటి తన స్థితిని దలచి దైవచిత్ర మిట్టిదని తలయూచుచున్నాడు. ఇంతలో కొంత దూరమున నడచి వచ్చు వ్యక్తిని గుర్తుపట్టినాడు. తాను పదవియం దుండగా ఆ వ్యక్తి దూరపు చుట్టరికమును దగ్గరకు తెచ్చినాడు. స్నేహమును ప్రకటించినాడు. సేవ చేసినాడు. అట్టి ఆత్మీయుడు నే డగుపించినాడు. అతడు, నడి సముద్రమున దిక్కు తెలియక తిరుగువేళ, ఎక్కడో ఎగురుచున్న మిడుగురునుజూచి తీరమందలి దీపమనుకొని తృప్తిపడ్డ నావికుడైనాడు. వచ్చుచున్న వ్యక్తి, వరుసగలిపి పలుకరించగల డనుకొన్నాడు. ఆపదలోనున్న తన్ను ఆశ్వాసించగల డనుకొన్నాడు. ముందుకునడచి వికసించిన ముఖముతో, వచ్చుచున్న వ్యక్తిని తానె పెదవివిప్పి పలుకరింప బోయినాడు. అతడు పరిచయము లేనట్లు పెడమొగము పెట్టినాడు. ప్రక్కవీధికి తొలగినాడు. బ్రదికి చెడిన ఆ యభాగ్యుడు ఏమని పలుకరింపగలడు? పోతవోసిన బీదరికమువలె నిశ్చేష్టుడై నిలిచినాడు. వెళ్ళుచున్న వ్యక్తివైపు వెనుకనుండి ఒక్క చూపు చూచినాడు. ఆ చూపులో ఆకులన్నియు రాలి పచ్చదనము మచ్చునకైన లేక చిదుగుల గూడువలె చూపట్టు శిశిరకాలపు చింతచెట్టు ప్రతిఫలించినది.

ఇట్లే గుండెమీద కత్తియుంచిన హంత చూపు. ఆ యర్ధరాత్రివేళ గ్రుచ్చుకునే కత్తినిజూచి గడగడలాడు ధనికుని చూపు. పయనించు పరాకులోనుండి ఒక్కసారి ప్రక్కనున్న 'పోలీసు' ను జూచు దొంగచూపు – ఇట్టి చూపులన్నియు చెప్పుకోదగినవే. కాని ఎన్ని చూపులని చెప్పగలము? ప్రపంచమున ఆ చూపులను చూడగలిగిన చూపున్నచో వాని సొగసు చూడవచ్చును.

(వ్యాస మంజరి)

# పగటి కలలు

—శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ

పగటి కలలగురించి రాత్రిపూట కబుర్లేమి టనకండి. వీటిని చాలా మంది రాత్రి కలలకు ముందుగానే ఏర్పాటు చేసుకుంటారు. పగటి కలలు కనడానికిగ్గాని, వాటిని గురించి వినడానిగ్గాని తీరికా ఓపికా ఉండవు. పగటి కలలు మా కలవాటులేదని బుకాయించకండి. ఒకవేళ నిజంగా లేకపోతే అలవాటు చేసుకోండి. ఒంటికి చాలా మంచిది.

ఎందుకంటే, పగటికల అనేది మనిషికి దేవుడిచ్చిన మంచివరాల్లో ఒకటి. మనసులో పేరుకుపోయిన దురాశలను, నిరాశలను అందీఅందని ఆశలుగా పరి మార్చి వేసేమందు. మితంగా సేవిస్తే కండకూ గుండెకూ పుష్టినిచ్చే దివ్యౌషధం.

ఇందులో అందం ఉంది. ఆనందం ఉంది. కొన్ని ద్రవ్యాలుఇచ్చే ఉత్తేజం ఉంది. మరీ ఘాడమైన పగటి కలలు ఎండమావులవంటివయినా, అంత వేడి ఉండదు. అంత నిస్పృహ కలిగించవు. అంత చేదుకాదు. కాని చేదుకూడా కాస్త ఉన్నమాట నిజం – గులాబీని ఆఘ్రాణిస్తూఉంటే ముల్లు సన్నంగా – గుచ్చు కుంటుంది. సిగరెట్టు కాలుస్తూ కునుకుతీస్తే చుర్రుమని మేలుకొలుపు పాడుతుంది. అలాగే ప్రతి పగటికలకీ ఒక మేలుకొలుపు – అలారం టైంపీస్‌లా ఏర్పాటయి ఉంటుంది. కలకీ, పగటి కలకీ తేడా ఒకటి. అది అప్రయత్నంగా కనేది. క్షణంలో సగంలో యుగంసేపనిపించేటంత పెద్ద కల కనచ్చు. ఇది ప్రయత్న పూర్వకంగా ఆరంభించేది. ఎంతసేపు కలవుంటే, అంతసేపూ బుర్ర పనిచేస్తూనే ఉండాలి. కావలసిన ముడిసరుకు కోరిక – తీరిక.

కోరికఉంటే, తీరిక లేకపోయినా కంటారు చాలామంది. కోరిక కలకు బలవత్తరమైనది. రోడ్డుమీద నడుస్తున్నా, బస్సులో జనంమధ్య నుంచున్నా ఆఫీసులో చివాట్లు తింటున్నాకూడా పగటికల అర్జంటుగా కనవచ్చు.

గొప్పవాడు, బీదవాడు, బలవంతుడు, అర్భకుడు, మేధావి, మేధకుడు,

సమర్ధుడు, అసమర్ధుడు అనే భేదం లేకుండా అందరికీ ఉచిత ప్రవేశం లభించే స్వర్గసీమ పగటికల, ముఖ్యంగా రెండోకోవ మనుష్యులకు దివ్యౌషధం.

అను నిత్యం, అనుక్షణం ప్రపంచమంతటా కోట్లకొద్దీ పగటి కలలు ఉత్పత్తి అవుతూనే ఉంటాయి. వాటిలో బద్ధకిష్టులు హోరాహోరీగా పనిచేస్తూ ఉంటారు. దురదృష్టవంతులు డెర్బీస్వీప్‌లో ఆరుకోట్ల రూపాయలు... రూపాయలా డాలర్లా... డాలర్ కెన్ని ? ఐదు రూపాయలా...ఐదార్లు...ప్చ్... ఆరుకోట్ల బహుమతి అందుకుంటారు. ఆఫీసు ఉద్యోగులు మేనేజరుని నిలదీసి అడగాల్సిన నాలుగూ అడిగేసీ కడిగేస్తూ ఉంటారు. రచయితలు వెయ్యి పడగల నవలలూ, మహా ప్రస్థానం గేయాలూ, కామేశ్వరరావుగారి వ్యాసాలు అవలీలగా రాసేస్తూ ఉంటారు. ఇంజనీర్లు తొలిసారిగా రేడియోలూ, విమానాలూ, టెలివిజన్‌లూ కనిపెడుతూ ఉంటారు. నాగేశ్వరరావులా, సావిత్రిలా, రేలంగిలా నటించి పారేస్తూ ఉంటారు. కాముకులు ప్రపంచ సుందరు లందరినీ - కలకొకరు చొప్పున - పెళ్ళాడి కాపరాలు చేస్తూ ఉంటారు. అన్ని కలలకీ చివర - ఓ గుండుసూదిలాంటి నిజం సున్నితంగా గుచ్చుకొని మేల్కొలుపు పాడుతుంది. సన్నటి నిట్టూర్పుతో, అది కల, ఇది ఇల, అన్న గ్రహింపుతో కథ ముగుస్తుంది. విషాదాంతం అని తెలిసిగూడా ప్రతి వ్యక్తీ మోజుపడి కనేవి పగటి కలలే - ఆనంద బాష్పాలూ దుఃఖ బాష్పాలూ కలపటం లోనే ఆ మాధుర్యం ఉందేమో...

పగటి కలలలో తేలిక రకం ఉన్నాయి. అవి కలగాని కలలు. ఇవి టెక్నీ కలర్‌లా తీర్చిదిద్ది ఉండవు. ఇట్టే చెరిగిపోవు. అవి జీవితాంతం ఆడించి తిప్పలు పెట్టే కలలు.

జీతపు రాళ్ళతో అప్పులన్నీ తీర్చిపారేసి, అరువు లేకుండా ఇల్లు నడ పడం... అస లదికాదు. జీతంలో ఇకనుంచి నెలకు పది రూపాయలు మిగిలేటట్టు చేసుకోవాలనుకోవడం, క్షౌరశిల్పి ఈసడింపుతోచూసి మొక్కాల్సి కత్తిరించే షియర్స్‌తోటి క్షౌరం చేస్తాననేటంతలా జుట్టు పెరక్కుండా పెంద్రాళే వెళ్ళడం, ఈసారి సెలవొస్తే సుబ్బరంగా రెస్టు తీసుకోవాలని దురాశ పడడం, ఇలాటివే. నూటికి తొంభై మందిని తిప్పలుపెట్టే వాటిలో విశ్రాంతి ఒకటి. నే నెరిగిన కుటుంబరావుగారు ఒకరున్నారు. ప్రసిద్ధ కథకుడుకాదు. ఆయన అసలు కలలు కనరు. కన్నా హెల్తు బద్ధంగా కని వాటిని తక్షణం సాధ్యములుగా పరిమార్చి వేస్తాడు. నే చెప్పేది పెద్ద కుటుంబండున్న రావుగారి గురించి.

వాక్‌సార్ - ఏమిటండీ ఈ లైఫు, ఏమిటంట. పొద్దున్న లేచింది లగాయితూ ఎవడో తరుముతున్నట్టు మొహం కడుక్కోడం, కాఫీ తాగడం, పేపరు చూడ్డం, తినడం, జీను వేసుకొని పరిగెత్తడం, పరిగెడుతూ పనులు చేయడం, ఇల్లు చేరడం, తరుముతున్నట్టే తినడం, వర్రీసు, ఛ... ఛ... రన్నింగు రేసులాఉంది. బొత్తిగా రెస్టుండడంలేదు. ఈ కాలపు మానవులికి... అంటాడాయన ఎవరో తరుముతున్నట్టు. అని వెళ్ళిపోతాడు. ఒక్క క్షణం ఆగాడా... ఒక అరనిముషం సేపు ఆయన ముఖం ప్రసన్నంగా ఉంటుంది. కళ్ళు అరమోడ్చి తనలో తను చిరునవ్వు నవ్వు కుంటాడు.

ప్చ్... ఈ సారి... రేపు సెలవునాడు ఏమైనాసరే పూర్తిగా రెస్టు తీసుకు తీరతాను అంటాడు. మనం వద్దన్నట్టు. ఆ అరనిముషం ఎవరో తరుముతున్నట్టే ఆయన ఒక పగటి కల కంటాడన్నమాట.

"సెలవునాడు రెస్టంటే ఎలాగని మీ ఉద్దేశ్యం" అని అడిగాను. చెప్పమంటారా? అంటా డాయన హుషారుగా. చెప్పడంలోనే అనుభవించినంత ఆనందం కనిపిస్తుం దాయన ధోరణిలో.

ఆ పవిత్ర దినాన ఆయన రోజూలాగా ఆరింటికి లేవడు. ఎనిమిదిన్నరకి బద్ధకంగా కళ్ళు తెరుస్తాడు. తెరిచాక మళ్ళీ మూస్తూ తెరుస్తూ ఆలోచిస్తూ బద్ధకంగా ఓ అరగంటసేపు అలాగే పడుకుంటాడు. తొమ్మిదింటికి మేనేజరుగారి పెద్దబ్బాయిలా బెడ్‌కాఫీ తాగుతాడు. తరువాత పళ్ళుతోమి టిఫెనుతిని, సంచి పట్టుకొని కూరల మార్కెట్టుకి వెళ్తాడు. దారిలో వాళ్ళతో వీళ్ళతో పిచ్చాపాటీచెప్పి కూరలు తీసుకొని ఇంటికి వస్తాడు. పదిన్నరనించి వంటింట్లో కూర్చుని పెళ్ళాంతో కబుర్లాడుతూ కూరలు స్వయంగా తరుగుతాడు. వీలైతే కొన్నిటిని తనే పోపేస్తాడు. ఈలోగా శ్రీనించి మంగళంవరకూ పేపరు సావకాశంగా చదువుకుంటాడు. పన్నెండింటికి భోంచేసి, హాయిగా పడకేస్తే, నా సామిరంగా... ఇంకా చాలా ఉన్నాయి అలాటి కలలు. సాయంత్రం టిఫెను, క్లబ్బు, లేదా గుడీ, బైస్కోప్...

మొన్నటి వారంనాడు ఆ విధంగా చెయ్యాలని శనివారం సాయంత్రం పుస్తూతుడై సంకల్పించాడు. పగటి కలలు పండినవాడిని గాబట్టి ఈయనదే మాత్రం పండుతుందో చూదామని ఆరింటికే వెళ్ళి వాళ్ళింటి సావిట్లో కూర్చున్నా...

ఆనాడు ఆయనకి రివాజయిన ప్రకారం ఆరున్నరకే తెలివొచ్చింది. లేచి సావిట్లోకొచ్చి కటుక్కున నాలిక్కొరుచుకున్నాడు. ఎనిమిదిన్నరదాకా లేవకూడ

దనుకున్నాడుగాని వెధవది ఆలారం పీసులా అలవాటై పోయింది. పైగా - పెరట్లో దాసీది, గుమ్మంలో పాలవాడు, సావిట్లో పిల్లలు ఎలక్షన్‌లో ఉపన్యాసకుడి కంఠా లలా గొంతెత్తి మాట్లాడుకుంటున్నారు.

అమ్మని కాఫీ తెమ్మనరా - అన్నాడు కుర్రాడిలా.

మొహం కడుక్కోవా నాన్నా - అన్నాడువాడు.

కాఫీ తెమ్మంటే - అన్నాడాయన.

ఆవిడ వచ్చింది. విడ్డూరం గాకపోతే పాచి మొహంతో కాఫీయా... లెండి...లెండి - అంది.

అమ్మా కాఫీ గిన్నెలు వేస్తారా, అల్ల వారింటి కెళ్ళిరానా - అంటోంది పెరట్లో పనిమనిషి.

లేవండి అది వెళ్ళిపోతూందటా - పోతే మళ్ళీ నే తోముకు చావాలి - అంది ఇల్లాలు.

కుటుంబరావుగారు పెరట్లోకి పరిగెత్తారు.

అరగంట తరువాత మార్కెట్టులో కూరలు కొనబోయారాయన. బోలెడు కూరలు కొని హాయిగా, తీరిగ్గా అన్నీ తరగాలని లెక్కలువేస్తూ వచ్చిన పెద్ద మనిషికి వంకాయ రూపాయండి, దొండకాయ రూపాయపావలా అంటూ ధరల దండకం చదివేసరికి ఉషారు చల్లారి పోయింది. రెండ్రూపాయల కూరలు కొంటే గాని అరగంట తరిగిన సరదా తీరేట్లా కనబడదే —

ఏవిటీ ధర లిలా మండిపోతున్నాయి అని మండిపడుతూ కాసిని కూరలు కొని ఇంటికి బయల్దేరాడు.

వీళ్ళందరి పొగరూ అణచాలంటే ఇలాకాదు... అసలూ... నెమ్మదిగా ఆయన పగటి కలల స్వర్గసీమలోకి జారిపోయాడు. అందులో ఆయన ప్రధాన మంత్రి ధరలు పెంచితే డొక్క చీరేస్తానని రూల్సు వేయించి, ప్రజలని కాపాడా లనే పట్టుదలతో అదే ఎలక్షను ప్లాటుఫారంగా ఎన్నికై, మెంబరై మంత్రయ్యాడు...

కుటుంబరావుగారి పగటి కలల వయినాలు నీకేం తెలుసునని మీ రడక్కండి. ఆయన ముఖంచూస్తే ఆయన కల ఎప్పుడు ఆరంభమైందో మీక్కూడా తెలిసి

పోతుంది. చూస్తూ ఉండగానే ఆయన చూపులో ఒక రకం శూన్యత కవిస్తుంది. కోపంమీద కలగంటున్నప్పుడు ముక్కుపుటాలు పూరిస్తాడు. గెడ్డం కొనదేరుతుంది. పిడికిళ్ళు వాటంతటవే కాస్త బిగుసుకుంటాయి. ఇంకో పది క్షణాలకల్లా ముఖంలో ఎరుపు దిగుతుంది. బిగించుకున్న నరాలు సడలుతాయి. ముఖంలో ప్రసన్నత వెన్నెలలా కాస్తుంది. ఉండుండి చిరునవ్వులు పూస్తాయి. అంటే అర్థం – కోపం కొద్దీ మినిష్టరయిన కుటుంబరావుగారు - మంత్రి కాగానే మండుతున్న ధరలమాట మరిచిపోయి, వరండా అంత కారులో వెనుక సీటులో కూర్చుని వెళ్తున్నా డన్న మాట. సన్మాన సభలో దండ వేయించుకుంటున్నాడన్నమాట. బాదం హల్వా చలిమిడి ముద్దఅంత పుచ్చుకోవడమేకాక పిల్లలకి పొట్లాలు కట్టించి పంపిస్తున్నా డన్నమాట. పూలదండలన్నీ తుంచి ఆవిడగారిమీద పూలవాన కురిపిస్తున్నాడన్న మాట. ఇవన్నీ ఆయన ముఖ కవళికల్లో మనం సునాయాసంగా చదువుకోవచ్చు.

ధరల మంటలు చల్లార్చే కలలో నడుస్తున్న కుటుంబరావుగారి కాలికి, ఇలలో ఆంధ్రా రోడ్డుమీద కంకర్రాయి ఒకటి ఠక్కున తగిలింది. తక్షణం ఆయన మంత్రిపదవి త్యాగంచేసి 'అమ్మ బాబోయ్' అన్నాడు. ధరలకన్న ఎక్కువగా ఒళ్ళు మండిం దాయనకి. తక్షణం కాలికి మందేనా వేసుకోకుండా, పి. డబ్ల్యు.డి శాఖలో మంత్రిఅయి, రహదార్ల శాఖపని పట్టించడం మొదలుపెట్టాడు. ఆయన ముఖంలో కర్కశత్వం, ఆ పళ్ళు గిట్టకరుచుకోవడం, చూస్తే ఆయన శక్రటరీల చేతా రోడ్డు కంట్రాక్టర్లచేతా రోడ్లమీద రాళ్ళేరించి చదునుచేయిస్తున్నా డనిపించింది.

రెండు తీవ్రమైన కలలుకని ఇంటికొచ్చేసరికి ఆయనకి ప్రాణం చాలొచ్చింది. కూరలు నువ్వే ఏడూ అని భార్యకు సూచించి, మంచినీళ్ళు త్రాగి అరుగుమీద కూర్చొని అప్పుడే వచ్చిన ఆదివారం పత్రిక విప్పాడాయన.

కాస్త అందులో కథలూ వ్యాసాల సెక్షనిలా పారెయ్యండి అంటూ ఒక చెయ్యివచ్చి పేపరు లాక్కుని కావలసింది తీసుకుని మిగతా కాయితాలు ఆయన ముందు పడేసింది. కుటుంబరావుగారు ఆపాద మస్తకం కోపంతో ఉక్రోషంతో వణికిపోయాడు. తరువాత అరగంటవరకూ చూపు పేపరుమీద ఉన్నా మనసు పక్క పెద్దమనిషి జబర్దస్తీమీద ఉంది.

రెస్టు తీసుకుంటున్నారా అన్నాను వెళ్ళి.

నా బొంద... అన్నాడు ముక్తసరిగా.

బహుశా ఆయన కల్చరల్ మినిష్టరయి ప్రజలకి పేపరుకొనే అలవాట్లు, పక్కవాడిది లాక్కోకుండా ఉండే నిగ్రహం మప్పుతున్నాడనుకున్నాను.

హడావిడిలో టిఫెన్ ప్రోగ్రాం మరిచిపోయినందువల్ల కోపంతోటే ఆకలి చుర్రుమంది. ఆదివారంకదా అని దేవుడి పాటలు పాడుతూ సావకాశంగా మడి కట్టుకొన్న ఇల్లాలుమీదకు తిరిగిందదంతా. ఆదివారంనాడయినా స్థిమితంగా తిని పడుకొనే యోగంలేదు, అంటూ లేచాడాయన.

ఆవిడ నీళ్ళ కడవ దింపింది.

తొంగిచూసి నవ్వుకొంటూన్న పిల్లలకి రెండువేసి వెళ్ళగొట్టి ఇల్లాలిని బ్రతిమాలాడాయన, ఇప్పుడు నే నేమన్నానే - అంటూ.

కోపం తగ్గినందువల్లనో, అన్నం మాడువాసన వచ్చినందువల్లనో మొత్తానికి ఆవిడ గుమ్మంమీంచి లేచింది.

భోజనం అయి అమ్మయ్య అనేసరికి ఆఫీసరుగారి జవాను కబురుతెచ్చాడు ఆయాసపడుతూ. అదెంతపనీ అని వెళ్ళినవాడికి ఆయన నడ్డివిరిగేపని చెప్పాడు. పిల్లలకి మ్యాపులు వేసిపెట్టాలయ్యా గొడవ పెడుతున్నారు - అంటూ అటు తిరిగి పడుకున్నా డాఫీసరుగారు.

ప్రపంచంలో విద్యా విధానాన్ని రద్దుచేస్తూ సంతాన నియంత్రణం కఠినం చేస్తూ ఓ పగటికల కని, పని పూర్తిచేసి నాలుగింటికింటికి చేరిన కుటుంబరావు గారు వాలు కుర్చీలో రామచంద్రా అంటూ వాలిపోయారు.

ఈ సారి సెలవునాడు పూర్తి రెస్టుతీసుకోవాలండీ అన్నారు ఎదురుగా లేచి నాతో. పదిహేనేళ్ళుగా నడుస్తోం దాయన కల. ఇంకా ఫలించలేదు. నా కొకటే మార్గం తోచింది. ఈ సారి సెలవునాడు పదినిముషాలు తీరిక చేసుకొని - ఒక సెలవునాడు పూర్తిగా రెస్టు తీసుకున్నట్లు ఒక టెక్నికలర్ పగటికల కని పారెయ్యడం మంచిది అని.

(జ్యోతి - సెప్టెంబరు' 64)

# తాంబూలమ్

—శ్రీ కామేశమ్

"తాంబూలం వేసుకోరూ ?"

అంటుంది భార్య తొణికిసలాడే వయ్యారంతో. మొదటి రోజుల్లో ఆమెకు మితిలేని సరదా. ఎంతో భావం యిమిడ్చి లేత ఆకుల్ని చిలకలుగా చుడుతుంది. తనే అతని చేతికి అందిస్తుంది. కళ లుట్టిపడే ఆ వ్రేళ్ళను ముట్టుకోకుండా అతను ఏనాడూ ఆకులు తీసుకోడు; ఏదో సరసమాడడం మానడుకూడా. తీరికగా విశ్రాం తిగా తాంబూలం వేసుకుంటాడు. కేవలం తాంబూలపు రుచికోసమేకాదు; వారిద్దరూ సమంగా పంచుకునే ఆనందంకోసం. వారిద్దరూ చేరి విభజించుకునే ఒక మానసిక ఉద్వేగమే తాంబూలం.

తరువాత చనువు హెచ్చుతుంది. చిలకలుగా చుట్టకపోవచ్చును. సున్నితంగా మాత్రం ఈనెలుతీసి ఆకుల్ని దొంతరగా పేర్చి యిస్తుంది. ఎన్నో సంఘటనలు అప్పటికి నడచిపోయి ఉంటాయి. అన్నిటి జ్ఞాపకాల సొంపునూ నిత్యమూ తాంబూ లంతో దొంతరగా పేర్చి అతని కోసం వక్కల భరిణెమీద పెడుతుంది.

ఏ కవి ఋషీకూడా తాంబూలంవదిలి పెట్టలేదు. పెద్దనార్యునికి 'కప్పురపు విడెము' లేని కవిత్వమేలేదు. అతని వరూధినీ అంతే. అభిసారిక తన తలలోని మల్లెపువ్వులు సంధ్యలో కొండదారి పొడుగునా జారవిడుచుకుపోతుందిట. ఆ జాడలు చూసుకుని అతను నిర్ణీత స్థానానికి జేరతాడు. ప్రవరునికూడా 'వీటీ గంధము' మాత్రమే 'విద్యుల్లతా విగ్రహ' దగ్గరకు తీసుకు వెళుతుంది.

తాంబూలం, తెలియని వ్యక్తులను దగ్గరకు తీసుకువస్తుంది. అంతేకాదు. తెలిసిన వ్యక్తుల ఆనందాన్ని ధృవపరచగలదు. మొదటి రోజునకాదూ ఒకటే తాంబూలాన్ని దంపతులచేత కొరికిస్తారు ? ఆ రోజున పిన్నలూ పెద్దలూకూడా ఎంత అట్టహాసం చెయ్యగలరో ? నిత్యమూ వారందరూచూసే తాంబూలమే. కాని ఆనాడు వింతరుచితో అది వారి నందరినీ ఆకర్షిస్తుంది.

పెళ్ళిలో వెకిలితనం చిందులాడి పోతుంది. వియ్యపురాలిని ఆదరించి, మంచి గంధం రాసి, పన్నీరు జల్లి తాంబూలం యిస్తారు. అందులో పచ్చ కర్పూరమూ, సీమ మిరపకాయలూ పెట్టి చక్కగా అమర్చి ఆమె నోటికి అందిస్తారు. కట్నాలూ, కానుకలూ లెఖ్ఖచూసుకొనే మనస్సుతో వియ్యపురాలు ఆ తాంబూలం నమలుతుంది. పెళ్ళికివచ్చిన - దక్షిణాది చీరలు కట్టుకున్న - ఆడవాళ్ళందరూ పందిటిలోకి మూగి పోతారు. ఆవిడ అవస్థచూసి విరగబడి నవ్వుతారు!

చిలిపి తనానికేకాదు. పెద్దలను గౌరవించడానికికూడా తాంబూలం ఒక చిహ్నం. 'అగ్ర తాంబూలం' ఎవరికి? అన్న సందేహం ఎన్నిసార్లయినా వస్తూ ఉంటుంది. బ్రహ్మాండమైన పాండిత్యం ఒకరికి; అద్భుతమైన రసనశక్తి మరొకరికి. ఎవరిని ఆదరించడం? పృథివికి పునాది పాండిత్యం; జీవితానికి ఆనందం రసికత. ఎవరికి అగ్రతాంబూలం యివ్వాలో మనం నిర్ణయించలేము. వెనుక ధర్మరాజే నిర్ణయించలేకపోయాడు. రాజసూయయాగ సమయంలో భీష్మునికి అగ్రతాంబూలం యిచ్చి ఉండవలసింది. కాని కృష్ణుడు అంతకన్న సర్వజ్ఞుడు. భీష్ముడు ఉత్తమ మానవుడు, రాజతంత్ర నిపుణుడు, పూజనీయమైన వయస్సు, అతని చరిత్రలో శంకించడానికి కొంచెమూ స్థానంలేదు. కాని, కృష్ణుడు జ్ఞాని. వెన్నెలలో చల్లదనం లాగ, యౌవనం పొడచూపే యువతి శరీరంలో వెలుగులాగ, అతని నిశ్చింతమైన వర్తనలో మాహాత్మ్యం ఉంది. అందుకని ధర్మరాజు కృష్ణునికే అగ్ర తాంబూలం యిచ్చాడు. పూర్వకాలంలో రాజాస్థానాల్లో అగ్ర తాంబూలం 'నాకు రావాలి' అని ధైర్యంచేసి తీసుకోగలిగే ప్రజ్ఞావంతులు ఉండేవారుట.

ఆనాటి వింతలూ, సామర్థ్యమూ యిప్పటికీ చెప్పుకుంటూనే ఉంటారు. అందరూ భోజనంచేసి ఆ కాశ్మీరు తివాసీమీద కూర్చుని ఉంటారు. మధ్య రంగు రంగులుగా నేసిన పద్మం మాత్రం ఖాళీగా వదిలేస్తారు. అక్కడ వెండి తాంబూలపు పళ్ళెం పెట్టాలి. ఈ మధ్యనే వారి పెద్దబ్బాయి వివాహం అయిఉంటుంది. అతిథులు నూతనంగావచ్చి ఉంటారు. వారికి తమ కోడల్ని చూపించవద్దూ? "చూడమ్మా భారతీ! తాంబూలం తెచ్చిపెట్టవూ?" అని మామగారు పిలుస్తారు. తాంబూలం వ్యక్తులను తెలియపరచడానికి ఉపయోగిస్తుంది.

పెళ్ళినాటికిముందే మేము తాంబూలంతో అదృష్టాలు నిర్ణయించుకొనే వారము. చాలా చిన్నతనంలో పిల్లల మందరమూ మా బామ్మగారిదగ్గర కూర్చునే వారము. పాందానిలోనుంచి తామలపాకులు దొంగతనంగా తెచ్చుకుని ఆవిడ దగ్గర

కూర్చుని వేసుకునేవారము. మా తాతయ్యగారు తాంబూలం కాశీలో వదిలిపెట్టేశారట. మా బామ్మగారు మమ్మల్ని "యింత చిన్నతనంలో తాంబూలం కూడద"నేవారు. కాని ఆవిడే మా పోట్లాట చూసేది. పిల్లలలో నిరంతరమూ మా అందరకూ దెబ్బలాటే. ఎవరికి ఎంత ఎర్రగా నాలుక పండుతుందో అని పంతం. ఎంత చక్కగా పండితే, అంత చక్కని సుఖపెట్టే భార్యో భర్తో వస్తాదని నమ్మిక... మా చంద్రికకు ఆ పల్చని తమలపాకులాంటి నాలుక ఎంత ఎర్రగా పండిపోయేదో? అందుకే ఆమె భర్తకు అంతపెద్ద ఉద్యోగమయింది. పండుగకు పుట్టింటికి రమ్మని ఉత్తరం వ్రాస్తే "ఆయనకు శలవు లేదు; పాపం ఒక్కరూ ఉండలేరు" అని సమాధానం వ్రాస్తుంది!...... ఎన్ని తములపాకులు నమలినా నాకు పండేదికాదు... మా ఆవిడకు చిటికెలో పండేదిట.

ఆ చిన్నతనంలో ఎంత చాదస్తంతో, ఎంత సరదాతో తాంబూలం వేసుకునేవారమో! పెద్దవారు "తాంబూలం పిల్లలకు కూడదు" అన్నందుకే పౌరుషం వచ్చేది. ఆ కోపం తీరేవరకూ తమలపాకులు నములుతూనే ఉండేవారము. ఆకుల్ని జాగ్రత్తగా కడిగి తుడిచేవారము. ఈనెలు తియ్యాలని బ్రహ్మ ప్రయత్నం; ఎన్నో రోజులు ప్రయత్నం చేశాను. ఒకనాడూ ఈనెలు తీసిన తరువాత చేతిలో ఆకు మిగులలేదు. చిగురుకు విసువువచ్చి ఆకుల నన్నిటినీ ఈ నెలతోనే, అలాగే, గబగబా నమలి పూర్తిచేసేవాడిని. అక్కడితో ఆ రోజుకు తాంబూలం అయిపోయింది.

ఇప్పటికీ మనలో చాలామందికి ఆ చిహ్నలే ఉన్నాయి. ఎన్నో కార్యాలు నెరవేర్చాలనుకుంటాము. ఎన్నో ఆశలు ఉంటాయి. కాని ప్రతి ఉషస్సుతోనూ చక్కని మొగలిరేకుల్లాంటి తొలి సూర్యకిరణాల సొంపు ఆనందించే భాగ్యం లేక పోవచ్చును. ఎన్నో కలతలు వస్తూనే ఉంటాయి. అయినా తమలపాకుల ఈనెలన్నీ జాగ్రత్తగా తియ్యాలని ప్రయత్నం చేస్తూనే ఉంటాము. తిరిగి చిన్ననాటి ఆటే! ఆ ప్రయత్నంలో ఆకులన్నీ చిరిగిపోతాయి. ఆ నిస్పృహలో ఆకులూ, ఈనెలూ, అన్నీ నమిలి, మ్రింగి, పూర్తిచేసేసి ఆనాటికి లేచిపోతాము. అన్ని రోజులలోనూ కొంతమందికి ఇదే సంభవిస్తుంది.

తాంబూలం కొంతమంది జీవితంలో ప్రధాన ఘట్టము. శ్రీలేఖ తాంబూలపు మైకమునుగురించి సిగ్గుపడుతూ చెప్పిన విషయం మరచిపోలేను. ఆమె వివాహానికి పూర్వం "అతను" ఆమెకు దగ్గరి పరిచయస్థుడు. ఒకనాడు మబ్బు వెన్నెలలో

ఇంటివెనుక సింహపు తిన్నెమీద కూర్చున్నారు. అక్కయ్య సుశీల తాంబూలం పంపించిందిట. ఇద్దరూ ఆ తములపాకులు వేసుకుంటున్నారు...... "అతను కూలూలోయ సౌందర్యం గురించి చెబుతూఉంటే అతని కంఠంకోసం వింటున్నాను. ఎంతో వాంఛనీయంగా చెప్పగలడు. నేను మాటలు వింటూనే తమలపాకులు వేసుకుంటున్నాను. లేత ఆకులు. వ్రేళ్ళు తగిలితేనే శోషగిలిపోయే మార్దవం; వెన్నెలలో ఆకుల అందం అతని వాక్యాలకు రక్తిమ తెస్తూంది. చాలా ఆకులు వేసుకొన్నాను. ఎంతో ఉత్సాహంగా ఉంది. తరువాత అతను తనగీతం చదివి వినిపించాడు. ఎంతో ఉద్రేకంగా ఉంది. ఇంకా తెలియకుండానే నవ్వుతూ తాంబూలం వేసుకుంటున్నాను... నేనూకూలూలోయకు అతనితో వెళ్ళిపోయాను... త్వరగా... త్వరగా ఎగిరిపోతున్నాము. దగ్గరగా అంటిపెట్టుకు వెళ్ళిపోతూంటే అందరూ తలెత్తి చూస్తున్నారు... శరవేగంతో వెళ్ళిపోతున్నాము... ఏమైందో తెలియదు. లోపలికి వచ్చేటప్పటికి 'పెదిమెలు అంత ఎఱ్ఱబడి పోయాయేమిటే' అంది సుశీల."

ఇప్పటికీ తాంబూలం వేసుకొనేటప్పుడు శ్రీలేఖ సిగ్గుపడిపోతూ ఉంటుంది - తలంబ్రాలుపోసే పెళ్ళికూతురులాగ.

(భారతి - 1946 - అక్టోబరు)

# మాట్లాడ్డం

—శ్రీమతి పోలాప్రగడ రాజ్యలక్ష్మి

సంగీత సాహిత్య చిత్రలేఖనాదులవలె మాట్లాడ్డంకూడా ఒక కళే అన్న సత్యాన్ని నాగరిక జాతులన్నీ గుర్తించిన సంగతి మనకి ఆ యా జాతుల చరిత్రలు చూసినా, వారివారి సారస్వతాలు పరిశీలించినా, స్పష్టంగా గోచరిస్తుంది. చతుర వచోనిధి, వాగ్విలసనా వైభవము, పుష్కల వాక్చతురత్వమువంటి ప్రాచ్యదేశ మందలి పలుకుబడులేకాక, 'ఎ గుడ్ కాన్వర్‌సేసనలిస్టు', 'యాన్ ఎన్‌టర్ టైనింగ్ డిస్‌కోర్సు' వంటి పాశ్చాత్య ప్రయోగాలుకూడా మన కీసత్యాన్ని ఋజువు చేస్తాయి.

ఉక్తి చమత్కృతి, వాఙ్మాధురీ వైభవంకల వ్యక్తులుకూడా ప్రాక్ ప్రతీచీ ప్రపంచంలో పుష్కలంగా కనిపిస్తారు. పాశ్చాత్య దేశంలో ప్రఖ్యాత ఆంగ్లసాహితీ వేత్తఅయిన 'శామ్యూల్ జాన్సన్' మాట్లాడుతూంటే వినాలని సమకాలీనులైన సామాన్య ప్రజలేకాక, అప్పటి బ్రిటిష్ సామ్రాజ్యాధినేత అయిన మూడవ జార్జి కూడా ఉవ్విళ్ళూరాడు. అందుకే లైబ్రరీలో కూర్చుని చదువుకుంటూన్న 'జాన్సన్' దగ్గరికి ప్రత్యేకంగావచ్చి మాట్లాడి మరీ వెళ్ళాడు. 'జాన్సన్' వలె 'బెర్నార్డ్‌షా' కూడా మంచి వాక్చతురత కలవాడు. ఇరవయ్యో శతాబ్దిలో వాక్చాతురీ ధురీణులుగా పేరుపొందిన వారిలో గాంధీ, భోగరాజు పట్టాభి సీతారామయ్య, హారీమన్, గాల్‌బ్రేత్‌లు కొందరు.

ప్రపంచ చరిత్రలో ఇటువంటి వాగ్విశారదులు అక్కడక్కడ కనిపిస్తారు. అరేబియన్ నైట్స్ కథలు సుల్తానుకిచెప్పి, తన ప్రాణాలతోపాటు తోటి ఇతరస్త్రీల ప్రాణాల్ని కాపాడడమే కాకుండా, రోజుకో స్త్రీని వివాహమాడి మరునాడామెను చంపించే సుల్తానుయొక్క పైశాచిక ప్రవర్తననుకూడా మార్పించిన 'సెహర్ జాదా'; మొఘల్ రాజ్యాధినేత అయిన అక్బరు సభాస్థలినే కాకుండా యావత్ప్రపంచాన్నీ తన మృదుహాస్యోక్తులతో చక్కిలిగింతలు పెట్టిన 'బీర్‌బల్'; తెలుగువారి జిహ్వాగ్రములపై నిత్యమూ నర్తించే 'తెనాలి రామలింగడూ'; మాట్లాడడాన్ని మహోన్నత

మైన కళగా తీర్చిదిద్దిన చతుర వచోనిధులు. ఇంతేకాక మాట్లాడడం ఒక కళ అని పింగళిసూరన్నవంటి కవులు గుర్తించి శుచిముఖివంటి పాత్రల్ని సృష్టించారు. పక్షిరాజమైన శుచిముఖి—

శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగనీక
    పదమైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
    బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును, శా
    ఖా చంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకో నదుకుచు
    నుపపత్తి యెందు నత్యూర్జితముగ

నొకటఁ బూర్వోత్తర విరోధ మొదవకుండఁ
దత్త దవయప వాక్య తాత్పర్య భేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చినదట—

మాట్లాడ్డంలోఉండే అందాలూ, మాట్లాడేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలూ అన్నీ ఈ సీస పద్యంలో పొందుపరిచాడు పింగళి సూరనకవి. మాట్లాడడం నిజంగా ఒక మధురమైన కళే అని నిరూపిస్తూ పాశ్చాత్య వ్యాసకర్తలైన ఎ. జి గార్డినర్, ఎఫ్. వి. లూకాస్ వంటివారు ఆన్ కాన్వర్ సేషన్, సైలెన్స్‌వంటి ఎన్నో వ్యాసాలు రాశారు.

ఇలా దేశ విదేశాల్లో చిరకాలంనుంచీ ఒక కళగా గుర్తించబడుతూ వచ్చిన వాగ్వ్యవహారాన్ని అతి సున్నితంగానూ, మిక్కిలి నేర్పుతోనూ శాంత్యానంద వాతావరణ సృష్టికై ఉపయోగించేవారు ఎంతమంది? ఈ వాక్శక్తిని ఇలా ఉపయో గించాలని తెలుసుకున్నవారూ, దాన్ని అలా ఆచరణలో పెట్టగలిగేవారూ నేటి నాగరిక ప్రపంచంలో ఎంత శాతం ఉన్నారు?

మాట్లాడడాన్ని, ఒక లలిత కళగా మలచి, అందించే ఓర్పూ నేర్పూ స్త్రీలలో ఉన్నట్లుగా పురుషులలో చాలా కల్పించదు. ఉన్నా, అది స్త్రీల సంఖ్యతో పోలిస్తే పురుషులలో తక్కువమందికే అలవడినట్లు కనిపిస్తుంది. దానికి

కారణం మరేంలేదు. చాలామంది పురుషులకి మనం ఎలా మాట్లాడుతున్నాం అనే దానికన్న ఏం మాట్లాడుతున్నాం అనే దానిమీదే ధ్యాస ఎక్కువ. అందుకు అతని ప్రకృతి కొంత కారణం కావచ్చు. పైగా అతని చుట్టూ ఉండే వాతావరణం, అతను నిర్వహించవలసిన బాధ్యతలు, పర్యవేక్షించవలసిన వ్యవహారాలూ ఇవన్నీ ఆ ప్రకృతికి దోహదం చెయ్యవచ్చు. ఏమైతేనేం మగవానికి 'మేటర్' (సంగతి) మీద ఉన్న దృష్టి 'మేనర్' (విధానము) మీద ఉండదు. ఇందుకు కొందరు పురుషులు అపవాదం అయినా, అధిక సంఖ్యాకులు మాత్రం మాట్లాడడాన్ని ఒక కళగా అభ్యసించినట్లూ, ఆచరిస్తున్నట్లూ కనిపించదు.

అయితే, ఇదే విషయం స్త్రీలలో భిన్నం. స్త్రీలకి మాట్లాడడాన్ని ఒక కళగా మలచి అందించే శక్తీ, అలా అందించాలనే ఆసక్తీ, అందుకు కావలసిన అవకాశమూ పుష్కలంగా ఉంటాయి. అసలు ప్రకృతి సిద్ధంగానే స్త్రీకి ఈ కళ అలవడుతుంది. అంతేకాదు. ఎదుటివాళ్ళు ఎలా మాట్లాడుతున్నారు, వాళ్ళ మాటల్లో లోపాలుకానీ అంతరార్థాలుకానీ వ్యంగ్య, ధ్వని ప్రధానమైన భావాలుకానీ ఏమైనా ఉన్నయా, అని గమనించే దృష్టికూడా ఆమెకి ఉంటుంది. సరళమైన భావాల్ని సవ్యమైన భాషలో అందించే నేర్పూ, అందుకు కావలసిన ఓర్పూ, దానికి తగిన అవకాశమూ అన్నీ ఉండీకూడా కొందరు పెళుసుగానూ వెడసరంగానూ మాట్లాడుతూ ఉంటారు. అలాటివాళ్ళనిచూస్తే, అయ్యో ప్రకృతీ పరిస్థితీ కలిసి ఈమెకు ప్రసాదించిన ఆ వర వాగ్వైభవ కళను ఈమె ఎట్లా దుర్వినియోగం చేసుకుంటోందా అని విచారించవలసి వస్తుంది.

ఎదుటి వ్యక్తులు ఎలా మాట్లాడుతున్నారు అనే ధ్యాసా, పట్టింపూ స్త్రీలకి యెక్కువ. అలా ఇతరుల్ని విమర్శనాత్మకంగా పరిశీలించేవాళ్ళు తమగురించి తాము విమర్శించుకుంటారా అంటే దాదాపు విమర్శించుకోరనే చెప్పాలి. కొందరు నోటితో మాట్లాడి నొసటితో వెక్కిరిస్తారు. మరికొందరు సంభాషణలో వ్యంగ్యాన్ని దట్టించి తమ మాటని ఎదుటివారికి ఈటెలా తగిలేటట్లు వదులుతారు.

ఉదాహరణకి "ఈ చీర బాగుంది" అనడానికీ, "బా...గా...నే...ఉం...ది" అంటూ ఆ అక్షరాలని సాగదియ్యడానికీ ఎంతో తేడా ఉంది. ఎవరేనా ఈ వస్తువును ఇంతకి కొన్నాం అని చెప్పినప్పుడు "ఆహా... బాగుంది... ఖరీదు కూడా సరసంగానేఉంది" అనే నిండైన మాటకీ, "ఓస్...ఇదా? ఇదైతే నేను

చాలా తక్కువకే కొనిఉందును", అనే అవహేళనతోకూడిన మిడిసిపాటు మాటకి తేడా లేదూ?

కొందరికి మన మాటలవల్ల ఎదుటివాళ్ళ హృదయానికి ఏం నెప్పి తగులుతుందో అనే ధ్యాస లేకపోవడం అటుంచి, అసలు మనం ఏం మాట్లాడుతున్నాం అనే వివేచనకూడా ఉండదు. వెనకటికి ఒకామె ఉండేది. ఎవరేమి చెప్తున్నా ఆ మాట పూర్తిగా వినేదికాదు. వినకుండా వెంటనే "నా కలాంటివంటే అసహ్యం" అనేసేది. నేనోమాటు ఆమెతో అన్నాను, "మీ అమ్మాయికి అన్నివిధాలా అవకాశాలు ఉన్నాయికదా? వీణ నేర్పించకూడదూ?" అంటే, వెంటనే తపీమని 'నా కలాంటివి అసహ్యం' అనేసింది. పోనీ మీరు చెప్పిన సలహా బాగానేఉందికాని సంగీతం అంటే నాకు ఇష్టంలేదు అంటే ఒక మోస్తరుగా ఉండును. అలా కాకుండా అసహ్యం అని మొహం చిట్లించుకుంటే ఏమనాలి? "అయ్యో అమాయకురాలా! మాట్లాడ్డం బొత్తిగా తెలియదే! ఇలాంటివాళ్ళు ఇంటా బయటాకూడా అవమానం పాలవుతారుకదా" అని జాలి పడ్డాను.

నాకు తెలిసిన భార్యాభర్తలున్నారు. ఆయనకు భార్యను అస్తమానూ వేళాకోళం చెయ్యడం అలవాటు. ఒకసారి ఆమెను "నీ చెవులు ఏనుగు చెవుల్లా ఉన్నాయి" అన్నాడు. వెంటనే ఆమె నవ్వుతూ "అవునులెండి ఏనుగ కళ్ళకి అలాగే కనిపిస్తాయి" అంది. మునిమాణిక్యంగారి కాంతం 'ఫూల్స్‌కి మీరు దారి ఇవ్వకపోతే నేను ఇస్తానులెండి' అంటూ భర్తకి జవాబు ఇచ్చిన ధోరణిలో. ఆమె అలా చమత్కారంగా అన్న ఆ మాటకి ఆ దంపతులతోపాటు నాక్కూడా నవ్వు వచ్చింది.

ఇలా నవ్వుతూ నవ్విస్తూఉండే వాళ్ళని చూస్తే అందరికీ ఆప్యాయంగానూ ఇష్టంగానూ ఉంటుంది. మనస్సుకి మాట అద్దంలాంటిది కనుక మనిషికి విలువ కట్టేదీ, మనిషి విలువ నిలబెట్టేదీకూడా మాటే! "నిండు మనంబు నవ్య నవనీత సమానము పల్కుదారుణాఖండల శస్త్ర తుల్యము" అనేది నన్నయ్యవంటి ఏ మహానుభావులకో చెల్లిందికాని, ఆ మాటే నా పట్లకూడా అన్వయించుకోండి అంటే ఎలా?

అన్నం పూటలందించినా, మనం అన్న మాటలకి ఆఖరికి దాసీదికూడా పడదు. ఏం పెట్టకపోయినా అప్యాయంగా పలకరిస్తే చాలు అందలం ఎక్కినట్లు సంతోషించి చెప్పినపనల్లా చకచకా చేసుకుపోతుంది. తన అంతస్థును తను మరచి

పోకుండా తగిన రీతిలో మాట్లాడగలిగే పడతికి, ఇంట్లో వాళ్ళతోటేకాదు ఇరుగు పొరుగుతోకూడా ఏ పొర పొచ్చాలూరావు. మాట్లాడే తీరు తెలిస్తే నూటికి తొంభై సమస్యలు తల ఎత్తకుండా ఉంటాయి. చుట్టుపక్కలవాళ్ళకి నివ్వాళులూ ఎత్తక్క ర్లేదు – నిప్పులూ చెరగక్కర్లేదు. వాళ్ళని సాటివారిగా గౌరవిస్తూ చిరునవ్వుల సంభాషణల్ని కొనసాగిస్తూ, వారి స్వంత విషయాల్ని విమర్శించి హద్దుమీరకుండా ఉంటేచాలు, అంతా మిత్రులే అవుతారు.

ఇంట్లోకూడా ఓర్పుగానూ నేర్పుగానూ మాట్లాడడం ఆదర్శ గృహిణికి అలవడవలసిన విద్య. పెద్దవాళ్ళేకానీ, పసివాళ్ళేకానీ కోపంగానూ గట్టిగానూ మాట్లాడుతూంటే మనం నింపాదిగా సౌమ్యంగా మాట్లాడితే, ఎదుటివారి కోపం కూడా తగ్గిపోతుంది. తల్లి నేర్పుగా మాట్లాడితే ఆ ఇంటి పిల్లలకికూడా ఆ నేర్పే వచ్చి తీరుతుంది.

పెద్దలతో మాట్లాడినప్పుడు గౌరవంగానూ, స్నేహితులతో సంభాషించి నప్పుడు తియ్యగానూ, చిన్నవారిని పలుకరించినప్పుడు శ్రేయోభిలాషిగానూ, తల్లి దండ్రులతో మాట్లాడినప్పుడు గోముగానూ, అపరిచితులను కలుసుకున్నప్పుడు నిండుగానూ, పదిమందిలోనూ సరిసమానులతో మాట్లాడినప్పుడు చమత్కారంతో కూడిన హాస్యంతోనూ, విజ్ఞుల సమక్షంలో వినయంతోకూడిన సిగ్గుతోనూ మాట్లాడే మహిళ, భర్తని పిలిచే పిలుపులో ఈ సప్తస్వరాల్నీ పలికించ గలిగితే, అపురూప మైన సౌందర్యం అనంతమైన విద్యా విజ్ఞానాలూకంటే ఎక్కువగా, భర్త మనస్సుని ఆకర్షించి తన సంసారంలో కోటి స్వర్గాలు పండించుకోగలదు.

తియ్యగా, మృదువుగా, మనస్సునకు చల్లగా, మలయమారుతంలా, మాట్లాడ గలిగే వ్యక్తినే మాటకారి అంటాము. ఏ కార్యాన్నయినా సమర్థవంతంగా విజయ వంతం చెయ్యాలన్నా వ్యర్థంగా అర్థరహితం చెయ్యాలన్నా మాటే ముఖ్యం. శ్రీనాథుడు, తిక్కన, వంటి సమర్థులు కొందరు తమ వాక్ప్రౌఢిమ నుపయోగించి యుద్ధాల్ని నివారించగలిగితే, శకుని, ఇయాగో, శూర్పణఖ, కేషియస్‌వంటి కుత్సితులు తమ పదునైన పలుకుబడి నేర్పుని ఉపయోగించే పచ్చని సంసారాల్నీ బ్రహ్మాండమైన మహా సామ్రాజ్యాలనీ కూల్చి, భీకరమైన యుద్ధాల్ని సృష్టించారు. మాటల్లో మంటల్ని దట్టించి 'యాంటొనీ' రోమన్ ప్రజావాహినిని మహోదగ్రంగా మార్చివేయగలిగితే వాక్కులో అమృతాన్ని వర్షించి పెద్దపులులులాంటి ఆంగ్ల

శత్రువుల్నికూడా, గంగిగోవులాంటి అనుంగు మిత్రులుగా పూజ్య బాపూజీ మార్చి వేశారు.

ఏ ఇతర ప్రాణికీ ప్రసాదించని చక్కని వాక్కుని భగవంతుడు మానవునికి అనుగ్రహిస్తే దానిని హేళనకీ, స్వాతిశయానికీ, ఇతరుల్ని హింసించడానికీ, వైమనస్యాలు సృష్టించి కలహాలూ కల్లోలాలూ లేవదీయడానికీ, ఇంటా బయటా అశాంతిని కల్పించడానికీ కనుక మనం ఉపయోగిస్తే అంతకంటే అవివేకం, మహా పాపం ఇంకేం ఉండదు. అందుకే మాట్లాడడాన్ని మహోన్నతమైన కళగా మానవు లంతా అభ్యసించాలి. అలా చేసిననాడే మాటలోని మధురిమ వీనులకి విందుచేసి హృదయాల్ని అరవిందాలులా వికసింపజేసి, ఆర్ద్రితనీ, ఆత్మీయతనీ, ఆలోచననీ విస్తృతమొనర్చి లోకంలో ఎన్నో సమస్యల్ని చక్కగా పరిష్కరిస్తుంది. మానవ జీవితాన్ని మధుర స్వర్గంగా మారుస్తుంది.

(ఆకాశవాణి - ఆంధ్ర జ్యోతి 13-9-1968)

# స్వయంపోషకులు

—శ్రీ వాకాటి పాండురంగారావు

పందొమ్మిదివందల నలభై ఏడులో, అంటే మనకి స్వాతంత్ర్యంవచ్చిన కొత్తలో గాంధీజీ "ఇది కేవలం రాజకీయ స్వాతంత్ర్యమే; ఆర్థిక స్వాతంత్ర్యంకూడా వస్తేగాని పూర్ణ స్వరాజ్యం కానేరదు" అన్నారు. మరి ఇంగ్లీషువాళ్ళూ ఇట్లాంటి భావాన్నే మరోలా వెలిబుచ్చారు. "తమకుతాము సాయం చేసుకునేవారికి దేవుడు సాయం చేస్తాడు" అన్నారు.

ఇటువంటి సూక్తులూ సువార్తలూ విని విని, మన దేశవాసులలో కొందరు అప్పటినుండీ రకరకాలుగా ఆర్థిక స్వాతంత్ర్యంకోసం స్వయం పోషకత్వం కోసం కృషిచేస్తున్నారు. ఎంతో ప్రతిభా మరెంతో ధైర్య సాహసములూ-వీటి సాయంతో క్రొత్తదారులు త్రొక్కుతున్నారు. కాని సోమర్సెట్ మామ్ ఏమన్నాడు — "అబ్బాయ్ - పాతదారినే నడిచిపో. సుఖంగా గడిచిపోతుంది. క్రొత్తదారిని త్రొక్కావా ముళ్ళు గుచ్చుకోవచ్చు. పులులు గర్జించవచ్చు" అన్నాడు. ఆ మేరకు పాపం ఈ స్వయం పోషకంవాలాల క్రొత్తదారులనిండా అన్నీ చిక్కులే అన్నీ చీకాకులే.

ఆ మధ్య కోయంబత్తూర్‌లోనూ నెల్లూరులోనూ కరెన్సీ నోట్లను ముద్రించి నాసిక్ ప్రెస్‌వారికి కాస్త పనిరద్దీ తగ్గిద్దామని కొందరు పుణ్యపురుషులు ప్రయత్నిస్తే ప్రభుత్వంవారు వారి శ్రమకు మెచ్చి వారికి కొన్నేళ్ళపాటు ఉచితగృహ ఆహార వసతులతో విశ్రాంతి కల్పించారు.

మద్యనిషేధమో రామచంద్రా అని మన గవర్నమెంటువారు ఊరేగిన రోజుల్లో వీధికొక రసాయనిక ప్రయోగశాల వెలిసింది. సైకిలు ట్యూబుల్లోని వాయు పదార్థం ద్రవరూపం ధరించింది. రాచకొండవారి ధర్మమా అని ఈ సారా సైంటిస్టులందరూ తెలుగు సాహిత్యంలో నాలుగు కాలాలపాటు నిలిచిపోగల నాయికా నాయకులుగా రూపొందారు. కాని చట్టం కన్నుకుట్టింది. అయితేనేమి

"ధైర్యే సాహసే సారా''గా వెలిసింది. కొందరు అధికార్లకుకూడా ఇన్‌కమ్‌టాక్స్ బెడదలేని ఆదాయ మార్గాలు దొరికాయి. ఇట్టి సర్వతో ముఖాభివృద్ధిచూసి ఏ ఒకటి రెండు రాష్ట్రాలోతప్ప తక్కిన రాష్ట్రాలన్నీ మద్యనిషేధాన్ని నిషేధించాయి. శ్రీ వావిలాల చెప్పినట్లు గాంధీ శకానికి స్వస్తిచెప్పి బ్రాందీ శకానికి నాందీగీతం పాడవలసి వచ్చింది.

ఢిల్లీలో ఆ మధ్య కొందరు మేధావులు ఇంకో పద్ధతిలో స్వయం పోషకత్వానికి ప్రయత్నించారు. వారు హాయిగా బస్సు టిక్కెట్లు అచ్చువేసి ఢిల్లీ రవాణా వ్యవస్థ ఉద్యోగులలో కొందరి సాయంతో ఆ టిక్కెట్లను బస్సు ప్రయాణికులకు అమ్ముతూ ''స్వల్ప మొత్తాల పొదుపు ఉద్యమం'' వంటిది చేపట్టారు. కాని దాని దుంపతెగ! ఈ ప్రయత్నానికి ఇటు సర్కారువారిది కాని అటు దేవుడిది కాని ఆశీస్సులు లభించలేదు. బట్టతల వాడి నెత్తిమీద తాటికాయ పడ్డట్లు ''దొంగ టిక్కెట్టు కొన్నారన్న'' నేరంపై ఒక బస్సు ప్రయాణికురాలికి ౕ0 రూపాయిలు జుల్మానా విధించారు.

ఢిల్లీలోనే ఈ టిక్కెట్లవారి భ్రాతలు కొందరు ''సత్యమేవ జయతే'' మార్కు-మూడు సింహాల ప్రతిరూపంఉన్న పది పైసల పోస్టుకార్డులను అచ్చువేయ సాగారు. ప్రభుత్వం, విదేశాలనుండి తెప్పించిన ఖరీదయిన యంత్రాల సాయంతో ఎందరో సిబ్బందితో, ఎన్నో కోట్లరూపాయల ఖర్చుతో అచ్చొత్తించే (పై పెచ్చు మా శాఖకు పోస్టుకార్డులవల్ల నష్టం వస్తూంది అని చెప్పే) కార్డులను, కొందరు కేవలం కలిసి ఓ చిన్న ఇంట్లో చిన్న అచ్చుయంత్రంమీద మాంచి ఒకటోరకం సరుకు తయారు చేస్తూంటే వారి ఉపజ్ఞను మెచ్చుకోక వారినుండి 'ఎఫిషియన్సీ' నేర్చుకోక వారందరినీ నిరుత్సాహ పరిచింది. వారి అస్త్ర శస్త్రాలను స్వాధీనం చేసుకుంది. పత్రికల్లో "దొంగ కార్డుల ముఠాకు స్వస్తి'' అని చెప్పుకుంది. అందుచేత ఈ అన్నయ్యల ప్రయత్నమంతా పన్నీటబోసిన బూడిద అయింది. అందుకనే కాబోలు అన్నారు. ''కారే రాజులు..." అనీ, ''... వా రేరీ కార్డుల మూటగట్టుకొని పోవన్ జాలిరే...'' అనీ జాలి ప్రకటించాలి మనం.

కరెన్సీ నోట్లయినా, బస్సు టిక్కెట్లయినా, పోస్టుకార్డులయినా - ఇవన్నీ కూడా చాలా సాత్త్వికమైన కుటీర పరిశ్రమలు. ఏతద్భిన్నమైన పరిశ్రమ నొకదానిని ప్రోత్సహించిన ఘనత పశ్చిమ బెంగాలు రాష్ట్రానికి చెందుతుంది. ఆ ముచ్చటైన విషయాన్ని వారూవీరూకాదు సాక్షాత్తూ ఆ పుణ్యభూమిని కొన్నాళ్ళు ముఖ్య

మంత్రిగా ఏలిన 'శ్రీ' అజోయ్ ముఖొర్జీ వారే శలవిచ్చారు. "మా (మాజీ) ఉప ముఖ్యమంత్రి వారి హయాములో బాంబులు తయారుచేసే కుటీర పరిశ్రమ మూడు పూవులూ ఆరు కాయలుగా వర్థిల్లింది. రాష్ట్రంలోని మిగతా పరిశ్రమలన్నీ మూత పడిపోయాయి. కాని ఇదొక్కటి మాత్రం శుక్లపక్ష చంద్రుడివలె ఎంతగా వర్థిల్లిందంటే, కావలసినవారు బజారులో అవలీలగా రెండు రూపాయల కొక బాంబు చొప్పున కొనగలిగేవారు. రెండు రూపాయలకు కిలో బియ్యం మంచివి దొరకని రోజులలో రెండ్రూపాయలకి ఒక బాంబు అంటే ఎల్లీన్‌వా నవలలోని బాంబులమ్మే పాత్ర మన దేశంలోకి నడిచివచ్చినట్లుందని వార్త!

పాకిస్తానువారు టర్కీమీద, అరబ్‌వారు రష్యామీద, అజ్ఞాత నాగులు చైనీయులమీద ఆధారపడినట్లు మనవారు ఈ అస్త్ర శస్త్రాల విషయంలో పరాయి ప్రభుత్వంమీద ఆధారపడరాదనే మహోన్నత దేశభక్తి భావంతో ఈ పని చేసుంటారు. లేదా, ఓ పితృదేశంలో ఇంటింట ఒక లోహాలయం వెలయించిన చందాన, ఈ మాతృదేశంలో ఒక బాంబాలయం వెలయించడం సమంజసం అనుకొని ఉంటారు. వారి స్వయం పోషకత్వపు ప్రాథమిక సూత్రాల నవగతం చేసుకోని రియాక్షనరీలు ఏమైతేనేం వారి ప్రయత్నాలమీద చన్నీళ్ళు పోశారు...

చరాస్ ఎగుమతి విషయంలోనూ అంతే అయింది. ఆ గంజాయి సరుకు నెగుమతి చేయబోయిన వారనుకున్న దొకటైతే, వారికి సర్కారు వారిచ్చిన బహుమతి వేరొకటైంది. సరే ఈ తయారీలూ ముద్రణాలయాలూ వీటి గొడవంతా ఎందుకని దేవాలయ విగ్రహాలను తరలించి అమ్మడం అన్న క్రొత్త విద్యను నేర్చారు ఢిల్లీ నాగరికులు కొందరు. ఆ స్వయంపోషక ప్రయత్నానికీ ప్రభుత్వం అడ్డుతగిలింది.

ఇది నిరంతర ప్రయత్నం. ఈ ప్రయత్నం పిలిచిన పిలుపుకి పలికేవారెందరో ఉంటారు. పలికించేది ధనం. వారి స్వయంపోషక ప్రయత్నానికీ చట్టానికీ పోరాటం సహజం. అయినా భర్తృహరి చెప్పిన "ఆరంభింపరు..." అనే పద్యమే వారికి గురి.

(1-5-70 ఆంధ్ర జ్యోతి - యమునాతీరే)

# నవ్వు

—శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

మానవులు నవ్వేవారుట. సాధారణంగా నవ్వుతూంటారు. ఇప్పుడు నవ్వుతున్నారు చూడండి. ఎంచేత? నవ్వగల్రు గనక. నేనూ నవ్వగల్ను; కాని నా ప్రస్తుతోద్యోగంలో వీల్లేదు. వడ్డించేవాడు వడ్డన సమయంలోనే తనుకూడా ఓ చేత్తో తింటూ వడ్డిస్తే భోక్తలకి అసహ్యంగా ఉంటుంది. నవ్వించదల్చుగున్నవాడూ అంతే - అతడు నవ్వితే నలుగురూ నవ్విపోతారుగాని నవ్వరు. కాని, నవ్వితేనే మానవుడుట! మానవుడికి మాత్రమే నవ్వే శక్తి ఉంటా! మానవేతరాలకి ఆ ప్రజ్ఞ లేదు. గుఱ్ఱం, కోతీ, సివంగిలాంటి జంతువులకికూడా నవ్వు తెలుసునని కొందరి నమ్మకంట. అయితే అవి కోపంలోనో, బాధలోనో ఉంటూ అరిచేటప్పుడు నరాలు పట్టెట్టి పెదిమలు వెనక్కి లాక్కుపోవడంవల్ల ముఖానికివచ్చే కొత్తవైఖరి నవ్వులా కనపడుతుందేకాని అది నవ్వుకాదు అని శాస్త్రజ్ఞుల ఊహ. అందుకని, నవ్వగల ప్రత్యేకపు హక్కు మానవుడిదే! ఒక చిత్రం. నవ్వే హక్కు మానవుడికి పుట్టుకతో ఉండేదికాదు. పుట్టీపుట్టడంతో ఎవరి తరిఫీయతూ లేకుండానే జీవుడు నేర్చి ఉండేది ఏడుపేగాని నవ్వుకాదు. నవ్వు అనేది జీవుడు తోడిమానవుల దగ్గిర్నించి నేర్చుగున్న బాపతు! నవ్వు అంటుడు దినుసు అవడంవల్లా అనుకరణ సాధ్యం అవడంవల్లా పసిబాలుడికి సైతం అది అలవడుతుంది. మరొకటి. దేన్ని గురించి మానవుడు నవ్వడం? అంటే, మానవ వ్యాపారాలు గురించే! అనగా, నవ్వేదీ, నవ్వబడేదీకూడా మానవుడే. రాళ్ళూ రప్పలూ చెట్లూ జంతువులూ మొదలైన మానవేతర ప్రకృతిని గురించి నవ్వడం వ్యర్థంగనక మానవుడు నవ్వడు. ఇంతే కాక మరో విషయంకూడాఉంది. ఒంటరిగా ఉన్నప్పటికంటె విని తెలుసుకోగలిగిన మరో మానవుడు ఉన్నప్పుడే నవ్వు విజృంభించడం. నవ్వు మానవసంఘ వ్యాపారం. ఒక్కడూ ఉన్నప్పుడు, వస్తూన్న నవ్వుని, వినేవాళ్ళు లేకపోవడం వల్ల, అపుగోడానికి ప్రయత్నిస్తాడు. జీవం, మార్పు, బుద్ధి అనే లక్షణాలు అన్నీ కలిసి ఉన్నవాళ్ళు మానవులే గనక, ఏ మానవుల్లో వాట్లకి కొరతగాని, లోటుగాని,

అభావంగాని, వైరుధ్యంగాని కనిపిస్తుందో వాళ్ళని గురించి ఇతరులు నవ్వుతారు. ఈ సంగతి హాస్య తత్త్వవేత్త అని లోక ప్రసిద్ధిచెందిన బెర్గ్సన్ స్పష్టంగా సూత్రీంచాడు. సజీవులై ఉండవలసిన మానవులు జడత్వ ప్రకటన చేసినప్పుడున్నూ (మనిషి బుట్టబొమ్మలా తిరగడం, నవ్వవలసినచోట నవ్వులేకుండా ఉండడం), నూతన సందర్భాలకి సరిపడేటట్టు మారవలసిన మానవులు ఒకే అంశంలో పునః పునరాచరణ చేసినప్పుడున్నూ (అదేమాటా, అదేచేష్టా పదేపదే), బుద్ధి ప్రయోగించుగోవలసిన మానవులు సంప్రదాయ సాంకర్యంలో పడిపోయినప్పుడున్నూ (చూసి అనుకోవలసినచోట అనుకుని చూడడంలాగ) తప్పకుండా హాస్యాస్పదులవుతారనిన్నీ, మానవులు హాస్యాస్పదులు కావడానికి మరో విధం ఉండజాలదనిన్నీ అతడు చెబుతాడు. అల్లాగ్గా సాధారణ మానవుల ఇంగితాన్నిబట్టి న్యాయతః ఉండవలసిన సందర్భానికీ, ప్రత్యక్ష వాస్తవిక సందర్భానికీ – అనగా పెట్టుగున్న ఆశకీ, గోచరించే ఫలితానికీ – ఎంతెంత వ్యత్యాసం, ఎంతెంత అంతరం, ఎంతెంత దూరం ఉంటూంటే అంతంతగా, ఇతరుల విషయంలో మానవుడు నవ్వేస్తూ ఉంటాడు. ఎక్కువ హాని లేనప్పుడు ఆకస్మిక సంభవాలకీ (ఎదురుదెబ్బ, ద్వారబంధం తగలడం) కల్పిత సంభవాలకీ (కుర్చీకి అడుగులేదని తెలియనివాణ్ణి కుర్చీలో కూర్చోమనడం) నవ్వుతాడు. అన్యపరంగా ఉండే తిట్లకీ, మిక్కిలి కొత్త మిక్కిలి పాత ఫాషన్లకీ, అలంకారాలకీ నవ్వుతాడు. ఇతరుల పిరికితనం భయంచూసి నవ్వుతాడు. ఇతరుల పొగరూ గర్వం మదం మొదలైనవి అర్థాంగా భంజనం అయినప్పుడు నవ్వుతాడు; ఇతరులు తమ ధనాశా అధికారాశా అజ్ఞానం కమ్ముకోవాలనే యత్నమూవల్ల పడే బాధలకి నవ్వుతాడు; ఇతరుల కోపానికి – అందులో వ్యర్థ కోపానికి మరీనూ – నవ్వుతాడు. డాంబికానికి నవ్వుతాడు. సంప్రదాయ మిశ్రణానికి నవ్వుతాడు. ఎంచేతంటే, ఇవి మానవుడికి ఉండకూడని లక్షణాలు. ఈ లక్షణాల విస్తరణంవల్ల మానవజాతికి పతన నాశనాలు ఏర్పడతాయనే నమ్మకం అంతర్యంలో సుప్తమై ఉండడంవల్ల గావును, ఇవి ఏ మానవుల్లో గోచరిస్తాయో ఆ మానవులకి శాస్తికాగానే ఇతరులు నవ్వుతూంటారు. పై లక్షణాలు పాలకవర్గం యొక్క చట్టాలలో ఉండని నేరాలు. అల్లాంటి నేరాల్ని సంఘం భరించలేక శిక్షిస్తుంది. ఆ శిక్షే నవ్వు.

ఇతర ప్రేక్ష్యం లేనప్పుడుకూడా, మానవుడు స్వంత పనిమీద చిరునవ్వు వాడుతూంటాడు. మనస్సుయొక్క సంతోషానికీ, ఆనందానికీ వచ్చేది చిరునవ్వే

కాని, నవ్వుకాదు. తన బిడ్డని ముద్దులాడేటప్పుడు (ఓ మితమ్మా! ఓ మితీ!), బుజ్జగించేటప్పుడు (అల్లరి చెయ్యకుండా వరాల తండ్రల్లా కూచోమ్మా మరీ, పోన్లే అమ్మా!) నమదాయించేటప్పుడు (నువ్ మంచివాడవ్, ఏడవకు. అబ్బ ఏడవద్దంటే, వాళ్ళబ్బాయి దిక్కుమాలినరకం – నువ్వేమిటీ – ముత్యాల గొడుగూ!) అంటూ తనకి పనున్నప్పుడు స్మితం చేస్తాడు. ఎరగని వాళ్ళతో ఎవరితోనేనా అవసరం వచ్చినప్పుడు – అధమం ఆ పని నెరవేరేదాకా – పై పెదిమి పైకెత్తి, "తమవద్ద రూపాయి చిల్లరుందా?", "అగ్గిపెట్టి ఓసారి యిస్తారూ?" అంటాడు. ఒక్కొక్కరు ఎడం అరచెయ్యి బాగుచేసుగుని ఎదటివాడికేసి చాచి, మందస్మితంతో 'ఒఖ్ఖ రవ్వ' అంటారు. అధికారి ఎదటపడి స్వలాభం కోరుకునేటప్పుడుకూడా కొందరు లేనవ్వు అభినయిస్తారు. ముష్టివాడు ఒక్కొక్కడు ఇకిలిస్తూ ముష్టి కోరతాడు. ఎవరేనా తన ప్రభావం మెచ్చుగునేటప్పుడు సిగ్గుపడి మానవుడు తల వంచుగుని తనకి అది సయించనట్టు "ఏముటో! మీ చాదస్తంగాని, నాకు అంత ప్రజ్ఞలేందే!" అని కులుకుతాడు. మనస్సుకి ముందు సందేహమూ, అందువల్ల భయమూకలిగి, వెంటనే యదార్థం తెలిసిపోయి ఆ భయం పోగానే, "ఓరీ, ఇదిట్రా, ఏముటో అనుకున్నానూ!" అని ఒక్కొక్కడు నవ్వుతూంటాడు. నమ్మడానికి వీలులేని ఆశ్చర్యంగాని మహాద్భుతంగాని జరిగిన సంగతి విన్నప్పుడు కనుబొమ్మ లెత్తి, నోరు తెరిచి, "ఆఁయ్, ఆఁ, నిజంగా!" అని సాధారణుడు నవ్వుతాడు. తను వెనకే చెప్పినమాట ప్రస్తుతం జరగ్గానే, "అయిందా మంగళం, నే చెప్పలేదుట్రా మన మాటలు పని కొస్తాయా?" అంటూ నసుగుతూ ఒక్కొక్కప్పుడు నవ్వుతాడు. బస్తీలో మానవుడు ఒక్కొక్క పరిచితుణ్ణి హెచ్చరిక చెయ్యడానికి నిశ్శబ్దంగా నవ్వి, ఆగకుండా వెళ్ళిపోతూనే ఉంటాడు. దూరాన్నుంచి వచ్చిన పరిచితుడు హఠాత్తుగా కనిపించగానే "ఇదుగో! ఎప్పుడు రావటం! ఉంటారా ఇంకా!" అంటూ చాలామంది నవ్వుతూంటారు. పై సందర్భాల్లో చిన్న నవ్వుయొక్క పని ఏమిటీ అని చూస్తే, కలుసుగున్న వ్యక్తులు, నవ్వడం అనే ప్రత్యేక ప్రజ్ఞగల మానవజాతికి చెందినవాళ్ళే అని స్ఫురణకివచ్చే నిమిత్తంగావును! [చిన్న నవ్వుని – 'నవ్విక' అనకూడదేమో – అంటాను. నవ్విక బలిసి బరితెగి నవ్వు అయిందా, లేక నవ్వు జోరుతగ్గి సాధులై నవ్విక అయిందా అనేది మీమాంసిక.]

అయితే, జీవితంలో హాస్యాస్పదంగా ఉండే సందర్భాలలో తనివితీరా నవ్వుకోడానికి జాలి మనస్సు ఒప్పుకోదు. ఎందుచేతంటే, ఆ సందర్భాలలో

చిక్కడిఉన్న వ్యక్తులకి మాత్రం ఏ కొంతవరకో బాధా, హానీ, కష్టం, నష్టంలాంటివి కలుగుతూండడం స్ఫురణకి రావడంచేత. కాని, పద రచనలుగల గ్రంథాలు చదివినప్పుడుగాని విన్నప్పుడుగాని వాటితోపాటు స్వర, రేఖా, చేష్టా రచనలైనా సరే ప్రదర్శించగా గమనించినప్పుడుగాని - రచన అనేది కాల్పనికం గనక - ఏ ఒక వ్యక్తీ నిజంగా బాధపడడం అనేది (తనకి అన్వయించుగుంటే తప్ప!) అక్కడ లేకపోవడంవల్ల ఏ విధమైన బాధా ఎవ్వరికీలేని నవ్వు కలగవచ్చు. పద రచనలో చమత్కారంవల్ల మెప్పుతోకూడిన లేనవ్వూ, స్వారస్యంవల్ల పెద్దనవ్వూ వుడతాయి. చమత్కార స్వారస్యాల సరిహద్దు తేల్చడం కష్టం. ఒకటి పాండిత్య ప్రధానమై పదార్థ మాత్రమై తాత్కాలికం అవుతుంది; రెండవది సున్నితమైన మార్ద వంతోకూడి గంభీరమై శాశ్వతంగా ఉంటుంది. ఏదైనా భాషలో ఒక్కొక్కమాట యొక్క అనేకార్థత్వగుణమే చమత్కారానికి మూలమని జ్ఞానులు చెబుతారు. నాదసామ్యంగాని వైరుధ్యంగాని గల రెండు వర్ణాలూ, అర్థసామ్యంగాని వైషమ్యం గాని గల రెండు పదాలూ, భావసామ్యంగాని వ్యత్యాసంగాని గల రెండు వాక్యాలూ ఒకచోట సంపుటిఅయి, అనుప్రాస, వక్రోక్తి, అన్యాపదేశం, ఉత్ప్రేక్ష, నీచోపమ వంటి శబ్ద అర్థ ఉభయాలంకారాలుండి, తన్మూలంగా నింద, పరిహాసం, ఎగతాళి, ఎత్తిపొడుపు, ఈసడింపు, ఎకసక్కెం, గేలి, హేళన, వెటకారం మొదలైనవి ఉద్దేశ ప్రకారం ఫలించినప్పుడు 'ఓహో' తో కలిసిన నవ్వొస్తుంది. గణితంలోనూ, గానంలోనూ, హాస్యంలోనూ ఎదటి వ్యక్తినించి సిసలైన జవాబు వెంటనే రావాలి. అనుకోవాలి. ఈ మూడింటిలోనూకూడా తక్షణ ఫలితం రానప్పుడు సాధనాల్ని మెచ్చరు; వచ్చినప్పుడు సాధనా లివేం సాధనాలని దుఃఖించరు. అల్లాగే రెండు పరస్పర విరుద్ధ లక్షణాలు ఒకే పాత్రలో ఇమిడి ఉన్నప్పుడుగాని, రెండు పరస్పర విరుద్ధ స్వభావాలుగల ఇద్దరు వ్యక్తులు సమావేశం అయినప్పుడుగాని భాషాలంకారాల తోనూ, భాషతోనూ నిమిత్తం లేకుండాకూడా నవ్వు రావచ్చు. స్వర హాస్యం ఉంది. వివాదిస్వరాలు ఏకంగాగాని, వెన్వెంటనేగాని వచ్చే గానం నవ్వొస్తుంది. ఖరగానంలో అటువంటి విశేషమే జనాన్ని నవ్విస్తుంది. నవ్వొచ్చే ప్రతి గానం లోనూ ఆటువంటి సంబంధం ఉంటుంది. పరిచయమైన గొప్ప కీర్తన ఫణితి తీసు గుని దాని గంభీర పదాలకి ప్రత్యామ్నాయిగా నిత్యకృత్యపు ముక్కలు బనాయించి పాడితే నవ్వొస్తుంది. ఒకరి గాత్రంతో ఇంకోరి గాత్రపు సంగతులు పలికిస్తే నవ్వొస్తుంది. మిత్రులు శ్రీ ఇమిటేషన్ ఆచారిగారు తెలుగులో పరిచితులే. రేఖా రచనల్లోనూ హాస్యశాఖ ఉంది. మానవ వ్యక్తియొక్క మొదటి దురాశా, చివరి

అపజయమూ ప్రత్యక్షంచేసే చిత్రాలు ఒకదాని పక్కనే రెండోది ఉంటే నవ్వు పుట్టిస్తాయి. వ్యక్తుల లక్షణాల్ని బట్టి గీసిన వికార రూపాలూ, దుస్థితిని సూచించే బొమ్మలూ, వ్యక్తిస్ఫురణచేసే జంతు సాంకర్యాలూ, అన్యాయంలో వ్యవహరించే వ్యక్తియొక్క కథ ఎదురు తిరగడాన్ని సూచించే బొమ్మల వరసా - ఇవన్నీ నవ్విస్తాయి. మిత్రులు శ్రీతలిసెట్టి రామారావుగారు తెలుగులో పరిచితులే. ఇల్లానే చేష్టల్లో - ఒకే చేష్ట యంత్రవతుగా ఉండడంవల్లా, విరుద్ధ చేష్టలు రెండు వెను వెంటనే రావడంవల్లా, అవస్థకి సంబంధంలేని చేష్టవల్లా మాటకి విరుద్ధమైన చేష్ట వల్లా, ఇంకా అనేక విధాలుగాఉండే చేష్టా రచనవల్లా సార్వత్రికమైన నవ్వు జనిస్తుంది. మిత్రులు శ్రీ గండికోట జోగినాథంగారూ, శ్రీ దుగ్గిరాల సత్యనారాయణ రావుగారూ తెలుగులో పరిచితులే. ఇక ఏమీ చేష్ట లేకుండానే, అన్య మహా వ్యక్తుల రూప సాక్షాత్కారం చేయించి సానందమైన నవ్వు కల్పించవచ్చు. డాక్టర్ చంద్రశేఖరం ఎం. ఏ. గారు తెలుగులో పరిచితులే - (ష. రా - డాక్టర్ అంటే ఫన్ డాక్టర్ అన్నమాట; ఎం. ఏ. అంటే మేకప్ ఆర్టిస్టు).

ఈ రీతిని, అనేక విధాలుగా వాస్తవికాలైన పర విషయ స్వవిషయాల్లోనూ కేవల కల్పితాలైన పద, స్వర, రేఖా, చేష్టాది రచనల్లోనూ, పాత్రలలోనూ, సంఘటనలలోనూ, ఎంత విరివిగానేనా వాడకంలో ఉంటుంది నవ్వు. అలాంటి నవ్వునీ, నవ్వు రచనల్నీ, వాటి గురించిన మెప్పూ, నిరసనా, అభిప్రాయ భేదమూ గమనిస్తే మళ్ళీ నవ్వొస్తుంది. సాహసించి హాస్య ప్రజ్ఞ కనపరిచి అయితేం, హాస్యాస్పదుడైతే యేం, సాటి ఇతర మానవుల్లో ఒక్కణ్ణైనాసరే నవ్వించ గలగడం అనేది జరిగిం

తరవాత, నమ్మవలసిందిగనక, ధన్యమేమో అని తపించేవాళ్ళున్నారు; అది కష్ట సాధ్యం అని గుర్తించినవాళ్ళూ ఉన్నారు. పాడిన గానం పట్టివ్వకపోతే, గానం అర్థ ప్రమేయంలేనిదిగనక, అవతల వాడికి ఆ బాణీ రుచిలేదనో ఏదో వాదించు గోనేనావచ్చు. కాని, హాస్యం పట్టివ్వకపోతే, అది విప్పిచెప్పి వ్యాఖ్యానం చెయ్యకుండా తప్పున వేలవలసిందే గనక, లోటు ఎవరిదైనాసరే, అపజయం మాత్రం కారకుడే పట్టిగ్గా మోసుగోవాలి. అందువల్లకూడా తెలుగులో 'సగంచచ్చి సంగీతం, అంతాచచ్చి హాస్యం' అనేది పుట్టి ఉంటుంది. రసాల వయస్సునిబట్టి కడసారపది హాస్యం. కొన్ని దేశాల్లో నేడు నవ్వించే రచనలకి (కే) విలవ అధికం. మన దేశంలో (పై రకాల) హాస్య రచనయొక్క విలవమాట దేవుడికి తెలుసు, మన్నన ఇటీవల చెప్పద్దు; ప్రోత్సాహంఅల్లా ఉణ్ణేంది, దోహదం తరవాత మాట్లాడదాం,

దాన్ని క్షమించేనా ఊరుకోక, పైపెచ్చు తెరచాటు యాగీకూడా మొదలెడతాడు - ఆంధ్రుడైన ఒక్కొక్క ఆంగ్ల జ్ఞానేశ్వర్! కొందరు పూర్వీకులు చప్పరించి 'నవ్వు నాలుగందాలా నష్టం' అంటారు. (అనగా నాలుగు పురుషార్థాలా అనిగావును!) నవ్వు నవ్వడంలో ప్రాణం పోగొట్టుకున్నవాళ్ళ పేర్లు చాలా ఉన్నాయి. నవ్వడం ప్రమాదం అనేవాళ్ళున్నారు. నవ్వువల్ల ఊడిన ఉద్యోగాలూ; తప్పిపోయిన సంబంధాలూ జ్ఞాపకంచేసి నవ్వు మానాలనే వాళ్ళున్నారు. మనసారా నవ్వడం అనేది తుంటరితనమూ, ఆకతాయితనమూ గనక ఏ ఒళ్ళువిసరో ఏడుస్తూనే నవ్వడం మంచిది అని సలహాయిస్తూ, నవ్వేవాళ్ళమీద పళ్ళుకొరుకుతూ, తమకి వచ్చే నవ్వుని ఉబకనియ్యక (అసలు నవ్వనేది బలవంతపెట్టి మొహమాటపెట్టి చావగొట్టినారాదు - బయల్దేరిం తరవాత ఆగమన్నా ఆగదు!) చచ్చిచెడి ఆపేసుగుని మింగేసుగుని జీవితం అంతకీ ఓమాటేనా, నోటినిండా కాకపోయినా 'కీ పంట' నేనా నవ్వకుండా మటమటలాడిపోయే అమావాస్యరాయుళ్ళు అరుదుగా ఉంటారు. వీళ్ళంతా తమ తమ నమ్మకాల్ని బట్టి అన్నారనండి, ఉన్నారనండి. ఆంగ్ల జ్ఞానేశ్వర్ మాట? ఒక్కొక్క ఉద్దండుడు, ఏదేనా హాస్య సందర్భంలో అనేకులు నవ్వొచ్చి నవ్వగా తనూ సభ్యుడైనా నవ్వు పంచుగోక, అవతలకిపోక, తన పదవికి అప్పట్లో లోటు వచ్చినట్లు భ్రమించి, నవ్వించేవాడు (రచయిత, నటుడు, వక్త, ఎవడైనాసరే) అధమం తనకంటె అధముడనీ, నవ్వించే రచన హాస్యేతరమైన కొయ్యరొట్టి - రాతిపాక - రచనలకంటే ముదురనీ, నవ్వించే అభినయం తను మొదట్లోనే మానుకొన్న నగానాభినయంకంటే వికారమనీ, మనస్సులో అనుకుంటే ఎవ్వడికీ తెలియకుండా వొదిలిపోనా! పైకి తరతమాలతో ప్రకటించి, మొత్తంమీద చెప్పాలంటే - ఎవరూ అడక్కపోయినాసరే, అనకి నవ్వు రానప్పుడు ఇతరులకి నవ్వు రావడం అనేది (కడుంగడు) 'అశాస్త్రీయము' అంటాడు. మరొక ఆంగ్ల సరసుడు, "ఫలానా హాస్యచేష్టా రచనంటే జనం అంతా మూర్ఖులైపోయి, వెనక, నవ్వేసేవారట! అల్లా వాళ్ళు నవ్వేసి ఉండడం రూలు ప్రకారం తప్పు. వెనకవాళ్ళు నవ్వేసేసినందుకు ఇప్పుడు వాళ్ళ నేంజెయ్యానా అని బెంగెట్టుగున్నాను" అని బారుమంటాడు. రచయిత ఎదటా రచన జరిగేవేళా నవ్వుతున్నట్టే కనిపించి, ఇతరుల సమక్షంలో, కుమ్మరి పురుగులాగ ఈర్ష్య తన హృదయం దొలవగా, చేతులోఉండే పనితప్ప తక్కిన అన్నీ క్షుణ్ణంగా తెలిసి దిగ్గజం అనిపించుగుంటూండే ఒక్కొక్క పూజ్యుడు - మిథ్యా ప్రమాణంతో కొలతలువేస్తూ, అతిగిన ముక్కలు విసందర్భించి కొట్టితెచ్చి వాటి కిమ్మతుకడుతూ, అహంకారం విరజిమ్ముతూ - ఫలానా రచనవల్ల

వచ్చేసిన నవ్వు అన్యాయార్జితంఅనీ, తనే అటువంటి బలవంత హాస్యపు రచన బళ్ళాడిగా, బస్తాదిగా ఎడంచేత్తో నిద్దరోతూ చెయ్యగలననీ, అయినాగానీ అది తన స్థాయికి నీచం అని మానేశాననీ, హాస్యం తనకి సయిస్తుందిగానీ, అది అతీతంగా, ఆదర్శంగా, ఇదిగో, ఎల్లా ఉండాలో అల్లా ఉండాలనీ, వీధులో దొర్లే ఎంగిలి పదాలు ఏరి ఏ కరువు పెట్టడంలో తనంతవాడికి ఒక్కడికీ నవ్వు రాకపోవడంవల్ల కొంప మునిగిపోయిందనీ, దిక్కుమాలిన జనం ఎంత చూడకపోయినా తన బేనవ్వు - గడకఱ్ఱ - రచన పై కేటులోనే పడుతుందిగాని మూకని చక్కిలిగిల్లి పెట్టే అసందర్భపు ముక్కలబొంత విని పారెయ్యడానికితప్ప పనికిరాదనీ, నిందా శ్లీలా సభ్యాలవల్లకూడా నవ్వు రావచ్చుగనక నవ్వొచ్చినప్పుడల్లా అవి ఉంటాయనీ, నవ్వనేది తనకే తిన్నగా జీర్ణంకాని ఒకానొక అనిశ్చిత పదంయొక్క చంచలార్థా వరణ దాటిఉంటే అపవిత్రపు నవ్వు అయిపోతుందనీ, ఏ సందర్భంలోనేనా ఎవరి కేనా నవ్వొస్తూంటే వాళ్ళు తక్షణం ఆపుగుని తన దర్శనంచేసి, అది తన అభి ప్రాయంలో ఏ శీర్షిక కిందికివస్తుందో, ఏ నియమాన్ని అనుసరిస్తుందో, ఏ సూత్రాన్ని ఆశ్రయిస్తుందో కనుక్కొని తన ఆర్డరుపొంది, వెళ్ళి తత్ప్రకారం నవ్వడమో మాన డమో విజ్ఞాన లక్షణంగాని, తన్ని లక్ష్యమే చెయ్యక, పడిపోయినట్టు తొందరపడి ఫక్కున నవ్వేసెయ్యడం చాలా ఏడవతగ్గ విషయమనీ, తను ఓ మూల స్వయంగా 'నవ్వడం మిక్కిలి కష్టమైనపని' అని శాసిస్తూండగా, నవ్వించడం గురించి అట్ట హాసం చెయ్యడం హాస్యాస్పదమనీ, రోగం కుదిరిన లోకం తన ఏకాభిప్రాయ పథ్యంకోసం నకనకలాడుతోందా అన్నంత తొందరపడి, శ్రమకోర్చి, ఘోషణ చెయ్యగా, ఎందుకో ఎందుకో నవ్వడంమాట ఎల్లాఉన్నా జనం ఇందుకు మాత్రం విధిగా నవ్వడం జరిగితీరుతుంది. ఒక్కొక్క హేమాహేమీ "మూర్ఖ జనాకర్షణలో ఏముందిపోదూ" అనేసి తను అందుకోసమే పాకులాడుతూ తన అనిష్టుడులో తనకి కనిపించే లోపాల అభావమే తన యిష్టుడులో ఉండే మాహాత్మ్యం అని మురిపిస్తూ, తన సర్వజ్ఞ దృష్టికి అందని అంశాలు ఒకటిరెండు ఉన్నా అవి చవటరకమే అని మొరాయిస్తూ, ఇతరుల హాస్య రచన జరిగేవేళ తనూ (దుఃఖం ఆపుగుని) నవ్వి, (మాటల విలవ వక్తకీ, విషయానికే ఉండే సంబంధాన్నిబట్టి ఉంటుందనే మాట మారుస్తూ) తనకి స్వాధీనులైనవాళ్ళదగ్గర ఆ రచనలో పసా, భాషా, కఠినపదాలూ, కొట్టుగోడాలూ, నీతీ, సత్యం, స్వభావసిద్ధీ సందర్భశుద్ధీ, అవసరమూ, ఉద్దేశమూ, దిబ్బా దిరుగుండం, ఇంకా తనకే తెలిసిన లక్షన్నర ఇతర సంగతులూ (అనగా సాధారణంగా, ఆ రచనలో తను లేవనుకున్నవీ, అటువంటి రచనలో ఉండనివీ,

ఉండజాలనివీ, ఉండక్కర్లేనివీ, ఉండకూడనివీ మరోచోట దొరికేవీ) "ఇందులో ఎంతమాత్రం లేవు" అనే మహా సత్యం ఒంటిచేతిమీద పరిశోధించి కనిపెట్టి, లక్షణ గ్రంథ పటాటోపపు పడికట్టురాళ్ళ 'కా భాషలో' జోరుగా శాసించడంలో, స్త్రీ బాలవృద్ధులుండే మహా సభమీద గోచరించే ప్రత్యక్ష ఫలితమే పరమావధిగా గల హాస్య వ్యాపారంలో మిడిమేళపు మధ్యవర్తి ప్రమేయంలేని సంగతి గుర్తించక నవ్వులో చొరబడి, నవ్వు కట్టేయించడానికి ఇంతా బయల్దేరినవాడు తేలిపోయి తనే ఎరక్కుండా నవ్వుకి చందాదారై మరీ ఎక్కువ నవ్వు జనించి వ్యాపించ డానికి తోడ్పడతాడు. ఇటువంటి రసజ్ఞులు (గణపతి దయవల్ల నూటికీ కోటికీ గాని ఉండరు!) వాదించేది: హాసం ఉండాలనీ, హాస్యం తమరికంటె గొప్పది కాదు గనక, ఒకవేళ ఉంటేకూడా తీసెయ్యాలనీ! దైవచింతగల కొందరి వాదన: "జీవితం దుఃఖమయం. నవ్వితే దేవుడికి కోపం! నవ్వు ఉండగానే ఏడుపుంటుంది - వెలుగుకి నీడలాగా ధనానికి ఋణంలాగానూ, ఏడుపు నవ్వుని వెన్నంటి ఉంటుంది. ఎవడికో ఏడుపుతెస్తేగాని ఒకడికి నవ్వు రావడానికి వీల్లేదు (వీల్లేదూ?) అందుకని నవ్వకూడదు (కూడదూ?) ముందు ఏడిస్తేనే నయం, తరవాత నవ్వచ్చు" అని. అయితే మరి కొందరు అల్లాంటివాళ్ళే. 'హసీ' లోంచి కిదా హాస్యం! హకార సకారాల ప్రమేయం ఆంధ్రులు నిరసన చెయ్యవలిసిందికాదు. నవ్వు ఏ ఒకర్నీ ఏడిపించకుండానే కలగచ్చు. ప్రకృతివల్ల కలిగే దుఃఖం భరించి తీరవలసిన మానవుడు తనుకూడా మరికొంత దుఃఖం అభ్యసించడం ఎందుకు? సర్వాన్నీ నవ్వెయ్య గలవాడు ఇహపరాలకి పైవాడు. భౌతిక దృష్టితో చూసినా, మామూలుగా గాలి పీల్చేటప్పుడు శ్వాసకోశంయొక్క ఉపరిభాగమే శుభ్రపడుతుందిగాని, తనివితీరా నవ్వినప్పుడు కోశం మొదలంటా ప్రాణవాయుమయం అవుతుంది గనక, యోగాభ్యాసం సరదాగా అవుతుంది. అందువల్ల నవ్వు మానవ శరీరానికికూడా అవసరమే" అంటారు.

సరే, నవ్వునీ, నవ్వించడాన్నీగురించి భయం, ద్వేషం, కోపం, ఏడుపూ - ఇంత శృంగారం బయల్దేరుతోందిగదా, అసలు 'నవ్వు' అంటే ఏమిటి? అనే ప్రశ్న వస్తే 'ఇహ్హి' అని ఒఖ్ఖ నవ్వు దాఖలు చేసుగోడం తేలికగాని, నిర్వచించడం నవ్వులాటకాదు. అందులో, నా అంత అజ్ఞానికి, అజ్ఞానం అయితే మరి ఈ వాగుడెందుకూ? అంటే, అదే హాస్యం! నా అజ్ఞానం ప్రకటించుగోడానికి! అదెందుకు? రొష్టు చేసుగుని అట్టేపెడితే, ఎవరేనా కనికరించకపోతారా! అదిసరి. సూక్ష్మ పదాల్ని తత్త్వజ్ఞులే తిన్నగా తేల్చలేరు. తెలిసినంతవరకు వాళ్ళన్నది చెబుతాను.

"ఎదటఉన్న వస్తువులోగాని, గోచరించే భావంలోకాని, జరిగే విషయంలో గాని, ఉండే విపరీత వైషమ్యంవల్ల మనస్సుకి కలిగే ఆశ్చర్యాన్ని మానవుడు సమన్వయం చేసుగుని జీర్ణించుగునేలోపల, కండరాల బిగింపు విలంబనలతోకూడా అప్రయత్నంగా నిర్బంధకంగా బయలుదేరే ఉచ్ఛ్వాసమే నవ్వు" అని ఒక మహా మహుడన్నాడు.

"ఏమీలేనిదానికి పెద్ద బ్రహ్మ ప్రళయం చెయ్యడమే నవ్వు" అని ఒకరు సెలవిచ్చారు. "మనస్సు, మామూలుగా వెళ్ళవలసినదారి హఠాత్తుగా మాయం కావడంచేత, ఆ మనస్సు తన కెటూ పాలుపోక పోవడంలో చేసే ప్రయత్నమే నవ్వు" అని ఒక జ్ఞాని అభిప్రాయం. "పెట్టుగున్న ఆశ అకస్మాత్తుగా అడుగంటి పోగా ఫలితం శూన్యం అవడం అనేదే నవ్వు" అని ఇంకోరి ఊహ. "తన లాభం వల్లగాని తన నష్టం తొలిగిపోవడంవల్లగాని, అన్యుడికి నష్టం, కష్టం, వంచనా వంటివి అర్థ్హంగా కలగడంవల్లగాని, తాత్కాలికమైన ఆత్మోన్నత్యం మానవుడికి గోచరించి, అతడికి తన అహంకారం అనర్గళంగా ప్రకటించుగోడానికి ఇతరుల ఖర్చుమీద దొరికిన ఆరోగ్య మార్గం నవ్వు" అని ఒకడి ఉద్దేశం.

ఇంకో సుప్రసిద్ధ తత్త్వజ్ఞుడు ఇలా అన్నాడు. "నవ్వనగా ఆకస్మిక ఔన్నత్య స్ఫురణవల్ల జనించేది అనేమాట ఉంది. ఒకనిలోని అదనపు ఉత్సాహ శక్తి పొంగి పొరలడమే నవ్వు అనే రెండోమాట ఉంది. నవ్వు సంఘ వైరులైన మానవుల్ని తిన్నపరచడానికి సంఘ శిక్ష అనే మూడోమాట ఉంది. అంతేకాదు. శ్వాసకోశాన్ని క్షాళన చెయ్యడం, రక్తంయొక్క ఒత్తిడి జోరు చెయ్యడం, శిరస్సుకి రక్తంతోడడం, ప్రతి మానసిక శ్రమకీ ఆటవిడుపుగా ఉండడం, నిరుత్సాహంలో పడకుండా కాపుదల చెయ్యడం, పడ్డవాళ్ళని గట్టెక్కించడం - ఇవన్నీ నవ్వు పనులే - కాక, మరో సంగతి - తోటి మానవులకు అనుదినమూ వేలాదిగా కలుగు తూన్న, తన సాయం అపేక్షించని, చిన్నచిన్న బాధలనుగురించి ప్రతి మానవుడికీ చాలా సున్నితమైన సానుభూతి ఉంటుంది. అటువంటి మానవ సానుభూతిని నిష్ఫలదాయకం చెయ్యడమా, ఫలజనకం చెయ్యడమా అని భగవంతుడు తటపటా యించి ఉంటాడు. ఆ సానుభూతి నిష్ఫలదాయకం అయేటట్టు చేస్తాడా సంఘ జీవనం అసంభవం అవుతుంది. లేక దాన్ని సఫలజనకంగా ఉంచాడా, మానవుడు ప్రతి యితర మానవుడివల్లా రోజుకి లక్షసార్లు బాధపడి కుంగి గతించడంవల్ల మానవజాతి త్వరలో నశించిపోతుంది. రెండిందాలా చిక్కే వచ్చేటట్టు కనపడింది.

ఈ సమస్య విడగొట్టడం ఎల్లానా అని ఆలోచించి చివర కతడు నవ్వు సృష్టించాడు. ఇతర మానవుల అటువంటి చిన్న బాధలు గోచరించినప్పు డుపయోగించుకునే నిమిత్తం ప్రతి మానవుడికీ నవ్వేసే సరంజామాతోసహా సామర్థ్యంకూడా ఇచ్చి, దేని వల్ల మానవుడు కుంగిపోయి గతించి ఉండేవాడో, దానివల్లే మానవుడికి కుంగిపోడం గతించడంలాంటి నష్టాలు రానీకపోడం సరికదా, ఆరోగ్య లాభంకూడా కలగచేసి ప్రకృతి సాయపడింది అని నా సిద్ధాంతం" అని.

వీటికి తోడుగా నవ్వుయొక్క ప్రత్యక్ష లక్షణాలుకూడా గమనించడం కర్తవ్యం. నవ్వులో ముఖం వికసించడం, కళ్ళు పెద్దసైజువి అవడం, లేకపోతే సగం అవడం, కనుబొమలు పైకి జరగడం, దవడలు లేవడం, ఎడం అవడం, సొట్టలు పడడం, పెదిమిలు బిగవడం, లేకపోతే దూరం అయిపోడం, తల డెక్కించు, ఝూడింపు, దంతదర్శనం (దంతాలు అసలుంటే మాటే!) ఒకవేళ పళ్ళు పొడుగ్గా ఉంటే అప్పుడు వాటిని ఆచ్ఛాదన చెయ్యడం, ఇమడని కట్టుపళ్ళైతే వాటిని తీసి చేత్తో పుచ్చుగోడం, భుజాలు ఎగరెయ్యడం, మెలికలు తిరగడం, 'దుంపతెగిపోను' మొదలైన మాటలతో తిట్లు, కేకలు, కూతలు, అరుపులు, చప్పట్లు, బాదులు, పక్కవాళ్ళది దిగదోడడం, కళ్ళనీళ్ళు తుడుచుగోడం, పొట్ట నెప్పి తమాయించడానికి 'అబ్బ! అబ్బ! ఉండు ఉండు' అంటూ తెమలకుండా మాట్టాడడం - లాంటివి నవ్వే సమయంలో కనిపిస్తాయి. చదువురానివాళ్ళుకూడా వీటిల్లో జాతు లేర్పరిచి పేర్లు పెట్టుగున్నారు. చిరునవ్వు, సకిలింపు, ఇకిలింపు, ముసిముసి నవ్వు, మూగనవ్వు, గుడ్డినవ్వు, సీ...సీ...నవ్వు, పకపక, వెకవెక, అట్టహాసం మొదలైనవి. సరి, శాస్త్రజ్ఞులు పేర్లెట్టిన ప్రకారం:

స్మితం (కనుబొమ్మలెత్తి కళ్ళు విప్పడం), హసితం (పళ్ళు బయటపడేటట్టు చేసి పెదిమిల్ని కళ్ళెం వెనక్కి లాగినట్టు ఆకర్ణాంతం లాగిపట్టి ఉంచడం), విహసితం (చల్లని శబ్దం చెయ్యడం), ఉపహసితం (తలకూడా ఝూడించడం), అపహసితం (ఆనంద బాష్పాలతోసహా గోలగా నవ్వడం) అతిహసితం (విరగబడి పక్కలు పట్టుగుని గిలగిలలాడి మెలికలు తిరిగి దొర్లి పెద్ద ఏడుపులోలాగ నానాయిదీ అవడం).

కాని మరికొన్ని రకాలు చెప్పచ్చు.

తలకాయ నవ్వు (తలమాత్రం తెగఝూడిస్తూ వంచేసి కళ్ళు మూసుగుని నవ్వడం), లయధాటి నవ్వు (తాళం వెయ్యడానికి వీలైె ఉండేది), తుపాకీ నవ్వు

(పెదిమిలు బద్దలు చేసుగుని తప్పున బయల్దేరేది) కొనఊపిరి నవ్వు (గుక్క తిరగని సమయందాకా మాట్లాడి అప్పుడు మాటా తెమలకుండా, నవ్వూ రాకుండా నవ్వడం), కోతినవ్వు (నవ్వేమో అని ఇతరులు భ్రమించేది), దాగుడుమూచ్చి నవ్వు (అధికారి ఎవరేనా కనిపెడతాడేమో అనే భయం చొప్పున ఆపేసుగోడానికి ప్రయత్నించే టప్పటిది), డోకు నవ్వు, దగ్గు నవ్వు, కొలిమితిత్తి నవ్వు, గుడ్సబండి నవ్వు. సరి, విషపునవ్వు (నవ్వు జాతిలో చెడపుట్టి లోపలి ఏడుపుని ఓ పక్కనించే వెళ్ళకక్కేది).

మరి రెండు మాటలు. నవ్వతగ్గ సందర్భాలకంటే నవ్వకూడని సందర్భాలు కూడా ఎక్కువ జ్ఞాపకం ఉంచుకో తగ్గవని ఒక జ్ఞాని అంటాడు – ప్రకృతివల్ల వచ్చిన స్థితికి నవ్వవద్దంటాడు; అనగా, గుడ్డీ, కుంటీ, నత్తీ, చెవిటీ, అవిటీవాళ్ళ స్థితినిగురించి, మృతుడైనవాణ్ణి గురించీ, అక్కడ లేనివాణ్ణి గురించీ అన్యత్వా రోపణచేసి ఉన్నవాణ్ణిగురించీ నవ్వకూడదంటాడు. 'భగవంతుడి మాట' అని మనం అనుకునేదాన్ని గురించి నవ్వరాదంటాడు. ఇంకా దీనులూ, హీనులూ, అర్భకులూ, వృద్ధులూ, పరదేశులూ, అపరిచితులూ, వికలాంగులూ, దరిద్రులూ, అజ్ఞానులూ, పరాజితులూ వీళ్ళనికూడా హాస్య లక్ష్యం చెయ్యడం మానుషం కాదంటాడు.

మానవుడు ఇతరుల్ని గురించి నవ్వడంలో అహంకార మమకారాలవల్ల పుట్టే ఈర్ష్యా కుత్సితాలు ఉండితీరతాయి. ఎంత సవ్యమైన నవ్వులోనేనా ఏ కొంచెమో అవి తప్పవు. వాటిని అల్పతమంచేసి, కరుణకి ఏమాత్రం జాగాలేని పట్టుచూసి, అసభ్యతలోపడి నవ్వుయొక్క ముఖ్య లక్షణాన్ని బలివెయ్యక, తాత్కాలికోపయోగం కోసంకాక, దూషణే గమ్యంగా పెట్టుకోక, వ్యక్తుల్ని మరిచి, సంగతి వీలైనంత తనమీద పెట్టుగుని, మోతాదు మీరక, శ్రుతి తప్పక, స్థాయి చెడక, మర్యాద మరవక ఉండే స్వారస్యంవల్ల జనించే నవ్వే సవ్యమైన నవ్వు. ఎంత తేలికో. నవ్వించడం! ఎంత తేలికో నవ్వు!

(భారతి – 1943 – ఆగష్టు)

# దేవుని దస్తూరి

—ప్రొఫెసర్ యస్వీ జోగారావు

సర్వ జగత్తునను ప్రగల్భించిన భగవదంశయే సౌందర్యము. మానవుని భగవద్భావన యెంత సనాతనమో అతని సౌందర్య తృష్ణ అంత సనాతనము. ప్రకృతి ప్రత్యణువున నిండి నిబిడీ కృతమైన అందము ననుభవించి ఆనందించిన మానవుని రసపరవశ మానసము సర్వ కళలకు జనుః స్థానమైనది. సృష్ట్యాది నుండి తన సుఖ సంతోషములకొరకు పరిశ్రమించుచున్న ఆ మనీషి ప్రజ్ఞోపజ్ఞములు, ఆ మనస్వి ప్రతిభోపపన్నములునై వెలసినవి కళలు. సౌందర్య తృష్ణ అతనిలో కలిగించిన సాత్త్వికావేశమునుండి ప్రాదుర్భవించినవి కళలు. బహిరంగమున సర్వ మానవులకు భగవంతు డొక్క ప్రపంచమునే కల్పింపగా కళా కమనీయ కల్పనా శిల్పియగు మానవుడు ఆస్వాదమున కధికారముగల అంతరంగములం దెల్ల అనేక రస జగత్తుల నుత్పాదించుచున్నాడు.

భారతీయుల పరిగణనమున అరువది నాలుగైన కళలం దెక్కువ ఉపయోగ భాజనములు, భౌతిక సౌఖ్య సౌకర్య ప్రదములు. కొన్ని మాత్రమే ఆనంద పర్యవసాయులు, సౌందర్య సింధువులు, హృదయ బంధువులు. అట్టివి సంగీతము, కవిత్వము, నాట్య నర్తనములు, శిల్ప చిత్రలేఖనములు. ఇవి యన్నియు ఆనంద మాత్రైక తంత్రములు. ఆ ఆనంద మనిర్వాచ్యము, అవ్యాజము. అభివ్యక్తి యందును ఆ పాత లాలిత్యము గలట్టివి. ఏ సుముహూర్తమున కాళిదాస మహాకవి వీనికి 'లలితకళ' లని (రఘువంశము viii - 67) నామకరణము చేసెనోగాని నాటికిని నేటికిని ఆ వ్యపదేశ మన్వర్థమై నిలిచియున్నది. చిత్రముగా ప్రాశ్చాత్యులు చేసిన 'Fine Arts' అను వ్యపదేశముగూడ దీనికి దీటుగా నున్నది. సౌందర్య మాధుర్య సౌకుమార్యముల సాహిత్యమే లాలిత్యము.

నిచ్చలు పచ్చి బాలెంతరాలగు ప్రకృతి సవిత్రికి స్తనంధయుడైన ప్రాక్తన మానవు డా మాతృహృదయ మాధుర్యము చూరగొని కొట్టిన కేరింతయే మానవ

జాతి గానకళాభ్యుపాసన కుషస్సంకల్పమైనది. తన కంఠమునుండి బయల్వెడలిన మధుర స్వరములేవో తన కర్ణపుటములనేపడి మరల తనలోనే ప్రవేశించి మారెలు గిచ్చినట్లు తన నాడీ తంత్రులలో కలిగించిన కదలికయే యతని కరచరణముల నుండి బహిర్గమించి నృత్యకళా సరస్వతి కేటికోళ్ళెత్తినది. మానవుని అనుకరణ ప్రవణశీలము, అందులో అంతర్భూతమైయున్న సృజన కళాకౌతూహలము నాట్య సాహిత్యాది కళలకు పురుడు వోసినవి.

పురావస్తు పరిశోధకులు జరిపిన త్రవ్వకములవలన బయల్పడిన చరిత్ర పూర్వయుగమునకుచెందిన బహువిధాభరణాదికమును పరికించినచో ప్రాక్తన మానవుని సౌందర్య తృష్ణ వ్యక్తమగును. ఆతడు వ్యావసాయిక స్థితికి వచ్చినప్పటి నుండి తన చుట్టును ఆవరించియున్న సౌందర్యమును తిలకించి పులకించి పునర్వ్యక్తీ కరింపగలిగినాడు. పశువునుండి తన సార్థక్యమును నిరూపింపగల ఆలోచనచే అనుభూతిచే తన స్వభావ జీవలక్షణమగు సౌందర్య రిరంసచే వస్తుగతమైనటువంటి శాశ్వతమైన అనంతమైన సౌందర్యమును తానుగ్రహించి రసపరవశుడై పదిమందితో తనదైన అనుభూతి పంచుకొన నెంచినప్పుడు ఎదనుండి ఎదకు సౌందర్య దేవత సంఘటించిన సేతువుకళ, గమ్యము రసాస్వాదము. అనగా పరమమైన సౌందర్య భావనయే లోకోత్తరమైన ఆనందానుభూతిగా పరిణమించుచున్నది. ఆ పరిణామమున కొక ప్రజల నిమిత్తమే కళ.

సౌందర్య గ్రహణమునకు సత్త్వస్ఫురణ మావశ్యకము. పరగత సుఖ దుఃఖాది భావనచే భావితమైన అంతఃకరణత్వమే సత్త్వమని విద్యానాధుని వక్కాణ. శశాంకలేఖా సాహచర్యమున శరత్కాల మేఘమువలె సౌందర్య తృష్ణ సాహచర్య మున సత్త్వగుణము వెలుగొందును. కాని చండ ప్రచండమైన సూర్యుని కాంతిని నిరోధించు కారుమబ్బులవలె సౌందర్య తృష్ణను రజస్తమోగుణములు తిరోహితము సేయును. కారుమబ్బులు క్రమ్మిన గగనాంగణమున పున్నమనాటి చంద మామకును పుట్టగతులుండవు. అట్లే బహుధా లౌకిక వాసనాలంపటులైచో కళా స్రష్టలకుగాని ద్రష్టలకుగాని డెందమున సౌందర్య స్పందము గలుగదు. నిరస్త నీరదమైన నీలాకాశమున కన్నె తారకలుగూడ కలకల నవ్వును. అట్లే స్థిమితపడిన చిత్తమున చిన్నారి పొన్నారి భావుకులును సౌందర్య స్వాదమున సిద్ధిపొందగలరు. ఆవేశము ప్రశాంత చిత్తతతో అవధరింపబడినప్పుడే అనుభూతి హృదయ గోచర మగునని కాలరిడ్జి మహాశయుడు సంభావించినాడు. ఆ స్థితినే సమాధ్యవస్థ

యన్నాడు రాజశేఖరుడు. ఆ క్షణమున అనుభూతి డెందపు దేవళమున కుంభగత ప్రదీప కళిక.

పరాత్పరుని ప్రతిదేవతయైన చరాచర ప్రకృతి సవిత్రి ప్రసవించిన సౌందర్యము సజీవములందేకాదు అప్రాణులందును, సచేతనములందేకాదు జడములందును, జంగమములందేకాదు స్థావరములందును ప్రతీయమానమగును. అసలు మూర్త పదార్థములందేకాదు అమూర్తములందును అనగా వస్తుకోశమునందేకాదు భావలేశమునందును గోచరమగును. కనువిప్పిన మనసులకు ప్రకృతి సర్వత్ర ప్రసన్నమగును. అతుల మహానుభావ మషడక్షీణ మధురానుభవములో గబ్బిగబ్బల బిబ్బోకవతి సును సిబ్బితిలో, పాలబుగ్గల పసిపాపల మునిముని నవ్వులలో, కొండలలో కోనలలో, కోకిల కాకలిలో, పురివిప్పిన పుంజునెమలి లలిత లాస్యపు లయహొయలులో, గగనాంగణమున విరిసిన హరివిల్లు రచియించిన రంగురంగుల రంగవల్లికలో, లే జవరాలి కడుపులోపలి తొలికాన్పు పసికందు రూపురేకల తలపోతలో, ప్రణయ లేఖలలో, యువతీ యువకుల హృదయ కూలంకషమైన వాగ్రసవాహినిలో ఎక్కడ రసింపదు రమణీయత ? ఎక్కడ వసింపదు కళా కమనీయత ! అంతేకాదు. కారు మబ్బునకు గిరిగీసిన కలధౌత రేఖలోను, కటిక గుండెల కసాయివాడు కన్నబిడ్డ కపోలమున చేసిన కదుష్ణ చుంబనములోను, కాటికి కాళ్ళు జాచుకొన్న మూడు కాళ్ళ ముసలితాత అవ్వ యౌవనమూర్తిని స్మరించి పూర్వానుభవరోమాంచముగా పొందిన పులకరింపులోను ఎక్కడలేదు చక్కదనము ? 'చక్కగా' అను పదమును బహుభంగులుగా మన ముపయోగించుటయే ఒక తార్కాణము. చక్కని సమయము, చక్కని మాట, చక్కని యూహ మొదలగునవి.

కడుపు, నోరుకాదు మానవుడనగామరి ? కన్నులు, చెవులు. ప్రాక్తన కాలమున మానవుడు తన జీవన ప్రభాతవేళ కుట్ర నట్టడవులలో గుహా కుహరములలో కోరలుసాచిన క్రూరమృగముల పచ్చిమాంసము వెచ్చని నెత్తురు కుడుచు చుండిన స్థితియందును పరిసర ప్రకృతియందు వసించు పరమ రమణీయతను గ్రహించి పరవశించినాడు. ఆ సౌందర్యమునకు కారణమైన ప్రకృతికి తన కృతజ్ఞతను అనుకరణ ద్వారమున నివేదించుకొనినాడు. ప్రకృతి ననుకరించుటతో ఆరంభించిన మానవుని ప్రయత్నము ప్రకృతిని అధిగమించుటతో పరిసమాప్తమైనది. అట్లనుకరణ రూపముగా వర్ధిల్లినది. సంతోష పారవశ్యముతో కై పెక్కిన మానవ

హృదయము కళకు దోహదము చేసినది. అతని అనుభవోపజ్ఞమైన సంస్కార పురస్కారమువలన కళ అనుదిన ప్రవర్థమాన మగుచున్నది.

సౌందర్య స్వాదము బహిరాకృతికి పరిమితముగాక ఆవరణలుదాటి అంతస్సారమున కభిముఖముగా పయనింపవలెను. పరమమైన సౌందర్య భావనావధి చేరుకొనుటకు మానవుడుచేయు ప్రయత్నములే ఈ భౌతిక సౌందర్య సోపానములు. సౌందర్య ప్రపణత్వము ఇంద్రియ వాంఛ వంటిదికాదు. ఇంద్రియ వాంఛ ఆ వస్తువును తనదిగా చేసికొనుమని మనస్సును హెచ్చరించును. తన అనుభూతిలో పదిమంది పాలుపంచు కొనవలెనని యాశించునట్టిది సౌందర్య రాగము. మనకు నచ్చిన పాటను మనము మెచ్చిన కవితను మరి పదిమంది విని కని వినోదింపవలెనను కొందుముగదా. విషయాసక్తుడగు మానవుడు వస్తువుల కనుగుణముగా తన భావములను మార్చుకొనును. కాని సౌందర్య దిదృక్షువైన కళాస్రష్ట తన భావముల కనుగుణముగా వస్తువులను మార్చుకొనును.

సౌందర్యము కర్తృ సాపేక్షమా? కర్తృ నిరపేక్షమా యనున దొక ప్రశ్న. అది వ్యక్తి నిష్ఠమా వస్తు నిష్ఠమా యనున దొక ప్రశ్న. ఒక వస్తువునం దెంత నిస్తుల సౌందర్యమున్నను దానిని దర్శించి మెచ్చుకొనగల వస్తువుగూడ తద్దర్శనాత్పూర్వమే తాదృశమైనదై యుండవలెను. మనస్సు స్వతస్సుందరమైనది కాకపోయినచో అది వస్తుగత సౌందర్యమును గ్రహింపలేదు. కళాస్రష్టకు సత్యము, అనంతము, శాశ్వతము అయిన సౌందర్యమును సందర్శించు శక్తిగలదు. స్థూల ప్రపంచములో కనిపించు వస్తువులకంటె సుందర తరమైన వస్తు ప్రపంచమును సృష్టింపగలడతడు. అనంత లీలా విలాసముగలది అతని అంతరంగ పరంధామము. పరమ భావుక పట్టభద్రుడైన గెటే మహాశయుడు సౌందర్యము ననిర్వాచ్యమైనదిగా సంభావించెను.

"Beauty is the disclosure of the mind or of the idea. Mind is higher than nature and therefore the beauty of art is higher than the beauty of nature."

అని సెలవిచ్చినాడు హెగెల్. అనగా సౌందర్యము మనస్సుయొక్కగాని భావముయొక్కగాని ఆవిష్కృతి. మనస్సు ప్రకృతికంటె ఉదాత్తమైనది. అందు చేత కళా సౌందర్యము ప్రకృతి సౌందర్యముకంటె ఘనమైనది. అవునుమరి, కళా ఖండములు మానవుని సౌందర్య దర్శనమున కొక స్థిర ప్రకృతిని కలిగించును.

అయితే రసభావముయొక్క ప్రాణకళ ప్రతిష్ఠింపబడినప్పుడే ఆ కళా ఖండమునకు విలువ. అప్పుడే కళాకారుని దివ్యభావ దీధితి ఆ శబ్దములు ధ్వనులు వర్ణములు రేఖలు అను అడ్డుగోడలను ఛేదించుకొని మన మనస్సును ప్రవేశించుచున్నది. అయితే కళా ఖండముయొక్క విలువ అది మన కందజేసెడి సందేశముపై ఆధార పడియున్నదనియు విజ్ఞుల భావన. ప్రకృతి కద్దము పట్టుటగాదు కళయొక్క పని. ప్రకృతి పునాదిపై వినిర్మితమైన సౌందర్యభావ సౌధములో నున్నది కళయొక్క వైభవము. కళాభిరతి క్రీడాభిరతి వంటిది. * భౌతికమైన ప్రయోజనము లేక పోయినను మానసికోల్లాసము కలిగించును. లలితకళలవలన లభించు ఆనందము అవ్యాజము, అవి ప్రతిభోపజ్ఞములు. "ప్రతిభోపజ్ఞమైన వస్తువు ఉపయోగికాదు. దాని ఆధిక్యము దాని నిరుపయోగముమీదనే ఆధారపడియున్నది." అని స్కోపేన్ హోవర్. రసానుభవము కేవలము వస్తువుయొక్క ఉపయోగమువలన కలుగదని హెర్బర్ట్ స్పెన్సర్. అది సౌందర్య సమగ్రాభివ్యక్తి వలననే కలుగునని క్రోషే. ఆ రసానందము మానవాత్మయొక్క సమరసము అవిజ్ఞాతమునైన పరిశ్రమ.

కాలింగ్‌వుడ్ మహాశయుడు తన Philosophy of Art అను గ్రంథ రాజమున ప్రవచించినట్లు కళాస్రష్ట ఆత్మీయమైన భావనా వైభవముతో వస్తు ప్రపంచమునకు కళా జగత్తులో ఒక వర్చస్వితను తెచ్చిపెట్టును. కళ యనునది యథార్థ్యమును కేవలము అనుకరించరాదు. వాస్తవికతను కళ వ్యాఖ్యానించును; సాధారణీకరించును; ఆదర్శీకరించును; రూపాంతరీకరించును. కళయొక్క లక్ష్యము జీవితమున కొక పరిపూర్ణతను గొనితెచ్చుట, అవసరమైనచో దానిని రూపాంతరీకరించుట. అంతేకాని అనుకరణముకాదు. దాని ఉన్నత ప్రయోజనము భావ వ్యక్తీకరణము. అలంకరణ ప్రధానమైన కళ (Decorative art) నేత్రము నకో శ్రోత్రమునకో సంతృప్తి నిచ్చునుగాని వ్యక్తీకరణ ప్రధానమైన కళ (Expressive art) బుద్ధీంద్రియమునకును హృదయమునకును సంతృప్తి నిచ్చును.

---

* "క్రీడనీయకే మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్" అనగా చూడదగినది వినదగినదియునగు క్రీడ మాకు కావలెనని దేవతలు బ్రహ్మను కోరగా ఆయన సమాహార కళయైన నాట్యమును వారికి ప్రసాదించెనని భరతుడు నాట్యశాస్త్రమున చెప్పియున్నాడు.

"Play is the art of the child. Art is the play of the man" అని యొక భావుకుని వక్కణ.

కళా జగత్తులో అనుభవింపబడిన, అభివ్యక్తమైన వేదన మనస్సులోనున్న దయ, సానుభూతి, ప్రేమ అను వానిని మరింత ప్రజ్వలింపజేయును. సంకుచితత్వము, స్వార్థపరత్వము, ఏకాకిత మున్నగు బంధములనుండి మన ఆత్మకు విముక్తినిచ్చును. కళలో మానవుని భావ వ్యక్తీకరణశక్తి పరమావధి చేరుకొనును. కళాకారుడు స్వభావసిద్ధముగా మంచిని ప్రేమించువాడు గావున వస్తువుల యొక్కయు, భావముల యొక్కయు పరిపూర్ణతను గ్రహించువాడు, ప్రదర్శించువాడుననియు, అత డంతస్సాక్షిగా భావన చేయువాడుగావున అతని భావ జగత్తులో ప్రవేశించిన సర్వవస్తువులు భావములు చిరంజీవములగుననియు జార్జి శాంతాయనుని భావన. కళాకారుని భవ్య సౌందర్య భావావిష్టమైన మనఃస్థితి, ఉద్రేకము, బుద్ధి, రసావేశము, సాత్త్వికానుభవము పాకమునబడిన పరిస్థితి. ఆ స్థితిలో అతని మనసు నుండి ప్రపంచము మీదకు ప్రసరించిన సౌందర్యమే కళ. సౌందర్యముగురించి మనము కనుచున్న కలలనుండి పొందుచున్న అనుభవములనుండి కొన్ని కలలను అనుభూతులను కళాకారు డెన్నుకొనును. లోపభూయిష్ఠమైన లోకములో వస్తు భావముల అంతస్సారమైన సౌందర్యము తరచుగా అనేకములైన అసందర్భములతో కలిసియుండును. కళాస్రష్ట వస్తువులనుండి సౌందర్యాంశను పృథక్కరించగలడు. విశ్లేషించగలడు. ఆ వస్తువులను తన లోకములో సందర్భ సుందరముగా మలచగలడు. మనోజ్ఞ శిల్పముగా ప్రదర్శింపగలడు. పండిన గుండెపై ప్రమాణముచేసి చెప్పవలెనన్నచో కళా జగత్తులోనే మత జగత్తులోకంటె తత్వ జగత్తులోకంటె మిన్నగా సమస్త విశ్వము సరసముగా సమరసభావ బంధురముగా అనుభవింపబడుచున్నది. వ్యక్తీకరింపబడుచున్నది. అందుచే పశువునుండి సార్థక్యము పొందిన మనీషియైన మానవుడు మనస్విగూడ కావలెనన్నచో అసలు మానవుడు మానవుడై మనుగడ సాగించవలె ననుకొన్నచో 'Beauty is the Handwriting of God' అని ఎమర్సన్ మహాశయునిచే సంభావింపబడిన సౌందర్య దేవతకు గుండెలో నొక గుడి కట్టవలెను. బ్రహ్మానంద సబ్రహ్మచారియైన రసానందమునకు రహదారులైన కళలను ఆరాధించవలెను.

Whatever is beautiful is for the same reason Good

—Socrates

All nature is Art — Alexander Pope

The course of nature is the art of God — young.

'రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.

—కాళిదాస మహాకవి

# శృంగారము

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి

"స్వరాజ్యం కావాలి, స్వాతంత్ర్యం కావాలి' అనే కోరిక, పుట్టిననాటినుండీ మన దేశపు పిన్నలలోనూ, పెద్దలలోనూ కలిగింది. ఆ కోరికతోపాటు మన జాతిని ఎలా పునరుజ్జీవితం చేయాలి అనే తహతహ ఒకటికూడా తలచూపింది. ఆచార వ్యవహారాలలో, చదువు సంధ్యలలో, వేషభాషలలో – ఒకదాంట్లో అనే ఏమిటి ? – అన్ని విషయాలలోనూ నవ్యత ఆరంభమయింది.

బెంగాలులో శ్రీ రామకృష్ణ పరమహంస వ్యావహారిక భాషా ప్రయోజనం చూపించాడు బుద్ధుడులాగా. వివేకానందుడు ప్రాబంధిక భాషకు స్వస్తిచెప్పి వ్యావహారిక భాషకు ప్రాముఖ్యం తెచ్చాడు. ఆంధ్రదేశంలోనూ, ఇతర దేశాలలోనూ ఆ యా పండితులు వాడుకభాషా ఉపయోగాన్ని అనేక విధాలుగా ప్రచారంచేశారు. దానికి ఫలితంగా తెలుగు దేశంలో పత్రికలూ పుస్తకాలూ చలద్భాషను అవలంబించడంవలన మూక ప్రాయమైఉన్న తెలివితేటలన్నీ కంఠాలూ గంటాలూ సంపాదించుకొన్నవి. తెలుగు సాహిత్యంలో ఒక కొత్త వికాసం ఆరంభించింది.

అప్పుడు రుషియా, ఫ్రాన్స్, స్వీడన్, నార్వే, ఇటలీ, ఇంగ్లండ్, జర్మనీ సారస్వతాలు ఒక్కసారిగా కనిపించడం మొదలుపెట్టినవి. హిందూదేశంలోని బంగాళీ హిందీ గుజరాతీ ప్రాంతాల పిన్నవారల కుతూహలానికి మేరలేకుండా పోయి – 'నపీయతే కావ్యరసం పిపాసితైః' అనే మాటకు స్వస్తి పుట్టింది. ఒక ఇంద్రజాలం వారి ఇంద్రియాలకు గోచరించింది. అంతట వారు అన్ని కళలలోనూ మేలుకొలుపులు పాడటం మొదలుపెట్టారు. దానికి పర్యవసానంగా ఈ నవ జాగరణంలో మేలూ, కీడూ రెండూ రెండు తలలతో కనబడుతున్నవి.

మన దేశంలో ఇంతకుముందు సాహిత్యానికి సంబంధించిన భావ రాజ్యంలో పౌరులు సౌందర్యాన్ని అన్వేషిస్తూ శక్తికొలదీ సభ్యతా సంప్రదాయాలను పాటిస్తూ క్రమక్రమంగా ముందడుగు వేసుకుంటూ వస్తున్నారు. పరంపరా ప్రాప్తాలయిన

మన సభ్యతా సంస్కారాల చూపుడువేలు నిర్దేశించిన ఘంటాపథంమీద హక్కును పొంది పరస్పర వైరం లేకుండా పిన్నలూ పెద్దలూ మెల్లగా నడుస్తున్నారు. కవులు, చిత్రకారులు, సహృదయులు, గాయకులు, శ్రోతలు - అందరూ ఆ బాట గుండానే సౌందర్య యాత్ర చేస్తున్నారు. మన సభ్యతకుగాని, సంస్కారానికిగాని తిరుగుబా టెంతమాత్రమూ కనబడలేదు. నేటి నవజాగృతిలో గలిగిన ఒక భాగం వల్ల సభ్య ప్రపంచంలో కళా లక్ష్మికి వస్త్రాపహరణం జరిగిపోతూంది.

నవ్య జాగృతిలో తలచూపిన యీ భాగం కొత్తదా అంటే కొత్తదీకాదు; పాతదా అంటే పాతదిన్నీ కాదుగాని యిది ఒక నవీన భంగిమం. ఇది జీవన రహస్యం ఎదుట, ప్రపంచ సమస్య యెదుట ఒక కొత్త తీరు. ఈ భంగిమలో అత్యాశనమైన క్షుధ ఉంది; సంయమంలేదు. బర్బ్రతర ఉంది; వీరత్వం లేదు. రూఢత ఉంది; పౌరుషంలేదు. ఇట్టి రచనల నన్నిటినీ ఏకీకరించి చెప్పగల సంజ్ఞ దొరకదు. ఈ రచనలలోనుంచి కొత్తవాణి వినిపిస్తూందా అని ఆలకిస్తే ఏమీ తేలదు. "ఈ రచనలలో కొత్తదన మేమీలేదు; ప్రాచీన సాహిత్యంలో ఇటువంటి రచనలు కావలసినన్ని ఉన్నవి, లేక ఉంటవి'' అనిగాని, లేక "యీ రచనల చూపు కేవలమూ అట్టి విశేష ఘటనలమీద మాత్రమే'' అనిగాని అంటే, ''ఇది కేవలం చూపుగాని, విపులీకరణంగాని, లేక ఒత్తి చెప్పడంగాని కాదు; ఇదే వీని సర్వస్వం" అని అనవలసివస్తుంది. మహాకావ్య సముద్రంలో తరంగితమై ఉద్గ మించే మానవ జీవనలీలలో తార, అహల్య మొదలయిన పాత్రలు సగం మునిగిన ద్వీపాలలాగు కనిపించీ కనిపించకుండా ఉంటవి. కాని యీనాటి వాస్తవ వాదో పాసకములయిన రస రచనలకు ఆ వస్తువే కొత్తగా కనుగొన్న మహాద్వీపం. వాని కల్పనాశక్తి అంతా ఆ ద్వీపంచుట్టూ నురుగులతో వెల్లివిరుస్తున్నది. పౌరాణికాఖ్యా యికలతో వాని ఇంద్రియ క్షుధ ఆరదు. అవి ఆధునికము లనుపేరిటి వస్తు తంత్రాలు. మరి వాని వస్తు తంత్రత స్త్రీ పురుషుల యౌవన ఘటితమయిన ఇంద్రియోద్రేకంతో పొగిచి ఒకానొక రూపమును ఏర్పాటుచేసే తొట్రుపాటు. ఈ శ్రేణికి చెందిన రచనలు 'మాది వాస్తవ వాదం' అని చెప్పికొనుటకు వెను దీయవు. ఈలాటి రచనలు ఒక తెలుగు భాషలోనేకాదు. ముమ్మరంగా వంగ భాషలోనూ, ఉద్ధృతంగా గుజరాతీలోనూ, మందంగా హిందీలోనూ, తెలుగుతో బుజాలు రాచుకుంటూ కన్నడంలోనూ బయలుదేరి విలాయతీ సరుకుతోపాటు మార్కెట్‌లో చలామణీ కావడానికి పోటాపోటీలు పడుతున్నవి.

పాశ్చాత్య దేశాలలో జీవతత్త్వ మూలకమైన ఆలోచనా ప్రవాహానికి చలనం కలిగింది. అచటి బుద్ధిమంతులు హార్మోన్ తత్వం గ్రహించారు. కొత్త పద్ధతిమీద జీవ తత్వగవేషణం బయలుదేరింది. ఫ్రాయెడ్ అనే మనస్తత్వ శాస్త్రజ్ఞుడు "మానవుల చిత్తవృత్తి అంతా మదనానంద మూలకం" అని సిద్ధాంతం చేయడానికి ప్రయాసపడ్డాడు. ఈ సిద్ధాంతం అనేకులను అటూఇటూ ఊపింది. పాశ్చాత్య దేశాలలో ఫ్రాయెడ్‌కు అనేకమంది శిష్యులు వెలిశారు. సమాలోచకులు బలిశారు. అంతకు పూర్వం బహిరంగంగా ఆలోచించడానికి సంకోచ పాత్రాలయిన విష యాలు బటాక బయలుగా సభాస్థానాలలో అర్హత సంపాదించుకొన్నవి. వానిలో కొన్నికొన్ని విషయాలు కస్తూరీ మాత్రల పరిమాణంలో హిందూదేశపు పత్రికలలో అవతరించినవి.

ఈనాటి పాశ్చాత్యుల ఆచార వ్యవహారాలలో ఉన్నతత్వాన్ని పలువురు గ్రహించి సాహిత్యంలో విప్లవ స్వరాన్ని వెలువరించారు. సాధారణ జీవితం లగాయతు నరక జీవితంవరకూ గల ఇంద్రియ క్షుధ వీరివలన బయట బడ్డది.

మన దేశంలోని భావుకులు ఇంతగా ఈలాగు చిత్రింపకపోయినా దానిని అతీత భావధారలోనే కనుక్కొన్నారు. కొందరు కనుక్కోక దానికే జయగీతాలు పాడుతున్నారు. కనుగొన్నప్పటికీ కొందరు అదే మంచిదని దానిని సాహిత్య కులా యంలో ఉంచుతున్నారు. ఈ కులాయంలో ఆదిమ జంతువు మహాకాయంతో కన బడగలదు. జీవనానికి కామ్యవస్తువు కామమే అని అది అరుస్తుంది.

ఆధునికమైన పాశ్చాత్య సాహిత్యంలో ఏ భావం వికసించిందో అది కేవలమూ వారి సంఘ సామగ్రి. దానిలో చిరంతనమైన సత్యం ఎంత వట్టు కలదో అది అన్ని సంఘాలలోనూ ప్రయోజనీయమే. ఆ సత్యం ఏదో దానిని గ్రహించి చిత్రించడానికీ, ఏ సంఘ సామగ్రి మన సంఘ ధాతువులో అతకదో దానిని ఆలోచించి చూడడానికీ మన యువకులకు అవకాశం ఎక్కడుంది? సతీ త్వానికీ, శరీరానికీ ఏమీ సంబంధంలేదని కొందరు వ్రాశారు. పెండ్లిని తీసివేయడం ఆపాత రమణీయమేకాని సతీత్వానికి మాత్రం కొత్త అర్థం చెప్పాలని ఇంకొందరు వ్రాశారు. ధర్మపత్నికన్న వారవనిత వేయిరెట్లు దొడ్డది; ఇద్దరూ శరీర విక్రయం చేస్తారు కాని ఇష్టం గనుక ఐతే వారవనిత శరీర విక్రయం చేయకుండా ఉండ గలదు అని మరికొందరు ఆచార్యుల మతం. ఇదంతా ఆకళించి ఈ మతాలనే వెక్కు రీతులుగా మనవారు రచిస్తున్నారు.

మన ఆది కావ్యాలలోనూ, ఇతరత్రా ఉన్న పచ్చి శృంగారం భావ నాగరికతా, సంస్కార కుశలతా కల సంఘంలో ఆరోగ్య వంతులయిన యువకు లను కేంద్రచ్యుతులను చేయలేదు. సమగ్రమయిన మహా కావ్యం ఒక విపుల స్పందంతో నడుస్తూ ఈ శృంగార శకటాన్ని తీసుకపోయి తీసుకపోయి శాంతికి తగిలిస్తుంది. దానివల్ల వారి చరిత్రమీద పడే రేఖాపాతం ఎట్లా పర్యవసన్న మవు తుందో, అనగా అది ఐహికాంత మవుతుందో, ఆముష్మికాంత మవుతుందో వివ రించవలసిన పని ఉండదు. వారు వేరు మార్గం పట్టారంటే అది స్వశక్తివల్లనే అని చెప్పవలసి ఉంటుంది.

ఇపుడొక వైపరీత్యం కనబడుతుంది. పరాపర విద్యలనుగురించి ఎవరికినీ ఇంగితమేలేదు. ఇప్పటి శైష్యోపాధ్యాయిక వర్తకంచేసే ఒక దుకాణం. గురువు చేతిలోదివ్వెలేదు. శిష్యులు లక్ష్యభ్రష్టులు. అంతా కంగారు. కామలోకమే కామ్య లోకమయితే ఏ యుపాధ్యాయు డేశిష్యుడికి 'అది తోవకాదు' అని ఉపదేశించ గలడు? మన దేశంలో మనం మన జీవన పరమార్థానికీ, జీవన అంతరార్థానికీ సంబంధించిన విషయాలను విశదంగా తెలిసికోడానికి ఏమయినా ఉపాయాలను చేశామా? త్యాగంలో ఉండే మాహాత్మ్యం పరాక్రమంలో గల గౌరవం, బ్రహ్మ చర్యంలోని ప్రభావం శృంగారంలోని గౌరవం వీనికి సంబంధించిన పరిచయం వీరికి నేటి చదువులలో ఏ మాత్రమయినా ఉన్నదా?

కాల ప్రభావంచే మన జాతి వెన్నెముక విరిగిపోయింది. శతాబ్దాల తరబడి ఆవరించిన కుంభకర్ణ నిద్రనుండి ఇపుడిపుడే మేలుకొంటూంది. మనం పశ్చిమాభి ముఖులము కావాలో, అంతర్ముఖులము కావాలో తెలిసికొంటూంది. అనేక యుగాల నుంచీ వస్తూన్న 'నిన్ను నీవు తెలిసికో, నిన్ను నీవు తెలిసికో' అనే మాట ఆసియా ఖండపు అంతరాళంనుండి ప్రతిధ్వనిస్తూంది. కాని బలం లేకపోతే 'నిన్ను నీవు తెలిసికోలేవు.'

'నాఽయమాత్మా బలహీనేన లభ్యః'

మనం బలహీనులమని ఎందుకు అనుకోవాలి? మనకు మన ఆత్మీయతను వెల్లడించుకోగల సాహిత్య సారంలేదా! అపక్వ ప్రేమా, హృదయ భేదం, నాయక నాయికా తిరస్కారం, బహిర్భూతమైన యింద్రియాకాంక్షా వెరసి సెక్స్ – అప్పీ లేనా మనకున్నది? ఈ రచన లింకా కొన్నాళ్ళు ఈ నడకతోనే నడుస్తే రచ యితలూ, పఠితలూకూడా దివాలా తీస్తారు.

మన దేశం మన విశిష్ట సభ్యతా రేఖనుంచి జారిపోతే మన యువకులు రేపటి ఇతిహాసమును ఎలా నిలబెడతారు ? ఈ భంగిమ ఈ తీరే మన యువకుల కందరకూ యధార్థ స్వత్వం కాకుండా ఉండాలి. ఇలాగని మన కసలు శృంగారం వద్దని ఎన్నడూ అనం. మనకు కావలసినంత శృంగారం కావాలి. ఇంకా కావాలి, ఇంకా కావాలి అనిపించే శృంగారం కావాలి. దేనిని చదువుతూఉంటే మనసు వ్యథపడదో అటువంటి శృంగారం కావాలి. దేనివలన మనకు నిషా కలగదో, మరి దేనివలన ఆనందం కలుగుతుందో అటువంటి శృంగారం కావాలి. దేనివలన మన సంఘానికీ, సభ్యతకూ సంస్కృతి ఏర్పడుతుందో, మరి దేనివలన హిందూదేశం అర్థనారీశ్వరుడనే భావ సత్యాన్ని చిత్రించిన దనే ప్రతిష్ఠ సభ్యతా ప్రపంచంలో ప్రశంసింపబడుతుందో అటువంటి శృంగారం కావాలి. ప్రపంచమంతా శృంగారం. దానిని చూస్తూఉంటే మన కెట్టి జడానందం కలుగుతుందో, కవులు చిత్రించే శృంగారం దానికి మేలుతరమైన అజడానందం కలిగించాలని కోరుదాం.

(భారతి - జనవరి 1949)

# ప్రయాణం - ప్రవాహం

—శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీ. శ్రీ.)

అందుకే చెట్టంటే ఎంతో నాకిష్టం: ఎక్కడికీ చెట్టు ఎప్పుడూ వెళ్ళదు కాబట్టి.

ఇవాళ ఉదయం ట్రాముకోసం తపస్సుచేస్తూ చెట్టుకింద నిలబడ్డాను. "ఎక్కడికి నేస్తం" అని చెట్టు నన్నిడిగిన ట్టనిపించింది. ఇంకెవరైనా ఈ ప్రశ్న అడిగితే "మైలాపూరుకి" అని జవాబిచ్చి ఉందును. నిజాన్ని మనం కొలిచే పొడుగు వెడల్పుల పరిమితిలో నా జవాబు నిజంలాగే కనబడేది. కాని చెట్టు వేసిందనుకున్న ప్రశ్న కాబట్టి "మైలాపూరు నా గమ్యం" అని ఏ మొగం పెట్టుకొని జవాబివ్వగలను? "తెల్లారగట్టే లేచి ఇందుకా ఈ వానలో నిలబడ్డావు?'' అని చెట్టు గద్దిస్తే ఏమయి పోవాలి నేను?

చెట్టుతో ఎవరూ మాట్లాడలేరు. మనం ఎంత కొలిచి కొలిచి జవాబు చెప్పినా అది అబద్ధపు వాసనే కొడుతుంది. చెట్టుని ఎవ్వరూ కొలవలేరు. మన ఆస్తుల్ని కొలుచుకోగలం. ఏదో ఒక పండుగపేరు చెప్పి ఎవరో ఒక దేవుణ్ణి కొలుచుకోగలం. కాని ప్రపంచ పర్యాప్తమైన చెట్టు తాలూకు ఆకుపచ్చని అహింసాత్మక సామ్రాజ్య వైశాల్యాన్ని ఎవ్వరూ కొలవలేరు. ఇంతలో ట్రాంబండి వచ్చింది. నాకు నిలబడ్డానికి చోటు దొరికింది. నిలుచున్న పాటుగా నేనేమీ కదలకుండానే ఒక చోటునుండి ఇంకో చోటు చేరుకున్నాను. నిలుచున్నంతసేపూ నా ఆలోచనలన్నీ చెట్టును గురించే! చెట్టులో నువ్వు చూసే నిశ్చలత్వం శిలదీకాదు, శవానిదీకాదు. అది కదలదనుకోవడం భ్రమ. క్షణం క్షణం చెట్టు కదుల్తూనే ఉంటుంది. అయితే దాని ప్రయాణం ఔన్నత్యంవేపు. ఆకాశాన్ని అందుకోవాలని ప్రతి చెట్టూ ప్రతి క్షణం ప్రయత్నిస్తూనే ఉంటుంది.

ధ్వనికన్నా ఎక్కువ వేగంతో ప్రయాణంచేసే విమానం ధన్యమైనదే. కాని శ్రావణ మంగళవారపు నోము రోజున సెనగ గింజలోనుండి ఎదిగే మొక్క సాధించే వేగానికి నేను ఆశ్చర్యం పొందక మానలేను. చిన్నప్పుడు నేను పారేసిన

చింత పిక్కల సంతానం ఇప్పుడు సకల ప్రపంచంలో నిండిపోయిందన్న తలంపు కేవలం నిరాధారకమైనదికాదు. శ్మశానాలమీద వాన కురిసినప్పుడు ఎంత వేగంగా పచ్చగడ్డి ఎదుగుతుందో, ఎందుకు నేను వేరే చెప్పడం ?

నీ, నీ ఒక్కో ఉదాహరణకి ఒక్కొక్క చెట్టుని చూడగలవు.

కోరికలెల్ల ధూళిబడ గోల్పడి
దిక్కుల శూన్య దృక్కులం జీరి
యెటో వృథా శిశిర జీవన భారము
బుచ్చుచున్న భూమిరుహమేను......

అన్నా డొక కవి.

శ్రీమంతంబుగ స్వాంతముల్ వికసిలన్
సేమంతి సీమంతినుల్
హేమంతుడను కాంతురాక కొరకెం
తే వింత మీరన్ వసీ
భూమిన్ మేన నలంకరించుకొను కెం
పుల్, నీలముల్, వజ్రముల్
గో మేధంబులు నా చెలంగె పలు రం
గుల్ గల్గు పుష్పావళుల్.

అన్నాడు ఇంకో కవి.

ఇక్కడ నా ఉద్దేశంలో కొమ్మా, రెమ్మా, మొగ్గా, ముల్లా, ఆకూ అన్నీ చెట్టే.

అందుకే చెట్టంటే ఎంతో నా కిష్టం. ఎక్కడికి చెట్టు ఎప్పుడూ వెళ్ళకపోతే నేం ? ఏరోప్లేనులో ఎక్కినా ఎక్కడికి వెళ్ళగలం మనం ? ఎక్కడికీ వెళ్ళని చెట్టు ఎప్పుడూ మనతోనే, మనలోనే ఉంది. ఇందుకే నా కంటే చెట్టెంతో ఇష్టం.

చెట్టు నీ కిష్టమైతే మరి నీకు చెట్టులా స్థిరత్వంలేదే - నిజమే శ్రీశ్రీకి స్థిరం లేదంటున్న వాళ్ళందరికీ నా కృతజ్ఞత. జీవించడం అంటే ప్రవహించడం కాబట్టి. నేను జీవిస్తున్నానన్న నిజాన్ని వాళ్ళు గుర్తిస్తున్నారు కాబట్టి.

నిన్నగాక మొన్నదాకా వృక్షాల నిశ్చలత్వాన్ని మెచ్చుకుంటున్న నేను నేడు ప్రవాహం గురించి ప్రశంసించడం కొందరికి ఆశ్చర్యం కలిగించవచ్చు. అదే మరి స్థిరం లేకపోవడం అనవచ్చు. స్వవచన వ్యాఘాతం అనే దోషాన్ని నామీద

ఆరోపించవచ్చు. కాని చెట్లలోని నిశ్చలత్వాన్ని నేను ఆరాధించటం మానలేదే!
నాకూ ఒకచోట స్థిరంగా ఉండాలనే ఉందే! ఏదీ నేను కోరుకునే నిశ్చలత్వం?

బహుశా నాలో స్థిరత్వం లేకపోవడానికి అన్నిటికీ నేను 'ఔను' అనడమే కారణం కాబోలు? పన్నెండో ఏటికే పన్నెండు భాషలలో ప్రజ్ఞ సంపాదించిన జెన్నీ అనే అమ్మాయి ఒక్క భాషలోకూడా 'వద్దు' అనలేక పోయిందట. అడగని వాడిదే పాపంగా బదికి ఉండాలి పాపం జెన్నీ!

ఎన్నోసార్లు అనుకుంటాను 'వద్దు' అనాలని. ఒకమారు నేను 'నా కీ జీవితం వద్దు' అనేసి ఆనిశ్చయాన్ని ఆచరణలో పెట్టబోయాను. కాని మనకి 'స్థిరం' లేదుగా? మనస్సు మార్చుకున్నాను. ఇకమీదట మృత్యువు దానంతట అదే రావాలి. అప్పుడుకూడా వద్దనడం నాకు చేతకాదు.

షరతులు లేని ఒకే ఒక్క సరే నా జీవితం. ఇందులో కొన్ని ఇబ్బందులూ ఉన్నాయి: కొన్ని సదుపాయాలూ ఉన్నాయి. 'సరే' అనడం అంత కష్టమైనదీ కాదు; అలాగని సులభమైనదీ కాదు.

సరే ఒప్పుకున్నాం – ప్రవాహం ఎటు తీసుకుపోతే అటు పోవడానికి. దేన్నీ నిరోధించకూడదు. దేన్నీ నిరాకరించకూడదు.

అయితే ఏమయినట్టు?

కాకపోతే ఏమయినట్టు? ఒక ప్రశ్నకి జవాబుగా ఇంకో ప్రశ్న వెయ్యడం మంచిది. చాలామంది ప్రశ్నకు జవాబు జవాబనుకుంటారు. ప్రశ్నకు జవాబు ప్రశ్నని చేస్తే ప్రశ్నించిన వాడిమీదనే జవాబిచ్చే బాధ్యతకూడా పడుతుంది.

ప్రస్తుతం ప్రశ్నించిన వాడిని నేను కాబట్టి జవాబుకూడా నేనే ఇస్తాను.

ఏమయినట్టు? ప్రవహించడం మానేస్తాను. గడ్డకట్టుకు పోవడానికి అనుమతిస్తాను. సమయానుకూలంగా సరే అని తాళం వెయ్యడమో, వీల్లేదని గద్దించడమో చేస్తాను. ఏ పనులుచేస్తే మన ప్రతిష్ఠ ఇనుమడిస్తుందో అవే చేస్తాను. ఎవరితో కూడితే మనకి లాభించే తలుపులు తెరుచుకుంటాయో వాళ్ళతోనే తిరుగుతాను. వాళ్ళ శత్రువులు నా శత్రువులే అని భ్రమపడడంకూడా ప్రారంభిస్తాను. ఎవడేనా నా దగ్గరికివస్తే వీడు ఎందుకు వచ్చాడు? వీడిని ఏమాత్రం వాడుకోవచ్చు? అనే పద్ధతులమీద ఆలోచిస్తాను. సాలెపురుగులాగ గూడుకట్టుకొని ఏ మక్షికమైనా పడదా అని ఎదురుచూస్తూ ఉంటాను.

ఇన్ని చేసినా జీవించడం ప్రవహించడం మానదు. నేను ప్రవహిస్తున్నా నన్న నిజాన్ని గుర్తిస్తున్నవాళ్ళకి నా కృతజ్ఞత.

(తెలుగు స్వతంత్ర 1948)

# కవుల ఢంకా

—శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

"నన్ను నేనే పొగడుకోగలిగినప్పుడు ఆ పని నేను మరొకరికి ఎందుకు అప్పగించాలి" అని బెర్నార్డ్‌షా తెగవేసి అడిగాడు. మనసారా తన పొగడ్తను తానే చేసుకున్నాడు. షా వలె చచ్చు లేకుండా చెప్పి మరీ చెయ్యకపోయినా, ప్రతి పెద్దకవి తన డబ్బాను తాను ఎంతో కొంత వాయించుకున్నవాడే. మన నన్నయ గారినే చూడండి. "అవిరళ జపహోమ తత్పరు"డను, "విపులశబ్ద శాసను"డను, "సంహితాభ్యాసుడ"ను "బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతు"డను, "పాత్రు" డను, "సద్వినుతావదాత చరితు"డను, "లోకజ్ఞు"డను, "ఉభయ భాషా కావ్య రచనాభి శోభితు"డను, "సత్ప్రతి భాభియోగ్యు"డను, "నిత్యసత్యవచను"డను అని తనకుతానై ఎన్ని కితాబు లిచ్చుకున్నాడో! ఇక, శ్రీనాథుడు "దీనారటంకాలఁ దీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల" అని, "పగుల గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి గౌడ డిండిమభట్టు కంచు ఢక్క" అని, "చంద్ర భూపక్రియా శక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమ బిరుద"మని తన ఢంకా తానే బజాయించాడు. ఆదేమి ఇదేమని తనను దగ్గరికి తీసిన కృష్ణదేవ రాయలనే "పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే" అని పెద్దనామాత్యుడు రొమ్ము విరుకుకుంటూ రెట్టించాడు.

పోతే, పిల్ల కవుల సంగతి చెప్పనక్కరనేలేదు. పెద్ద కవులు తమ గొప్పను గురించి బాకాను ఒక్కదాన్నే పట్టుకోగా, పిల్లకవులు బాజా భజంత్రీ లన్నింటినీ ఉపయోగించి వేసుకుంటారు. పెద్దకవులకంటె ఎక్కువగా పిల్లకవులే తమ పొగడ్తను తామే చేసుకోవడం అకారణంగా జరగదు. నిజంగా మహాకవులైనవారు - కీట్స్‌వలె చెదురుగా కానవచ్చే ఏ కొద్దిమందినో మినహాయిస్తే - తమ జీవితకాలంలోనే సన్నుతి నందుతారు. అందువల్ల తమ ఘనతను తామే చాటుకోవలసిన ఖర్మవారికి పట్టదు. ఒకవేళ పట్టినా ఆదిలో కొద్దికాలంపాటే. ఆ తర్వాత కూడా వారు స్వోత్కర్ష చేసుకుంటే అది స్వాతిశయంవల్లకాదు; తన బల దర్పాలను

తా నెరిగిన మృగరాజు అప్పుడప్పుడు జూలును జళిపించడం, పంజాను నేలను రాయడం, దిక్కులు పిక్కటిల్లేటట్టు గర్జించడం ఎంత సహజమో, ఈ స్వోత్కర్ష కూడా అంత సహజం. కవి సింహాలు కానివారు ఈ పని చేసినప్పుడే ఇది హాస్యాస్పదంగా పరిణమిస్తుంది. ఈ మాట మనం చెప్పినా వారి తలకెక్కదు. మహాకవి కోవకు చెందనివారికి లోకంనుంచి నిర్లక్ష్య, నిరాదరణలు తప్పవు; ధిక్కార తిరస్కారాలు తప్పవు. వీటిని చూచి లోకం గ్రుడ్డిది కనుకనే తమ ప్రతిభను అది గుర్తించలేక పోతున్నదని వారు నిశ్చయించుకుంటారు. సాటి కవుల ఈర్ష్యావిద్వేషాలవల్లే తమ పేరు బయటికి రావడంలేదని ధ్రువపరచుకుంటారు. అక్కడినుంచి తా మింతవారమని, అంతవారమని లోకం చెవులు చిల్లులు పడేటట్టు పెడబొబ్బలు ప్రారంభిస్తారు. అవి పనిచేయడంలేదన్న బాధ హెచ్చినకొద్దీ మరింతగా గొంతు చించుకుంటారు.

మహాకవు లైనవారు స్వోత్కర్ష చేసుకున్నా, దానిలో కానవచ్చేది వ్యర్థాడంబరంకాదు; విశేష ఆత్మ విశ్వాసం మాత్రమే. హోరేస్ (లాటిన్ భాషలో మహాకవి) తన బృహత్కావ్య సౌధాన్ని గురించి ప్రస్తావిస్తూ ''లోహాలకంటె ఇది గట్టిది; రాజాధిరాజుల సమాధులకంటె మహోన్నతమైంది; కుంభ వర్షాలైనా దీన్ని కరిగించలేవు; తుపానులైనా దీన్ని తుడిచిపెట్టలేవు; కాల ప్రవాహానికే ఇది చెక్కుచెదర బోవడంలేదు'' అని చెప్పుకున్నాడు. షేక్స్పియర్‌లోనూ ఇంత ప్రబలమైన ఆత్మ విశ్వాసం కానవస్తుంది. ఆయన తన 'సానెట్స్'లో 'ఏ చంద్రకాంత శిలా ఫలకంకాని, ఏ భూపాలుని స్మారక భవనంకాని, ఈ కవితకంటె ఎక్కువకాలం నిలవబోదు' అని ఎలుగెత్తి చాటుకోగలిగాడు. మరొక ఆంగ్లేయ కవి వర్డ్స్ వర్త్, తన అమరత్వం విషయమై ప్రదర్శించిన విశ్వాసం దీనికి తీసిపోయేదికాదు. తన తక్కిన కావ్యాలు ఒకవేళ కాలగర్భంలో కలిసిపోయినా, "ఈ గూటిలో ఒక పిచ్చుక గూడుకట్టుకున్నది; దీన్ని గురించి నే నొక పద్యం అల్లాను; ఇది కలకాలానికీ నిలుస్తుంది" అని ఆయన చెప్పుకున్నాడు.

తమ జీవిత కాలంలో మన్నన పొందలేకపోయిన మహాకవులైనా తమ చిరంజీవిత్వాన్నిగురించి నిస్పృహ చెందినట్టు కనబడదు. ''నా పేరు నీటిపై వ్రాతకాబోతున్నది'' అని వాపోయిన కీట్స్‌కూడా మరొక ఘడియలో ''తక్కిన ఇంగ్లీషు కవుల పేర్లతో నా పేరుకూడా జతకావచ్చు'' అన్న ఆశకే పోయాడు. తక్కిన ఇంగ్లీషు కవుల పేర్లతో తన పేరు జతకూడడం ఖర్మమేమి? – సాక్షాత్తు ఆ షేక్స్పియర్ సరసనే ఆయనకు లోకం ఈనాడు పెద్ద పీట వేస్తున్నది.

అసలు తనపేరే భూమిపై నిలవదేమో అని జాన్‌కీట్స్ కొన్ని క్షణాలలో సందేహపడగా, తాను అనుభవించవలసినంతటి ఖ్యాతిని అనుభవించడంలేదని రాబర్ట్‌బర్న్స్ కొంత బాధపడినట్టున్నాడు. అందువల్లనే కావచ్చు ఆయన తన భార్యకు ఉత్తరం వ్రాస్తూ "నేను మరణించిన తర్వాత నూరేళ్ళకు లోకం నన్ను ఈనాటికంటె చాలా ఎక్కువ గౌరవిస్తుంది" అనడం తటస్థించింది. అయితే మహా కవి కనుక "నేను మరణించిన తర్వాత నూరేళ్ళకు" అని బర్న్స్ చెప్పుకున్న మాట అక్షరాలా చెల్లుబాటు అవుతున్నది. తన శక్తికి మించిన ఖ్యాతికి అంగలార్చే ప్రతి కవి సాధారణంగా ఈ పలుకునే చిలక పలుకువలె పలుకుతుంటాడు.

మహాకవులైనవారు స్వశక్తి జ్ఞాన ప్రేరితులై స్వయంగా ప్రకటించుకునే ఆధిక్యం కొంత గుంభనగా వుండడంకూడా కద్దు. మాళవికాగ్నిమిత్రం నాందీ ప్రస్తావనలో "ప్రాచీనమైనది ప్రతీదీ ప్రశస్తమైంది కానక్కరలేదు, అధునాతనమైంది. ప్రతీదీ నింద్యమైంది కానవసరంలేదు. పాతదైనా, కొత్తదైనా సారం గలదాన్ని ప్రాజ్ఞులు మెచ్చుకుంటారు. మూఢులే ఏది మెచ్చదగిందని ఇతరులు చెబితే దాన్ని మెచ్చుకునేవారు'' అని కాళిదాసు సూత్రధారునిచే అనిపించాడు. "భాస, సౌమిల్ల, కవిపుత్రాదులను పోలిన మహాకవుల నాటకాలుండగా, ఈ కాళిదాసు యెవడయ్యా?" అని ముందు ప్రశ్న వేయించి, దానికి కాళిదాసు చెప్పించిన ఈ జవాబులో తన పూర్వీకులు ఎంత మహాకవులైనా, తాను అంతకంటె తక్కువ వాడను కానన్న భావం ఎంత గుంభనగా లేదు!

*    *    *

కీర్తి వచ్చేది కేవలం కవితవల్లనేకాదు. రాజ్యపాలన, సైనిక విజయాలు, శాస్త్ర పరిశోధనలు - ఇట్టివన్నీ కీర్తికి మార్గాలే. అయితే, కవితకూర్చే కీర్తి నిలిచి నంతగా తక్కినవి నిలవవనే చెప్పాలి.

జయన్తితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తితేషాం యశః కాయే జరామరణజం భయమ్.

అని భర్తృహరి చెప్పినట్టు సుకవీంద్రులు సుకృతాత్ములే, రససిద్ధులే, విజయ నిధులే; వారి కీర్తిశరీరాలు జరామరణ జన్మభయరహితాలే. పైగా, కవితారంగంలో సాధించబడిన కీర్తికి వుండే బహుళవ్యాప్తి అన్య రంగాలలో సంపాదించబడినదాని కుండదు. వాల్మీకి, వేదవ్యాసుడు తమ రంగంలో ఎంతటి అఖండులో, చరకుడు.

భాస్కరాచార్యులు తమ తమ రంగాలలో అంతటి ఉద్దండులు. అయినా, ఆ కవు లిద్దరి పేర్లతో మన భారతీయులకున్న పరిచయంలో నూరోవంతైనా ఈ ఆయుర్వేదా చార్యుని పేరుతోగాని, ఈ గణితశాస్త్రజ్ఞుని పేరుతోగాని కలదనగలమా? ఆంధ్రులైన మనకు శ్రీనాథునిగురించి తెలిసినంతబాగా ఆయన కాలపు ఇతర ప్రసిద్ధ పురుషులు తెలుసునా? ఆ కవి సార్వభౌముడు పేర్కొనబట్టిగాని, లేకపోతే వీరారెడ్డి, విస్సన్న మంత్రి, భాస్కరుడు మొదలైనవారి పేర్లు మనదాకా వచ్చేవికావు. అంతంత మాత్రపువారైన తక్కినవారి మాట దేనికి? అయోధ్యరాముని చరిత్ర ఆదికవి వాల్మీకికి కావ్య వస్తువై ఉండకపోతే, తక్కిన ఇక్ష్వాకు రాజులతోపాటు ఆయన మరొక రాజుగానే మిగిలేవాడే తప్ప, ఇంటింట, వాడవాడ పూజా పురస్కారాలు పొందగలిగేవాడుకాడు.

కవి వాక్కు నిలిచినంతకాలం తన కీర్తి నిలవదని ప్రతి రాజుకు చక్కగా తెలుసు. అందువల్లనే విజయస్తంభాలను యెత్తించడంలోను, శిలాశాసనాలను చెక్కించడంతోను, గుళ్ళు గోపురాలను కట్టించడంతోను, విగ్రహాలను ప్రతిష్ఠాపించ డంతోను, నగరాలను నిర్మించడంతోను సంతృప్తి చెందక కవులను దగ్గరికి తీస్తాడు; వారి కృతులను అందుకుంటాడు. ఇట్టి జాగ్రత్త పడబట్టే భోజుని, రాజరాజ నరేంద్రుని, మనుమసిద్ధిని, కృష్ణదేవరాయలను మన మిప్పటికీ తలుచు కోవడం; లేకపోతే, వారెవరో, మనమెవరమో! "భోజునివంటి రాజు కలిగితే కాళి దాసువంటి కవి అప్పుడే ఉంటాడు" అనడం తప్పు; కాళిదాసు కలిగితేనే భోజుడు ఉండడం.

కవి కృపను సంపాదించగలిగితే సామ్రాజ్యాధిపులేకాక, సామాన్యులైనా అమరత్వం పొందగలరు. ప్రపంచ చరిత్రలో ఇందుకు తార్కాణాలు వందలూ వేలూ. వీటి అన్నింటిలో పైథియాస్‌కు సంబంధించిన గాథ మహా చక్కనిది. ప్రాచీన కాలంలో ఇతడు ఈజినాకు (గ్రీస్) చెందినవాడు. ఇస్థమియన్ ఆటల పోటీలలో జగజ్జెట్టిగా ఎన్నికై, తనను కీర్తిస్తూ ఒక పద్యం వ్రాయడానికి ఎంత చెల్లించవలసి ఉంటుందని అడగడానికి తమ ఊరు కవి పిండార్ వద్దకు వెళ్ళాడు. తన కట్నం ఇప్పటి మన డబ్బు లెక్క ప్రకారం ఇంచుమించు మూడువేల రూపాయలని పిండార్ చెప్పాడు. "అబ్బో అంతే! అంత పెడితే నా కంచు విగ్రహాన్నే పోతపోయించుకోవచ్చు" అని పైథియాస్ పెదవి విరిచాడు. "నిజమే కావచ్చు" అని పిండార్ మందహాసంచేసి మిన్నకున్నాడు. వచ్చిన దారినే ఇంటికి

వెళ్ళి బాగా ఆలోచించుకున్న మీదట అడిగిన మొత్తం చెల్లించి ఒక పద్యం వ్రాయించు కోవడమే మంచిదేమోనని పైథియాస్‌కు తోచింది. ఈనాడు ఈజినాలో కంచు విగ్రహాలులేవు సరిగదా, ఈజినాయేలేదు. కాని, పైథియాస్ భుజబలాన్ని భూషిస్తూ పిండార్ వ్రాసిన పద్యం మాత్రం చెక్కు చెదరకుండా మిగిలి ఉన్నది.

అయితే, పైథియాస్‌వలె ఏ మూడు, నాలుగువేలో ఖర్చుపోయి ఆచంద్ర తారార్క విఖ్యాతి నందగోరితే, అది వ్యర్థ ప్రయాసే కావచ్చు. అమరకీర్తి రాగల దంటే మూడు, నాలుగువేలు ఖర్చుపోవడం పెద్ద లెక్కలోపని కాకపోవచ్చు. కాని, పిండార్‌వంటి కవి తటస్థపడాలిగదా ? పద్యాలలో పొగడ్తలు మాత్రమే కావాలంటే కవులతో పనేలేదు, అయిదో, పదో చేతిలోపెడితే భట్రాజులు ఎన్ని పద్యాలైనా గుప్పిస్తారు. మరి కొంచెం పెట్టుబడిపెడితే, పంచరత్నాలు, అష్టకాలు, నవరత్నాలు, నక్షత్ర మాలలు సమర్పించే బాలకవులు, ప్రౌఢ కవులు, సరస కవులు, సహజ కవులు, మధుర కవులు, బంధ కవులు, వికట కవులు, ఆశు కవులు, జంట కవులు, అష్టావధానులు, శతావధానులు, కవి హంసలు, కవి కోకిలలు. కవి సింహాలు, కవి శార్దూలాలు, కవి మత్తేభాలు, కవి రాజులు, కవి సార్వభౌములు కొల్లకొల్లలుగా ఉన్నారు. మరి కాస్త చెయ్యిజారితే కృతి సమర్పణే చేయించుకోవచ్చు. అయితే, వీటిద్వారావచ్చే కీర్తి సబ్బు బుడగవలె ఈ క్షణం అలరించి, మరుక్షణం 'ఢుప్పు' మనేదే !

కవితద్వారా కలిగే కీర్తి ఎంత గట్టిదో రాజకీయాలద్వారా వచ్చేది అంత ఒట్టిది. రాజకీయ పదవిలో ఉండగా ఎక్కడికి వెళ్ళినా స్వాగతాలే, సన్మానాలే, పూలమాలలే, విందు భోజనాలే – దర్శనానికి గుంపులకు గుంపులే పడికాపులు కాస్తారు. అది లభిస్తే ధన్యులమైనట్టు సంబర పడతారు. "మా యింటిలో బస" అంటే "మా యింట'' అని పోటీ పడతారు. ఎవరింటికి వెళ్ళితే వారు తమ గృహం పావనమైనట్టు సంతోషిస్తారు. ఆ పదవిలో ఉండగా కదిలితే పత్రికలలో వార్త, మెదిలితే మరొక వార్త. బుర్రున చీదితే వార్త, ఖంగున దగ్గితే వార్త. అయినా, పదవినుంచి దిగగానే మళ్ళీ తలచుకొనేవారే ఉండరు. అప్పుడు వారి బ్రతుకు "ఏమి పోలిశెట్టీ" అంటే "ఎప్పటి మొత్తుకోళ్ళే'' అన్నట్టు తిరిగి తయారౌతుంది. బహు కొద్దిమంది విషయంలో పదవి పోయిన తర్వాతకూడా వారి పేరు తలచుకొనడం జరిగితే, అది ఒక తరంపాటు, తప్పితే రెండుతరాలపాటు. ఫాక్స్, పిట్, వాల్‌పోల్, గ్లాడ్‌స్టన్ – వీరు నలుగురు తమ జీవితకాలంలో బ్రిటిష్ రాజకీయ రంగాన అద్వితీయ

రాజకీయవేత్తలు. అయినా, వీరి మంచి చెడ్డలనుగురించి బ్రిటిష్‌వారిలోనే ఈనాడు ఎంతమందికి తెలుసు? గ్లాడ్‌స్టన్ అంటే ఆ పేరుతో చెల్లుబాటు అవుతున్న ఒక చేతిసంచిని తొలిగాచేసి అమ్మినవాడని త్వరలోనే హెచ్చుమంది అనుకోగల ప్రమాదం కలదని ఎ. జి. గార్డినర్ ఎక్కడో వ్రాశాడు. ఇది అత్యుక్తికాదు. ఇంత దేనికి? మాంట్‌ఫర్డ్ రిఫారమ్స్ రోజులలో మన చెన్నరాజధానికి ఎవరెవరు ముఖ్యమంత్రులో, ఎవరి తర్వాత ఎవరో, ఎంతెంతకాలమో ఈనాడు చెప్పగలవారు మనలో ఎందరున్నారు?

కవి వాక్కు ప్రతిమ కలదనడంనుంచి అది అమోఘమైనదనడం ఒక మెట్టు; అది అమోఘమైన దనడంనుంచి శాపోప సంహరణల శక్తి దానికి కలదనడం మరొక మెట్టు. ఈ మెట్టువరకు కొందరు యెక్కనే యెక్కారు. కవులు పెట్టిన శాపాలనుగురించి కథ లనేకం. "పెద్దాపురపుకోట పెద్దమ్మ కిల్లొట కవికోప కలన" వల్లనే జరిగిందట. వేములవాడ భీమకవి —

గడియ లోపలదాడి కడఁగి ముత్తునియగాఁ
దిట్టిన మేధావి భట్టు కంటె
రెండు గడెల బ్రహ్మదండి ముండ్లన్నియు
డుల్లఁదిట్టిన కవిమల్లు భట్టుకంటె
మూఁడు గడెలకుఁదా మొనసి యత్తిన గండి
పగులఁ దిట్టిన కవిభాను కంటె
అరజాము లోపలఁ జెఱువు నీళ్ళింకంగఁ
దిట్టిన బడబాగ్ని భట్టుకంటె

ఉగ్రకోపి నేను నోపుదు శపియింపఁ
గ్రమ్మఱింప శక్తి గలదు నాకు
వట్టి మానఁ జిగురు పుట్టింప గిట్టింప
బిరుదు వేములాడ భీమకవిని.

అని చెప్పుకున్నాడట. అయితే, కవుల ప్రతాపం తాళ్ళు, బ్రహ్మదండి ముళ్ళు, గళ్ళు, చెఱువునీళ్ళు మొదలైన వాటిపైనే కాబోలని ఎక్కడ నవ్విపోతారోనని కవులైనవారు రెండు చాటు పద్యాలను వాటికి అతకడానికి ఒక కాకమ్మ కథను వేములవాడ భీమకవికి అంటగట్టారు. యాచనకు – కవులు చెయ్యిజాపితే యాచన

అనరాదు. అంటే ముక్కు మెలివేస్తారు. అందువల్ల 'ప్రాపు'నకు అందాము – కళింగ గంగు ఆస్థానానికి భీమకవి వెళ్ళాడట. ఏమి రాచకార్యంలో మునిగిఉన్నాడో కాని, ఇప్పుడుకాదు, మరొకసారి రమ్మని ఆరాజు కాస్త చికాకు వెలిబుచ్చాడట. ఆ మాత్రానికే భీమకవి కాలరుద్రుడై

వేములవాడ భీమకవి
వేగమెచూచి కళింగ గంగు తా
సామము మాని కోపమున
సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోషమిక
ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్థమం దతని
సంపద శత్రుల పాలు గావుతన్.

అని ఒక శాపం తగిలించాడట. కవి శాపం పెట్టడమూ, దానికి తిరుగు ఉండడమూనా? కళింగగంగు గర్భదరిద్రుడై, "పూవులమ్మినచోట కట్టెలమ్మడమా!" అని ప్రచ్ఛన్న వేషం వేసుకుని, దేశాంతరాలకుపోయి, తిరిపమెత్తుతూ పొట్టపోసుకుంటున్నాడట. ఈ అభాగ్య జీవితాన్ని గడుపుతూ ఒకనాటి రాత్రి చిమ్మ చీకటిలో కన్నుగానక బొక్కబోర్లగా అత డొక గోతిలో పడిపోయి "అయ్యో! దివ్వెటీకైనా గతిలేకపోయిందే?" అని వాపోయాడట. సరిగా ఆ వేళకు పూలపాలకీ యెక్కి, కళ్ళు జిగేలనే దివ్వెటీలతో ఆ దారిని పోతున్న భీమకవి "ఎవడవురా నువ్వు?" అని పలకరించాడట. "భీమకవిగారిచే జోగి చేయబడినవాడను" అని ఆ శిక్షకుడు బదులు చెప్పగా, "రాజ కళింగ గంగువా?" అని కవిరాజు మీసం మెలివేస్తూ (రాజసం కలవాడు గనక మీసం ఉండేదనే అనుకుందాము) ప్రశ్నించాడట. ఈ ప్రశ్న వినగానే మందు తెల్లబోయి, పల్లకీలోని పరమ పురుషుడు భీమకవేనని అల్లంతలో గ్రహించి, శిరస్సువంచి, రెండుచేతులూ జోడించి, "మహాకవీ! నన్ను కరుణించు" మని కళింగగంగు సంప్రార్థనం చేసేసరికి –

వేయి గజంబులుండఁ బది
వేలు తురంగములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జనగ
రంబున బట్టము గట్టుకో వడిన్

రాయ కళింగ గంగు కవి
రాజు భయంకర మూర్తిఁజూడఁగాఁ
బోయెను మీన మాసమునఁ
బున్నమ వోయిన షష్ఠి నాటికిన్.

అని మరొక ఆశుపద్యం చెప్పాడట. కినిసి పొమ్మన్నంతనే పోయినట్టు, కనికరించి రమ్మనగానే రాజ్యలక్ష్మి కళింగ గంగు కాళ్ళవద్దకు రానే వచ్చిందట.

భీమకవినిగురించి చెప్పబడే కట్టుకథ ఇదొక్కటేకాదు. గుడిమెట్ట గ్రామంలో తన గుర్రాన్ని సాగి పోతురాజు దొడ్డికి తోలించుకోగా, "నా జయమును, బోత రక్కసుని చావును నేడవనాడు చూడుఁడీ" అని కవిరాజు పద్యంలో ఒక విసురు విసిరాడట. అన్నట్టే, ఏడవనాడు సాగి పోతరాజు ఇహలోకంనుంచి సాగిపోయాడట. అయితే, తన గుర్రాన్ని తాను వెంటనే అప్పగింత పెట్టించుకోకుండా భీమకవి వారం రోజులు గడవు పెట్టడంలో అంతరార్థ మేమిటో మనకు తెలియదు. మరొకమారు చాళుక్య చొక్క భూపాలునికి తన మహత్తును ప్రదర్శించి చూపడానికి ఆయన చిత్రకూటంలోని స్తంభాన్ని "ఆనీతాభ్యుపదాన శృంఖల కరాభ్యాలంబిత స్తంభమా!" అని సంబోధించి, "నేనే వేములవాడి భీమకవి నేనిన్" అని భీషణ ప్రతిజ్ఞచేసి, "భూనవ్యాపృత పల్లవోపలతికా పుష్పోప గుచ్ఛంబులన్ నానా పుష్పఫల ప్రదాయివగుమా నా కల్పవృక్షాకృతిన్" అని శాసించేసరికి, చూస్తూ చూస్తూ ఉండగా ఆ స్తంభం రెమ్మలుసాగి, చిగుళ్ళు వెళ్ళి, మొగ్గతొడిగి, పువ్వు పూచి, కాయలు కాచిందట. స్తంభం ఫలవృక్షమై కూర్చుంటే చిత్రకూటానికి చేటు వస్తుందని కాబోలు, "స్తంభము రీతి నీ తనువుదాలిచి యెప్పటియట్ల యుండుమా?" అని తిరిగి ఆజ్ఞాపించేసరికి అది యథారూపం ధరించిందట!

నోరు పెట్టుకు బ్రతకవలసినవారు కాబట్టి, మాట బీరుపోదన్న నమ్మకం కలిగించుకోనిదే కవితా వ్యాపారం సాగడం కష్టం కాబట్టి, ఈ కట్టు కథలను కవులు ప్రచారం చేసుకుని ఉండాలి. ఈ "ట్రేడ్ సీక్రెట్" జోలికి మనం ఇంకా పోవడం న్యాయం కాదేమో!

(ఆంధ్రప్రభ – పిడ్చాపాటి)

# కోటలో పాగా

—శ్రీ తిరుమల రామచంద్ర

ఏమోయ్! కోటలో పాగా వేశావే! కోటలో పాగా పడిందన్నమాట! ఇకనేం? కోటలో పాగా వేసినట్టే! - అని అభినందిస్తాం; ఎవరైనా పని సాధించినప్పుడు, ఇలా ఈ నానుడి గెలుపు అనే అర్థంలో వాడుకలో ఉంది. కాని, దీనికి ఈ అర్థం ఎలా వచ్చిందో కొంచెం చర్చిద్దాం.

"కోటలో పాగా వేయడ"మంటే కోటలోపాగా ధరించి రాజోద్యోగం సంపాదించడ మన్నమాట. రాజోద్యోగం సంపాదించడ మనేది పూర్వం ఎంతో ఘన కార్యం. దివానులను, తక్కిన దివాణం ఉద్యోగులను ఆశ్రయించి ఎంతో శ్రమ పడితేనేగాని ఉద్యోగం దొరికేదికాదు. ఇంత శ్రమపడడంవల్ల లభించిన ఉద్యోగం గనుకనే ఎంతో అభినందనకు పాత్రమయ్యేది. "ఇక భయంలేదు. కోట్లో పాగా పడింది. అని సంతృప్తి పొందేవారు" అని కొందరి వివరణ.

ఈ దృష్టితోచూస్తే పాగాలు ధరించడం, ముఖ్యంగా రాజ సభలలో ప్రత్యేకంగా దుస్తులు ధరించడం మనకు అనాదిగా వుంది. అమరావతి చిత్రాల్లో శిరోవేష్టనాలు కల బొమ్మలను చూడవచ్చు.

విజయనగర రాజుల దర్బారు వేషం వింతగా ఉండేది. కనుకనే శ్రీనాథుడు "కుల్లాయుంచితి కోక సుట్టితి మహా కూర్పాసమున్ దొడ్గితిన్" అన్నాడు. ఆ కాలంలో రాజభటులు, పెద్దమనుష్యులుకూడా తలపాగ మొదలయిన దుస్తులు ధరించేవారు. "వంకర పాగలున్ నడుము వంగిన కత్తులు, మైల కోకలున్" అని శ్రీనాథుడు మొరస రాజ్యము వారిని ఈసడించుకున్నాడు. "తిలకంబు కస్తూరి తిలకించి చొళ్ళెంబు; చెంగుల పాగతో చెన్నుమీర" అని సింహాసన ద్వాత్రింశతిలో వీరుని వర్ణనముంది.

వెలమ దర్బారీవేషం మరొక విధంగా వుండేది. ఆ వేషం లేనిదే దర్బారులో ప్రవేశం దొరికేదికాదు. కనుకనే మల్లినాథుడు సింగభూపాలుని చూడడానికి వెళ్ళి

నప్పుడు, ఆయన చీకిరి బాకిరి గుడ్డలుచూచి ఇరుగు పొరుగువారు నవ్వగా, ''సర్వజ్ఞ సింగని చూడడానికి వైదుష్య మొకటే సహాయమోయ్. తక్కినవన్నీ ఎందుకు ?'' అని జవాబు చెప్పాడు.

తర్వాతి కాలంలో రకరకాల పాగాలు ధరించేవారు. కరణం 'పొసగగా బోడకుల్లా' చుట్టాడట, వైష్ణవ భాగవతుడు 'పోలగా పొత్తిపాగా' చుట్టాడట (పరమ యోగి విలాసం) 'గంధపు బొట్టు వీడియము పచ్చల పాగయు కావిదుప్పటిన్' కోమటి వేసమట (చంద్రభాను చరిత్ర).

చక్కని వేషంతో ఇతరులను మోసంచేసే వారిని వేమన మా బాగా అన్నాడు :

తలనుపాగ, పైని తగు పచ్చడము, బొజ్జ
చెవులపోగు లరసి చేరు నర్థి
శుద్ధ మూర్ఖులనుచు బుద్ధిలో నరయక
విశ్వదాభిరామ, వినురవేమ !

పాగ పచ్చడంబు, పైకి కూసంబును,
పోగు, లుంగరములు, బొజ్జకడుపు,
కలిగినట్టివాని కందరు చుట్టాలు
విశ్వదాభిరామ వినురవేమ !

రాజుల దర్బారులు పడిపోయిన తర్వాత మామూలు రెడ్ల (గ్రామ మున సబుల) దగ్గరకుకూడా కరణాలు ఈ తలపాగాతోనే వచ్చేవారు. "ముదురతల పాగయును... కరణమేతెంచి రెడ్డి చెంగట వసించె" (విప్ర. చరిత్ర)

ఇలా పాగాలు ధరించడం ఆచారంలోవున్నా, పాగా వేసుకొనడం, పెట్టు కొనడం అనాలిగాని, పాగా వేయడం అనేదానికి వేసుకొనడం అనే అర్థం ఎలా వస్తుంది ? కనుక ఇది సనిపడదు. కోటలోని వుద్యోగులేకాక, తక్కిన మామూలు మనుష్యులు పాగాలు ధరించేవారే గనుక, శిరోవేష్టనం అనాది ఆచారం గనుక ఈ అర్థం సనిపడదు. మరొక విధంగా కుదురుతుందేమో చూద్దాం.

పచ్చీసు ఆటలో పావులున్నాయి. ఆ ఆటలో గెలుపొందడానికి మధ్యన వున్న కోటలో - కొండలో పావులు పడెయ్యాలి. అన్ని కాయలూపడి ఒక్క కాయ మిగిలి వుందనుకోండి. అదీవేశాం. ఇక గెలిచాం. కోటలో పాగా వేశాం అన్న

మాట. పావుపావా అయి, వగవర్ణాలకు గల వ్యత్యయాన్నిబట్టి (పవడము; పగడము; పవలు : పగలు లాగ) పాగా అయివుంటుందని, పచ్చీసు కాయల ఆటలకు సంబంధించినదే ఈ నానుడి అని శ్రీ తాపీ ధర్మారావుగారు సూచించారు. ఏమైనా కోట్లో పాగా వేయడం టోపీ వేయడం వంటిది మాత్రంకాదు.

కాని ఇంకొక విధంగా పరిశీలిస్తే ఇంకేమయినా అర్థం స్ఫురిస్తుందేమో చూద్దాం.

"ఉడుము కేలరా ఊళ్ళో పెత్తనం?" అని సామెత. కాని, ఊళ్ళపై పెత్తనం చేయడానికి, ఊళ్ళు కోటలు సాధించడానికి ఉడుము పూర్వం రాజులకు చాల ఉపయోగపడేవి.

ఉడుముకువుండే ప్రధాన గుణం గట్టిపట్టు. భల్లూకప్పట్టు ఎంత భయంకరమో, ఉడుముపట్టుకూడా అంతే. అందువల్లనే "ఉడుము పోయినా చేయి వదలించుకొని వచ్చినాడు" అనే సామెతకూడ పుట్టింది. ఉడుము నాలుగు కాళ్ళూ అప్పళించి అతుక్కుందంటే ఏనుగు పట్టుకొనిలాగినా పట్టు విడువదు; విగిలి పైకి రాదు. ఎంత నిటారుగావున్న గోడలనైనా ఉడుము గబగబా ఎక్కిపోతుంది. అందుకే "ఉడుంలాగ ఎక్కిపోతాడు" అనే సామెత ఏర్పడింది. జీవితంలో గబగబా పైకి ఎక్కిపోతున్న వ్యక్తిని ప్రశంసించే సందర్భంలో. వీటికి నీటిపై పాకిపోయే శక్తికూడా వుంది.

రాజులు వీటిని సాకి ప్రత్యేకంగా తర్ఫీదు ఇప్పించేవారు. వీటి తోకకు పగ్గంకట్టి, కోట గోడలమీదికి విసిరేవారు. పగ్గం వదులుగా వున్నంతసేపూ ఉడుము ఎక్కిపోతూ ఉంటుంది. లాగితే ఆగుతుంది. లాగినకొద్దీ బిర్రుగా అతుక్కుంటుంది గోడకు. ఆ పగ్గం పట్టుకొని సైనికులు పైకి ఎక్కిపోయేవారు.

ఉడుములు సాకడానికి ప్రత్యేకంగా సిబ్బంది వుండేది, ప్రతి రాజుదగ్గరా. తరచు వీటిని బోయవారు సాకేవారు. ప్రస్తుతం కోయం బుత్తూరు జిల్లాలో "ఉడుమల్ పేట" అని వూరుంది. ఇది తాలూకా కేంద్రం. ఈ వూరికి ఏడు మైళ్ళలో 'దలి' అనే మరొక గ్రామం వుంది. ఇది నేడు గ్రామమైనా పూర్వం ఒక పాళేగారు రాజధాని. ఉడుమల్ పేట మైసూరు రాజ్యం సరిహద్దుల్లో వుంది. "దలి" పాళేగారు మైసూరు సరిహద్దు రక్షకుడుగా వుండేవాడు. ఆ పాళేగారు మైసూరు రాజులకు ఉడుమల్ పేట అడవులనుంచి ఉడుములు సరఫరా చేసేవాడు. ఉడుముల వ్యాపార

కేంద్రం కావడంవల్ల ఆ వూరికి ఆ పేరు వచ్చింది. ఇలాగే ప్రతి రాజుకూ ఉడుముల శాఖ (డిపార్టుమెంటు) వుండేది.

కోటలు ఎక్కువగావున్న మరాఠ్‌వాడా, రాయల సీమలలో ఉడుము సహాయంతో కోటలను సాధించిన కథలు, లెక్కలేనన్ని జనం నాలుకపై వున్నాయి. సింహగడ విజయంలో శివాజీకి కుడిభుజమైన తానాజీ ఉడుముతోకకు పగ్గంకట్టి గోడకు విసరివేయడం, అది తిరిగి రావడం, ఇలా రెండుసార్లు తిరిగివస్తే మూడో సారి దానిని బెదిరించి పంపడం అది తిరిగి రాకుండా అతుక్కుపోవడం - ఈ కథంతా అందరికీ తెలిసిందే. దీనిని శ్రీ గడియారం శేషశాస్త్రిగారు 'శివ భారతం' లో ఉదాహరించారు.

"పెద బొబ్బిలి రాజుకథ" అనే గేయ రచనలో ఉడుము ప్రస్తావన వుంది. బొబ్బిలివారి పుట్టకోట బూసీకి స్వాధీనం కాకపోయిందట. అప్పుడు ఉడుములు పనికి వచ్చాయి.

"సాధ్యానికి రాకయున్నది పుట్టకోటయున్న
సీమ వుడుములు తెప్పించినారు ప్రాంచీ దొరగారు
కోటపైగా తగిలించినారు జాతుల వారూనూ
ఉడుముతోక పట్టుకొని లగ్గల కెక్కిరి."

ఇక చెప్పవలసినది కోటలో పాగాకూ ఉడుముకూగల సంబంధం మాత్రమే. సైనికులు పొడుగాటి పాగాలు ధరించేవారు. వాటి నేతే వేరు. వెడల్పు మూరెడే అయినా, పొడవు మాత్రం ఎనిమిది బారలు పదారు బారలు వుండేవి. మనకు తల కట్టు ధరించడం వేల సంవత్సరాలుగా ఆచారమైనప్పటికీ "పాగాల" పద్ధతి మాత్రం విదేశీయం. పాగా తెలుగుపదంకాదు. పాగాలు శిరస్త్రాణాలుగా ఉపయోగపడేవి. శత్రువులను రెక్కలువిరిచి కట్టడానికి వుపయోగపడేవి. వేని పగ్గాలుగా కట్టి కోటలు ఎక్కడానికి పనికి వచ్చేవి. కొందరు సైనికులు కోటవద్దకు వెళ్ళేవారు. నిచ్చెనలు మోకులు వగైరా సామాను తీసుకొని వెళ్ళడంలో ముట్టడి గుట్టు బట్ట బయలయిపోదూ? ఉడుములను మాత్రం వెంట తీసుకొని వెళ్ళేవారు. తలపాగా తీసి పెనవేసి దాని తోకకు కట్టేవారు. ఉడుము కోటకొనకు వెళ్ళి అక్కడ అనువుగా వున్నచోట్లో అతుక్కునేది. సైనికులు పాగా పట్టుకుని ఒకరొకరే పైకి పాకి వెళ్ళేవారు. ఆ పాగానే కోటగోడ ఆవలి వైపుకు జారవిడిచి కోటలోపల దిగేవారు. వీరు రహస్యంగా వెళ్ళి కోటలోపలి తలుపులవద్దవున్న కావలివారిని చంపి, తలుపులు

తీయడమేమిటి, కోట వెలుపల పొంచి సిద్ధంగావున్న దండు ఒక్కుమ్మడిగ లోపలికి జొరబడడ మేమిటి - నిమిషాలమీద జరిగేవి.

ఇది చెప్పినంత సులభమైన పనికాదు. కోట బురుజులలోవుండే కావలివారు ఈ ఎత్తులు కనిపెట్టి ఉడుములను చంపివేసేవారు; పాగాలు తెంపివేసేవారు. కనుకనే కోటను జయించగోరిన సైనికులు ఎంతో గుట్టుగా దిట్టతనంతో పాగా ఉడుమును విసరవలసి ఉంటుంది. కాపలావారి కంటబడని ఏ మారుమూలో చూడ వలసి వుంటుంది. కాపలావారి కన్ను తప్పించుకొని పాగా వేయవలసి వుంటుంది. వేసి గోడ ఎక్కినా, లోపలదిగే ప్రదేశం ఆనుపానులు చూడవలసి వుంటుంది.

అలా వేశాక యిక విజయమే. ఇదే అనుకుంటాను కోటలో పాగా వేయడమంటే.

[ఆంధ్రప్రభ : నుడి - నానుడి]

# రిహార్సల్స్

—డా॥ కొల్లిపాటి గంగాధరరావు

'రిహార్సల్' అనే ఆంగ్లపదం ఏ ముహూర్తానవచ్చి, ఆంధ్ర నాటకరంగ ప్రవేశం చేసిందోకాని, నాటికీ నేటికీ ముఖ్య ప్రదర్శనకి ముందు జరిగే, నాటక ప్రయత్నానికీ, తత్సంబంధమైన తతంగానికీ, ఆ పేరుమాత్రం స్థిరంగా నిలిచి పోయింది. పూర్వ రంగ ప్రయత్నం అనండి, తెరవెనుక భాగవతం అనండి, లేదా అచ్చమైన తెలుగులో 'ఒద్దికలు దిద్దుకోవడం' అనండి, ఏమనండి, రిహార్సల్ అంటే అర్థం అయినంతబాగా, మరేమాట ఉపయోగించినా అర్థంకాదు – కాదు గాక కాదు.

ప్రదర్శనయొక్క విజయం ఈ రిహార్సల్స్‌మీద ఆధారపడి ఉంటుందని అంతరంగికంగానేకాదు బహిరంగంగాకూడా నాటకరంగంతో సంబంధంఉన్న ప్రతి ఒక్కరూ అంటూనే ఉంటారు. కాని వచ్చిన చిక్కల్లా, దాన్ని మనస్ఫూర్తిగా నమ్మి ఆ నమ్మకాన్ని అక్షరాలా ఆచరణలో పెట్టవలసి వచ్చేసరికి, మాత్రం అంతా బద్ధకిస్తారు. ఉదాసీనత వహిస్తారు. ఊఁ కొట్టి ఊరుకొంటారు.

"రేపు రిహార్సల్ – పోర్షను వచ్చిందో లేదో, నటనలో ఇంకా లోపాలు ఏవైనా ఉన్నాయేమో, అందరి నటనలమధ్యా సామరస్యం ఎంతవరకూ పొసిగిందో, అంతా చూసుకుందాం – ఓ మాటురా" అని దర్శకుడో నిర్వాహకుడో పిలిస్తే, చాలామంది నటులు "ప్చ్ – రిహార్సల్స్‌కదా – రాకపోయినా ఏం ఫరవాలేదండీ – అసలు ప్రదర్శనలో చూపిస్తాకదా నా సామర్థ్యం అంతా" అంటూ తేలికగా తీసే స్తారు. ఇది ఔత్సాహిక నాటక సందర్భాలలో జరిగే ముచ్చట. ఇక కిరాయి నాటకాలలో రిహార్సల్స్ ప్రసక్తేలేదు. ఇంకో గంటకి నాటకం అనగా బందరునుంచి ఒకరూ బస్తర్‌నుంచి ఒకరూ రావడం, ఇంత రంగు కొట్టుకొని, ఎవరికొచ్చిన పద్యాల్ని వాళ్ళు జీళ్ళపాకంలా సాగదీసి, వన్స్‌మోర్‌లు తెగకొట్టించుకొని, కోడి కూతవేళయి, అందరికీ నిద్రతో జోగూ నీరసంతో తూగూరావడంతో, మొహానికి రాసుకున్న రంగు కాస్తా తుడిచేసుకుని, కిరాయి డబ్బులు జేబులో వేసుకుని ఎవరి

బండి వాళ్ళు ఎక్కడం; మళ్ళీ ఇంకో ఊళ్ళో ఇంకో నాటకానికి హాజరవడం. ఇలా నిత్యమూ జరిగే నాటకాల పందెపు పరుగులో ఇంక రిహార్సల్స్‌కి టైము ఏది?

“మేం పెద్దనటులంకదా మాకు రిహార్సల్ ఎందుకని కొంద రనుకుంటారు” కాని, ఇతరుల నటనా విధానాన్నీ వాళ్ళ కదలికల్నీ తెలుసుకుని వాటితో తమ నటననీ అభినయాన్నీ అనుసంధించడానికైనా రిహార్సల్స్ అవసరం. పైగా ఎక్కడ విరామం ఇవ్వాలి, ఎక్కడ విరుపు ఇవ్వాలి, ఎటునుంచి ప్రవేశించాలి, ఎటునుంచి నిష్క్రమించాలి, ఏ మాట అంటూ ఎటు కదలాలి, ఎంతవరకు కదలాలి, తను ఏ భావానికి ఏ నటన చూపాలి, సహనటుల నటనకి తను ప్రతినటన (Reaction) ఎలా చెయ్యాలి, నాటకంయొక్క ఆత్మ (Spirit) ఏమిటి, దాన్ని ఎలా ఆవిష్కరించాలి, దాన్ని ఎన్ని అంతరాల్లో పతాక స్థాయికి తీసుకువెళ్ళాలి, ఏ మాట మీద ఊనిక ఇవ్వాలి, ఏ విసురు ప్రేక్షకులకి అందుతుంది, రంగంమీదకి ఏయే వస్తువులు అవసరం అవుతాయి, నటనకి అనుకూలంగా వాటిని రంగస్థలంమీద ఏయే స్థానాల్లో ఉంచాలి, ఆఖరికి కర్టెన్ ఎప్పుడు తియ్యాలి ఎప్పుడు వెయ్యాలి - ఈ రకమైన లక్షా తొంభై సంగతుల్ని సరిచూసుకొని, క్రమశిక్షణతో ముందుగా శిక్షణ పొందుతేనేగాని అసలు ప్రదర్శనని సమర్థవంతంగా అందించడం కష్టం. తెరవెనక జరిగే ఈ శిక్షణనే రిహార్సల్స్ అంటారు.

రిహార్సల్స్ అనేవి ఒక్క నాటకానికేకాదు ప్రముఖమైన ఏ ప్రయత్నానికైనా ముందు ఉండవలసినవే - విద్యార్థులకి ఏడాది మొత్తంలో రెండు మూడుసార్లు జరిగే 'టెర్మినల్ ఎగ్జామినేషన్లు'. అసలు పరీక్షకి రిహార్సల్స్ వంటివే! అలాగే ప్లీడర్లు, ఇంటిదగ్గర సాక్షిచేత వల్లెవేయించే పాఠాలన్నీ, అసలు కోర్టులో అతనిచేత ఆడించబోయే నాటకానికి రిహార్సల్సే! పుట్టింట్లో తల్లి తన పిల్లకిచ్చే శిక్షణ అంతా, రేపు పొద్దున్న అమ్మాయి అత్తారింటికి వెళ్ళాక జీవించే విధానానికి రిహార్సలే! ఆ రిహార్సల్స్‌ని నిర్లక్ష్యం చెయ్యడంవల్లే ఈ రోజుల్లో కొందరు అమ్మాయిలు జీవిత నాటక రంగంలో విజయం సాధించలేక విడాకులు పుచ్చుకొని పుట్టింటికి వేంచేస్తున్నారు.

మానవ జీవితంలో రిహార్సల్స్ పాత్ర అంతా ఇంతాకాదు. పుట్టిన మరుక్షణం నుంచీ ఇది ప్రారంభం అవుతుంది. తినడం, వినడం, అనడం వీటిలో ఎన్నో రిహార్సల్స్ వేస్తేనేకాని, బాలుడు మానవ జీవిత వ్యాపారంలో భాగస్వామి కాలేడు. ప్రతి రంగంలోనూ, రిహార్సల్స్ కావలసిందే, ప్రజ్ఞావంతుడు కావాలంటే -

ఉద్యోగం ఖాయం చెయ్యడానికి ఒక ఏడాది 'ప్రొబేషన్' అంటే అర్థం ఏమిటి? మేస్త్రీ ట్రైనింగ్‌లో, సైనికుడుగాజేరిన కొత్తలో, ఐ. ఎ. ఎస్. ఆఫీసర్‌గా ఎన్నుకోబడిన తర్వాత, వారివారికిచ్చే తర్ఫీదు మాటేమిటి? పై ఆఫీసరు శెలవు పెట్టినపుడు ఇన్‌ఛార్జిగా ప్రొమోట్ అయిన కింద ఆఫీసర్ చేసేదేమిటి? – అందువల్ల రిహార్సల్ అనేది ఒక్క నాటక రంగంలోనేకాదు, జీవిత నాటక రంగంలోకూడా అడుగడుగునా అవసరం. ఈ అవసరాన్ని విస్మరిస్తే విజయం లభించదు. ఈ రహస్యాన్ని తెలుసుకున్నాడు కనకే విన్‌స్టన్ చర్చిల్, పార్లమెంటులో మాట్లాడ్డానికి ముందు, అద్దంముందు నుంచుని, కళ్ళు కదపడం దగ్గర్నుంచి, కనుబొమలు ముడివేయడం దగ్గర్నుంచి, కరచరణాలు ఆడించడం దగ్గర్నుంచి సర్వమూ సంపూర్ణంగా రిహార్సల్ వేసుకుని మరీ వెళ్ళేవాడట. ఒక్క చర్చిలే ఏమిటి, జీవితంలో ఏదైనా ఘనకార్యాన్ని సాధించాలనుకున్న ప్రతివాడూ ప్రతి సందర్భంలో రిహార్సల్స్ వేసుకుంటాడు; తనలోఉన్న లోపాల్ని సరిచూసుకుంటాడు. పాండవులంతటివాళ్ళే అజ్ఞాతవాసం చెయ్యడానికి విరాటరాజు దగ్గరికి వెళ్ళడానికి ముందు, రిహార్సల్ వేసుకుని మరీ వెళ్ళారు.

రిహార్సల్స్ అనేవి, లోపాల్ని సరిదిద్ది లోకువ కాకుండా కాపాడతాయి. నలుగురిలోనూ నగుబాటు కాకుండా ఉండాలంటే ముందుగా ఒద్దికలు దిద్దుకోవడం ఒక్కటైన పద్ధతి. రిహార్సల్స్‌లో అయితే ముందుగా మన లోపాలు మనకే తెలుస్తాయి కనక, మనలో మనమే నవ్వుకొని మార్చుకోవచ్చు – నిజానికి మనకే నవ్వువచ్చే సంఘటనలుకూడా రిహార్సల్స్‌లో అప్పుడప్పుడు జరుగుతూ ఉంటాయి. అవి ఒక్కొక్కప్పుడు ఎంతో వినోదాత్మకంగా ఉంటాయి.

మద్రాసులో కాలేజీ ఆంధ్రా ఎసోసియేషన్ తరపున నాటకాలు వేస్తూ ఉండేవాళ్ళం. డాక్టర్ గరికిపాటి రాజారావుగారు చదువు ముగించుకుని వెళ్ళేదాకా అందర్నీ ఒక అదుపులోపెట్టి ఆయన నిర్వహించేవారు. ఆయన వెళ్ళిన తర్వాత ఎవరిమటుకు వాళ్ళే పెద్దలయి పోయారు. ఓ నాటకానికని రిహార్సల్స్ వేస్తూంటే, పక్క నటుడ్ని అతిక్రమించడంకోసం ఒక నటుడు నాటకంలోలేని డైలాగుల్ని నాలుగు చేర్చి అనసాగాడు. అవతలివాడు అది కనిపెట్టి 'ఉండు నీ రోగం కుదురుస్తానని' తను మరో ఎనిమిది డైలాగులు తన పోర్షన్‌కి కలిపాడు. అది చూసి మొదటివాడు ఇరవై – మళ్ళీ వీడు ముప్పై – ఇలా పెంచుకుపోయారు డైలాగుల్నీ పోర్షనునీ కొల్లేరు చేంతాళ్ళలాగ – ఏం చెయ్యం? చివరికి గంటన్నరలో పూర్తి

కావలసిన రిహార్సల్ మూడుగంటలయినా కాదే - చివరికి నాకు విసుగొచ్చి "అబ్బాయిలూ మీ కిద్దరూ ఇంక నాటకాలు వెయ్యడానికి పనికిరారు. ఏమంటే నటించే స్థాయినుంచి, డైలాగులురాసే నాటకకర్త స్థాయికి పెరిగిపోయారు. అందు వల్ల తప్పుకోండి. ఈ నాటకంలో మీ రెండువేషాలూ ఇంకొకళ్ళచేత వేయిస్తాను" - అన్నాను. దాంతో ఇంక వాళ్ళు చూసుకోండి, అసలు దానికంటే అక్షరం ఎక్కువ అంటే ఒట్టు.

సాధారణంగా నటీమణి వస్తేనేకాని రిహార్సల్స్ రక్తి కట్టవు. అసలు అంత దాకా నటశేఖరులు రిహార్సల్స్‌కేరారు సరిగ్గా. ఆమె వచ్చినప్పటినుంచీ మాత్రం అంతా టంచన్‌గా అరగంటముందే వచ్చి కూచుంటారు. మీ పోర్షన్ అయింది మీరు వెళ్ళొచ్చుఅన్నా వెళ్ళరు. ఆమెకి టీ కావాలన్నా, తలనొప్పి మాత్రలు కావాలన్నా, ఆమెతో వచ్చిన పురుషపుంగవుడికి (తండ్రి కావచ్చు, లేదా భర్త కావచ్చు) సకలోపచారాలూ చేస్తారు. రిహార్సల్స్‌కి కావలసిన చాకిరీ యావత్తూ కూడా ఒళ్ళువంచి మరీ చేస్తారు. అయితే కొందరున్నారు. ఆడపురుగు కనిపిస్తే చాలు కుంచించుకుపోయి సిగ్గుపడిపోతారు. ఒకమారు ఒక యువకుడు ఒక నటీ మణితో దగ్గరగా నిలబడి నటించవలసి వచ్చింది. 'దగ్గరగా వెళ్ళవయ్యా' అని ఎన్నిమాట్లు చెప్పినా వెళ్ళడే - పెద్దపులిని చూసినట్లు బెదిరిపోయి దూరంగా ఉండి పోతున్నాడు. సిగ్గేమిటయ్యా అని కేకవేశాను. భయం ఏమిటి నిన్ను కొరుక్కుని తినెయ్యదులే అని హాస్యం ఆడాను. ఆమె ముఖానికి దగ్గరగా నీ ముఖం చేర్చుతావా చేర్చవా అని కోప్పడ్డాను. చివరకి అతను బిక్కమొహంవేసి "ఆమె నోరు... నోరు..." అన్నాడు. ఆపైన అతనినోట మాట రాలేదు. ఆ తర్వాత తెలిసింది అసలు ఇబ్బంది. ప్రతి రిహార్సల్‌ముందు, అది సాయంత్రం కానీండి రాత్రి కానీండి అప్పటికప్పుడు పేస్ట్, బ్రష్ ఇచ్చి పళ్ళు తోమించి, ఏ లవంగమొగ్గో ఏలక్కాయో విధిగా నోట్లో వేసుకోవాలని ఒక కఠినమైన నియమం విధించాను.

ఓమాటు ఓ లేడీ యాక్టరు, రిహార్సల్‌కి రమ్మన్నప్పుడల్లా, నా వంట్లో బాగోలేదు, కడుపులో పోట్లు, తలనొప్పి, వికారం, అంటూ తెగ బాధపెట్టేది. ఓ మాటు మేనేజరువచ్చి "ఏమిటిది డాక్టరుగారూ ! ఎప్పుడూ ఏదో ఒక రోగం అంటుంది. అసలు ఏవిటి జబ్బు ?" అన్నాడు. "ఆ... ఏం ఉంది ? ఏ రోగానికైనా ఒకటే వైద్యం - స్పిరిట్ గమ్" అన్నాను... ఆ మర్నాడు ఆ నటీమణి మూగ నాట్యంచేస్తూ పెదిమలు కదపకుండా నా ముందు అభినయం చేయసాగింది. "ఏమి

టయ్యా ఇది ?'' అని మేనేజరుమీద విసుక్కున్నాను. "ఏమోనండి ! గంట క్రితం కడుపులో పోట్లు అంది. మీరు చెప్పిన స్పిరిట్‌గమ్ ఇచ్చాను. అప్పటినుంచీ ఇది తంతు. పెదిమ విప్పదు'' అన్నాడు. "చంపావుపో... అయితే ఈ స్పిరిట్‌గమ్‌తో మీసాలూ గడ్డాలూ సరిగ్గా అతుక్కోపోయినా పెదిమలు మాత్రం బాగానే అతుక్కుంటాయన్నమాట'' అన్నాను. ఆ తర్వాత ఆ అమ్మాయి రిహార్సల్స్‌ముందు ఒంట్లో బాగోలేదంటే ఒట్టు – ఇలా ఎన్నో, ఎన్నో.

జగన్నాటకంలోని అంతర్భాగాలైన అంతర్నాటకాలలోనే రిహార్సల్ పాత్ర ఇంతటిదైతే ఇంక జగన్నాటకంలో వేరే చెప్పాలా ? తెలివైనవాళ్ళెవరూ రిహార్సల్స్ మనస్సులోనేనా ఒకమాటు వేసుకోకుండా ఎవర్నీ ఏమీ అనరు, తొందరపడి ఏపనీ చెయ్యరు. ఈ మాట అంటున్నాం దీని ఫలితం ఎలా ఉంటుంది, ఈ పని చేస్తున్నాం దీని పరిణామం ఎలా వస్తుంది అని ఒకటి రెండుసార్లు మనలో మనమే రిహార్సల్స్ వేసుకున్నామంటే, నిత్యమూ ఎదురయ్యే వేలకొద్దీ సమస్యల్నీ లక్షలకొద్దీ సంఘర్షణలనీ నివారించవచ్చు; బతుకుని గతుకులులేని మార్గంలో మలుచుకోవచ్చు. రిహార్సల్ వేసుకోకుండా, తొందరపడి ప్రవర్తించే వ్యక్తి సావకాశంగా విచారించవలసి వస్తుంది. రిహార్సల్స్ లేకుండా చేసేపని ఏదైనాసరే నవ్వులపాలు అవుతుంది. అందుకే రివల్యూషనరీలు, రియాక్షనరీలుకూడా రివల్యూషన్ తీసికొనేముందు రిహార్సల్ వేసుకుంటారు. అసలు రిజల్ట్ అంతా రిహార్సల్ మీదేఉంది. కనుక అందాం మనమందరం, ''రిహార్సల్ జిందాబాద్ !'' అని—

| వరుస సంఖ్య | రచన | రచయిత | మొదట ప్రకటించిన పత్రిక లేక గ్రంథము | చిరునామా | పుటలు |
|---|---|---|---|---|---|
| 1. | స్వదేశీ పరిశ్రమలు | శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు | 24-11-1920 ఆంధ్ర పత్రిక | కీర్తిశేషులు | [illegible] |
| 2. | పిఛి అరుగు | శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి | పుష్పలావికలు విశ్వోదయ | 4, జగదంబాళ్ వీధి, త్యాగరాజ నగర్ - మద్రాసు - 17 | 7 |
| 3. | చలి | శ్రీ రాపూరి వెంకట సత్యనారాయణ | ఆషా మాషీ ఆంధ్ర ప్రభ | 3-5-1091/10 - వెంకటేశ్వర కాలనీ, నారాయణగూడా, హైదరాబాదు - 29 | 4 |
| 4. | ఉపన్యాసాలు | శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి | బారిస్టరుగారి బాతాఖానీ | కీర్తిశేషులు కుమారులు - శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడు, ఆంధ్ర శాఖాధ్యక్షులు, ఎ. ఎల్. ఎ. ఎమ్. కాలేజీ, అనకాపల్లి | 7 |
| 5. | తెలుగు కవిత్వంలో ఫాషన్లు | శ్రీ నోరి నరసింహశాస్త్రి | ప్రతిభ | సాహితీ సమితి రేపల్లె - గుంటూరు జిల్లా | 16 |
| 6. | నరుడు - నారి | శ్రీమతి తెన్నేటి హేమలత (లత) | ఊహాగానం ఆంధ్ర ప్రభ | వంశీకుంజం - విజయవాడ-3 | 2 |

